## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంథాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) తిరుమల తిరుపతి దేవస్థానం వారి వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు
Tirumala Tirupati Devasthanams
ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US

: COMPLAINTS PLS CONTACT e MAIL saptagirittd@gmail.com CAN CALL 0877 225 4359, 4543,4360,4363, 4365 BETWEEN 10.30 AM AND 5 PM (DURING WORKING DAYS)

- TELUGU (1197)
- BANJARA (2)
- ENGLISH (226)
- SANSKRIT (70)
- TAMIL (302)
- KANNADA (175)
- HINDI (181)

Saptagiri

Telugu Tamil Sanskrit Kannada Hindi English

Online Subscription

Panchangam

Telugu Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam

Narada Bhakthi Sutra...

Maha Bharatham - Bhagavatham

Maha Bharatham Vol 1...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భాగవతంలో కృష్ణతత్త్వం



ప్రథమ ముద్రణ : 2006

ప్రతులు : 1000

వెల : **రూ.150/-**

ప్రతులకు :
1. నవోదయ పబ్లికేషన్స్
కాచిగూడ, హైదరాబాద్.
2. యస్. రామ్మోహన్ రావు
హెచ్.ఐ.జి., బ్లాక్-6, ఫ్లాట్-7
బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు-500 044.
ఫోన్ : 94403 29488

కవర్ పేజీ డిజైన్
పాణ్యం నాగార్జున
ఫోన్ : 92462 72581

డి.టి.పి.
శ్రీమతి ఎస్. అనంత లక్ష్మి
ఎస్. మల్లేష్ గౌడ్

ప్రింటర్స్
గాయత్రి గ్రాఫిక్ పాయింట్
బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు-500 044.
ఫోన్ : 040-6677 2580



సమర్పణం

అస్మదాచార్య సమారంభాం సాయి సద్గురు మధ్యమాం

రాధావల్లభ పర్యంతాం వందే శ్రీ గురుపరంపరాం

## సద్గురు మాతాజీ కృష్ణ ప్రియ గారికి

పాదాభివందనాలతో

....సుధ



ఆధ్యాత్మిక పుస్తక ప్రచురణలకు
తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఇచ్చే
ఆర్థిక సాయంతో ప్రచురించిన పుస్తకం.

డా.ఎం.కులశేఖర్ రావు గారు

పూర్వాచార్యులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం

# మంగళా శాసనం

డా.సూరంపూడి సుధ భాగవతంలో కృష్ణతత్త్వం అనే సిద్ధాంత వ్యాసం వ్రాస్తానన్నప్పుడు నేను ఆమెను ప్రోత్సహించాను. కారణమేమంటే పోతన గారి భాగవతం మీదనాకు చిరకాలంగా శ్రద్ధ ఉన్నది. ఆ మహానుభావుడు భాగవతపురాణాన్ని తెలుగులో ఒక మహాకావ్యంగా తీర్చిదిద్దిన ఘనత సంపాదించుకున్నాడు. అందుచేతనే ఆయన పురాణకావ్యం పాఠకుల మన్ననలను అందుకున్నది.

పిహెచ్.డి. విషయం నేను సుధతో మాట్లాడినప్పుడు తనకు కూడా పోతనకావ్యం మీద ఆసక్తి ఉన్నట్లు వెల్లడైంది. ఏదో అపరిచిత విషయాన్ని మధించి సిద్ధాంతవ్యాసం వ్రాయడం కంటే ఆసక్తి ఉన్న కావ్యం మీద రిసెర్చిచేయడం చేత మంచిఫలితాలు వస్తాయని నా విశ్వాసం.

భాగవతంలో విష్ణుమూర్తి దశావతారాల కథలు మహిమలు ఉన్నమాట లోక విదితమే. కానీ శ్రీకృష్ణ వృత్తాంతం భాగవతంలో బాగా విస్తరించి ఉన్నది. ఈ విషయాన్ని సూచించడానికి కాబోలు బమ్మెర పోతనగారు "శ్రీకైవల్య పదంబు చేరుటకునై..." అని ప్రారంభపద్యంలో కథా సూచనకూడా చేసి ఉన్నారు.

పరిశోధకురాలు సుధ సిద్ధాంతగ్రంథం ప్రారంభంలో అష్టాదశపురాణాలు గ్రహించి ఆయా పురాణాలలో శ్రీకృష్ణుని ప్రస్తావన ఎంత చక్కగా ఉన్నదో వివరించింది. ఈ ప్రకరణములో పరిశోధనలో కావలసిన అన్వేషణ, పరిశీలన అనేరెండు ముఖ్యాంశాలు సరియైన పద్ధతిలో వచ్చినవి. హరివంశం అయితే ఆసాంతం శ్రీకృష్ణుని జన్మవృత్తాంతమే. సుధ ఈ పురాణంలో ఉండే విషయాన్ని

సంక్షిప్తంగానైనా చక్కగానే వ్రాసినట్లు నాకు భాసించింది. ఒక భక్తునికి శ్రీకృష్ణుడు కనిపిస్తే అతడు **'హరిగంటి గృష్ణుగంటి,**

**పరమేశ్వరు గంటి భక్తపాలుగంటిం**
**పురుషోత్తముడచ్యుతుడీ**
**శ్వరుడభవుడువీడెవీడె సమ్ముఖుడయ్యెన్'**

ఈ మాటలు అన్నవాడు ఎవరో తపశ్చర్య చేసిన భక్తుడు కాడు. విష్ణు మూర్తి పేరువింటేనే మైలపడి పోతానని భావించే ఘంటాకర్ణుడు. ఈ ఒక్క పద్యం చాలు శ్రీకృష్ణుని మాహాత్మ్యం ఎటువంటిదో చెప్పడానికి. మిగిలిన పురాణాలలో కూడా శ్రీకృష్ణుని విషయాలు ఆసక్తికరంగానే సుధ ఉల్లేఖించింది.

ఈ సిద్ధాంత గ్రంథంలో అయిదవ ప్రకరణం భాగవతంలో విశిష్టాద్వైతం అనేది. నాకయితే ఈ భాగం ఈ గ్రంథానికి ప్రాణప్రదంగా భాసించింది.

'చేతులారంగ శివుని పూజింపడేని' వంటి పద్యాలు వ్రాసిన పోతనగారు అద్వైతి అనికొందరు భావించడం ఉంది. ఒక్కసారి ప్రహ్లాదుని చరిత్ర శ్రద్ధగా చదివి చూడండి. గజేంద్ర మోక్షం మరొక్కసారి హృదయంపెట్టి పరిశీలించండి. జీవుడు పరమాత్మ అనేటటువంటి తాత్త్విక విశేషాలు ఈకథల్లో ఎల్లా ప్రతిబింబిస్తాయో స్పష్టమవుతుంది. గజేంద్రుడి కథ నిజానికి ఏనుగులరాజు కథకాదు. ఒక మానవుడు దారితప్పి విష్ణుమూర్తిని ప్రార్థిస్తే ఆ ఆర్తత్రాణ పరాయణుడు అతన్ని అన్ని కష్టాలనుండి విముక్తి చేసిన వృత్తాంతం భాసించక మానదు. విష్ణుమూర్తి కరుణాస్వభావానికి గజేంద్రుని వృత్తాంతం సంకేత ప్రాయంగా ఉన్నదని భావించడం సమంజసం. ఈ సిద్ధాంతాలను పరిశీలించి శ్రీమన్నారాయణుడే పరతత్త్వం శ్రీమన్నారాయణుడే సర్వదేవాత్మకుడు అర్చిరాదిమార్గం మొదలైన శీర్షికలలో సుధ సూత్రప్రాయంగా విశిష్టాద్వైతాన్ని ఒక పరిమితిలో చెప్పగలిగింది.

భాగవతంలో శ్రీకృష్ణుడు ప్రధాన పాత్ర వహించడం ఆ వృత్తాంతాన్ని ఈ పరిశోధకురాలు గ్రహించడం సముచితంగా ఉన్నది. ఆరవ ప్రకరణంలో శ్రీకృష్ణావతార ప్రయోజనాలు అను విషయం చక్కగా చర్చకు వచ్చింది. ఈ సిద్ధాంత గ్రంథంలో ఈ ప్రకరణం చదివి తీరవలసినదే ప్రస్తావనోచితంగా శ్రీకృష్ణుని జీవిత వృత్తాంతమంతా వర్ణితమైంది. మనోహరమైన రుక్మిణీ కళ్యాణ ఘట్టాన్ని సుధ మరింత మనోహరంగా వివరించి చెప్పింది.

**"ప్రాణేశ నీ మంజుభాషలు వినలేని**
**కర్ణరంధ్రంబుల కలిమియేల"**

**"ఘనుడా భూసురుడేగెనో"** వంటి పద్యాలు ఉదాహరించడం చదివే వారిని ఆకర్షిస్తుంది.

నేను పైన చెప్పిన విషయాలు చాలా స్వల్పం. ఇవికాక భగవత్తత్త్వం వంటి వాటిని గురించి అవతార ప్రయోజనాలను గురించి అనేకానేక విషయాలు ప్రస్తావనకు వచ్చినవి. ఆలస్యంగానయినా ఈ గ్రంథం ఇప్పుడు ముద్రిత మయింది. గ్రంథ ప్రచురణలోని వ్యయ ప్రయాసలు అందరికీ తెలిసినవే. సూరంపూడి సుధ వాటినన్నింటినీ ఓర్చి పాఠకులకు తన సిద్ధాంత గ్రంథాన్ని అందిస్తున్నందుకు నా అభినందనలు. ఇంక చదివి ఆనందించడమే మీ వంతు.

ఈ గ్రంథానికి తగిన ప్రాచుర్యం పరిగణన రావాలని నా ఆకాంక్ష. సూరంపూడి సుధకు నా మంగళాశాసనం.

హైదరాబాదు　　　　　　　　　　　　ఎం.కులశేఖరరావు

ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం
పూర్వ ఉపాధ్యక్షులు, పొ.శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయం

# ముప్పేట సుధ

**"ఇదం హి పుంసః తపస శ్రుతస్య వా**
**స్విష్టస్య సూక్తస్య చ బుద్ధిదత్తయోః**
**అవిచ్యుతోఽర్థః కవిభి ర్నిరూపితో**
**యదుత్తమ శ్లోక గుణానువర్ణనమ్"**

అని శ్రీమద్భాగవత మహాపురాణం ప్రకటించింది. మానవుడు చేసే తపస్సు, వేదాధ్యయనం, యజ్ఞానుష్ఠానం, స్వాధ్యాయం, జ్ఞానదానాదుల వలన కలిగే ప్రధాన ప్రయోజనం ఉత్తమ శ్లోకుడైన పరమేశ్వరుని దివ్యగుణాను వర్ణనమే అని కవులు నిరూపించారని భాగవతం నిర్ధారించింది. ఈ సత్యాన్ని భక్త మహాకవి బమ్మెరపోతన భక్తి మత్త చిత్తంతో మత్తేభవృత్తంలో మహనీయంగా కీర్తించాడు.

మ. **"హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ**
**సురుచి భ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ**
**హరినామస్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ**
**కరమైయుండ దయోగ్య దుర్మదన దత్కాకోల గర్తాకృతిన్".**

భగవంతుని యందు భక్తి కుదరటం మానవులకు పూర్వజన్మ పుణ్యఫలం. అందులోనూ భాగవతమునందు మనను లగ్నంకావటం బహుజన్మల పుణ్యఫలం. సాహిత్య పరిజ్ఞానమంతా ఒక యెత్తు, భాగవతతత్త్వ విజ్ఞానం ఒక్కటి ఒక్కయెత్తు. అందుకే పోతన్న గారు వినయవివేకంతో అన్నారు-

**"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు**
**శూలికైన తమ్మిచూలికైన**
**విబుధవరుల వలన విన్నంత కన్నంత**
**తెలియ వచ్చినంత తేటపఱతు" -**

ఈ మాట పోతన పట్ల మాత్రమే కాదు భాగవతాన్ని గురించి మాట్లాడే, వ్రాసే ప్రతివారికీ వర్తించే విశ్వజనీన సూత్రం!

డాక్టర్ సూరంపూడి సుధ విద్యార్థినిగా ఉన్నప్పుడే పాండిత్యంతో పాటు భక్తిప్రపత్తులు గలిగిన ఉత్తమ సంస్కారాన్ని చదువు సంధ్యలలో ప్రదర్శిస్తూ ఉండేది. ఆమె కానరాని కృష్ణభక్తురాలు. చిన్నప్పటినుండి కృష్ణసుధను మనసారా ఆస్వాదించింది. దేవకిగా, యశోదగా, గోపిగా ఆమె కృష్ణుడిని ఆరాధించింది. వైరభక్తిలో ఉండే మాధుర్య హేలను అనుశీలించింది. భాగవత భక్తుల శీలం ఆమె ఆలోచనధారలో అక్షర తోరణాలుగా వెలుగుచూచాయి. భాగవతం మీద పరిశోధన చేయటానికి ఆమె తగినంత సాహిత్య తపస్సు చేసింది. రాసక్రీడలోని మధురాద్వైతాన్ని శరణాగత భావంతో స్వాయత్తం చేసికొన్నది. భావంలో కుదురుకొన్న తన్మయత్వాన్ని భాషలో తరళసుందరంగా ప్రదర్శించగలిగింది. కృష్ణభక్తి ఆమె జీవనాదంగా, జీవన వేదంగా పరిణమించింది. అందుకే కాబోలు 'భాగవతంలో కృష్ణతత్త్వం' అనే అంశాన్ని పరిశోధన వస్తువుగా ఎన్నుకున్నది. చేస్తున్నది తెలుగులో పరిశోధన కాబట్టి ఆభాగవతం వ్యాసభాగవతం అనటంకంటె పోతన భాగవతం అనటమే మేలు. అదే నిజం కూడా! మూల భాగవతం బ్రహ్మసూత్ర భాష్యంగా ఉంటుంది. పోతన భాగవతం భక్తిరసాయనం లా ఉంటుంది. ఆంధ్రమహా భాగవతంలో భక్తికవిత్వంలో తత్త్వ నవనీతం తేలియడుతూ ఉంటుంది. కృష్ణతత్త్వం కూడా అనుభూతిలో అటువంటిదే. ఈ పరిశోధన భక్తి భాండాన్ని చిలికి తత్త్వనవనీతాన్ని ముంజేతిలో నిలిపినట్లుంటుంది. చిరంజీవి సూరంపూడి సుధ ఈ ప్రయత్నంలో సాహితీవిదుల ప్రశంసల నందుకొనగలదని మనసారా నమ్ముతున్నాను.

భాగవత మహాపురాణాన్ని భగవంతుడి విశ్వమూర్తిగా భావించి ఆరాధించే భాగవతోత్తములున్నారు. ఆ భగవంతుని శరీరంలో దశమస్కంధం హృదయంగా వారు భావిస్తారు. ఎందుకంటే దశమస్కంధం శ్రీకృష్ణలీలామృతం. అవతారాలన్నింటిలో శ్రీకృష్ణావతారం పరిపూర్ణావతారం. విష్ణుదేవుని అవతారాలన్నిటిలో 'పరమాత్మ' అనే వివేకంతో పిలువబడే దివ్యమూర్తి శ్రీకృష్ణుడే.

భారతంలో గీతాచార్యుడుగా నిలిచిన శ్రీకృష్ణుడిని 'భగవాన్' అని పిలిచాడు వ్యాసమహర్షి. భగవాన్, పరమాత్మ - అనే వాచకాలు అవతారపురుషులలో శ్రీకృష్ణుడికే పర్యాయపదాలు. పరమాత్మ మానవాకృతి ధరించి ప్రదర్శించే దివ్య విభూతిని శ్రీకృష్ణావతార చరిత్రంలో సమగ్రంగా దర్శించగలం. తథ్యం. అందుకే భాగవతంలోని దశమస్కంధం చదివితే భగవత్తత్త్వాన్ని పరిపూర్ణరసంగా ఆస్వాదించినట్లే. డాక్టర్ సూరంపూడి సుధ దశమస్కంధం కేంద్రంగా భాగవత పరిధిని పరిశీలించి ప్రామాణికమైన రచన చేసింది. అందుకు ఆమె అభినందనీయురాలు.

భాగవతంలోని కృష్ణతత్త్వాన్ని ఒక్క వాక్యంలో చెప్పాలంటే 'రసోవైసః' అనే ఉపనిషత్సూక్తి. ఇది లౌకిక సూక్తి కాదు. అలౌకిక సూత్రం కాదు. ఆధ్యాత్మిక సత్యం. లౌకిక రసాలు సుఖదుఃఖాత్మకాలు. అలౌకిక రసాలు ఆనంద పర్యవసాయులు. ఆధ్యాత్మిక రసం శుద్ధమైన ఆనంద స్వరూపం. పరిపూర్ణ రసం. అదే పరమాత్మ. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ ' అని చెప్పబడే పరబ్రహ్మను శ్రీకృష్ణునిగా దర్శించి, అద్వైతానంద సిద్ధిని పొందే ఆధ్యాత్మిక అనుభూతియే రసానుభవం. కావ్యాలు ఎన్ని చదివినా కలిగేది బ్రహ్మానంద సదృశమైన కావ్యానందం మాత్రమే. భాగవత మొక్కటే బ్రహ్మానందాన్ని అందించగలిగిన ఆధ్యాత్మిక కావ్యం. భక్తి-శృంగారాదులవలె అలౌకిక రసం కాదు. అది ఆధ్యాత్మిక రసం. దానిని భాగవతం అనే వాఙ్మయవాహిక ద్వారా సహృదయులు పొందగలుగుతారు. ఆ మార్గాన్ని బోధించటానికి తత్త్వగంభీరమైన వేదాంత మార్గాన్ని ఆశ్రయించి కొందరు వ్యాఖ్యానిస్తే, అనుభూతి నందించే మధుర మార్గాన్ని అనుసరించి కొందరు వివరిస్తారు. డాక్టర్ సూరంపూడి సుధది మధురమైన అనుభూతి మార్గం.

పైకి ఇది పరిశోధన గ్రంథంగా కనపడినా పరిశోధనలో సహజంగా ఉండే సత్యప్రతిపాదనలోని శాస్త్ర స్వభావంకంటె ప్రసన్న కథా కలితార్థయుక్తితో కూడుకొన్న సహజ మధుర వాగ్విలాసం ఇందులో తరంగ సుందరంగా లాస్యంచేస్తుంది. వచనంలో పరుచుకున్న ఒక పెద్ద పాటలాగా ఈ పరిశోధన

వ్యాసం జాలువారింది. అందువలన కృష్ణతత్త్వం పాడుతున్న వచన వాగ్గేయకారిణిగా చిరంజీవి సుధ ఈ గ్రంథంలో ఆత్మసంగీతం పాడే వచనరచనం చేసింది. అందుకే అనిపిస్తుంది. ఇది పరిశోధనే కాదు. పారవశ్యంతో పలికిన భక్తివచనం. ఇందులో కనపడేది విషయ విశ్లేషణేకాదు. శ్రీకృష్ణతత్త్వాన్ని మజ్జిగలో తేలాడుతున్న వెన్నను ముద్దగా చేస్తున్న నవనీత విద్యారహస్య మంత్రోపదేశంగా మనస్సుకు హత్తుకొనే వివేచనం. ఈ వ్యాసంలో కథగా చెప్పిన వేదాంతం, ఘట్టాలుగా చిత్రించిన భక్తి దశలు, ఉదాహరణలుగా ఉల్లేఖించిన మానసికావస్థల మధుర భక్తి మహిమలు, భగవల్లక్షణాలను నెమలిపింఛంలోని రేకుల్లాగా విప్పి చూపించిన శ్రీకృష్ణ లీలా విభూతులు, రాసక్రీడలలోని రసానుభూతుల ఆనందహేలలు డాక్టర్ సుధ రచనలో రాగలహరిలాగా రవళిస్తాయి.

శ్రీకృష్ణుడు ఆనందరూపుడు. శ్రీకృష్ణభక్తి వేణుగానం వంటిది. గోపిక-భక్తుడు-జీవుడు వేణువువంటివాడు. శ్రీకృష్ణుడు ఊదితే వెదురు వేణువుగా నినదిస్తుంది. ఆనందమధువును అందిస్తుంది. అలాగే డాక్టర్ సూరంపూడి సుధ పరిశోధనను భాగవత కృష్ణుని నోటికందించింది. ఆయన పాడిన పాటను వినిపించింది. పరిశోధనగా జాలువారిన ఆ పాటయే ఈ రచనగా మన కందుతున్నది సుధ. నిజానికి రచనకూ రచయిత్రికీ భేదం తొలగింది. మధురాద్వైతం కుదిరింది. భాగవతం ఒకసుధ. శ్రీకృష్ణతత్త్వం సుధ. ఇక రచయిత్రి కూడా ఒక సుధ. సుధాత్రివేణి సంగమం ఈ పరిశోధన వ్యాసం. ఈ గ్రంథం రచించిన రచయిత్రికీ చదివిన వారికీ పుణ్యం, పురుషార్థం! శుభం భూయాత్.

హైదరాబాదు
**29.11.2005** జి.వి. సుబ్రహ్మణ్యం

- ఆచార్య కసిరెడ్డి

# శ్రీకృష్ణ చైతన్య సుధ

**హరిమయము విశ్వమంతయు**
**హరి విశ్వమయుండు సంశయము పనిలేదా**
**హరిమయము గాని ద్రవ్యము**
**పరమాణువు లేదు వంశపావన వింటే !**

(భాగవతం, ద్వితీయస్కంధం, పద్యం: 17)

ఇది హరి తత్త్వం, ఇదే కృష్ణతత్త్వం, ఇదే భాగవత తత్త్వం. ఇది సూక్ష్మం, కాని ఈ సూక్ష్మం స్థూలరూపంలో చూపాలి. అక్షరం అంతరం సూక్ష్మమైతే అక్షరం ఆకృతి ధరించడం స్థూలమవుతుంది.

తమ అంతరంగంలోని కృష్ణ చైతన్యాన్ని భాగవత గ్రంథం ఆధారంగా బహిరంగంలోకి తెచ్చారు డా॥ సూరంపూడి సుధగారు.

పాలసముద్రాన్ని మథిస్తే అమృతంవస్తుంది. విషం మొదలైనవి తొలిదశలో కష్టపెట్టినా అంతిమ ఫలితం మాత్రం చైతన్యాన్ని ప్రసాదిస్తుంది. భాగవత పరిశోధనలో బయల్పడిన ఆ చైతన్యామృతమే కృష్ణతత్త్వం. ఆత్మ సదృశలేదా ప్రాణ సదృశ పద్యాలను పట్టుకొన్న కారణంగా కృష్ణతత్త్వం స్పష్టంగా నిరూపించ గలిగారు.

**విశ్వాత్ముడు, విశ్వేశుడు**
**విశ్వమయుండఖిల నేత విష్ణుడజుండీ**
**విశ్వములో దామండును**
**విశ్వము దనలోనఁ జాల వెలుగుచునుండున్**

(భాగ, ద్వి.స్కం, పద్యం:100)

విశ్వాత్ముడు, విశ్వేశుడు, విశ్వమయుడు విష్ణువు. అంతర్బహిశ్చనారాయణః అటువంటి తత్త్వం భౌతిక దృష్టికి అలవడదు. భాగవతాన్ని భక్తి తత్త్వంగానే భావించి, భక్తుల కథలు గానే భావించి అధ్యయనం చేయరాదు. అది నిత్య చైతన్యమనీ నిర్గుణమైంది నిరాకారమైంది అని భావించి అధ్యయనం చేయాలి. గజేంద్రునిలా దర్శించాలి.

**స్త్రీ నపుంసక పురుష మూర్తియుముగాక**
**తిర్యగమరనరాది మూర్తియుముగాక**
**కర్మగుణ భేద సదసత్ప్రకాశిగాక**
**వెనుక నన్నియుఁదానగు విభుదలంతు**

(భాగ, అష్టమ, పద్యం:85)

స్త్రీ కాదు, పురుషుడు కాదు, నపుంసకుడు కాదు, తిర్యక్కు కాదు, అమరుడు కాడు, ఏ మూర్తులేలీ ఆయనకాడు, త్రికర్మలు, త్రిగుణాలు, వాటి భేదాలు, సదసత్ప్రకాశాలు ఆయనకాదు. ఇవికాని వేవో, ఇది కాని దేదో అదీ ఆయన. నేతి....నేతి......నేతి అంటూ ఇదీ అని తేల్చాలి.

ఇలా అంతరంగం తేల్చిన చైతన్యమున్న వారు మాత్రమే "భాగవతములో కృష్ణతత్త్వము" అనే అంశంపై పరిశోధన చేయడానికి అర్హులు. ఆ అర్హత డా॥ సూరంపూడి సుధ సంపాదించారు.

ఈ తత్త్వాన్ని శ్రీకృష్ణయుగంలో సంపూర్ణంగా ఎవరూ చెప్పకుండానే తమంతకు తాము సాధించినవారిలో సాధించి బహిర్గతం చేసినవారిలో ప్రప్రథమంగా చెప్పుకోదగ్గవారు భీష్మపితామహులు. దీనిని అనుభవించి ధన్యమైనవారు రాధాకృష్ణులు. అహంకరించినా అర్థం చేసికొన్నది సత్యభామ. మదాహంకారాలు వదలి పరమగమ్యం చేరుకొన్నవాడు గజేంద్రుడు. కృష్ణ తత్త్వాన్ని అంతరంగంలో దాచుకొని అర్చించిన వాడు కుచేలుడు. ఆతత్త్వాన్ని తన పయస్సుధా ధారలతో పెంచిన అమ్మ యశోదమ్మ. ఆ తత్త్వంతో పులకించింది నంద వ్రజం. ఆతత్త్వాన్ని ఆనాటి నుండి నేటివరకు అన్వేషిస్తున్నవారు గోపికలు.

ఆ అన్వేషణలో ఒక గోపిక ఈ పరిశోధకురాలు. వీరు ఆనాడు అన్వేషించి సాధించిన చైతన్యాన్ని పొందిన పరమానందాన్ని, ఈ కలియుగంలో పరిశోధన అనేనెపంతో కొన్నాళ్లు సాధన చేసినట్లు నటించి అధ్యయనశీలురందరికి ఈ తత్త్వాన్ని అందించాలనే తపనతో చేసిన పని ఇది.

ఎవరంగీకరించినా అంగీకరించకున్నా ఈ పవిత్ర నేపథ్యంతో ఈ గ్రంథాన్ని అధ్యయనం చేయాలి. భాగవతం-భగవదవతారాలు, భాగవత వైశిష్ట్యం, ఏకవింశత్యవతారాలు, అష్టాదశపురాణాలలో శ్రీకృష్ణ ప్రసక్తి హరివంశంలో శ్రీకృష్ణ ప్రశస్తి... ఇలా ఎన్నిటినో వివరించిన పరిశోధకురాలి అంతరంగాన్ని ఈ పవిత్ర నేపథ్యంతోనే అధ్యయనం చేయాలి.

ఇక పరిశోధనకు ప్రధానంగా ఎన్నుకొన్న గ్రంథం శ్రీమదాంధ్రమహాభాగవతం. భక్త పోతన పలికిన భాగవతకథ; పలికింది తాను కానని పలికించినవాడు రామభద్రుడని, భవహరం నిమిత్తం తాను పలికాడు. ఆపలికిన పలుకుల్లోని పరమార్థాల్ని తమ పరిశోధన ప్రణాళికకనుగుణంగా డా॥ సుధగారు ఉపయోగించుకొన్నారు. భక్తిభావవిలీనంలో అద్వైతాన్ని అందుకొని అక్కడే ఆగిపోతే పరిశోధకు రాలి కలం ఇలా నడిచేదికాదు. బౌద్ధిక ప్రణాళిక పద్ధతి ఇలా రూపుదిద్దుకొనేదికాదు.

నవవిధ భక్తుల పరిశీల నానంతరం శ్రీకృష్ణావతార ప్రయోజనాలను ఈ అంతమ్సూత్రంతో పరిశోధకురాలు తెలుగు సాహిత్యాధ్యయన శీలురకు అందించారు. ఆవిర్భావం, అవతార కారణాలు, గోకులంలో శ్రీకృష్ణుడు, ఇక ఆతర్వాత ఓ లీలలుగా కనిపించే రక్షణ శిక్షణలు జీవితాన్ని ఆనందమయంగా తీర్చిదిద్దుకోడానికి పేలైన అనేక సంపుటవలను రచయిత్రి స్పృశించారు. చివరలో శ్రీకృష్ణుని భగవత్తత్త్వాన్ని ప్రకటించడానికి చతుర్వ్యూహాలను వివరించారు. తామస, రాజస, సాత్త్విక ప్రకరణాల ప్రమాణ ప్రమేయ - సాధన-ఫల ప్రకరణాలను సాధికారికంగా అందించారు. వారు గ్రహించిన సారభూతార్థాన్ని చూద్దాం. సంస్కృతాంధ్ర భాగవతాలపై ప్రసారించిన లోచూపును గ్రహిద్దాం.

శ్రీమద్భాగవతం గంభీర విషయ విచారణతోనూ గూఢార్థ పదగుంఫిత శైలితోనూ, గాఢబంధ సమ్మిళితంగానూ ఉండి మోక్ష శాస్త్రమనీ, సాత్వత సంహిత అనిపిలవబడుతోంది. హయగ్రీవ బ్రహ్మవిద్య అనీ చెప్పబడుతోంది.

భాగవతాన్ని అర్థంచేసుకోవడం, అన్వయించుకోవడం పాండితీ ప్రకర్షకు నిదర్శనం. అది సమాధి భాష (సమాధి స్థితిలో వ్రాసినది). వ్యాఖ్యాన సహాయం లేనిదే గ్రంథం అర్థమవడం దుర్లభం. ఈ సమస్య పోతన భాగవతానికి లేదు. ఆలోచనామృతమైన సంస్కృతభాగవతానికి ఆపాత మధురత్వాన్ని జోడించాడు పోతన॥ (పుట:8).

పరిశోధకురాలు సమాధిస్థితిలోకి వెళ్ల వచ్చు. అదివ్యక్తిగత విషయం. ఆస్థితిలో చెప్పేవి పరమసత్యాలు. అయితే వాటిని బాహిర చైతన్యంతో బౌద్ధికశక్తితో నిరూపిస్తేనే దానిని పరిశోధన పరాకాష్ఠగా సాహిత్య లోకం గ్రహిస్తుంది. సరిగా ఇదేపని చేసి "భాగవతములో కృష్ణతత్త్వము" అనే సిద్ధాంత గ్రంథాన్ని లోకార్పణం చేశారు. ఇది భాగవత కృష్ణ సుధ. ఈ దిశలో అధ్యయనం చేసేవారికిది భక్తిసుధ. పరిశోధకురాలికిది శ్రీకృష్ణ చైతన్య సుధ.

భాగ్యనగర్ ఆచార్య కసిరెడ్డి
15.10.2006 కార్యదర్శి
జాతీయసాహిత్య పరిషత్.

## Sweet Blessings

"Shri Gopi Janavallabha Sri Krishna Chandrayanamah"
"Shri Yamune"
"Madhuradhipate rakhilammadhuram"

"Lord Shri Krishna the lord of sweetness is entirely sweet"

Every particle of this universe and the universe beyond is moving every moment according to the sweet will of the sweet Lord Shri Krishna. His sweetness selects and picks up the divine souls to reach the Highest.

All the thinkers, writers, reachers and teachers are moving in truth consciousness and bliss, blessed are those who have been selected for his sweet services and for the greater cause.

Lord Shri Krishna has selected and picked up Surampudi Sudha for his own sweet purposes.

The Deeksha Guru (Krishna Priyaji) of Surampudi Sudha put the thought into writing on the subject:

Krishnatattva in Vyas Bhagavatam.. Sudha very sincerely honestly and truthfully did this and now having

the Ph.D. By Shri Krishna's grace and sweetness Sudha is writing about Shree Mahaprabhu Vallabha Charya. This is all possible due to Shri Krishna's sweet grace.

Shri Krishna Kripa Ashirvaad has very deeply rooted in Surampudi Sudha to reach the highest goal. Krishna Kripa Ashirvaad and Ashirvaad of Shyam Sakha are inseparable. Shyam Sakha wishes Surampudi Sudha of beloved Krishna to have special grace by way of pangs seperations (TAAP) to reach her Krishna's Sweet Leelas by Krishna's sweet grace.

Raipur — Shyam Sakha

18.07.2006 — (B.P.Sharmaji, Raipur)

శ్రీ కృష్ణ సద్గురవేనమః
శ్రీ కృష్ణః శరణంమమ

# నా మాట

ఎవరి గుణాలు కర్ణేంద్రియాలను సోకగానే జీవుల తాపత్రయాలు తీరిపోతాయో ఎవరి శుభాకారాన్ని వీక్షించినంతనే కన్నులకు అఖిలార్థాలు సిద్ధిస్తాయో ఎవరి చరణసేవ చేస్తే భువనోన్నతత్వం ప్రాప్తిస్తుందో ఎవరి నామాన్ని స్మరిస్తే భవ బంధనాలన్నీ పటాపంచలవుతాయో ఆ పరతత్త్వమే శ్రీ కృష్ణ పరబ్రహ్మం. ఆ పరబ్రహ్మం దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మసంస్థాపన నిమిత్తం భువికి అవతరించి ఎన్నో లీలలు సలిపాడు. ఆ లీలలు ఎంతటి రసభరితమో హృదయంగమమో అంతటి దురవగాహ్యం. కృష్ణతత్త్వాన్ని తెలుసుకోవడమనేది ఆ కృష్ణ పరమాత్మ అనుగ్రహం వల్లగానీ సాధ్యంకాదు. ఆ అనుగ్రహం వల్లనే పోతనామాత్యుడు కృష్ణతత్త్వాన్ని వినీ కనీ అర్థంచేసుకునీ తెలుగులో భాగవతాన్ని అత్యద్భుత కావ్య చిత్రంగా తీర్చిదిద్దాడు. ఆ పరమాత్మ దయ, అనుగ్రహంతో **ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 'భాగవతంలో కృష్ణతత్త్వ'**మనే అంశం మీద పరిశోధన చేసే అవకాశం నాకూ లభించింది. **శ్రీమద్గురుదేవి మాతాజీ కృష్ణ ప్రియగారి** ఆశీర్వాద బలంతో పరిశోధన ఆరంభమయింది. ఈ రూపేణా ఎంతో మంది పెద్దలను మహాత్ములను దర్శించి వారి ఆశీస్సుల నందుకో గలిగే మహద్భాగ్యం కలిగింది. ముఖ్యంగా కృష్ణ భక్తి సాగరంలో నిరంతరం ఓలలాడుతూ ఉండే **శ్యామసఖుల (బి.పి.శర్మాజీ -రాయపూర్)** వారి పరిచయం గురుకృప వల్ల కలిగింది. వారు హిందీ భాషలోని గ్రంథాలనూ వల్లభాచార్యుల వారి కృష్ణ సాహిత్యాన్ని నాకు ప్రసాదించి నా పరిశోధనను సుగమం కావడానికి ఎంతగానో తోడ్పడ్డారు.

అలా నేను సేకరించిన విషయాలను ఒక పద్ధతి ప్రకారంగా గ్రంథస్థం చేయడంలో నా పరిశోధనా పర్యవేక్షకులు ఆచార్య **డా.ఎం.కులశేఖర రావుగారు** ఎంతో సహకరించారు.

కృష్ణతత్త్వాన్ని ఆస్వాదించవలసిందేగానీ వివరించి చెప్పనలవి కానిది. ఆద్యంతరహితమైన భగవత్తత్త్వాన్ని గ్రంథ రూపంలో కుదించి పొందుపరచడం అసాధ్యం. ఎంత చెప్పినా అది అసంపూర్ణం. గ్రంథానికి నేను వేసుకున్న ప్రణాళిక ప్రకారం 'భాగవతము-భగవదవతారాలు' 'అష్టాదశ పురాణాలలో కృష్ణ ప్రసక్తి', 'హరివంశంలో కృష్ణ ప్రశస్తి', 'పోతన భాగవత తత్త్వం', 'భాగవతంలో విశిష్టాద్వైతం', 'శ్రీ కృష్ణావతార ప్రయోజనాలు' అనే విషయాలను వివరించి చివరగా 'శ్రీ కృష్ణుడు-భగవత్తత్త్వం' అన్న విషయాన్ని శ్రీమద్వల్లభా చార్యుల వారి సుబోధిని (భాగవతానికి వ్యాఖ్య)లోని విభజనను ఆధారంగా పోతన భాగవతాన్ని విభజించుకుని చతుర్వ్యూహాత్మకంగా షడ్గుణయుక్తంగా కృష్ణతత్త్వాన్ని విపులీకరించడానికి ప్రయత్నించాను. ఈ రూపంగా కృష్ణలీలను అవగాహన చేసుకోవాలని ఆశించాను.

ఈ విధంగా భాగవతంలో కృష్ణతత్త్వానికి ఒక ఆకృతిని ఆవిష్కరించానని భావిస్తున్నాను. అనంతమైన కృష్ణతత్త్వం రేఖామాత్రంగా నయినా ఈ గ్రంథంలో ఆవిష్కృతమయినట్లు పాఠకులు భావిస్తే నేను కృతార్థురాలినే.

1993లో ఈ గ్రంథానికి పిహెచ్.డి. పట్టా వచ్చినా అనేక కారణాల వల్ల ఇప్పటి వరకు ముద్రణకు నోచుకోలేదు. దీనిని ముద్రించి శ్రీమద్గురుదేవికి అంకితమివ్వాలన్న నా చిరకాల వాంఛ ఇన్నాళ్ళకు నెరవేరింది. అపారమైన తన అనుగ్రహాన్ని నాపై చూపిన ఆ శ్రీకృష్ణ పరమాత్మకు, తమ ఆశీర్వాదబలంతో నన్ను నడిపిస్తున్న శ్రీమద్గురుదేవి మాతాజీ కృష్ణ ప్రియగారికీ తమ సత్సంగసుధను వర్షిస్తూ ఈ సుధకు అండదండగా ఉన్న శ్యామసఖుల వారికీ పాదాభివందనాలు. ఈ గ్రంథముద్రణకు కావలసిన ఆర్థిక సాయాన్ని అందించిన **శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం** వారికీ నా తమ్ముడు **మారంపూడి శ్రీనివాస రావు**కీ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

నా మీద అవ్యాజమైన వాత్సల్యాభిమానలతో ఈ గ్రంథానికి ముందుమాటలు వ్రాసియిచ్చిన శ్యామనఖుల వారికి గురువర్యులు పూర్వ ఉపాధ్యక్షులు (పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం) **డా.జి.వి.సుబ్రహ్మణ్యం** గారికి-పరిశోధనా పర్యవేక్షకులు పూర్వాచార్యులు (ఉస్మానియా విశ్వవిద్యాలయం) **డా.ఎం.కులశేఖర రావుగారికి** నతమస్తక అభివాదాలు. పనివత్తిడి ఎంతగా ఉన్నా ఈ గ్రంథంపైన తమ అమూల్యమైన అభిప్రాయాన్ని వెల్లడించిన ఆత్మీయులు పూర్వాచార్యులు (ఉస్మానియా విశ్వవిద్యాలయం) **డా. కపిరెడ్డి వెంకట రెడ్డిగారికి** నా అభివందనాలు.

నా కెన్నో గ్రంథాలనూ సలహాలనూ ఇచ్చి ఆధ్యాత్మిక సాహితీ పథంలో మార్గదర్శకులైన కీ.శే.శ్రీ పరకాల చంద్రశేఖర రావు మామయ్యకి, శ్రీ మూర్తి మామగారికి, ఆధ్యాత్మిక సోదరీ మణులు కుమారి వకుళమాల కుమారి శ్యామల (నాగపూర్) గారలకు నా నమోవాకాలు.

ఇక ముద్రణకు ముందుగా ఆసాంతం చదివి తమ సలహాలతో ఈ గ్రంథానికి మెరుగులు దిద్దిన **డా.ముంజులూరి నరసింహారావు** గారికి **శ్రీ మారంపూడి వేంకటేశ్వరరావు** బాబాయికి నామీది అభిమానంతో అడిగిన వెంటనే కాదనకుండా ఈ గ్రంథానికి ప్రూఫులు దిద్దిపెట్టడంలో తమ పూర్తి సహకారాన్ని అందించిన **శ్రీ మారంపూడి నరసింహారావు** (బాబాయి)కి. మిత్రులు **డా. నగడాల చంద్రశేఖర్** (తెలుగు విశ్వవిద్యాలయం) గారికి, ముద్రణకి సలహాలనిస్తూ ఎంతగానో సహకరించిన **డా.సాయిబాబా** (వి.వి.సాయంకళాశాల) డా.అనంత లక్ష్మి గారికీ కృతజ్ఞతాభివందనాలు.

నిరంతరం తమప్రోత్సాహంతో నాలో సాహిత్యాభిలాషను వృద్ధి చేస్తూ ఉండే బాబాయిలకీ (మారంపూడి నరసింహారావు, రాధాకృష్ణ మూర్తి, సూర్యనారాయణ మూర్తి, మధుసూదన రావు, వెంకటేశ్వర రావు), పిన్నమ్మలకీ (సీతారామమ్మ, శ్రీమణి, లలిత, డా.సుశీల, లక్ష్మి), మేనత్త (కీ.శే.రాజ్యలక్ష్మి)కీ ఇంకా మేనమామలకీ, అత్తయ్యలకీ నా ప్రణవపూర్వక ప్రణామాలు.

నా సాహిత్య ప్రస్థానంలో ప్రత్యక్షంగా పరోక్షంగా ఆర్థికంగా హార్దికంగా ఎంతగానో సహకరిస్తున్న తమ్ముళ్ళూ (సూరంపూడి శ్రీనివాస రావు, సూరంపూడి విజయ వేంకట సుబ్బారావు, డా.శ్రీకృష్ణ), చెల్లెలు (మంచిరాజు రమాసుందరి) మరిది (మంచిరాజు మురళి) మరదళ్ళూ (సౌందర్య, మంజరి, అనూరాధ) అందరికీ ఆశీస్సులు.

ఎంతో ఓపికగా పుస్తకాన్ని ఆద్యంతమూ అందంగా తీర్చి దిద్దిన పాణ్యాం నాగార్జున (గాయత్రి గ్రాఫిక్ పాయింట్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్) గారికి కృతజ్ఞతలు.

భగవత్సేవకూ సాహిత్య సేవకూ ఉపయోగపడే ఈ జన్మను నాకు ప్రసాదించి పెంచి పోషించి నా అభీష్టాన్ని నెరవేరుస్తూ నన్ను ధన్యురాలిని చేసిన మా తల్లిదండ్రులకి (శ్రీమతి సుబ్బలక్ష్మి, శ్రీ రామ్మోహన రావు) నా శతాధిక వందనాలు.

హైదరాబాద్ — సుధ

# విషయసూచిక

## ౬. శ్రీకృష్ణావతార ప్రయోజనాలు

ప్రకరణ విభాగం



# భాగవతము - భగవదవతారాలు

శ్రీ మన్నారాయణుని విశ్వరూపత్వాన్ని సర్వనామత్వాన్నీ వేదాలు ప్రత్యక్షీకరిస్తాయి. వేదధర్మం భారతీయ సంస్కృతికి మూలాధారం. ఆ వేద ధర్మాన్ని లోకంలో ప్రతిష్ఠించడానికి ఏర్పడిన సులభ సాధనాలు పురాణాలని 'వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణేష్వేవ సర్వదా'[1] అనే నారదీయ మహాపురాణంలోని వాక్యమూ 'వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణే నాత్ర సంశయః'[2] అనే స్కాంద పురాణంలోని వాక్యమూ స్పష్టం చేస్తున్నాయి.

ప్రప్రథమంగా పురాణం స్మరింపబడిందనీ ఆ తరువాతే దివ్య పురుషుని ముఖాల నుండి వేదాలు వెలువడ్డాయనీ కనుక పురాణం వేదాల కంటే కూడా ప్రాచీనమని-

**"ప్రథమం సర్వ శాస్త్రాణాం పురాణం బ్రహ్మణాస్మృతం**
**అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిస్సృతాః"**[3]

అనే వాయుపురాణ శ్లోకం తెలుపుతోంది.

"పురానవం భవతి పురాణం"[4] అనేది పురాణానికి వాచస్పత్య నిర్వచనం.

వేదాలు ఉపనిషత్తులు పురాణాలు 'పురాణ' శబ్దానికి పురాతన వస్తు సంబంధమైన అర్థాన్నిస్తున్నాయి. జగత్ప్రాగవస్థను గురించి చెప్పే కావ్యాలు పురాణాలని, దేవదానవ యుద్ధాది ప్రసిద్ధ విషయాలను గురించి చెప్పేవి ఇతిహాసాలని వేద వాక్యాల వల్ల అర్థమవుతుంది.

ఈ 'పురాణం' ఒక సాహిత్య ప్రక్రియగా రూపొంది పంచ లక్షణాలను సంతరించుకుంటుంది.

**"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ**
**వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్"** [5]

అని అమర సింహుని నిర్వచనం. ఈ పురాణాలు మహాపురాణాలు, ఉప పురాణాలు అని రెండు విధాలుగా ఉన్నాయి. అందులో 'మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మ వైవర్త, వామన, వాయవ్య, విష్ణు, వారాహ, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద పురాణాలు మహాపురాణాలు.[6] "ఉశన, కపిల, కాళి, సనత్కుమార, శంభు, సౌర, దౌర్వాస, నందీయ, నారసింహ, నారదీయ, పారాశర, ఆంగీరస సంహిత, భృగుసంహిత, మారీచ, మానవ వాసిష్ఠ, లింగ, వారుణ అనేవి ఉప పురాణాలు.[7] అష్టాదశ పురాణాల్లో ఒకటైన శ్రీ మద్భాగవతము భగవద్విషయాలను, భగవద్భక్తుల జీవిత గమనాలను వర్ణించి చెప్పే మహాపురాణం. వేద భాస్కరుడి వేవెల్గులను గ్రహించి, భక్తిజ్ఞాన వైరాగ్యాలనే వెన్నెల వెల్లువగా మలచి, సామాన్యులకు సైతం ఆస్వాదయోగ్యంగా చేసిన పురాణ విదుడు శ్రీమద్భాగవత కర్త వ్యాసుడు. శ్రుతివాత నీతమైన (3-9-5) శ్రీమన్నారాయణ చరణకమల కోశ గంధాన్ని కర్ణవివరాలకు వాసన చూపించి, ఆ గంధ కణాల రూపేణ శ్రీ కృష్ణుడిని భావసరోరుహంలో (2-8-5) ప్రవేశింపజేసి శరత్కాల సలిల శమలాన్ని పోగొట్టి, మన అంతశ్శమలాన్ని నశింపజేస్తుంది భాగవతం.

## భాగవతం అంటే....

*"మోక్షే ధీర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్ప శాస్త్రయో"*

యే - 'భా' దీప్తౌ జ్ఞాన జ్యోతిర్మార్గే 'గ' గచ్ఛంతితే భాగవతాః తేషాం చరితమ్ భాగవతం. భగవద్భావారూఢులు భాగవతులు. వారి చరిత్రమే భాగవతం. భగవద్భావారూఢునికి జ్ఞానం కన్నా భక్తే ఎక్కువ. భక్తి భాగ్యానికి నోచుకొన్న భక్తుల చరిత్రమే భాగవతం.

భగవంతుని గురించి చెప్పే గ్రంథం గనుక 'భాగవతం' అని వాచస్పత్యం. అయితే భగవంతుడెవరు? ఆ భక్తులెవరు?

*'ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై*
*యెవ్వనియందు డిందు? బరమేశ్వరుడెవ్వడు? మూల కారణం*
*బెవ్వ? డనాది మధ్యలయుడెవ్వడు? సర్వముదానయైనవా*
*డెవ్వడు? వాని నాత్మ భవునీశ్వరునే శరణంబు వేడెదన్'*

అంటూ భక్త కవి పోతన చేత కీర్తింపబడిన ఆ 'ఎవ్వడు' ఎవ్వడో.. ఆ పరమాత్మ సర్వ ప్రపంచానికీ ఒక్కడే. ఆ పరమాత్మనే బ్రహ్మ పదార్థమనీ, చైతన్య స్వరూపమని అంటున్నాం. చైతన్య స్వరూపుడయిన ఆ పరమాత్మ జ్ఞాన శక్తి సంపన్నుడు. శక్తి అనేది సత్త్వ రజస్తమో గుణాలతో కూడియుండి జ్ఞానం చేత శాసింప బడుతుంది.

రజస్సు సృష్టి కారకం. సత్త్వం స్థితి కారకం. తమస్సు లయకారకం. మూడింటిలోనూ సత్త్వం శుద్ధమైనది. త్రిగుణాలను ఆధారం చేసుకొని సృష్టి స్థితిలయాలను నిర్వహించదలచిన 'పరబ్రహ్మం' రజోగుణ ప్రధానుడై, సృష్టికార్యం చేస్తూ బ్రహ్మ అనీ సత్త్వ గుణ ప్రధానుడై స్థితి నిర్వహణ గావిస్తూ విష్ణువనీ తమోగుణ ప్రధానుడై 'లయం' చేస్తూ శివుడని

వ్యవహరించబడుతున్నాడు. సృష్టి స్థితిలయాల కోసం ఆ పరం జ్యోతి నుండి ఆవిర్భవించిన మూడుమూర్తులుగా బ్రహ్మవిష్ణు మహేశ్వరులు చెప్పబడుతున్నారు. ఈ త్రిమూర్తులపై సర్వంసహాధికారం ఆ పరతత్త్వానిదే.

ఉపాధిని బట్టి మాత్రమే పరమాత్మకు మూర్తిత్రయ భేదం కలుగుతున్నట్లుగా, ఉపాధి వైశిష్ట్యాన్ని బట్టే ఫలం సంప్రాప్తమవుతుంది. ఆ కారణంగా సత్త్వమూర్తీ స్థితి కారకుడూ అయిన శ్రీహరిని లోకం క్షేమార్థం ఆశ్రయిస్తోంది. ఈ కారణంగానే 'హరి'ని భగవంతునిగా హరిభక్తులను భాగవతులుగా చెప్పడం జరుగుతోంది.

'భగ' శబ్దానికి అర్థం సమగ్రమైన ఐశ్వర్యం, పరాక్రమం, యశస్సు, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం అనే ఆరింటి కలయిక అని వ్యవహారంలో ఉంది.[10] ఈ షడ్విభూతుల కలయికే భగవత్తత్త్వం. ఆ తత్త్వాన్ని ఆవిష్కరించేదే భాగవతం.

## శ్రీ మద్భాగవత ఆవిర్భావం... వికాసం

శ్రీ మద్భాగవతము వ్యాస ప్రణీత మహాపురాణంగా విఖ్యాతి చెందింది. బ్రహ్మాండాది పురాణాలను పదిహేడింటిని వ్యాసుడు ద్వాపరంలో పరిష్కరించి, పంచమవేదమయిన మహాభారత రచన గావించి, అనంతరం శ్రీ మద్భాగవతాన్ని రచించినట్లు భాగవతం ద్వారా స్పష్టమవుతుంది.

### ఇంతకీ ఈ వ్యాసుడంటే ఎవరు?

ప్రతి ద్వాపరంలోనూ బ్రహ్మ, వశిష్ఠుడు మొదలయినవారు వ్యాసపదవిని గ్రహించి వేదాది విభజన, పురాణ పరిష్కారం గావిస్తారు. ఆ విధంగా గడచిపోయిన వ్యాసులు 27మంది. అయితే మహాభారత, మహాభాగవత రచన గావించిన పరాశరాత్మజుడైన కృష్ణద్వైపాయనుడు ప్రస్తుత కలియుగానికి ముందటి ద్వాపర యుగంలో వెలసిన ఇరువది ఎనిమిదవ వ్యాసుడు.[11] ఈ వ్యాసుడే దేవర్షి అయిన

నారదుడు ఉపదేశించిన చతుశ్శ్లోకీ భాగవతాన్ని సృష్ట్యాదిగా విష్ణుప్రాశస్త్యాన్ని భక్తి పూర్వకంగా పద్దెనిమిది వేల శ్లోకాలలో[12] రచించి లోకంలో ప్రతిష్ఠించాడు.

శ్రీ కృష్ణలీలల్ని భిన్నరీతుల్లో వర్ణిస్తూ 'కృష్ణస్తు స్వయం భగవాన్' అని ప్రబోధించే గ్రంథం భాగవతం.

భాగవతం ప్రప్రథమంగా సృష్టికారకుడయిన బ్రహ్మదేవునికి ఆ పరమాత్మచేత ప్రబోధించబడింది. బ్రహ్మ సృష్టి విషయమై ఆలోచిస్తూ ధ్యానంలో ఉండగా 'తపః' అనే శబ్దం ముమ్మార్లు వినబడింది. దానిని భగవానుని ఆదేశంగా భావించిన బ్రహ్మ ఏకాగ్ర చిత్తంతో సహస్ర దివ్యకల్పాలు తపస్సుచేసి ఆ పరమాత్మను దర్శనం చేసుకొని పరమానందం చెందాడు. బ్రహ్మ తపస్సుకు ప్రసన్నుడయిన ఆ పరమాత్మ బ్రహ్మ కోరికను తెలుపమన్నాడు. దానికి బ్రహ్మ తన క్షేమానికై భగవత్తత్త్వాన్ని ఉపదేశించ వలసిందిగా ప్రార్థించాడు. తత్ఫలితంగా పరమాత్మ తన స్వరూప జ్ఞానాన్ని బ్రహ్మకు ఉపదేశించాడు. నాలుగు శ్లోకాల రూపంలో బ్రహ్మకు ఆ పరమాత్మ అందించిన ఉపదేశమే చతుశ్శ్లోకీ భాగవతం.[13]

పరమ రహస్యము, పరమ దుర్లభమూ అయిన తన తత్త్వాన్ని పరమ పవిత్రుడూ ఇష్టుడూ భక్తుడూ అర్హుడూ అయిన బ్రహ్మకు శ్రీమన్నారాయణుడు ఉపదేశించాడు. దీనిని బ్రహ్మ తన మానస పుత్రుడూ బ్రహ్మచర్య వ్రత దీక్షాపరుడూ భక్తి తత్పరుడూ అయిన నారదునికి బోధించాడు. ఆ తరువాత వేదాలను వింగడించి, పురాణాలను పరిష్కరించి, పంచమవేదంగా మహాభారతాన్ని ప్రవచించి కూడా మనశ్శాంతి చిక్కక తల్లడిల్లుతున్న వ్యాస మహర్షికి నారద మహర్షి దానిని ఉపదేశించాడు. 'భగవంతుడి యశోగానాన్ని నువ్వు చేయలేదు. ఆయన సంతుష్టి చెందకపోతే ఎంతటి ఉద్దండ దర్శనమైనా ఖిలప్రాయమే అవుతుంది. ఆ గ్రంథాల్లో పురుషార్థాలను నిరూపించినంత విపులంగా నువ్వు వాసుదేవ మహిమను నిరూపించలేవు. పదాలతో కదం తొక్కించే చిత్ర విచిత్ర

కవిత్వాలైనా సరే హరి ప్రశంస లేనట్టైతే అవి కాకి తీర్థంలాంటివే అవుతాయి. మానస సరస్సులో వికసించిన కమలాలే ఆటపట్టుగా విహరించే (పరమ) హంసలు అక్కడ నిలువనే నిలువవు. పాద బద్ధాలు కాకపోయినా సరే, పదబంధాలు లేకపోయినా సరే, హరి యశోంకితాలైన కాసట బీసట మాటలు కూడా పాపాల పాలిటి పలు విప్లవాలై సాధుపురుషుల నోళ్ళలో నానుతూ ఉంటాయి చిరస్థాయిగా. భగవద్భావంలేని నైష్కర్మ్యం గాని, జ్ఞాన విజ్ఞానాలు గాని ఎందుకూ కొరగావు. ఇక కామ్య కర్మలు గానీ అతనికి అర్పణం కాని నిష్కామకర్మలు గానీ ఎందుకు పనికి వస్తాయి' అని నారదుడు వివరించాడు.[14] నారద భక్తి సూత్రాలకు లక్ష్య గ్రంథంగా భగవత్కథా విలసితమైన శ్రీమద్భాగవతాన్ని వేదవ్యాసుడు రచించాడు.

వ్యాసుని మనో వైకల్యాన్ని పోగొట్టే ఈ సన్నివేశం వ్యాసుని చేత భాగవతం రచింపజేసిన తీరును గమనించినట్లయితే - అసంతృప్తి పరాకాష్ఠ చెంది మనః కుహరంలో వేదన ఉద్భవించినపుడు, భగవదన్వేషణ కోసం నిజమైన అంతర్మథనం జరిగినపుడు, దానిని నివర్తింప చేయడానికి బోధకుడు లేదా గురువు తనంతతానే వెతుక్కుంటూ వచ్చి తత్త్వోపదేశం చేయడం జరుగుతుందని అనిపిస్తుంది.

శ్రీ మద్భాగవతాన్ని రచించి సంప్రీతుడైన వ్యాసమహర్షి దీనిని పఠించే అధికారి ఎవరాయని ఆలోచించి మహాయోగి, భక్తి వైరాగ్య నిధి అయిన తన పుత్రుడు శ్రీశుకునికి 'బదరికాశ్రమంలో శమ్యా ప్రాసమనే స్థలం'లో బోధించాడు. భాగవత రసాస్వాదన గావించి తన్మయుడైన శ్రీ శుకుడు 'శృంగి శాపకారణంగా సర్పదష్టుడై ఏడు రోజులలో మరణించమున్నట్టెరిగి, ప్రాయోప విష్టుడైన పరీక్షిత్తుకు ముక్తి ప్రసాదించదలచి, సూతుడు మొదలైన అరవైవేల మంది ఋషుల సమక్షంలో 'శుక్రతలమనే చోట భాగవతాన్నంతటినీ వినిపించాడు.

కలియుగారంభంలో ఆ యుగ దోషానికి చిక్కకుండా భగవంతుని దగ్గరకు చేర్చే మార్గంగా సత్రయాగాన్ని చేయ సంకల్పించి నైమి శారణ్యంలో నివసిస్తున్న శౌనకాది మహామునులకు సూతుడు ఈ భాగవత తత్త్వాన్ని

విపులంగా వివరించారు. ఈ విధంగా ఋషి పరంపరగా వచ్చి శ్రీ మద్భాగవతం లోకంలో ముముక్షువుల ద్వారా మరింత ప్రసిద్ధి కెక్కింది.

## భాగవత వైశిష్ట్యం

'సర్వ వేదాంత సారం హి శ్రీ మద్భాగవత మిష్యతే'[15] చతుర్వేదాలనే పెరుగును చిలకగా శ్రీ మద్భాగవత నవనీతం ఆవిర్భవించింది. దీనిలో భగవంతుని సమస్త అవతార విశేషాలు, భక్తుల చరిత్రలు వివరించబడ్డాయి.

బ్రహ్మమానస పుత్రుడయిన నారదమహర్షి వ్యాసునికి భాగవతం ఉపదేశించిన విధానమే భాగవత విశిష్టతను చాటుతుంది. వేదాధ్యయనం, యజ్ఞ గురు పూజాదులచేత, నిత్య కర్మానుష్ఠానాల చేత భగవంతుడు తృప్తి చెందడనీ; భగవంతుని తృప్తి పరచలేని విజ్ఞానం వ్యర్థమని, జ్ఞానానికి హరిభక్తి తోడయితే బంగారానికి తావి అబ్బినట్లేనని, హరిభక్తి గురించి చెప్పనివాడు ధర్మబోధకు అనర్హుడని స్పష్టం అవుతుంది.

ముముక్షు జనసేవితమూ భక్తి విరక్తి జనకమూ అయిన శ్రీ మద్భాగవతాన్ని అధ్యయనం చేసే అర్హత కూడా అందరికీ ఉండదు. వ్యాసుడు శ్రీ శుకునికీ శ్రీ శుకుడు పరీక్షిత్తుకూ భాగవత బోధ గావించడమూ పరీక్షిత్తుకు భాగవతం మోక్షాన్ని సంపాదించి పెట్టడమూ జరిగింది.

**మోక్షకామునకును మోక్షంబు సిద్ధించు**
**భవభయంబులెల్ల బాసిపోవు**
**యోగిసంఘమునకు నుత్తమ వ్రతములు**
**వాసుదేవనామ వర్ణనములు**[16]

అని భాగవతాన్ని ఉపదేశించిన శ్రీశుకుని మాటలను బట్టి భాగవత గ్రంథానికి ఉన్న మహోన్నత లక్షణాలు అవగతమవుతాయి.

"లలిత స్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సు జ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై" [17]

అని పోతన ఈ భాగవత కల్పవృక్షాన్ని వర్ణించిన తీరు భాగవత వైశిష్ట్యాన్ని వినువీధికి ఎగురవేస్తుంది. పఠితలకు భగవద్భక్తిని, లౌకిక భావ విరక్తిని అందించేది భాగవతమని తెలుస్తోంది.

శ్రీ మద్భాగవతం గంభీర విషయ విచారణతోనూ గూఢార్థ పద గుంఫిత శైలితోనూ గాఢబంధ సమ్మిళితంగానూ ఉండి మోక్ష శాస్త్రమని, సాత్వత సంహిత అని పిలవబడుతోంది. హయగ్రీవ బ్రహ్మ విద్య అనీ చెప్పబడుతోంది.

భాగవతాన్ని అర్థం చేసుకోవడం, అన్వయించుకోవడం పాండితీ ప్రకర్షకు నిదర్శనం. అది సమాధి భాష (సమాధి స్థితిలో వ్రాసినది). వ్యాఖ్యాన సహాయం లేనిదే గ్రంథం అర్థమవడం దుర్లభం. ఈ సమస్య పోతన భాగవతానికి లేదు. ఆలోచనామృతమైన సంస్కృత భాగవతానికి ఆపాత మధురత్వాన్ని జోడించాడు పోతన.

భారతీయ సంస్కృతి మీద, ఆధ్యాత్మిక జీవనం మీద భాగవతానికి ఉన్న ప్రభావం కారణంగా భాగవత వైశిష్ట్యాన్ని విశదీకరిస్తూ సంస్కృత భాగవతానికి సుమారు 30, 40 వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. శ్రీధరాచార్యులు వ్రాసిన భావార్థ దీపిక (అద్వైత వ్యాఖ్య), శ్రీ మద్వేంకట కృష్ణాచార్యులు వ్రాసిన విజయధ్వజీయం (అద్వైతవ్యాఖ్య) అనేవి ప్రధానమైన వ్యాఖ్యలుగా చెప్పుకోవచ్చు. శ్రీ మద్భాగవత గ్రంథమంతా భగవద్భక్తి ప్రబోధన పరంగానూ, భగవత్తత్త్వ నిరూపకంగానూ సాగడం చేత దీనికి త్రిమతానుయాయులు (ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత) వ్యాఖ్యానాలు రచించారు.

అందులోని భక్తి తత్త్వానికి ఆకర్షితులయి ఎంతోమంది కవులు ఎన్నో భాషలలోనికి భాగవతాన్ని అనువదించుకున్నారు. పై అన్నింటిని మించి భాగవతం స్వయంగా మహావిష్ణు ప్రాశస్త్యాన్ని, తన్మహిమను, తదవతారాలను, తద్భక్తిని సమగ్రంగా వక్కాణించే సాత్త్విక పురాణం కావడమే భాగవత వైశిష్ట్యానికి కారణం.

శ్రీ మద్భాగవతం బ్రహ్మ సూత్రాలకు నిర్వివాదమైన భాష్యం. అంటే వ్యాస భగవానుడే స్వయంగా పురాణ రూపేణ బ్రహ్మ సూత్రాలకు భాష్యం వ్రాశాడన్నమాట.

ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రన్థా అ ప్యురుక్రమే
కుర్వన్త్య హైతుకీం భక్తి మిత్థం భూతగుణో హరిః [18]

హృదయంలోని అజ్ఞాన గ్రంథులన్నీ విడిపోయిన ఆత్మారాములైన మునులు కూడా హరి అంటే చాలు అహేతుక భక్తిని కనబరుస్తారు. హరిగుణాలు అంతటి మనోహరాలు. శ్రీ మద్భాగవతంలో వ్యాస భగవానుడు ప్రతిపాదించిన సవిశేష సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపం 'శ్రీకృష్ణుడు'. ప్రేమే బ్రహ్మం. అదే దాని సత్య స్వరూపం. ఆ ప్రేమను పొందటమే జీవికి అంతిమ లక్ష్యం అని శ్రీ మద్భాగవతం పదేపదే బోధిస్తుంది. దానిలోని ప్రతిమాటా శ్రీకృష్ణ ప్రేమను చిలకరిస్తుంది, మన మనస్సులో చిగురింప జేస్తుంది. ఇదే భాగవతానికున్న విశిష్టత.

## భారతీయ భాషల్లో భాగవత కథానువాదాలు

సంస్కృత భాగవతం అనేక భారతీయ భాషలలోకి అనువదింపబడింది. ప్రధానంగా ఆయా కవులు భాగవతంలోని దశమస్కంధాన్ని మాత్రమే స్వీకరించి కొద్దిపాటి మార్పులతో చేర్పులతో తమ భాషలలోకి అనువదించుకున్నారు.

**1. మళయాళం:**[19] మళయాళ భాషా సాహిత్యంలో మళయాల కవిత్రయంలో ఒక్కరైన 'శంకర పణిక్కర్ (14 శ.) 'భారతమాల' అనే తన గ్రంథంలో భాగవతంలోని దశమస్కంధ గాథను మొదట రచించి తరువాత భారత కథను రచించాడు.

మళయాల కవిత్రయంలో మూడవకవి మాధవ పణిక్కర్ కూడా 'భాగవతం' అనే గ్రంథాన్ని రచించాడు. వ్యాస భాగవతంలోని దశమస్కంధం ఆధారంగా నంబూద్రి (15 శ.) అనే కవి 'కృష్ణగాథ' లేక కృష్ణప్పాట్టు అనే గ్రంథాన్ని రచించాడు. భాగవత గాథకున్న మాహాత్మ్యం దీనికి కూడా ఉందని ప్రశంసింప బడింది.

'ఎళుత్తచ్చన్' (16 శ.) అనే కవి రచించిన 'శ్రీమద్భాగవతం' అనే గ్రంథం, 'భాగవత గద్యం' అనే మరొక గ్రంథం కూడా కనిపిస్తున్నాయి.

**2. తమిళం:** [20]శెవ్వైశూడువార్ (16 శ.) అనే కవి సంస్కృత భాగవతాన్ని అనుసరించి తమిళ భాషలో సుమారు ఐదువేల పద్యాలలో భాగవతాన్ని రచించాడు.

**3. అస్సామీ:** [21]వైష్ణవాచార్యుడు అయిన 'శంకరదేవుడు' (1449 - 1569) రచించిన భాగవతం అస్సామీ భాషా సాహిత్యంలో ప్రధానమైనది. శ్రీమద్భాగవతంలోని 1,2,3,7,8,9,10,12 స్కంధాలను తాను స్వయంగా అనువదించి, మిగిలిన 4,5,6,11 స్కంధాలను శిష్యులచేత అనువదింపజేసాడు. పోతనకు (1450-1500) సమకాలికుడు శంకరదేవుడు (1449 - 1569). పోతన భాగవతంలోని భావాలు శంకరదేవుని భాగవత భావాలు ఇంచుమించు కలిసినట్లుగా ఉంటాయి.

భాగవత భట్టాచార్యుడనే బిరుదున్న భట్టదేవుడు (1558 - 1638) 'కథాభాగవతం' అనే గ్రంథాన్ని వచనంలో అత్యద్భుతంగా రచించి అస్సామీ మధ్యయుగ గద్య సాహిత్యాన్ని ఎంతో ప్రభావితం చేశాడు. రామ సరస్వతి అనే కవి కూడా దశమస్కంధాన్ని రచించాడు.

**4. కన్నడం:**[22] భాగవత గ్రంథానికి కన్నడ అనువాదాన్ని చాటు విఠలనాథుడు చేశాడు. ఈ భాగవత గ్రంథం మూలానుసారిగా ఉండి కన్నడ సాహిత్యంలో ప్రసిద్ధికెక్కింది. ఈ గ్రంథ అనువాదంలో చాటు విఠలునితో బాటు ఆరాధ్యేంద్ర, విద్యానాథ సదానంద, నిర్వాణ నాథ అనేవారు కూడా భాగస్వాములని తెలుస్తోంది. కన్నడ సాహిత్యంలో చిక్కదేవరాజా రచించిన 'భాగవతం' కూడా ప్రజాదరణ పొందింది.

**5. వంగభాష:**[23] వంగబాషా సాహిత్యంలో భాగవత కథలు కృష్ణకథా రూపంలో ఎన్నో వచ్చాయి. సంస్కృత భాగవతం, విష్ణుపురాణం ఆధారంగా గ్రహించి 'మాలాధర వసు' (1473-80) దశమస్కంధం నుండి శ్రీకృష్ణ అవతార సమాప్తి దాకా గల గాథను 'శ్రీకృష్ణ విజయం' అనే పేరుతో రచించాడు. 1510కి పూర్వం మాధవాచార్య అనేకవి భాగవత దశమ స్కంధం ఆధారంగా 'శ్రీకృష్ణ మంగళ' అనే గ్రంథం రచించాడు. భాగవత దశమ, ఏకాదశ స్కంధాల ఆధారంగా కృష్ణదాసు అనే కవి 'శ్రీకృష్ణ మంగళ' అనే పేరుతోనే మరొక గ్రంథం రచించాడు. పరశురామదాసు అనే కవి భాగవత దశమ, ఏకాదశ స్కంధాల ననుసరించి 'శ్రీకృష్ణ మంగళ' అనే పేరుతోనే మరొక కావ్యం రచించాడు.

భాగవత భట్టాచార్య అనే బిరుదు వహించిన రఘునాథ భట్టాచార్య (16శ.) భాగవతం 12 స్కంధాలను 20,000 పద్యాలలో 'కృష్ణ ప్రేమ తరంగిణి' అనే గ్రంథాన్ని రచించాడు. దుర్లభానందకవి (17 శ.) మూలానికి అతి దగ్గరగా భాగవతంలోని పన్నెండు స్కంధాలను అనువదించాడు. దుఃఖీ శ్యామదాసు (17శ.) భాగవత దశమ స్కంధాన్ని అనుసరించి 'గోవింద మంగళ' అనే గ్రంథాన్ని వ్రాశాడు. 'గోవింద మంగళ' అనే పేరుతోనే కవి చంద్ర శంకర చక్రవర్తి (18 శ.) భాగవత గ్రంథానికి భావానువాదంగా ఒక గ్రంథాన్ని వ్రాశాడు. 'దేవకీ నందన సింహ' (15 శ.) భాగవతాన్ని 'గోపాల విజయాఖ్యాన్' అనే పేరుతో రచించాడు.

**6. ఓఢ్రం (ఒరియా):** [24] జగన్నాథదాసు (15 శ.) రచించిన భాగవతం ఒరియాలో ఎంతగానో ప్రసిద్ధి చెందింది, విశ్వజనీనమయింది. దీనిని జగన్నాథదాసు గాన యోగ్యంగా రచించాడు.

**7. మరాఠీ:** [25] మరాఠీలో కూడా భాగవతాన్ని ఎంతోమంది కవులు అనువదించారు. మరాఠీ సాహిత్యంలో ప్రసిద్ధుడైన బోపదేవుడు భాగవత వ్యాఖ్యా గ్రంథం రచించాడు. శ్రీమద్భాగవతాన్ని బోపదేవుడు, దేవీ భాగవతాన్ని వ్యాసుడు రచించాడని మహారాష్ట్రలో ప్రతీతి నామదేవుని శిష్యుడైన పరసాభాగవత్ అనేకవి భాగవతాన్ని రచించాడు. ఏకనాథుడు (1533 - 99) ఏకనాథ భాగవతాన్ని (చతుశ్శ్లోకీ భాగవతానికి టీకను) రచించాడు. ఏకనాథుడు భాగవతాన్ని ద్వితీయ స్కంధనవమాధ్యాయాంతర్గతమయిన 32-35 వరకు గల నాలుగు శ్లోకాల (చతుః శ్లోకీ భాగవతం) భావాన్ని 1036 ఓవీలలో (మరాఠీఛందం) రచించాడు.

శివకల్యాణుడు ఒక లక్ష ఓవీ వృత్తాలలో దశమస్కంధాన్ని అనువదించాడు. కృష్ణ దయార్ణవుడు (1596 - 1662) దశమ స్కంధం మీద నలభై రెండువేల ఓవీలలో గ్రంథాన్ని వ్రాశాడు. ఇది అసంపూర్ణంగా లభించడం వల్ల 'ఉత్తమ శ్లోకుడనే శిష్యుడు పూరించాడు. మేరోపంత్ (1729 - 94) మంత్ర భాగవతాన్ని రచించాడు.

**7. గుజరాతీ:** [26] ఈభాషలో దశమ స్కంధాన్ని కేశవహ్రాది రాముడు, బాలణుడు (14 శ.) విడివిడిగా అనువదించారు. నరసింహమెహతా (1500 - 80) భాగవత పురాణాన్ని విలక్షణ రీతిలో రచించాడు.

ప్రేమానందుడు (1580 తరువాత) భాగవతాన్ని రచించాడు. ప్రేమానందుడి శిష్యుడు రత్నేశ్వరుడు (1700 ప్రాంతం) భాగవతాన్ని రచించాడు.

**8. హిందీ:** [27] హిందీ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగంగా భాసిల్లిన భక్తి యుగానికి మధుర సౌరభాన్ని కూర్చింది కృష్ణసాహిత్యం. 1535లో ఈ కృష్ణ సాహిత్యం

శ్రీ వల్లభాచార్యుల వల్ల ప్రభావితమయింది. 1535 - 1640 మధ్యకాలంలో శ్రీ వల్లభాచార్యులు రచించిన భాగవత కథా ప్రవచనంలోని విస్తృతమైన భాగాలను సూరదాసు విస్తరించి 'సూరసాగర్' అనే 1,25,000 పదాలను గానం చేశాడు. ఇప్పుడు అందులోనివి 10,000 మాత్రమే లభిస్తున్నాయి. ఇది సంస్కృత భాగవతంలో లాగా 12 స్కంధాలు కలిగిన గ్రంథం. కానీ ఇది శ్రీ మద్భాగవతానికి క్రమబద్ధ అనువాదం కాదు. దశమ స్కంధమే ఇందులో విపులంగా ఉంది శ్రీకృష్ణుని లీలా స్వరూపం ఇందులో అతి మధురం.

1590 - 1640 ప్రాంతంలో నందదాసు అనే కవి 'దశమ స్కంధ భాషా' అనే గ్రంథం రచించాడు.

**9. తెలుగు**: తెలుగులో ఎందరో కవులు భాగవతాన్ని అనువదించినప్పటికీ పోతన రచించిన భాగవతానికే అగ్రతాంబూలం.

తెలుగులో మడికి సింగన (15 శ.) భాగవత దశమ స్కంధాన్ని ద్విపద కావ్యంగా రచించాడు. హరిభట్టు (15 శ.) భాగవత షష్ఠైకాదశ ద్వాదశ స్కంధాలు రచించాడు. రంగాజమ్మ (17 శ.) సంగ్రహ భాగవతాన్ని ప్రబంధంగా రచించింది. గణపవరపు వేంకట కవి (17 శ.) వ్రాసిన పరమ భాగవత చరిత్ర, కుందుర్తి వేంకటాచలపతి (17శ.) రచించిన భాగవతం' లభించడం లేదు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి (1866 - 1961) భాగవతాన్ని వచనంలో రచించారు. జనమంచి శేషాద్రిశర్మ 'తాండవ కృష్ణ భాగవతాన్ని' రచించారు. ఇంకా ఎంతోమంది ఆధునికులు రచించిన భాగవతాలు ఉన్నప్పటికీ పోతన 'భాగవతం' అజరామరంగా ఆబాల గోపాలానికి ఇప్పటికీ ఆనందాను భూతుల్ని, భక్తి రసానందాన్ని అందిస్తోంది.

వివిధ భాషలలో వెలువడిన భాగవతానువాదాలను పరిశీలిస్తే భాగవతమంటే దశమ స్కంధమేనని కృష్ణ చరిత్రేనని ఆయాకవులు భావించినట్లుగా

స్పష్టమవుతోంది. వ్యాసమహర్షి, పోతనామాత్యుడు కూడా దశమస్కంధంలో శ్రీకృష్ణలీలల్ని విస్తరించి వర్ణించినట్లుగా ఇంకే అవతారం గురించి రచించలేదన్నది స్పష్టంగా తెలుస్తోంది.

పన్నెండు స్కంధాలున్నా నిజానికి పదో స్కంధమే భాగవతానికి పరాకాష్ఠ. పదకొండో స్కంధంలో శ్రీకృష్ణుడు ఉద్ధవుడికి చెప్పిన గీత భారతంలోని భగవద్గీత కన్నా విపులంగా ఉంది. పన్నెండో స్కంధం భవిష్య పురాణానికి మారు పేరు. ఏడో స్కంధానికి పదకొండో స్కంధం అనుబంధం మాత్రమే. కనుకనే భాగవతం పది స్కంధాలనుకోవచ్చు. భాగవతానికి పది లక్షణాలు చెప్పారు.

అత్ర సర్గో విసర్గశ్చ స్థానం పోషణ మూతయః
మన్వంతర రేశాను కథా విరోధో ముక్తి రాశ్రయః [28]

పదో లక్షణం 'ఆశ్రయం' దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహ లక్షణమ్
**(2-10-2)**

మొదటి తొమ్మిది లక్షణాలు పదో లక్షణమైన ఆశ్రయ తత్త్వాన్ని స్పష్టంగా నిశ్చయించడానికే. ఈ ఆశ్రయ తత్త్వానికి సాకార స్వరూపం శ్రీకృష్ణుడు. అందుకే కాబోలు అందరూ దశమ స్కంధాన్ని భాగవతంగా అంగీకరిస్తారు. మొదటి తొమ్మిది స్కంధాలు పదో స్కంధాన్ని పరిపుష్టం చేయటానికే.

ఏకవింశత్యవ తారాలను పేర్కొన్నప్పటికీ దశావతారాలకు ప్రాధాన్యమిచ్చి వివరించిన గ్రంథం పోతన భాగవతమే. ప్రథమ దశమ ఏకాదశ స్కంధాలలో కృష్ణావతార లీలల్ని పఠిత కన్నుల ముందు నిలిపినది పోతన భాగవతమే. దానికి కారణం 'కృష్ణస్తు స్వయం భగవాన్' అన్న వాక్యాన్ని నిరూపించడమే.

వ్యాస భగవానుడు భాగవతం సమాధి భాషలో భావుకుల బాణీలో, సంసార ఐంరుటాటంలో, కొట్టుమిట్టాడే పామర జనానికి అందని తీరులో ఉంటుంది.

దానిలోని భక్తి రసాన్ని ఆస్వాదించడానికి ఆయన భావుక స్థాయికి మనం చేరుకోవాలి. హరినామాలను అంటూ వింటూ ఉన్నా కూడా హృదయం కరిగి కళ్ళల్లోంచి అశ్రువులుగాను, రోమ రోమంలో పులకలు గాను బయటపడకపోతే ఆ హృదయం రాయి లేక అయః పిండం. ఇటువంటి ప్రేమను వ్యాసుడు భాగవతంలో నిక్షిప్తం చేశాడు. ఆ ప్రేమ భక్తి అద్వితీయం. ఆయన భక్త్యావేశం స్వర్గాన్నీ సార్వభౌమత్వాన్నీ యోగసిద్ధులను చివరకు మోక్షాన్నీ కూడా కాదని హరినే కోరుతుంది. పోతన వ్యాసుని భక్త్యా వేశాన్ని పుణికి పుచ్చుకొని మూలం కంటే విస్తరించి వ్యాఖ్యాన ప్రాయంగా రచించడం వల్ల తెలుగువారికి కృష్ణతత్త్వాన్ని అర్థం చేసుకోవడానికి పోతన భాగవతం ఎక్కువ దోహదకారిగా ఉంటుందని చెప్పవచ్చు.

అలాగే తెలుగులో పోతన భాగవతానికన్నా ముందువచ్చిన హరివంశం ఒక భగవదవతారవంశానుక్రమణ చరిత్రగా ఉంటే పోతన భాగవతం భగవత్తత్త్వ నిరూపణ చేసేదిగా కనిపిస్తుంది.

## భగవదవతారాలు - కారణాలు

భగవంతుడు సర్వాతీతుడు, సర్వమయుడు, సర్వవ్యాపుడు, సదా సర్వత్ర విరాజితుడు. అయినప్పటికి అప్పుడప్పుడు భూమిమీద ప్రకటనమవుతాడు. దీనినే భగవంతుని అవతరణం అంటున్నాం. (అవతరణం అంటే దిగడం అని అర్థం). ఆ రూపాన్ని భగవదవతారంగా కొలుస్తున్నాం.

భగవంతుడు అనంతుడని చెప్పుకున్నట్లే భగవదవతార కారణాలు అనంతాలనే చెప్పుకోవాలి. భగవదవతారానికి శాస్త్రాలలో కారణాలు ఎన్ని ఉన్నా[29]అధర్మం వృద్ధి పొంది ధర్మానికి గ్లాని కలిగినపుడు, దుష్టశిక్షణ సాధురక్షణతో బాటు ధర్మ సంస్థాపనం చేయడానికి గాను భగవంతుడు అవతరిస్తాడన్నది ప్రధాన కారణంగా కనిపిస్తుంది.

భాగవతంలో శౌనకాది మునులతో సూతుడు-

*భగవంతుండగు విష్ణుడు*
*జగములకెవ్వేళ రాక్షస వధలు గలుగుం*
*దగ నవ్వేళల దడయక*
*యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్*[30]

అన్నమాటలు దుష్ట శిక్షణ తత్త్వాన్నీ, అర్జునుడు శ్రీకృష్ణునితో -

*మాయచేత మునిగినమవారలకు గృప*
*సేసి ధర్మముఖ్య చిహ్నమయిన*
*శుభము సేయుదీవు సుజనులనవనిలో*
*గావ బుట్టుదువు జగన్నివాస!*[31]

అని అన్న మాటలు భగవంతుని సాధురక్షణ తత్త్వాన్ని, భూదేవి ధర్మదేవతతో

*లీలాకారము దాల్చెను*
*శ్రీలలనేశుండు ఖలుల శిక్షించిభవో*
*ద్మాలనము సేయు కొఱకును*
*వాలుగు పాదముల నిన్ను వడిపించుటకున్‌!* ॥[32]

అని అన్న పలుకులు భగవదవతరణకు ధర్మ సంస్థాపనే ధ్యేయంగా వెల్లడి చేస్తున్నాయి.

అయితే అసలు అధర్మం వృద్ధి పొందడం, ధర్మానికి గ్లాని సంభవించడం ఎందుకు? ఇది మాత్రం దైవసంకల్పం కాకూడదా అని అనిపించక పోదు. అటువంటి సందర్భంలో భగవదవతరణానికి కారణం భగవంతుని క్రీడ (లీల) అని మాత్రమే సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

భగవంతుడు తన భక్తులను తన విచిత్ర లీలలతో అలరించాలనే భూమి మీద అవతరిస్తాడు. సామాన్యునికి అతడిని కన్నెత్తి చూసే శక్తి ఉండదని అతనితో లీలా విహారానికై శయ్యాసన భోజన యుద్ధాది వ్యవహారాలకోసం తన పరివారాన్ని కూడా తెచ్చుకుంటాడు.

ముందుగా అసురులలో తమో గుణాన్ని అభివృద్ధి గావించి, సాత్త్వికులు భయపడి బాధపడే విధంగా చేసి, ఆ బాధల రాపిడిలో సాత్త్వికులైన భక్తుల హృదయాలను మరింతగా భగవంతుని పరమయ్యేట్లు చేసి, లోకంలో దైవీ శక్తిని నశింపజేసి, అసుర బలాన్ని పెంచుతాడు. ఆ అసురులు సాధారణమైన పాపులయితే తమ పాపాల చేత మునుల శాపాలతో నాశనమవుతారు. ఒకవేళ ఆ క్రూరులు మహాతపస్వులూ దాతలూ ధర్మాచరణ పరాయణులూ అయినపుడు వారిమీద మునుల తేజం పనిచేయదు.

ఆ విధంగా ద్వైదీ భావం ఉన్న ఆ అసురులలో తామస ప్రవృత్తిని కల్పించి, పెంచి సజ్జనులు లోకంలో ఉండడం దుర్భరమయ్యే పరిస్థితిని సృష్టించి, అందరూ తనను భూమిమీద అవతరించమని కోరే వాతావరణాన్ని ఏర్పాటు చేసుకొంటాడు. ఇలావారి ప్రార్థనల నాలకించి కాలాన్ననుసరించి ఆయా గుణాలలో ప్రవేశించి పెంచి చివరకు వధ్యుడు వధకుడు కూడా తానే అవుతాడు.[33]

కాబట్టి దుష్టశిక్షణ, శిష్టరక్షణ అనేది నెపంగానూ తన లీలలతో భక్తులను ఆనందింపజేయడానికి అవతరిస్తున్నట్లుగానూ చెప్పుకోవాలి. భూభారాన్ని తగ్గించడానికి గానీ దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేయడానికి గానీ ధర్మాన్ని పునః ప్రతిష్ఠించడానికి గానీ సర్వ శక్తిమంతుడైన పరమాత్మ దిగి రావలసిన పనేలేదు. ఆయన అవతరించడానికి సరియైన కారణం భక్తులైన వారు వినదగినవి, గుర్తుంచుకొని, మననం చేసుకోదగినవియైన పనులు చేసి, తద్వారా జీవుల అవిద్యనూ కామకర్మాది నివేశాన్ని పోగొట్టడానికే!

అయితే కథ ప్రసంగం సాగడానికి భూభారహరణాన్ని, శాపవిమోచనాలను చేయడం వంటివి కల్పించుకుంటాడు. ఇలా అవతరించిన అవతారాలనేకమయినా ఏకవింశత్యవతారాలు అందులోనూ దశావతారాలు పూజనీయాలయాయి.

## ఏకవింశత్యవతారాలు - ప్రయోజనాలు

నిరాకార ఘన పరబ్రహ్మం ప్రప్రథమంగా సకల జగత్తు సృష్టించడానికి షోడశకళాత్మకమయిన పురుష రూపాన్ని ధరించాడు. ఆ విరాట్పురుషుని నాభి సరోవరము నుంచి పుట్టిన పద్మం నుంచి బ్రహ్మ జన్మించాడు. విరాట్పురుషుని పాదాద్యవయవాల నుండి ఈ సర్వలోకాలు కల్పించబడ్డాయి.

మొదటి అవతారమైన సనత్కుమార అవతారం బ్రహ్మచర్యానికి ప్రతీక. బ్రహ్మచర్యం వల్ల మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం పవిత్రమవుతాయి. అంతఃకరణ శుద్ధికి బ్రహ్మచర్యం ప్రధానమని చెప్పేదే సనత్కుమారావతారం.

రెండవదయిన వరాహావతారం సంతోషావతారం. వరాహమంటే శ్రేష్ఠమైన దినము. (వర + అహము). ఏ రోజున సత్కర్మ జరుగుతుందో అది మంచి రోజు. సత్కర్మతో లోభాన్ని చంపి భగవంతుడు మనకిచ్చిన దానితో తృప్తి చెంది సంతోషించమని చెప్పడమే ఈ అవతార రహస్యం.

మూడవది నారదావతారం. ఇది భక్తి రసావతారం. భక్తి ద్వారా భగవత్సాక్షాత్కారం లభిస్తుంది గనుక నాలుగవది నారాయణావతారం. అయితే జ్ఞాన వైరాగ్యాలు లేకుండా భక్తి స్థిరపడదు. జ్ఞాన వైరాగ్యాలకు ప్రతీకగా వెలసినది అయిదవదైన కపిలావతారం.

బ్రహ్మచర్యం సంతోషం జ్ఞానం వైరాగ్యం భక్తి ఉన్నవారు గుణాతీతులవుతారు. అప్పుడే భగవంతుడు వారి సన్నిధికి వస్తాడు. దాని చిహ్నమే

ఆరవదయిన దత్తాత్రేయ అవతారం. ఈ ఆరు అవతారాలు బ్రాహ్మణ్యం కోసం ఏర్పడిన అవతారాలు. ఏడవదయిన యజ్ఞమూర్తి అవతారం, ఎనిమిదవదయిన ఋషభదేవుని అవతారం, తొమ్మిదవదయిన పృథురాజు అవతారం, పదవదయిన మత్స్యనారాయణావతారం క్షత్రియులకోసం ఏర్పడిన అవతారాలు. ధర్మాదర్శాన్ని చూపడమే ఈ అవతారాల ఉద్దేశం.

పదకొండవదైన కూర్మావతారం, పన్నెండవదైన ధన్వంతరి అవతారం, పదమూడవదైన మోహినీ అవతారం వైశ్యులకోసం, అనేక లీలలు ప్రదర్శిస్తూ ఏర్పడిన అవతారాలు.

భగవంతుని సర్వవ్యాపకత్వాన్ని తెలియజేసి ప్రహ్లాదునిపై కృపను ప్రదర్శించడం పధ్నాలుగవదయిన నరసింహావతారం. దీని ప్రయోజనం కేవలం ప్రేమతోనే భగవంతుడిని జయించవచ్చు. మనశ్శక్తి, బుద్ధిశక్తి భగవంతుని లొంగదీయలేవు. ప్రహ్లాదుని వంటి దృష్టి కలిగి ఉండాలని తెలియజేసే అవతారం ఇది.

పదిహేనవ అవతారం అయిన వామనుడు పూర్తిగా నిష్కాముడు. భక్తి నీతుల చిత్రం వామనుడిపైన ఉంది. ధర్మ కవచం ధరించినటువంటి మానవుని భగవంతుడు కూడా చంపలేడు. పరమాత్మ ఎంత గొప్పవాడైనా బలి చక్రవర్తి వంటి వారి ముందు అతి చిన్నవాడు.

ఇక పదహారవదయిన పరశురామావతారం ఆవేశావతారం. పదిహేడవ అవతారం వ్యాసభగవానునిది. ఇది జ్ఞానావతారం. పద్దెనిమిదవది మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని అవతారం. పందొమ్మిదవది శ్రీకృష్ణావతారం. శ్రీరామునిలా మర్యాదను పాటిస్తే కామం నశించి శ్రీకృష్ణుడు లభిస్తాడు. 'కృష్ణస్తు భగవాన్ స్వయమ్'. శ్రీరామ కృష్ణావతారాలు అనంతకాలం వరకూ జీవులందరికీ శుభాన్ని కల్గించడానికి ఏర్పడిన పూర్ణావతారాలు. మిగిలినవి అంశావతారాలు. ఆ తర్వాతి బుద్ధ కల్క్యవతారాలు కలిపి ఏకవింశత్యవతారాలు.[34]

ఈ అవతారాలలో బుద్ధుని అవతారం గౌతమ బుద్ధునిదికాదని కొందరి అభిప్రాయం. కలియుగంలో దేవవిద్వేషులు తామసికులైన జనులను మోహపరచడానికి బుద్ధుడనే పేరుతో అంజన (అజిన?) యను నామెకు గయ ప్రాంతంలో జన్మిస్తాడని, యుగసంధి కాలంలో (కలియుగాంతాన) రాజులు దస్యు ప్రాయులు కాగా జగన్నాథుడైన విష్ణువు కల్కి అనే పేరుతో విష్ణుయశుడనే బ్రాహ్మణుని గృహంలో జన్మిస్తాడని భాగవతం తెలుపుతోంది.

## అవతార భేదాలు

భగవంతుని కళ భూమిమీద ప్రసరించి ఒక వ్యక్తి చేత లేదా జీవి చేత లోక కళ్యాణం కోసం ఘనకార్యాలు గావించడమే అవతరణం. అయితే ఆ కళ లేదా ఆ వ్యక్తి చేసిన ఘనకార్యాల తారతమ్యాన్ని బట్టి అవతార భేదాలు కూడా ఏర్పడడం సహజం. ఇలా ఏర్పడిన అవతారాలు ఆరు విధాలు.

1) అంశావతారం, 2) అంశాంశావతారం, 3) ఆవేశావతారం, 4) కళావతారం, 5) పూర్ణావతారం, 6) పూర్ణతమావతారం.

### అంశావతారులు

బ్రహ్మాదులు అంశావతారులు. బ్రహ్మ సృష్టికర్త, విష్ణువు స్థితికర్త, ఈశ్వరుడు సంహారకర్త. వీరు కార్యాధికారులు. సృష్టి స్థితిలయాలు పూర్ణానికి అంశాలు. కనుక బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పూర్ణతముని అంశావతారాలు.

### అంశాంశావతారులు

అంశావతారాలకు తోడ్పడేవారు అంశాంశావతారులు. మరీచ్యాదులను అంశాంశావతారులుగా భావించవచ్చు. వీరు అంశావతారుల ఆజ్ఞాబద్ధులయి ఉంటారు.

### ఆవేశావతారులు

జన్మతః లోకోత్తర శక్తి విశేషాలు లేకుండా ఒకానొక సమయంలో ఆవేశ విశేషం చేత లోకోత్తర కార్యాలను సాధించే శక్తి ఆవేశించినవారు ఆవేశావతారులు. జన్మతః ఋషికుమారుడైన పరశురాముడు తండ్రి మరణం కారణంగా సకల దుష్ట క్షత్రియ సంహారం గావించాడు. ఈ విధంగా శక్త్యావేశ పూరితులై ధర్మ సంస్థాపన కావించిన వారంతా ఆవేశావతారులుగా పరిగణించబడతారు.

### కళావతారులు

వీరు యుగ ధర్మోద్ధారకులు. కపిల కూర్మాదులు ఇటువంటి వారు. కపిలునిలో పరమేశ్వరుని కళ ప్రసరించడం వలన అతనికి తత్త్వం గోచరించి సాంఖ్యయోగ నిర్మాణం చేయగలిగాడు. ఈ కళ ప్రసరించడం వల్లనే కూర్మంలోనూ అధికబలం చేకూరి సముద్ర మథన సమయంలో మంధర పర్వతాన్ని మోయగలిగింది.

### పూర్ణావతారులు

శాపవశులయిన రాక్షస జన్ములను సంహరించే నిమిత్తం ఆవిర్భవించిన వారు పూర్ణావతారులు. నృసింహుడు. శ్రీరాముడు మొదలయినవారు.

### పూర్ణతమావతారం

సకల భువనాలకీ నాయకుడై అత్యుత్కృష్టధామమయిన గోలోకవాసి శ్రీకృష్ణుడు పూర్ణతముడు. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడయిన శ్రీకృష్ణ భగవానుడు అనంత శక్తులను అపరిమితంగా కలిగి వాటిని లోకకళ్యాణానికై ఉపయోగించి పూర్ణతముడయినాడు. 'లోక రక్షైకా రంభకుడు' భక్తపాల కళా సంరంభకుడు, దానవోద్రేకస్తంభకుడు, కేళీలోల విలసదృగ్జాల సంభూత నానాకంజాత భవాండ కుంభకుడు, మహానందాంగనా డింభకుడు' అయిన శ్రీకృష్ణ పరమాత్మ పూర్ణతమావతారంగా భావించబడుతున్నాడు.

# దశావతార తత్త్వం

భాగవత పరంగా ఏకవింశత్యవతారాలు ప్రస్తావించినప్పటికీ లోకానికి బాగా పరిచితమైనవి దశావతారాలే. సాధారణంగా దశావతారాలు శ్రీ మహావిష్ణువు అంశాలుగా చెప్పబడుతున్నా ఎంతోమంది ఎన్నో రకాలుగా వ్యాఖ్యానించారు. అయితే

"మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామోరామశ్చ రామశ్చ బౌద్ధ కల్కిరేవచ"

అనే శ్లోకంలో కృష్ణావతారం దశావతారాలలో ఒకటిగా చెప్పబడలేదు.

దశావతారాలు ప్రధానంగా మానవ శరీర నిర్మాణ క్రమ పరిణామాన్ని తెలియజేస్తున్నాయనీ ఆధ్యాత్మిక సాధనలలోని తారతమ్యాన్ని సూచిస్తున్నాయనీ మాతృగర్భస్థ శిశువు పొందే పరిణామాన్ని సూచిస్తున్నాయనీ ఇంద్రియ నిగ్రహశక్తిలోని తారతమ్యాలను సూచిస్తున్నాయనీ ఇంకా ఎన్నో విధాలుగా ఎంతోమంది వ్యాఖ్యానించారు.

'యద్భావం తద్భవతి' అన్నట్లుగా దశావతార అంతరార్థాలను ఎంతమంది వ్యాఖ్యానించినా అన్ని అవతారాలలోకీ శ్రీరామ, శ్రీకృష్ణావతారాలకే అందరూ ఉన్నత స్థానం ఇవ్వడం జరిగింది. అవతారాలన్నీ వందనీయాలే స్తవనీయాలే. అయినా శ్రీరామ శ్రీకృష్ణావతారాలకు ఉన్న చిత్తాకర్షణ ఇతర అవతారాలలో అంతగా కనిపించదు. సకల గుణాభిరాముడుగా, మర్యాదా పురుషోత్తమునిగా, మానవత్వానికి ఆదర్శప్రాయంగా వెలుగొందాడు శ్రీరాముడు.

సకల జీవులనూ సమానంగా ఆదరించిన మానవత్వం రామునిది. ఇది మానవులందరికీ ఆదర్శమైన ఆచరణ యోగ్యమైన పూర్ణావతారం. అయితే మానవులలో మానవుడిగా వుంటూనే తాను మానవమాత్రుడిని కానని, దైవాన్నే సుమా అని సూటిగా తెలియజేసినది శ్రీకృష్ణావతారంలోనే.

తాను వేసే ప్రతి అడుగులోనూ చేసే ప్రతి చేష్టలో కూడా అద్భుతాలను ప్రదర్శిస్తూ మానవాళిని తన లీలా విలాసాలతో సమ్మోహితులను చేసే సర్వోత్కృష్టమైన, సర్వోత్తమమైన అవతారం శ్రీకృష్ణావతారం.

కృష్ణావతారం అన్యావతారాలలాగా సరళమైనది కాదు. సర్వశక్తుల సమన్వయమూ సంక్లిష్టమూ విలక్షణమూ అయిన అవతారం. 'బాల్యం లీలా మాధుర్యాలతో బాటు అనంత దార్శనిక మార్గాలకు వ్యాఖ్యానం. శృంగార విభూతి లోకదృష్టికి ఎంత మోహనమో తత్త్వ దృష్టి కంత జటిలం. కళ్యాణలీల [illegible] విభూతి విలాసాలకు [illegible]. జీవిత ఘట్టాలలో సందర్భాను గుణమైన ధర్మ[illegible] ఆచరించి చూపాడు. చివరి తనంతో విస్మయతత్త్వాన్ని బోధించిన మనోజ్ఞమూర్తి. చెరసాలలో పుట్టిన నాటినుండి [illegible] అవతారాన్ని చాలించే దాకా కూడా భయంకరమైన అనేక సందర్భాలలోనూ ముఖంలో చిరునవ్వును విడని 'ముగ్ధమోహన మూర్తి'.

అవతార తత్త్వాలను పరిశీలించినట్లయితే భగవంతుడు [illegible] కార్యానికి [illegible] మాత్రం తాను చేసే [illegible] విన్నాయి.

భగవంతుడు మానవాళికి భక్తి జ్ఞానాదులను తప్పనిసరిగా ఉపదేశించవలసిన కాలం ద్వాపరాంతంలోనే ఏర్పడింది. త్రేతాయుగం వరకూ శ్రుతులూ స్మృతులూ శాస్త్రాలలో చెప్పిన మార్గంలోనే మానవులు నడచుకునేవారు. ద్వాపరాంతంలో ప్రజలకు లేనిపోని శంకలూ శ్రుతిస్మృతులమీద విశ్వాస రాహిత్యమూ ప్రబలడం వలన ఆ భగవంతుడే అవతరించవలసిన తప్పని పరిస్థితి ఏర్పడింది. కనుక శ్రీకృష్ణావతారమే సర్వోత్కృష్ట అవతారంగా భావించబడుతోంది.

భగవద్గీతలోని...

'యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థానమ ధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్' [36]
'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' [37]

అనే శ్లోకాలలో కృష్ణుడు తన అవతార కారణాన్ని చెప్పిన విధం పరిశీలించి నట్లయితే.....

ధర్మానికి గ్లాని సంభవించినప్పుడు అధర్మం పెరిగిపోయినపుడు తాను అవతరిస్తానని, సాధురక్షణ, దుష్ట శిక్షణ గావించి ధర్మాన్ని స్థాపిస్తానని అన్నాడు.

అయితే ఈ శ్లోకంలో కనిపిస్తున్న 'ధర్మం' అనే పదానికి అర్థం ఏమిటి? ఆంగ్ల తదితర భాషలలో ధర్మానికి మతం లేదా విశ్వాసం అని అర్థాలున్నాయి. అన్ని మతాలు సమానమే. ఎవరి మతం వారికి ఉత్తమము అయినపుడు... 'అధర్మం' అనే దానికి అర్థం ఏమిటి? ఏ 'అధర్మాన్ని' రూపు మాపడానికి భగవాను డవతరిస్తానన్నాడు?

ఒక మతం ప్రకారం జంతుబలి అధర్మమయితే మరో మతానికి అది సమ్మతమే అవుతుంది. అటువంటప్పుడు, ఈ భిన్న విశ్వాసాలను అవలంబిస్తున్న మానవులలో ఎవరిది ఒప్పు? శ్రీమద్భాగవతం "ధర్మంతు సాక్షాత్ భగవత్ప్రణీతమ్" అని తెలుపుతుంది. అంటే భగవంతుడు శాసించిందే ధర్మం.

సామాజిక దృక్పథంలో శాసనాలనేవి ప్రభుత్వం ఏర్పరచిన నియమాలు. ఉదా: ఒక దేశంలో రహదారికి ఎడమవైపు నడవడం, వాహనాలను నడపడం శాసనమయితే; మరొక దేశంలో కుడివైపున నడపాలనేది శాసనం. ఆ దేశంలో

అది ఒప్పు అయితే ఈ దేశంలో ఇది ఒప్పు. ఒక దేశంలో శాసనం మరొక దేశంలో పాటించివట్లయితే అది తప్పు అవుతుంది.

"పరిత్రాణాయ సాధూనాం"... అనే శ్లోకంలో ధర్మగ్లాని ఏర్పడినపుడు తాను అవతరించి సాధురక్షణ, దుష్టశిక్షణ గావిస్తానన్నాడు. ఇది 'ఒక ప్రభుత్వం తన శాసనం పాటించే పౌరులను రక్షిస్తానని, శాసనోల్లంఘనం చేసిన వారిని శిక్షిస్తానని అనడం వంటిది. వాస్తవానికి ఏ ప్రభుత్వానికైనా ఈ రెండూ ప్రధాన కర్తవ్యాలు. ఇదే తనకూ కర్తవ్యమని జగానికే ప్రభువయిన కృష్ణభగవానుడు కూడా చెప్తున్నాడు.

ధర్మమనే పదానికి మరో అర్థాన్ని పరిశీలిస్తే - ధర్మమంటే స్వతః సిద్ధమైన గుణం. ఉదా: చక్కెర ధర్మం తియ్యదనం. లవణ ధర్మం ఉప్పదనం. పంచదార ఉప్పగానూ ఉప్పు తియ్యగానూ ఉంటే అది అధర్మం అవుతుంది.

అదేవిధంగా జీవికి స్వాభావిక ధర్మం ఏమిటి అనుకున్నప్పుడు ఎవరికో ఒకరికి అధీనమయి ఉండడం జీవి స్వాభావిక ధర్మంగా చెప్పుకోవలసి ఉంటుంది. అంటే కుంటుంబానికో కులానికో ఒక యజమానికో ప్రభుత్వానికో అధీనమయి ఉండక తప్పదు.

ఆ అధీనమవడమనేది సరియైన వారికి అధీనమయితే అంతా సవ్యంగా ఉంటుంది. కానట్లయితే అంతా అపసవ్యమే. ఆ సరైన వారెవరన్నది చైతన్య ప్రభువు ఈ విధంగా చెప్తారు. 'జీవుడు స్వాభావికంగా శ్రీకృష్ణునికి నిత్యదాసుడై ఉండాలి'. అంటే జీవుని సహజధర్మం భగవదాశ్రయం. అలా చేయనపుడు అది అధర్మం అవుతుంది.

శ్రీమద్భాగవతం...

**"సవై పుంసాం పరోధర్మోయతో భక్తి రధోక్షజే**
**అహైతుక్య ప్రతిహతాయయాత్మా స ప్రసీదతి"** [38]

అంటూ సర్వోత్కృష్టమైన ధర్మం అధోక్షజుని (భగవంతుని) శరణు పొందడం అని చెబుతుంది. అంటే విషయవాసనలకు లొంగి ఉండక, భగవదాశ్రితుడై భగవంతునికి లొంగి ఉండడమే ధర్మం.

ఈ ధర్మానికి గ్లాని కలిగినపుడు, అశాంతి పెచ్చుపెరిగి నప్పుడు, జీవుడు తల్లడిల్లి నప్పుడు తనకు తాను ఆవిర్భవించి ధర్మాన్ని సుస్థిరంగా స్థాపిస్తాడని తన అవతార హేతువును శ్రీకృష్ణభగవానుడు తెలిపాడు.

అందుకే భగవద్గీతలో కృష్ణుడు

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"[7]

అని అర్జునునికి బోధించాడు. అన్ని ధర్మాలను పరిత్యజించి తన శరణు పొందడమే పరమధర్మమని తెలిపాడు. ఆ పరమ ధర్మాన్ని తెల్పడమే కృష్ణతత్త్వంగా భాగవతం అంతటా స్పష్టంగా తెలుస్తుంది.

## పాదసూచికలు

1&2. జి.వి. సుబ్రహ్మణ్యం - పురాణ వాఙ్మయము. పు - 4.

3. పోతన - శ్రీ మద్భాగవతము (సాహితీ అకాడమీ ప్రచురణ) (వాయుపురాణ శ్లోకం). పు - 104-281.

4. జి.వి. సుబ్రహ్మణ్యం - పురాణ వాఙ్మయము. పు - 4.

5. వ్యాస ప్రణీత శ్రీ మద్భాగవతము, దశమస్కంధము (వదలవాడ జయరామశాస్త్రి తత్త్వ దర్శినీ వ్యాఖ్య), (1971) (పీఠిక), పు -2.

6. విద్యార్థి కల్పతరువు (సం: ముసునూరి వేంకటశాస్త్రి), పు - 207.
7. విద్యార్థి కల్పతరువు (సం: ముసునూరి వేంకటశాస్త్రి), పు - 12.
8. "మోక్షే ధీర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్ప శాస్త్ర యోః" (అమరం ప్రథమ కాండం ధీవర్గం).
9. పోతన - శ్రీ మహాభాగవతము (2) అష్టమ స్కంధము (బులుసు వెంకటరమణయ్య సం) పద్యం - 73, పు - 11.
10. ఐశ్వర్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా' విష్ణుపురాణం అధ్యాయం. 6.
11. వ్యాసుడు - శ్రీ మద్భాగవత ప్రశస్తి (పీఠిక) శ్రీమద్భాగవతము (పదలవాడు జయరామ శాస్త్రి విరచిత తత్త్వదర్శిని వ్యాఖ్యా సమేతం) దశమస్కంధం ప్రథమ భాగం (1971), పు - 1.
12. '[illegible]' - వ్యాస విరచిత శ్రీమద్భాగవతము, దశమస్కంధము ప్రథమభాగం (పదలవాడ జయరామ శాస్త్రి విరచిత వ్యాఖ్యాన సహితము. పు - 3.
13. (ఎ) అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్ సదసత్పరమ్।
పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్ ॥ (2-9-32)

తా॥ సృష్టికి పూర్వం నేనొక్కడినే ఉన్నాను. నాకంటే వేఱుగ స్థూలంగాని, సూక్ష్మంగాని అదెంతటికీ కారణమైన ప్రధానము (అజ్ఞానము) గానీ లేదు. సృష్టికి పిమ్మట కూడా ఉండేది నేనొక్కడినే ప్రళయంలో మిగిలేది కూడా నేనే).

(బి) ఋతేఽర్థం యత్ ప్రతీయేత న ప్రతీయేత చాత్మని।
తద్విద్యాదాత్మనో మాయాం యథాఽఽభాసో యథా తమః ॥ (2-9-33)

తా॥ వాస్తవంగా లేకపోయినా అనిర్వచనీయ వస్తువు కొంచెము కూడా నాకంటే భిన్నముగా పరమాత్మనయిన నాలో ఇద్దరు చంద్రులలాగా (మిధ్యగా) ప్రతీయమాన మవుతోంది. లేదా విద్యమానయినప్పటికీ ఆకాశంలోని నక్షత్రాలలోలాగా వెల్లడిగాదు. ఇదేనా మాయ.

వాస్తవంగా లేకపోయినా ఉన్నట్లనిపించడం (అభాసం) వాస్తవంగా ఉన్నది లేనట్లనిపించడం (తమస్సు) ఇదే మాయ అంటే. దీనిని ఆకళించుకోవాలి.

(సి) యథామహాన్తి భూతాని భూతేషూచ్చావచేష్వను।
ప్రవిష్టాన్యప్రవిష్టాని తథాతేషు నతేష్వహమ్॥ (2-9-34)

తా॥ పంచమహాభూతాలు ఉచ్చనీచాలయిన దేవతిర్యగాది భౌతిక దేహాలలో సృష్ట్యనంతరం ప్రవేశించీ ప్రవేశించనట్లు స్వతంత్రంగా ఉంటాయి. అదే విధంగా నేను కూడా భూతమయమయిన జగత్తులో ప్రవేశించియున్న వాడనయినా భిన్నమయిన భగవత్స్వరూపంతో అంతటాస్ఫురిస్తున్నాను.

(డి) ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వ జిజ్ఞాసునాఽఽత్మనః
అన్వయ వ్యతిరేకాభ్యాం యత్ స్యాత్ సర్వత్ర సర్వదా॥ (2-9-35)

అన్నిట్లోను ద్యోతకమయ్యే సామాన్యాన్ని గ్రహించడం (అన్వయం) ద్వారాను 'ఇది కాదు' 'ఇదికాదు' అన్న వ్యతిరేక పద్ధతి ద్వారాను అంతటా ఎప్పుడూ నిండి ఉన్న ఆత్మతత్త్వాన్ని అనుశీలించడం ఒక్కటే తత్త్వజిజ్ఞాసువు చేయవలసిన పని.

14. శ్రీమద్భాగవతం, ప్రథమస్కంధం పంచమాశ్వాసం శ్లోకాలు 8,9,10,11,12.
15. 12-13-15
16. పోతన - శ్రీ మహాభాగవతము, ద్వితీయ స్కంధము పద్య - 7, పు -91.
17. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్య - 22, పు - 4.
18. ప్రభుదత్త బ్రహ్మచారి 'చైతన్య చరితావళి' పంచమఖండం కుందుర్తి వేంకట నరసయ్యగారి ఆంధ్రానువాదం - పు 230.
19. 'ఆధార గ్రంథాలు' - జొన్నలగడ్డ వేంకటేశ్వర శాస్త్రి - మళయాళ భాషా సాహిత్యాలు. చల్లారాధాకృష్ణశర్మ - 'దక్షిణ భారత సాహిత్యాలు (అకాడమీ ప్రచురణం).
20. 'ఆధార గ్రంథం' - తమిళ సాహిత్య చరిత్ర (సాహిత్య అకాడమీ), పు - 224.
21. బిరించికుమార్ బారువా - అస్సామీ సాహిత్య చరిత్ర సాహిత్య అకాడమీ ఆధారంగా.
22. ఆధార గ్రంథాలు - 1. రం. ముగళి - కన్నడ సాహిత్య చరిత్ర, (సాహిత్య అకాడమీ) 2. దక్షిణ భారత సాహిత్యాలు (సాహిత్య అకాడమీ) (వ్యాసం గడియారం రామకృష్ణ శర్మ)
23. ఆధార గ్రంథాలు - 1. దక్షిణ భాషా సాహిత్యాలు, (సాహిత్య అకాడమీ).

24. ఆధార గ్రంథ వ్యాసం పండిత పెమమత్స సత్యనారాయణ రాజు - ఉత్తర భాషా సాహిత్యాలు (సాహిత్య అకాడమీ).

25. ఆధార గ్రంథం - (చల్లా రాధాకృష్ణ శర్మ సం॥) దక్షిణ భారత సాహిత్యాలు. (వ్యాసం గుండేరావు హర్కారే).

26. ఆధార గ్రంథం - చిలుకూరి సత్యనారాయణరావు - గుజరాతీ వాఙ్మయ చరిత్ర.

27. ఆధార గ్రంథం - అయాచితుల హనుమచ్ఛాస్త్రి హిందీ సాహిత్యము (వేంకటేశ్వర హిందీ సాహిత్య పరిషత్).

28. 2 స్కంధము, 10 అధ్యాయము, 1 శ్లోకము.

29. ఆధారం కుందుర్తి వేంకట నరసయ్య - శ్రీ భాగవత కథ.

కారణాలు: 1) సనకసనందాదుల శాపం చేత జయవిజయులతో భగవంతుడు మూడు జన్మల వరకూ వారితో విరోధంతో నుండి శ్రీకృష్ణావతారంలో ఉద్ధరిస్తాననడం వలన, 2) భృగువు కూతురు లక్ష్మిని విష్ణువుకిచ్చి పెళ్ళిచేసి కట్నంగా ఒక గ్రామం మీద భృగువు అధికారం చెలాయించడంతో విష్ణువుకు భృగువుకి జగడం పెరిగి భృగువు విష్ణువుతో పదిసార్లు భూమిమీద జన్మించమని చెప్పడం వల్ల, 3) భృగు మహర్షి యాగరక్షణ కార్యాన్ని విష్ణువుకు అప్పగించగా ఆ సమయంలో అసురులు దండెత్తారనీ దేవతల సహాయం కోసం విష్ణువు చక్రధారి అయి వెళ్ళిపోయాడనీ అసురులు భృగుమహర్షి యజ్ఞం నష్టపరిచారనీ దానికి కోపించి భృగువు 'అల్లుడైయుండి తన ఆజ్ఞాపాలనలో ప్రమాదమొనర్చాడ'నీ విష్ణువును భూమిమీద పది జన్మలెత్తమని శపించడం వల్ల, 4) అసురులు దేవతలను కొట్టి భృగుపత్ని దగ్గర దాక్కొనగా దేవతలు ఆమె దగ్గరకు వెళ్ళలేరు గనుక విష్ణువు తన చక్రంతో ఆమె శిరస్సు ఖండించగా దానికి భృగువు కోపించి విష్ణువును భూమి మీద పదిజన్మలెత్తమని శపించడం వల్ల, 5) ద్రోణ వసువుధరాదేవి అనే దంపతులను బ్రహ్మ భూమిమీద పుట్టమనగా భగవంతుడు మాతో బాల రూపంలో ఆడుకునే టట్లయితే భూమి మీద పుడతామని వారు చెప్పడం, బ్రహ్మ సమ్మతించడం వల్ల, 6) చాలామంది రాక్షసులు తాము భూమిమీద రాజులుగా పుట్టి భగవంతుని చూస్తూ మృత్యువును వరించాలని వరం కోరుకున్నందువల్ల - ఇంకా ఇటువంటి ఎన్నో కారణాల వల్ల తనలీలతో ఎంతోమందిని అంతరించాలనే కారణం వల్ల అవతరించాడని చెప్పడం జరుగుతోంది.

30. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్యం 65, పు 14.

31. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్యం 147, పు - 28.

32. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్యం 407, పు - 72.

33. **"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః**
**అహమాదిశ్చ మధ్యంచ భూతానామంత ఏవచ -"**

- భగవద్గీత - విభూతి యోగం - శ్లోకం 20.

34. ఈ అవతారాల గురించిన ఆధార గ్రంథం - శ్రీరామచంద్ర డోంగరే మహారాజ్
శ్రీ మద్భాగవత రహస్యము (ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధాలు)
పుటలు - 94, 95, 96.

35. డా॥ వేదుల సూర్యనారాయణ శర్మ - అంతరార్థ భాగవతము, పు - 46.

36,37. భగవద్గీత, జ్ఞానయోగం - శ్లోకాలు - 7,8.

38. వ్యాసుడు - శ్రీమద్భాగవతము, ప్రథమస్కంధం ద్వితీయాధ్యాయం శ్లోకం [illegible]

39. భగవద్గీత



# 2

# అష్టాదశ పురాణాలలో శ్రీకృష్ణప్రసక్తి

'కృ' అంటే 'కృష్ణ' వస్తువు చిత్తాలను ఆకర్షించేవాడే కృష్ణుడు. భగవంతునికి శరణాగతుడైన [illegible] వారి స్వాభావిక ధర్మము [illegible] ధర్మము అని చెప్పుకున్నట్లయితే ఆ ధర్మాన్ని నిలబెట్టి ఆచరింపజేసే కృష్ణుడేనా కృష్ణ శబ్దంలోనూ ఇమిడి ఉంది.

చిత్తాకర్షకమైన శ్రీకృష్ణుని ప్రసక్తి భారత భాగవతాలలో మాత్రమే గాక అంతకు పూర్వం ఉన్న మరికొన్ని పురాణాలలోనూ కనిపిస్తుంది. వేద విభజన, పదిహేడు పురాణాల పరిష్కరణ గావించి,మహాభారత రచనతో తృప్తి చెందని వ్యాసుడు తన చరమదశలో ఆధ్యాత్మికంగా పరిణతి పొందిన స్థితిలో భాగవతాన్ని రచించాడు. ధర్మ స్థాపనకోసం ఎన్నో గ్రంథాలను రచించిన వ్యాసుడు జీవుని పరమధర్మాన్ని మనసుకు హత్తుకునేట్లు చెప్పడానికా అన్నట్లు భాగవతం రచించాడు.

వ్యాస భాగవతానికి పూర్వం ఉన్న పదిహేడు పురాణాలలో కొన్ని కృష్ణ లీలల్ని ప్రస్తావించాయి. పోతన భాగవతానికి మూలం వ్యాసభాగవతం. అలాగే వ్యాస భాగవతానికి ఆధారాలు కొన్ని ఈ పురాణాలలో కనిపిస్తాయి. భాగవతంలో కృష్ణ తత్త్వాన్ని పరిశీలించే ముందు ఈ పురాణాలలో కృష్ణ ప్రసక్తి ఏవిధంగా వుందో క్లుప్తంగా పరికించడం సమంజసం. అష్టాదశ పురాణాలలో భాగవతం మినహాయించినట్లయితే బ్రహ్మ బ్రహ్మాండ బ్రహ్మవైవర్త పద్మ కూర్మ విష్ణు అగ్ని శివ నారద మార్కండేయ పురాణాలలో కృష్ణ ప్రసక్తి కనిపిస్తుంది.

## బ్రహ్మపురాణం[1]

బ్రహ్మపురాణం శ్రీకృష్ణ చరిత్రమ విపులంగా వివరించింది. దీనిలో మొదట రాజ వంశాను కీర్తనం, ఆ తరువాత స్యమంతక మణి వృత్తాంతం ఉన్నాయి.

బ్రహ్మ పురాణంలోని కృష్ణావతారఘట్టంలో దేవకి అష్టమ గర్భస్థ శిశువు కంసుని వధిస్తాడనే విషయం ఆకాశవాణి కాకుండా నారదుడే కంసునికి తెలిపినట్లు ఉంది. పూతన వధానంతరం శవదహనాది వృత్తాంతం ఇందులో లేదు. శకటాసుర భంజనాది సంఘటనలను మిగిలిన పురాణాలలో లాగానే ఉన్నాయి. వ్రజంలో కృష్ణుని చంపడానికి కంసుడు చేస్తున్న పనులు తెలుసుకొన్న వసుదేవుడు గోకులంలో ఉన్న కుమారులను నామకరణం చేయడానికి గర్గ మహర్షిని నియోగించడం, గర్గ మహర్షి రహస్యంగా ఆ కార్యాన్ని నిర్వహించడం ప్రత్యేకంగా ఉంది.

కాళీయ గర్వభంగ ఘట్టానికి ముందు కృష్ణుడు తన మనసులో 'కాళీయుడు తనచేత కీడుబడి, ప్రచేతసాలయాన్ని వీడి, వ్రజంలో వసిస్తున్నాడు కదా తాను నరలోకంలో పుట్టినది కఠినమైన కృత్యాలు చేయడానికే కదా' అని మనసులో తలచినట్లు, అనంతరం కాళీయమర్దనం జరిపినట్లు చెప్పబడింది. ఈ విషయం తెలిపిన యశోద 'కృష్ణ పరతత్త్వాన్ని' కూలంకషంగా తెలుపుతూ దుఃఖించింది.

తాళవన విహారాలు, ధేనుకాసుర ప్రలంబాసుర వధ, గోవర్ధనోద్ధరణ, శరత్కాల రాసక్రీడ వర్ణనలు, అరిష్టాసుర వధ మొదలయిన ఘట్టాలు ప్రసిద్ధంగానే ఉన్నా క్రమ భేదంలో ఉన్నాయి. గోవర్ధనోద్ధరణ సందర్భంలో యజ్ఞయాగాదులలో పశుహింసను గూర్చి ఉంది. ఈ పురాణంలో కంసుని మాటల్లో సూటిదనం కనిపిస్తుంది.

కేశి దైత్య వధానంతరం నారదుడు వచ్చి కృష్ణతత్త్వాన్ని మనోహరంగా వ్యాఖ్యానించాడు. యమునా జలాలలో స్నానం చేసిన అక్రూరుడు చేసిన స్తుతిలో కృష్ణావతార తత్త్వం వెల్లడి అవుతుంది. మధురలోని పౌరులు తమలో తాము కృష్ణుని ప్రశంసిస్తున్న సందర్భంలో శ్రీహరి అవతార తత్త్వం తెలుస్తుంది.

కంసవధానంతరం ఉగ్రసేనుని అమరపురికి పంపి సుధర్మ (ఇంద్రసభ) ను తెచ్చుకునేట్లు చేశాడు. కాలయవన ముచికుంద వృత్తాంతాలు కూడా ఇందులో ఉన్నాయి.

రుక్మిణీ కళ్యాణ ఘట్టంలో బ్రాహ్మణ సందేశం, గౌరీపూజా వృత్తాంతాలు లేవు. పౌండ్రక దంతవక్త్ర శిశుపాల జరాసంధాది వృత్తాంతాలు, ప్రద్యుమ్న చరిత్ర, నరకాసుర వధ మొదలయిన ఘట్టాలు ఉన్నాయి. నరకాసుర ఘట్టంలో ద్వారకలో ఉన్న శ్రీకృష్ణుని దగ్గరకు ఇంద్రుడు వచ్చి నరకాసురుని దౌష్ట్యం గురించి చెప్పినట్లుగా బ్రహ్మ పురాణంలో లేదు. సత్యభామ శ్రీకృష్ణునితో స్వర్గానికి వెళ్ళిన సమయంలో అక్కడి పారిజాత వృక్షాన్ని చూపి, మక్కువపడి, రుక్మిణి జాంబవతుల కన్నా తనను కృష్ణుడు అధిక ప్రీతితో చూస్తున్న దానికి నిదర్శనంగా పారిజాత వృక్షాన్ని గరుత్మంతుని మీద పెట్టించి అమె భర్తను యుద్ధానికి పంపమని చెప్పి రెచ్చగొట్టినట్లుగా ఉంది.

కృష్ణుడు 16000 మంది కన్యలను శాస్త్రవిధిని వివాహమాడిన వృత్తాంతం, ఉషానిరుద్ధుల చరిత్ర, పౌండ్రక వధ మొదలయినవి ప్రసిద్ధంగానే ఉన్నాయి.

యాదవకుల వినాశనం కూడా ప్రసిద్ధంగానే ఉంది. శ్రీకృష్ణుని దుష్టశిక్షణ శిష్టరక్షణకు ఈ కథలన్నీ నిదర్శనంగా ఉన్నాయి.

## బ్రహ్మాండ పురాణం[2]

ఈ పురాణంలో కృష్ణప్రసక్తి తృతీయాశ్వాసంలో ముందుగా కనిపిస్తుంది. కార్తవీర్యార్జునుని మీదికి పరశురాముడు యుద్ధానికి వెళ్ళే తలంపుతో ఉండగా: పరశురాముని సమస్తార్థఫలసిద్ధికోసం కృష్ణ ప్రేమామృత స్తోత్రాన్ని, తన్మంత్రాన్ని అగస్త్యుడు ఉపదేశించాడు. పరశురాముడు నిష్ఠతో మంత్రస్తోత్రాలను పఠించిన అనంతరం శ్రీకృష్ణుడు ప్రసన్నుడై, తన అంశతో కార్తవీర్యుని జయించేట్లుగాను భువిలో ఇంద్రసమానుడై పరశురాముడు వెలుగొందేట్లుగాను వరం ప్రసాదించాడు. త్రేతాయుగంలో తాను రాముడిగా పుట్టి సీతాకల్యాణ సందర్భంలో పరశురామునిలో నున్న తన తేజాన్ని తిరిగి స్వీకరిస్తానని చెప్పి అంతర్ధాన మయినట్లుగా ఉంది.

పరశురాముడు శత్రు సంహారానంతరం కైలాసానికి వెళ్ళి పార్వతీ పరమేశ్వరులను దర్శించబోయి తనను అడ్డగించిన గణపతితో యుద్ధం చేసి గణపతి దంతాన్ని భగ్నం చేశాడు. దానికి దుఃఖించిన పార్వతిని మిగిలిన ప్రమథ గణాలను శాంత పరచడానికి శంకరుడు గోలోకవాసి అయిన కృష్ణుని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు రాధా సమేతంగా ప్రత్యక్షమయి పార్వతికి హితోపదేశం గావించాడు. పరశురాముని కుమారునిగా భావించమనీ గణపతి ఛిన్నదంతుడనీ ఏకదంతుడనీ అందరిచేతా కీర్తింపబడి విఖ్యాతి చెందుతాడనీ అందరూ అన్ని కార్యాలకూ ముందు వినాయకునే పూజించి విఘ్నాలను బాపుకుంటారనీ' చెప్పి శాంతింప జేశాడు. రాధ శివకేశవాభేదం తెలిపి పార్వతిని ఊరడించింది. రాధాకృష్ణులు గణపతిని తమ అంకం మీద అధిష్ఠింప జేసుకోగా రక్తసిక్తంగా ఉన్న గణపతి స్వస్థుడై తేజోవంతమయ్యాడు. కాళ్లమీద పడ్డ పరశురాముని

క్షమించిన పార్వతీ పరమేశ్వరులు శ్రీకృష్ణుని ఆదరించి గౌరవించారు. రాధాకృష్ణులు పరశురామునికి వరాలిచ్చి తమలోకానికి వెళ్లారు.

పంచమాశ్వాసంలో శ్రీకృష్ణావతార కథ ఉంది. ముందుగా స్యమంతకమణి వృత్తాంతం ఆ తరువాత శ్రీకృష్ణావతార వృత్తాంతం ఉంది.

రాక్షస సంహారంకోసం యదువంశంలో శుభశకునాల మధ్య రోహిణీ నక్షత్ర విజయ ముహూర్తంలో జయంతి అనబడే రాత్రిలో అవ్యక్తుడైన నారాయణుడు శ్రీకృష్ణుడిగా జన్మించాడు. విష్ణుత్వ లక్షణాలతో జన్మించిన వానిని ఆ రూపం ఉపసంహరించమని వసుదేవుడు ప్రార్థించగా శిశువు రూపం పొందాడు. ఆ బాలుని ఆజ్ఞ ప్రకారం వసుదేవుడు ఆ బాలుని నందుని ఇంటికి తీసుకువెళ్ళి నందుని భార్య యశోదకు ఇచ్చాడు. యశోద ఎంతో సంతోషించి ఆ బాలుని తీసుకొని వసుదేవుని వలన పుత్రుని పొందే భాగ్యం లభించింది ఆ కుమారుడే యదుపురి వంశాన్ని వృద్ధి చేయాలని అన్నది. దేవకి ప్రసవించిన సమయానికే యశోద ఆడశిశువుని యోగమాయ వల్ల ప్రసవించింది. యశోద నుండి ఆ శిశువుని తీసుకెళ్ళి [illegible] ఉంచి ఆమెవల్ల పుట్టినది అని ప్రచారం చేయమని తెలియజేశాడు. [illegible] ఆమెకి పుట్టిందని, తాను ఎంతో సంతోషించింది. పుట్టినది ఆడపిల్ల కనుక కంసుడు కూడా ఆమెను చంపక వదిలేశాడు. ఆ బాలిక వృష్ణిగృహంలోనే పెరిగింది. రాక్షస సంహారానికి అవతరించిన కృష్ణుని రక్షించడానికై ఉద్భవించింది కనుక ఆమెను యాదవులు భక్తితో కొలుస్తారు. కంసుడు దేవకి సంతానాన్ని సంహరించడానికి కారణం అడిగిన సందర్భంలో దేవకీ వసుదేవుల వివాహాది విషయాల ప్రస్తావన ఉంది.

తరువాత కృష్ణవంశాను కీర్తనం, సాంబ వాసుదేవ సంకర్షణాదుల దివ్యత్వం కృష్ణునితో బాటు భూమిపైన అవతరించిన దేవతాంశాల గురించిన వివరాలు ఉన్నాయి.

అనంతరం దేవదానవుల యుద్ధ సందర్భంలో రాక్షస రక్షణార్థం రాక్షసగురువు శుక్రుడు తపస్సు చేసి సిద్ధుల్ని పొందడం, దేవాసుర యుద్ధంలో రాక్షసులను రక్షిస్తున్న శుక్రుని తల్లి అయిన భృగుపత్నిని విష్ణువు సంహరించడం, భృగువు కోపించి భూమిపై జన్మించమని శపించడం అనే ఘట్టాలు ఉన్నాయి. ఇందులో గోలోక కృష్ణుని గురించి ఉన్నా దేవకికి జన్మించింది నారాయణుడే అని ఉంది.

## బ్రహ్మవైవర్త పురాణం[3]

ఇది కృష్ణుని గోలోక వృత్తాంతాన్ని విపులంగా తెలిపే పురాణం. ముందుగా గోలోకాన్ని గురించిన వర్ణన తరువాత గోలోకంలో రాధాకృష్ణుల విహార వర్ణన ఉంది. ఆ విహార సమయంలో కృష్ణుడు అంతర్ధానమవగా రాధ కృష్ణుని అన్వేషిస్తూ 'విరజ' మందిరానికి వెళుతుంది. అక్కడ ద్వారపాలకుడైన సుదాముడు రాధను అడ్డగించగా రాధ కోపంతో సుదాముని భూలోకంలో రాక్షసునిగా పుట్టమని శపించి తన మందిరానికి వెళ్ళి విరహ వేదనను అనుభవించసాగింది.

విరజతో విహరిస్తున్న కృష్ణుడు సుదాముని ద్వారా ఈ వృత్తాంతాన్ని విని రాధ దగ్గరకు వెళ్ళి ఎంత అనునయించినా రాధ ఊరడిల్లక పోవడంతో విసిగి తన మందిరానికి వెళతాడు. కొంతసేపటికి రాధ కృష్ణ మందిరానికి వెళ్ళి కృష్ణుని నిష్ఠూరంగా నిందించగా వినలేని సుదాముడు కోపంతో రాధను భూలోకంలో పుట్టమని శపిస్తాడు. దీనికంతకు కారణం విరజేనని తలచి రాధ విరజను నదిగా అవమని శపిస్తుంది. కృష్ణుడు వారిని అనునయించి, శాపాలు అనుభవించక తప్పదు, కనుక సుదాముని శంఖచూడుడనే రాక్షసుడై జన్మించి, లక్ష్మీదేవి అంశతో వెలసిన తులసిని పెళ్ళాడి సౌఖ్యాలనొంది, కొంతకాలానికి శివుని చేత నిహతుడై తన సన్నిధికి చేరమని, రాధను భూలోకంలో వృషభానుని ఇంట జన్మనొందమని, తాను తన అంశతో యదుకులంలో జన్మించి రాధను వరిస్తానని, విరజ

గోలోకంలోనే నదీరూపంలో ఉంటుందని తెలిపాడు. రాధను గురించిన వివరణ బ్రహ్మవైవర్త పురాణంలోనే ఎక్కువగా ఉంది. శాప వృత్తాంతాల అనంతరం కృష్ణావతరణం విలక్షణంగా ఉంది.

భూలోకంలో నాస్తికులు, దురాచార పరాయణులు అధిక సంఖ్యాకులై ఉన్న కారణంగా భరించలేని భూదేవి స్త్రీ రూపంలో ఇంద్రుని దగ్గరకు వెళ్ళి మొరపెట్టుకోగా వారు బ్రహ్మదగ్గరకు, ఆ తరువాత బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో కలిసి గోలోకవాసియైన కృష్ణుని దగ్గరకు చేరి తమ రాకకు కారణం తెలిపారు. అప్పుడు కృష్ణుడు తాను భూలోకంలో పుడతాననీ, రాధ వృషభానుని పుత్రికగా, లక్ష్మి రుక్మిణిగా, పార్వతి యోగమాయగా జన్మిస్తారని తాను కథనడుపుతానని తెలిపాడు.

యోగమాయ యశోద గర్భాన, తాను దేవకి గర్భాన పుట్టగా వసుదేవుడు ఇరువురినీ మార్చుతాడనీ అప్పుడు కంసుని బారినుంచి తప్పించుకున్న యోగమాయ జనుల పూజలందుతూ ఈశ్వరాంశతో జన్మించిన దూర్వాసుని వివాహ మాడుతుందనీ అవతరణ పథకాన్ని నిర్దేశించాడు. తరువాత దేవతలంతా వెళ్లిపోవడం, కంస వసుదేవుల వృత్తాంతం ఆరుగురు పిల్లల్ని కంసుడు చంపడం, సంకర్షణ జననం మొదలైన వృత్తాంతాలున్నాయి.

ఆ తరువాత దేవకి అష్టమ గర్భం వాయువుతో నిండియుండి, తొమ్మిదవ మాసం ప్రవేశించింది. ఆ సమయాన కృష్ణపరమాత్మ దేవకి హృదయాన వసించాడు. దేవకి అఖండ తేజః పుంజంలా కనబడసాగింది. అటువంటి దేవకిని చూసిన కంసుడు తనకు మృత్యువు తప్పదని తలచి ఏడు ద్వారాలున్న దివ్య భవనంలో ఎన్నో కట్టుదిట్టాలతో బంధించి ఉంచాడు. ప్రసవ సమయం ఆసన్నం కాగా వసుదేవుడు కత్తినీ లోహాన్నీ అగ్నినీ జలాన్నీ తెప్పించి ఆ భవనంలో ఉంచినట్లు, త్రిమూర్తులు అదృశులై వచ్చి దేవకి హృదయస్థ శిశువును రాధాపతిగా స్తుతించినట్లు బ్రహ్మవైవర్త పురాణం తెలుపుతుంది.

ప్రసవ సమయాన దేవకి గర్భం నుంచి వాయువు బహిర్గతం అయినట్లు, మూర్ఛపోయిన దేవకీదేవి హృదయ కమలం నుంచి శ్రీకృష్ణ పరమాత్మ పృథ్విపై అవతరించినట్లు ఉంది. వసుదేవుని చేత స్తుతించబడిన శ్రీకృష్ణుడు దేవకీ వసుదేవుల పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలిపి వారు ఆ జన్మలో తాను సకల కళాసమన్వితంగా వారికి పుత్రునిగా అవతరించానని, తనను పుత్రబంధానికి అతీతంగా భావించి యశోదపక్కతో మార్పు చెయ్యమని చెప్పడం, వసుదేవుడు అదేవిధంగా చెయ్యడం, కంసుడు యోగమాయను చంపబోగా ఆకాశవాణి కంసుని చంపేవాడు గోకులంలో పెరుగుతున్నాడని తెలుపడం, దానితో ఆ బిడ్డను చంపకుండా వదిలివేయడం మొదలయిన విషయాలు [illegible] ఉన్నాయి. ఆ బిడ్డ దేవకీ వసుదేవుల సంరక్షణలో 'ఏకానంశ' అనే పేరుతో పెరిగి దూర్వాసుని వివాహం చేసుకున్నదని ఈ పురాణం తెలుపుతోంది. యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతాలు, కృష్ణుని పెంచడానికి గల కారణం, రోహిణి వ్రజంలో ఉండడానికి కారణం మొదలయినవి [illegible] ఉన్నాయి.

నందుడు పుత్రోత్సవం చేయుచున్న విషయం తెలిసి, కంసుడు మంత్రులతో సమాలోచన చేసే సమయాన ఆకాశవాణి కృష్ణ బలరాముల వృత్తాంతం తెలుపగా కంసుడు తన చెల్లెలు పూతనను, శకటాసుర తృణావర్తులను కృష్ణసంహారార్థం పంపడం, నామకరణం, బాల్యక్రీడలు మొదలైనవి ప్రసిద్ధంగానే ఉన్నాయి.

ఈ పురాణంలో రాధాకృష్ణుల సమాగమం ప్రత్యేకంగా ఉంది. నందుడొకనాడు గోవులను కాస్తూ కృష్ణుని తీసుకుని పోగా పెద్ద వర్షం కురవడం, నందుడు ఇంద్రుని ప్రార్థించి వర్షాన్ని నిలపడం, ఆ సమయాన సర్వాలంకార భూషితయైన రాధ మెరుపు తీవెలా ఆ ప్రదేశానికి రావడం, అంతకు పూర్వమే రాధాదేవి గురించి తెలిసి ఉన్న నందుడు భక్త్యావేశంతో రాధాదేవిని స్తుతించి ఆమెకు ప్రీతిని కలిగించి 'ఆజన్మాంతం వర్షసుఖాలు అనుభవించి మరణానంతరం గోలోక ప్రాప్తి' కలిగేట్లుగా రాధాదేవి చేత వరాన్ని పొందడం

ఉన్నాయి. ఆ తరువాత నందానుమతితో వన శోభను తిలకించే నిమిత్తం బాలకృష్ణుని గొనిపోయి తానను భవించే కృష్ణ వియోగ దుఃఖాన్ని వెల్లడిస్తున్న సమయాన బ్రహ్మదేవుడు వచ్చి వారిని స్తుతించి వారికి 'గాంధర్వ వివాహం' గావించి వెళ్ళడం, రాధాకృష్ణులు బహువిధ శృంగార క్రీడలలో కాలం గడిపిన తరువాత అప్పటివాకా రాధాదేవితో యువకుడిగా ఉన్న కృష్ణుడు తిరిగి బాలక రూపాన్ని దాల్చి తాను ప్రతి రాత్రి అదేవిధంగా రాధాదేవితో క్రీడిస్తానని తనను ప్రతిరోజూ యశోదకు అప్పజెప్పుతూ ఉండమని ఆదేశించడం వంటి ఘట్టాలు వివరంగా ఉన్నాయి.

అనంతరం బకాసుర అఘాసుర ప్రలంభాసుర సంహారాలు, వారి పూర్వజన్మ వృత్తాంతాలు ఉన్నాయి.

కంస బాధ చేత నందాదులు బృందావనం రావడం, అక్కడ కృష్ణుని చూచినతే మధ్యాహ్నము కోరిక ప్రవేశించడం, ఆ రాత్రి ఆ ప్రదేశాన విశ్వకర్మ ఒక నగరాన్ని నిర్మించడం ఉన్నాయి. ఆ సందర్భంలో బృందావన పవిత్రతను గూర్చి, సప్తర్షుల భార్యలు విప్ర భార్యలుగా జనించి శ్రీకృష్ణ సందర్శన భాగ్యంతో ముక్తులవడం గూర్చి వారి పూర్వజన్మ వృత్తాంతాలు సహితంగా ఉన్నాయి.

కాళీయ మర్దనం, గోవర్ధన పూజ, గోవర్ధనోద్ధరణం వంటి ఘట్టాలు ప్రసిద్ధాలు. వృషభానుని పూర్వజన్మ వృత్తాంతం ఇందులో ఉంది. బలికుమారుడు తిలోత్తమతో స్వేచ్ఛావిహారం చేస్తూండగా దుర్వాసుడి కంట బడటంతో వారిని వృషభానునిగానూ బాణుని కూతురు ఉషగానూ పుట్టేట్లుగా శపించాడు దుర్వాసుడు.

ఆ తరువాత వివరించబడిన గోపికా వస్త్రాపహరణఘట్టంలో రాధ కూడా ఉన్నట్లు బ్రహ్మ వైవర్త పురాణం తెలుపుతోంది.

రామకృష్ణులు బృందావన విహారం చేయడం కృష్ణుని పాదాలవద్ద ప్రాణాలు విడిచిన అష్టావక్రముని శరీరానికి కృష్ణుడే అంత్యక్రియలు జరపడం మొదలైన

విషయాలు వివరంగా ఉన్నాయి. కృష్ణుడు రాధకు అష్టావక్రుని పూర్వ జన్మ వృత్తాంతం చెప్పడం ఉంది.

అక్రూరుడు రామకృష్ణులను మధురకు గొనిపోవడానికి రావడం, రాధకు దుస్స్వప్నం వచ్చి భీతితో కృష్ణునికి తెలుపడం, కృష్ణుడు రాధతో రాధ మూల ప్రకృతియనీ లక్ష్మీసరస్వతీ పార్వతుల ఆవిర్భావానికి మూలకారణమనీ తెలుపడం వంటివి ఈ పురాణంలో ఉన్నాయి. కృష్ణుడు రాధతో గోలోకంలోని సుదాముని శాపకారణంగా రాధాకృష్ణులకు వందేళ్ళు వియోగం రానున్నదని తెలుపగా అది విని రాధ మూర్ఛిల్లడం, కృష్ణుడు రాధను సేద తీర్చడం ప్రధానంగా ఉన్నాయి.

కృష్ణుని మధురానగర ప్రవేశం, రజక వధ, మాలాకారుని కటాక్షించడం, కుబ్జా వృత్తాంతం కుబ్జను తృప్తిపరిచి గోలోకానికి పంపడం, కంస వధ గావించి తల్లిదండ్రులను చెరనుంచి విడిపించడం వంటివి వివరించబడ్డాయి. అనంతరం వ్రజానికి రమ్మన్న నందునితో కృష్ణుడు తన సర్వవ్యాపకత్వాన్ని, రాధా మాహాత్మ్యాన్ని బోధించి భూభార నివారణానంతరం నందాదుల్ని కూడా గోలోకానికి గొని పోతానని మాటిచ్చి జ్ఞానోపదేశం చెయ్యడం ఇందులో ప్రత్యేకంగా ఉన్నాయి.

కొంతకాలానికి తనకై పరితపిస్తున్న వ్రజవాసుల దగ్గరకు కృష్ణుడు తన సందేశాన్ని అందించమని ఉద్ధవుని పంపి, రాధాయశోదాదులను ఉపశమింప జేశాడు. ఆ తరువాత విద్యాభ్యాసం, గురుదక్షిణాదులు, ద్వారకనిర్మాణం, బలరామ వివాహం, రుక్మిణీ కళ్యాణం, ప్రద్యుమ్న జననం వంటి ఘట్టాలు ప్రసిద్ధంగానే ఉన్నాయి. తరువాత దుర్వాస మహర్షి వృత్తాంతం వివరంగా ఉంది. శ్రీకృష్ణుడు రుక్మిణీ సత్య భామాదులను షోడశ సహస్ర కాంతలను వివాహమాడి బహుసంతానవంతుడై ఉండగా ద్వారక గోకులం వలె వెలుగొందినట్లు, ఆ ప్రదేశానికి వచ్చిన దూర్వాసునికి యోగమాయకు వివాహం చేయించగా గార్హస్థ్య

రహస్యాన్ని తెలుసుకోవాలని కృష్ణుని భార్యల ఇళ్లకు వెళ్లగా ప్రతి ఇంటిలోనూ కృష్ణుడు కనిపించి చివరకు రుక్మిణీదేవి ఇంటిలో రుక్మిణిచే పాదసేవలందుకొంటూ ఉన్న కృష్ణుని చూసి ఆశ్చర్యాన్ని పొంది కైలాసానికి వెళ్ళగా కృష్ణుడు గోలోక వాసియైన పరబ్రహ్మం అనీ అతని పాదధ్యానమే ముక్తిహేతువనీ పార్వతి తెలుపడం, దూర్వాసుడు ద్వారకకు వచ్చి భార్యాసమేతుడై కృష్ణధ్యానం చేసి ధన్యుడైన వృత్తాంతం వివరంగా ఉన్నాయి.

ఆ తరువాత జరాసంధవధ, రాజసూయ యాగం, శిశుపాలవధ, ఉషానిరుద్ధుల వివాహం, బాణాసుర యుద్ధం, స్యమంతకమణి వృత్తాంతం, జాంబవతీ సత్యభామలతో వివాహం ప్రధానాంశాలుగా ఉన్నాయి. చివరగా రాధాకృష్ణుల సమాగమం, దివ్యశరీరాలతో గోలోకానికి ప్రస్థానించడం, యాదవకుల వినాశనం అనే ఘట్టాలు వర్ణించబడ్డాయి.

## పద్మపురాణం[4]

పద్మ పురాణంలో శ్రీకృష్ణ కథ కొన్నిచోట్ల క్లుప్తంగాను మరికొన్ని చోట్ల వివరంగాను ఉంది.

ముందుగా బ్రహ్మఖండంలో కృష్ణాష్టమీ వ్రత మాహాత్మ్యం ఉంది. తరువాత కృష్ణావతరణ సందర్భం వివరించబడింది. శివుడు బ్రహ్మ మొదలైన దేవతాకోటితో క్షీరసాగర శయనుని దగ్గరకు భూదేవి వెళుతుంది. కంసుడు చేసే దౌష్ట్యాలు తెలిపి సోదరి పుత్రుని వల్ల తప్ప అతడికి మరణం లేదు కనుక దేవకీగర్భాన జన్మించమని శివుడు విష్ణువును వేడుకుంటాడు. విష్ణువు తనతోడుగా ఉమను పంపమని కోరి, శివుడు పంపగా తాను దేవకీగర్భాన, ఉమ యశోద గర్భాన ఉద్భవించారనీ దేవకి భయంతో ఈ శిశువును యశోద వద్ద వదిలి ఆ బిడ్డను వెంటనే తెమ్మని అడిగిందనీ వసుదేవుడు బాలుని తీసుకుని వెళుతుండగా యమున ఉప్పొంగి ప్రవహించిందనీ వసుదేవుడు బిడ్డను రక్షించుకోవడం ఎలాగా

అని విలపించగా యమున జానువుల దాకా తగ్గి ప్రవహించిందనీ పద్మపురాణ కథ తెలుపుతోంది. వసుదేవుడు బాలుని తీసుకుని ఆనందంగా యమునలో సాగుతూండగా బాలుడు చేతి నుండి జారి నదిలో పడి కనిపించక పోవడంతో వసుదేవుడు చింతించి ఆ నదిలోనే తాను అంతమువదలచగా నీటిలో ఈదుకుంటూ వచ్చిన బాలుని చూసి ఆనందించి యశోద దగ్గరకు తీసుకువెళ్ళి ఇచ్చి అక్కడి బిడ్డను తెచ్చి దేవకికి ఇచ్చాడు.

అనంతరం పూతన సంహారం. "శకట భంజనంబును తృణావర్త హననంబును గాలియ మర్దనంబును గావించి మధురాపురంబున కరిగి లోక కంటకుడగు కంసుని సంహరించి లోక కళ్యాణంబు చేకూర్చె" నని 'అటువంటి కృష్ణుని యొక్క కృష్ణాష్టమి వ్రతం చేస్తే వైకుంఠ పదం కలుగుతుందనీ' పద్మపురాణం క్లుప్తంగా కృష్ణకథను తెలిపింది.'

పద్మపురాణంలో పాతాళ ఖండంలో శివుడు పార్వతికి కృష్ణ పరివార వర్గం గురించి, కృష్ణ చరిత విశేష కథనాన్ని గురించి తెలిపాడు. ఈ సందర్భంలో కృష్ణుని పరబ్రహ్మ తత్త్వాన్ని శ్రీకృష్ణుని గోలోక నివాస, విలాసాల గురించి శివుడు పార్వతికి చెప్పడం జరిగింది.

తరువాత దేవర్షి అయిన నారదుడు కృష్ణుని దర్శించి-

"నంద నీ పూర్వ పుణ్యములెల్ల ఫలియించె
ధన్యాత్మకుండ వింతకును నీవు
నీ గేహంబున జొచ్చె నిఖిల దేవతలును
వాసించు చుండు నారాయణుండు
బాలమాత్రుడుగాడు పరికింపనీతండు
ధ్యానైక గమ్యుండు మౌనులకును

దైవభావమున నీతని గొల్చువారికి
ప్రాప్తించు మోక్ష సామ్రాజ్య లక్ష్మి"[6]

అంటూ కృష్ణమహాత్మ్యాన్ని నందునికి వినిపించి 'ఇందిర' సైతం వ్రజంలోనే ఉన్న దన్న ఉద్దేశంతో ఆమెను దర్శించడానికి గోపగృహాలన్నీ చూసి చివరకు నందుని మిత్రుడైన వృషభానుని గృహానికి వెళ్ళి దివ్యమైన బాలికను చూసి, ఆమె వృత్తాంతాన్ని సమాధి స్థితిలో దర్శించి ఆశ్చర్యచకితుడై ఆ బాలిక మహాత్మ్యాన్ని వృషభానునికి చెప్పి వెళ్ళిపోతాడు.

తరువాత సమాధి స్థితిలో గోపకన్యకలు చెప్పిన స్థలానికి (బృందావనంలో గోవర్ధనగిరి సమీపాన అశోకలతిక క్రింద అర్థరాత్రి సమయాన) కృష్ణ ప్రియను దర్శించడానికి వెళ్ళాడు. దివ్యాభరణ భూషితురాలైన ఒక సుందరి అక్కడకి వచ్చి పూర్వం ఎంతోమంది మహర్షులు రాజర్షులు కృష్ణుని దర్శించడానికి చేసిన ప్రయత్నాలు తత్సాఫల్య వైఫల్యాలు తెలిపి కృష్ణప్రియ వృత్తాంతాన్ని సైతం తెలిపింది. అనంతరం మధురా మహిమ, అర్జునుడు గోలోకాన్ని చూడాలని చేసిన ప్రయత్నాలు చెప్పడం జరిగింది. ముఖ్యంగా గోలోక దర్శనం సులభంగా కాదని తెలిపింది. ఇదే సందర్భంలో కృష్ణ మంత్రాది కథనం రాధాకృష్ణ ధ్యానం, రాధాకృష్ణ మంత్రార్థ కథనం, మంత్రజప ఫలకథనం, మంత్ర దీక్షా కథనం తెలుపబడ్డాయి.[7]

పద్మపురాణంలోని సృష్టి ఖండంలో స్యమంతకమణి వృత్తాంతమూ కృష్ణుడు భృగుపత్ని శిరస్సును ఖండించగా భృగువు కృష్ణుని శపించే వృత్తాంతమూ ఉన్నాయి. స్యమంతకమణి వృత్తాంతంలో 'సింహం ప్రసేనుని చంపడం', 'భల్లూకంతో యుద్ధం' సత్యా వివాహం వంటి విషయాలు లేవు.

ఆ తరువాత కృష్ణుని 16000మంది కాంతలు సాంబుని చూసి కామ వికారానికి లోనయిన సంగతి తెలిసి కృష్ణుడు వారిని దస్యులచేత అపహరింప బడేట్లుగా శపించి, వారు పశ్చాత్తాపంతో దుఃఖించడంతో దాల్భ్య మహర్షి వారికి

ఉద్ధరణ మార్గాన్ని ఉపదేశించాడని ఉంది. దాల్భ్యమహర్షి వారి ఆ స్థితికి గల కారణాన్ని నారద శాప వృత్తాంతాన్నీ వివరించి వారందరూ ముక్తిని పొందుతారని తెలిపాడు.

పద్మపురాణ ఉత్తర ఖండంలో పారిజాతాపహరణం గురించిన ప్రసక్తి ఉంది. నారదుడు ఇచ్చిన పారిజాతాలను సత్యభామకు తప్ప మిగిలిన భార్యలందరికీ ఇచ్చినట్లు సత్యభామ దుఃఖించగా పారిజాతవృక్షాన్ని తెచ్చినట్లు ఉంది. తులాపురుషదాన వృత్తాంతం కూడా ఇందులో వివరంగాఉంది. సత్యభామ పూర్వ జన్మ వృత్తాంతం కూడా ఉంది.

దేవశర్మ అనే బ్రాహ్మణునికి గుణవతిగా పుట్టి దేవశర్మ శిష్యుడైన భద్రుని వివాహమాడి తండ్రి, భర్త ఒకనాడు అరణ్యంలో రాక్షసుని చేత చంపబడటంతో గుణవతి దుఃఖించి వృద్ధురాలయే వరకూ నారాయణుని పాదాలమీద దృష్టి నిలిపి కార్తీక వ్రతమాచరించి, గంగలో శరీరాన్ని వదిలిన కారణాన వైకుంఠం చేరి విష్ణుప్రేమకు పాత్రురాలయిందనీ కృష్ణావతారంలో సత్యభామగా ఉన్నతిని పొందిందనీ ఆనాడు గుణవతి నాటిన తులసి కల్పవృక్షమయిందనీ కృష్ణుడు తెలిపాడు.

తరువాత నారాయణ విభూతి, వైకుంఠ వ్యూహం మొదలైన సందర్భాలలో చెప్పబడిన దశావతార కథలలో కృష్ణుని గురించి ఉంది. ఇందులో దేవకీ వసుదేవుల వృత్తాంతం, కృష్ణావతార కారణాలు ప్రయోజనాలు, వ్యూహాలు, మధురాగమనం, జరాసంధ ముచికుంద స్యమంతకమణి వృత్తాంతాలు, అష్టపరిణయాలు, నరకాసుర వధ, పారిజాతాపహరణ బాణాసుర దమనం ఉన్నాయి. పౌండ్రక వధ అనంతరం కృష్ణుడు గోకులానికి వెళ్ళి కొంతకాలం ఆనందంగా గడిపి అక్కడి వారందరినీ వైకుంఠానికి పంపినట్లుగా పద్మ పురాణం తెలుపుతుంది. ఆ తరువాత కుచేల వృత్తాంతం, భారతయుద్ధం, విప్రపుత్ర దానం, యదువంశ వినాశనం అనే విషయాలు కొద్ది మార్పులతో ఉన్నాయి.

## విష్ణుపురాణం [8]

విష్ణు పురాణంలో ముందుగా నారాయణ శబ్ద నిర్వచనం, బలరామ రేవతుల వివాహం, స్యమంతకోపాఖ్యానం, శిశుపాల వృత్తాంతం, కృష్ణ కథా పూర్వరంగంలో గగనవాణి కంసునికి జెప్పిన వృత్తాంతం ఉన్నాయి. ఆ తరువాత శ్వేత ద్వీపంలోని భూదేవి దేవతా బృందాలతో నారాయణుని దర్శించడం, విష్ణువు దేవతలకు కృష్ణావతార కథనాన్ని గూర్చి ముందుగానే పథకం తయారు జేసి చెప్పడం, ఆ తరువాత కృష్ణావతరణ ఘట్టం వివరంగా ఉన్నాయి. దేవకి ప్రసవ వేదన సందర్భంలో ఇంద్రాది దేవతలు వచ్చి దేవకికి పరమాత్మ తత్వాన్ని మహాత్మ్యను తెలిపి ఔపచారిక వాక్యాలు తెలిపి వెళ్ళినట్లుగా కూడా ఉంది.

దేవకికి పుట్టిన బిడ్డ ముందుగా చతుర్భుజుడై శంఖ చక్రాది లక్షణాలతో ఉండి, స్తుత్యనంతరం దేవకీ వసుదేవులకు తాను కంస సంహారణ గావిస్తానని చెప్పి, యోగమాయ ద్వారా ప్రణాళిక అంతా వారికి స్ఫురిస్తుందని చెప్పి, మామూలు బాలకునిగా మారినట్లుగా ఉంది. ఆ తరువాత శిశువుల మార్పిడి, కంసుని దురాగతం, కంసుడి మంత్రాలోచన తెలుసుకొని వసుదేవుడు స్వయంగా నందుని దగ్గరకు వెళ్ళి పూతన విషయం చెప్పి వారందరూ మహాఘోషానికి వెళ్ళేట్లు చేయడం, పూతన వృత్తాంతం ఉన్నాయి. పూతన మృత కళేబరాన్ని ఊడ్చివేస్తుండగా శకటాసుర వృత్తాంతం జరిగింది. తృణావర్తుని వృత్తాంతం, నలకూబర మణిగ్రీవుల పూర్వ వృత్తాంతం విష్ణుపురాణంలో లేవు. వ్యోమాసుర వాయుకుల వృత్తాంతాలు కూడా విష్ణుపురాణంలో లేవు.

కంసుని ఆహ్వానం మీద ధనుర్యాగానికి రామకృష్ణులు మధురకు రావడం, రజకుని నిహతునిజేసి, సుదాముని, కుబ్జను అనుగ్రహించడం వంటి వృత్తాంతాలూ ధనుర్భంగం, కంసవధ, సాందీపని దగ్గర విద్యాభ్యాసం, గురుదక్షిణ అనే సంఘటనలూ ఉన్నాయి. అయితే సాందీపని కొడుకు యాతనాగతుడై

నరకంలో పూర్వదేహంతో ఉన్నట్లు చెప్పబడటం విశేషం. కుబ్జా గృహానికి వెళ్ళడం ఇందులో లేదు.

జరాసంధుని దండయాత్రలు, కాలయవన వధ, ముచికుంద వృత్తాంతం, ద్వారకా నగర నిర్మాణం రుక్మిణీ కళ్యాణం విష్ణుపురాణంలో ఉన్నాయి. రుక్మిణీ కళ్యాణ సందర్భంలో కృష్ణుడు రుక్మిణిని అడిగించగా రుక్మిణి అంగీకరించకపోవడం విష్ణుపురాణంలోని ప్రత్యేకాంశం. స్యమంతకమణి వృత్తాంతం స్వల్ప మార్పులతో ఉంది. నరకాసుర వృత్తాంతంలో కొంత మార్పు విష్ణుపురాణంలో గోచరిస్తుంది. కృష్ణుడితో నరకాసుర సంహారానికి సత్యభామ వెళ్ళకపోవడం, దుఃఖిత అయిన భూదేవిని ఓదార్చి శ్రీకృష్ణుడు తన అవతార తత్త్వాన్ని చెప్పడం, సత్యభామ పారిజాతాపహరణోద్యోగానికి కృష్ణుని రెచ్చగొట్టడమే గాక, ఉద్యానవన పాలకుల దగ్గర అహంకారంతో మాట్లాడటం విష్ణుపురాణంలో ప్రత్యేకాంశాలు. ఇంద్రలోకం నుండి వచ్చిన తరువాత కృష్ణుడు మొత్తం నరక కన్యల వలన 32,200 మంది పుత్రులను, రుక్మిణీ మొదలైన భార్యలకు 81,100 కుమారులను పొందినట్లు విష్ణుపురాణం తెలుపుతోంది. బాణాసురవధ పౌండ్రకవధ ఘట్టాలు మాత్రమే విష్ణుపురాణంలో హరివంశాన్ని అనుసరించి సంక్షిప్తంగా ఉన్నాయి.

యాదవ వంశ నిర్మూలనం శ్రీకృష్ణ లీలా సంవరణానికి సంబంధించిన కొన్ని విషయాలు విష్ణు పురాణంలో ప్రత్యేకంగా ఉన్నాయి. కృష్ణ దర్శనార్థమై వచ్చిన దూర్వాసుడే ముసలోత్పత్తియయ్యేట్లుగా శాపం ఇచ్చినట్లుగా ఉంది.

ద్వారకలో దుర్నిమిత్తాలు కనిపించడం, ఇంద్రుని దూత వచ్చి భూమిమీద నూరేండ్ల కన్నా ఎక్కువ కాలం ఉండరాదని యదువంశం వినాశనమవడానికి ఉపాయాన్ని కల్పించమని కృష్ణునికి చెప్పడం, యదువంశ నాశనం, కృష్ణుని ఆయుధాలు నమస్కరించి మాయమవడం, బలరాముడు అవతార సమాప్తి గావించడం, కృష్ణుడు దారుకుని రప్పించి ఉగ్రసేనునికి పెద్దలకు జరిగిన విషయం

చెప్పమని పంపి అర్జునునితో వనితాజనాన్ని తీసుకుపొమ్మని చెప్పడం, యాదవులకి పరలోక క్రియలు నిర్వర్తించి కృష్ణుడు వైకుంఠానికి జేరడం, కృష్ణుని అష్టభార్యలు సహగమన మొనర్చడం వంటి విషయాలన్నీ వివరంగా ఉన్నాయి.

అర్జునుడు కృష్ణుని అంతఃపుర కాంతలను తన వెంట హస్తినకు తీసుకుని వెళ్ళే మార్గమధ్యంలో బోయలు అర్జునుని అడ్డగించి కాంతలను గొనిపోవడం వర్ణితమయింది. తన అసమర్థతను అర్జునుడు వ్యాసునికి చెప్పి చింతించినప్పుడు వ్యాసుడు అర్జునుని ఓదార్చి ఆ కాంతల పూర్వజన్మ వృత్తాంతం చెపుతూ 'అష్టావక్రముని రంభాది అప్సరసలకు ఇచ్చిన వరం వల్ల హరి భార్యలయ్యారని శాపం వల్ల హరి పరోక్షంలో కిరాతులచే చెరబడ్డారని, వారిచే ప్రార్థింపబడిన అష్టావక్రుడు వారికి మానభంగం కాకుండా స్వర్గానికి చేరుకునేట్లు అనుగ్రహించాడని' చెప్పి కలి ప్రవేశించి నందున పాండవులు కూడా తపమొనర్చి సుఖంగా ఉండేట్లు అన్ని విషయాలు ధర్మరాజుకు చెప్పమని తెలిపి వ్యాసుడు నిష్క్రమించాడు.

## నారదీయపురాణం[9]

నారదీయ పురాణంలో ప్రథమాశ్వాసంలోనే శ్రీకృష్ణజననం శ్రీకృష్ణ లీలలు, దుష్ట సంహారం, గోవర్ధన మెత్తడం, దావాగ్నిపానం, వర్షాగమం వసంతాగమం, గోపికా విహారం, నందుడు ఏకాదశి దినాన ఉపవసించడం, అక్రూరుడు యమునా జలాన బలరామ కృష్ణులను గాంచడం, శ్రీకృష్ణుడు కంసుని సంహరించడం, ఉద్ధవరాయబారం, జరాసంధ కాలయవనులను జయించడం, రుక్మిణీ సత్యభామలతో పరిణయాలు, నరక సంహారం, పారిజాతాపహరణం, ప్రద్యుమ్నవృత్తాంతం, బాణాసురుని ఓడించడం, నృగ మహారాజు వృత్తాంతం, పౌండ్రకుని వధ, కుచేలోపాఖ్యానం, వృకాసురుని భంజనం, అర్జునుడు సుభద్రల వివాహం, ద్వారకలో శ్రీకృష్ణుని జీవితం వివరంగా తెలుపడం జరిగింది. నారద

పురాణంలో సత్యభామ నరకునితో యుద్ధం చేసినట్లుగా ఉంది. ద్వితీయాశ్వాసములో శ్రీకృష్ణుని మణికిరీట ధారణ గాథ ఉంది.

నారద పురాణంలో వ్యాసుడు అగస్త్యునికి, సీత రామునితో ద్వాపరంలో ధరించబోయే అవతారం గురించి అడిగిందనీ, రాముడు ద్వాపరంలో కంసాది దానవ సంహారణార్థం మధుర నుండి వ్రేపల్లెకి తరలింపబడి కాలాంతరాన కంసాదులను సంహరిస్తానని అప్పుడు సీత రుక్మిణిగా అవతరిస్తుందని చెప్పాడనీ. ఆ రూపాన్ని సీత చూడగోరగా రాముడు శ్రీకృష్ణుని రూపాన్ని చూపగా ఆ రూపాన్ని ఎక్కడైనా సాక్ష్యంగా స్థాపించమని ప్రార్థించగా ఆ రాత్రి గరుడుని చేత జగన్నాథుని సమీపంలో స్థాపింప జేశాడనీ అది 'సాక్షి గోపాలునిగా' ప్రసిద్ధికెక్కిందని' తెలుపడం జరిగింది.[10]

## మార్కండేయ పురాణం[11]

మార్కండేయుడు తపస్సు చేసుకుంటున్న చోటికి వ్యాసుని శిష్యుడు జైమిని వచ్చి మార్కండేయునితో 'శ్రీ కృష్ణునికి మనుష్యత్వం కలుగడానికి కారణం చెప్పుమని అడుగగా మార్కండేయుడు వింధ్య పర్వతాలలో ఉన్న పింగాక్షుడు, వివోధుడు సుపుత్రుడు సుముఖుడు అనే ధర్మ పక్షులు సందేహం తీరుస్తాయని చెప్పి పంపగా ఆ పక్షులు జైమినికి చెప్పిన వృత్తాంతంలో పరోక్షంగా అతి స్వల్పంగా కృష్ణ కంథాంశం వున్నట్లు తెలుస్తోంది.

## అగ్ని పురాణం[12]

ఈ పురాణంలో శ్రీ రామ శ్రీకృష్ణ చరిత్రలు అగ్నిచేత వశిష్ఠునికి కొంచెం వివరంగా తెలుపబడినాయి. హిరణ్యకశిపుని ఆరుగురు పుత్రులు యోగమాయచేత దేవకీ గర్భాన ప్రవేశపెట్టబడ్డారని ఏడవ గర్భంలో కృష్ణ పరమాత్మ ఉద్భవించాడని ఉంది.

## మత్స్య పురాణం[13]

మత్స్య పురాణంలో నలుబది అయిదవ అధ్యాయంలో వృష్ణివంశ వివరణం, స్యమంతకోపాఖ్యానమూ ఉన్నాయి. ఆ తరువాత శ్రీకృష్ణ వంశాను వర్ణనం నారాయణుడు అవతారాలెత్తడానికి గల హేతువులు ఉన్నాయి.

శ్రీకృష్ణుడు అనపత్యుడైన గండూషుడనే వానికి తన కుమారుడైన 'సుచంద్రుడిని' ఇచ్చాడని మత్స్యపురాణం తెలుపుతోంది.

**"అథదేవో మహాదేవః పురాకృష్ణః ప్రజాపతి**
**విహారార్థం సదేవేశో మానుషే ష్వి జాయతే"** [14] అనే శ్లోకం

మహాదేవుడు విహారార్థమే ఈ లోకంలో మానవుల నడుమ కృష్ణునిగా జన్మించినట్లు తెలుపుతుంది. తరువాత దేవకీ వసుదేవుల పూర్వజన్మ పుణ్యాన్ని చెప్పి మోహమాయతో కృష్ణుడు సకల మతాలనూ మోహపరచి ధర్మస్థాపన రాక్షస సంహారాలు గావించాడని అతనికి రుక్మిణీ సత్యభామ సత్య, నాగ్నజితి, సుదామ, శైబ్య, గాంధారి, లక్షణ, మిత్రవింద, కాళింది, పద్మ, జాంబవతి, సుశీల, మాద్రి, కౌసల్య, విజయ మొదలగు 16000 మంది భార్యలు ఉన్నారని మత్స్య పురాణం తెలుపుతోంది.[15]

## కూర్మ పురాణం[16]

కూర్మ పురాణంలో ముందుగా శ్రీకృష్ణుడిని జాంబవతి సంతానాన్ని అర్థించడం, కృష్ణుడు పుత్రలాభార్థం ఉపమన్యుని ఆశ్రమానికి పోయి అక్కడి మునులను పూజించి మునులచేత గౌరవించబడి ఉపమన్యుని ఉపదేశానుసారం శివుని కోసం తపస్సు చేసి, శివుని సాక్షాత్కారం పొంది, శివుని స్తుతించి పుత్రుని అర్థించడం మొదలైన అంశాలు ఉన్నాయి.

పుత్రార్థియై వెళ్ళిన కృష్ణుడు కైలాసంలో కొంతకాలం నివసించడం, అక్కడ తనను గాంచి మోహించిన గంధర్వ కన్యలకు ఆత్మమాయతో సుఖాన్ని ప్రసాదించడం, ద్వారకలో అందరూ కృష్ణుని గానక విరహాన్ని అనుభవించడం, రాక్షసులు ద్వారకను ముట్టడించడం, గరుత్మంతుడు వారిని చంపి నారదుని వల్ల కృష్ణుని జాడ తెలుసుకొని కైలాసానికి వెళ్ళి కృష్ణునికి విషయం విన్నవించి ద్వారకకు తీసుకురావడం, జాంబవతికి సాంబుడనే పుత్రుడు కలగడం, మార్కండేయాది మునులు వచ్చి కృష్ణుని ప్రస్తుతించగా కృష్ణుడు తాను శివుని పూజిస్తానని శివలింగ మహాత్మ్యాన్ని వివరించడం వంటి ఘట్టాలు కూర్మ పురాణంలో కనిపిస్తాయి.

చివరగా కృష్ణుని సంతానాభివృద్ధి, కంసాది రాక్షస సంహారం జరిగిన తరువాత ధర్మాన్ని శాశ్వతంగా రక్షించి స్వస్థానానికి పోవాలనే వాంఛ కలుగుతుంది. తనను దర్శించ వచ్చిన భృగు మొదలైన మహర్షులకు తాను విష్ణు పదమంద దలచిన విషయాన్ని చెప్పి, ధర్మదూరమైన కలియుగం రాబోతున్నది కనుక మునులంతా ప్రసన్నులై లోకానికి తమ విజ్ఞానాన్ని విస్తరింపజేసి మేలు చేయుమని సందేశం ఇచ్చాడు. వంశీయుల నాశనానంతరం పరమపదాన్ని చేరిన వృత్తాంతం మొదలైనవి వివరంగా ఉన్నాయి.

17

స్కాంద పురాణంలోని కౌమారీ ఖండంలో నరకునికి ఆప్తుడైన బర్బరీకుని గురించిన వృత్తాంతంలో కృష్ణ ప్రసక్తి కనిపిస్తుంది. బర్బరీకోపాఖ్యానంలో కామకటంకట అనే మురదైత్యుని పుత్రికతో కృష్ణుడు యుద్ధం చేస్తాడు. ఆ సందర్భంలో కామాఖ్య అనే దేవి వచ్చి కామకటంకటను చంపవద్దని, తాను ఆమెకు అజేయత్వాన్ని వరంగా ఇచ్చానని కృష్ణుని ప్రార్థించింది. కృష్ణుడు ఆ కామ కటంకటను చంపే ప్రయత్నం మానుకున్నాడు.

అనంతరం ఘటోత్కచుని కామకటంకటపైకి యుద్ధానికి పంపడం ఘటోత్కచుడు వెళ్లి ఆమెను తన వశం చేసుకొని పాండవుల వద్దకు వచ్చి ఆమెను వివాహం చేసుకోవడం జరిగింది. తరువాత బర్బరీకుడు కృష్ణుని చేతిలో నిహతుడైన సంఘటన ఇందులో వివరంగా ఉంది.

## వరాహ పురాణం[18]

శ్రీకృష్ణుడు శివుని గురించి తపస్సు చేయడం, శివుని గొప్పదనాన్ని మహాత్మ్యాన్ని చాటడం వంటి సందర్భాలు వరాహపురాణంలో కనిపిస్తాయి.

జాంబవతి కోరిక మీద పుత్రార్థియై కృష్ణుడు శివభక్తుడైన ఉపమన్యు ఉపదేశం ప్రకారం ఈశ్వరుని గురించి తపస్సు చేసి శివసాక్షాత్కారాన్ని పొందడం, శివుడు ఎంతో ప్రేమతో కృష్ణుని కైలాసానికి తీసుకుపోవడం, అక్కడ కొంతకాలం వినోదిస్తూ ఉండగా కృష్ణుడు లేని కారణాన ద్వారకను రాక్షసులు ముట్టడించడం, బలరాముడు నారదుని ద్వారా కృష్ణుని జాడ తెలుసుకొని గరుత్మంతుని కైలాసానికి పంపడం, కృష్ణుని రాకతో రాక్షసులు పారిపోవడం వంటి సంఘటనలు వివరంగా ఉన్నాయి. అనంతరం జాంబవతికి సాంబుడు జన్మించాడు

ఒకనాడు మార్కండేయ మహాముని ద్వారకకు రాగా శ్రీకృష్ణుడు అతిథి సత్కారాలు చేసి తనకు ఆత్మయోగాన్ని బోధించమని కోరడం, మార్కండేయుడు 'అన్నియోగాలు శ్రీకృష్ణుని కోసమేనని, యోగమయ పురుషుడైన శ్రీకృష్ణునికి చెప్పగలవాడను కాన'ని చెప్పి, శివలింగోద్భవ గాథను తెలుపమని కృష్ణునే మార్కండేయుడు కోరాడు. ఆ సందర్భంలో కృష్ణుడు శివలింగోద్భవాన్ని గురించి తెలుపుతూ ప్రళయంలో అంతా నశించి జలమయంగా అంధకారంలో ఉండగా తాను విరాడ్రూపంలో వెయ్యి తలలు, వెయ్యి చేతులు, వెయ్యి ముఖాలు కలిగి జలం మీద పడుకుని నిద్రించి ఉండగా బ్రహ్మ రావడం సంభవించిందనీ తమలో తాము అహంకరించుకొంటూండగానే అద్భుతమైన లింగం

ఉద్భవించిందనీ తాము బ్రహ్మ ఆ లింగానికి ఆద్యంతాలు కనుక్కోలేక శివుని స్తోత్రం చేయగా నిజరూపంలో పరమేశ్వరుడు ప్రత్యక్షమయ్యాడనీ బ్రహ్మ విష్ణువు ఆ పరమేశ్వరుని నుండి పుట్టిన వారేనని శ్రీకృష్ణుడు మార్కండేయుడికి తెలిపాడు.

## భవిష్య పురాణం[19]

ఈ పురాణం శతానీకుడనే రాజుకు సుమంతుడు తెలుపుతున్నట్లుగా ఉంది.

'చంద్రభాగానది ఒడ్డున సాంబపురం ఆదిత్యునికి శాశ్వత స్థాన'మని చెప్పిన సుమంతునితో శతానీకుడు సాంబుని గురించి చెప్పమనడం వల్ల సుమంతుడు కృష్ణుని కొడుకైన సాంబుని చరిత్రను తెలుపుతున్న సందర్భంలో కృష్ణ ప్రసక్తి కనిపిస్తుంది.

సుమంతుడు, 'ద్వాదశాదిత్యులలో ఒకడయిన విష్ణుదేవుడు వాసుదేవుడై భూలోకంలో జన్మించాడనీ, జాంబవతికి వాసుదేవునికి పుట్టిన సాంబుడు కృష్ణుని శాపం చేత కుష్ఠు రోగి అయి, తన పేరు గల పట్టణాన్ని కట్టించి, ఆదిత్యుని స్థాపించి పూజించాడనీ' చెప్పాడు. సౌందర్య మద గర్వంతో దూర్వాసుని ఎగతాళి చేయడం, నారదుని తిరస్కరించి అవినయంగా ప్రవర్తించడంతో సాంబుని కుష్ఠురోగివి కమ్మని కృష్ణుడు శపించడం జరిగింది.

తరువాత శ్రీ కృష్ణుని 16000 కాంతలు సాంబుని కామించారని నారదుడు చెప్పగా విని శ్రీకృష్ణుడు స్త్రీల చపల చిత్తాన్ని గూర్చి తలచుకోవడం, నారదుడు ఆ వనితలతో కృష్ణుడున్న సమయాన సాంబుని రప్పించగా అప్పటి ఆ ఉవిదల చేష్టలను చూసి వారినీ సాంబునీ శ్రీకృష్ణుడు అలా శపించడం జరిగింది. సాంబునితో చంద్రభాగానది ఒడ్డున తన పేరున పురం కట్టించి అందులో సూర్య మందిరం కట్టించమని, ఆదిత్యుడే రోగాన్ని పోగొట్టగలడని శ్రీకృష్ణుడు సాంబునికి తెలియజేశాడు.

అష్టాదశ పురాణాలలో బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, పద్మ, విష్ణు నారద, మార్కండేయ, అగ్ని, మత్స్య, కూర్మ, స్కాంద, వరాహ, భవిష్యత్ పురాణాలలో కృష్ణ ప్రసక్తి కనిపిస్తుంది. ఆయా పురాణాలలో శ్రీకృష్ణుని జీవిత ఘట్టాలలో ప్రధానాంశాలు ఒకే విధంగా ఉన్నా మిగిలిన అంశాలలో కొద్ది కొద్ది మార్పులు తేడాలు గోచరిస్తూ ఉన్నాయి. కొన్నిటిలో గోలోకవాసి శ్రీకృష్ణుడే భూలోకంలో అవతరించినట్లు మరికొన్నిటిలో నారాయణుడే కృష్ణుడుగా అవతరించినట్లు ఉన్నది. కొన్ని పురాణాలు శ్రీకృష్ణుని జీవితాన్ని సంపూర్ణంగా క్షుణ్ణంగా వర్ణిస్తే మరికొన్ని పురాణాలు క్లుప్తంగా అతి తక్కువగా తెలిపాయి. కొన్నిటిలో గోలోకవాసి అయిన కృష్ణునికి అత్యంత ప్రియురాలు అయిన రాధాదేవి కూడా బృందావనంలో అవతరించినట్లు చెబితే, కొన్నిటిలో రాధ ప్రసక్తే లేదు.

ఇటువంటి వ్యత్యాసాలకు కారణాలు పరిశీలించినట్లయితే కొన్ని విషయాలు అర్థం అవుతాయి. శ్రీకృష్ణుని చరిత్రలో కనిపించే తేడాలకు కల్పభేదం అనేది ప్రధాన కారణం.

కృష్ణావతారం ప్రతికల్పంలోనూ జరుగుతుంది. కనుక ఆయా కల్పాలలోని కృష్ణావతారం గురించిన లీలలలోనూ తేడాలు కొద్దిగా ఉండటం సహజం. ఆ తేడాలే ఆయా పురాణాలలో కనిపించడం జరిగింది. అయితే స్వయం భగవానుని పూర్ణావిర్భావం మాత్రం సారస్వత కల్పంలోనే జరుగుతుంది. ఇందులో సమస్త అంశకళలు సమావేశం అయి ఉంటాయి. ఆ భగవానుని పూర్ణావిర్భావం ఈ కలియుగానికి పూర్వం జరిగిన ద్వాపరంలో జరిగినట్లు వ్యాస భగవానుని చేత శ్రీమద్భాగవతంలో వర్ణితమైనది.

ఆయా పురాణాలలో కనిపించి భాగవతంలో కనిపించని పాత్ర రాధాదేవిది. శ్రీకృష్ణునికి అత్యంత ప్రియురాలుగా శ్రీకృష్ణునికి అభిన్నంగా పురాణాలలో వర్ణితమయిన రాధ భాగవతంలో చోటు చేసుకోక పోవడానికి కారణమేమిటనేది చాలా మందికి కలిగే సందేహమే.

'అనయారాధితో నూనం భగవాన్ హరిరీశ్వరః
యన్నో విహాయ గోవిన్దః ప్రీతోయా మనయద్రహః' [20]

శ్రీకృష్ణుని అన్వేషిస్తున్న గోపికల నోటివెంట వెలువడిన ఈ పలుకులు ఆధారంగా తీసుకుని కృష్ణునితో ఏకాంత ప్రదేశానికి వెళ్ళిన 'సఖి' రాధేనని పెద్దలు చెప్పడం జరుగుతోంది. భాగవతంలో రాధ పేరు మాత్రమే కాదు ఏ గోపిక పేరూ చెప్పలేదు.

'రాధ'కు ఆరాధనకు అతి దగ్గరి సంబంధం ఉంది. 'రాధ్' అనే ధాతువుకు సేవ యొనర్చడం, ప్రసన్న పరచడం అనే అర్థాలున్నాయి.[21] రాధ అంటే సేవకు ఆత్మార్పణకు మధుర భావనకు ప్రతీక. కృష్ణుని త్రికరణ శుద్ధిగా సమర్పితమయినది. కృష్ణుని విడిచి క్షణం నిలువలేనిది. మధుర భావనతో కూడినది. కృష్ణుని తప్ప అన్యమెరుగనిది 'రాధ'గా చెప్పుకోవడం సహజసంగా ఉంటుంది. ఈ రాధ స్వభావమే రాధాతత్త్వమే వ్యాసభాగవతంలోను. దానిననుసరించి రచించిన పోతన భాగవతంలోను ఒక వ్యక్తిగా కాక సమిష్టి రూపంగా వ్యాపించింది.

బృందావనంలోని ఒక్కొక్క గోపికలోనూ సంపూర్ణంగా రాధ స్వభావం నిండి ఉంది.[22] ప్రతి గోపిక రాధాతత్త్వాన్ని కలిగి ఉంది. వాస్తవానికి రాధే ఇన్ని రూపాలలో గోపికలుగా ప్రకటితమయింది. కనుకనే శ్రీకృష్ణుడు ఒక్కొక్క గోపికకు (రాధికకు) ఒక్కొక్క కృష్ణునిగా అయి రాసక్రీడ జరిపాడు. ద్వాపరంలోని గోపికలే కాక శ్రీకృష్ణునికి త్రికరణ శుద్ధిగా సమర్పితమయి శ్రీకృష్ణునే సర్వస్వంగా భావిస్తూ మధుర భావనతో శ్రీకృష్ణుని సేవ చేసే ప్రతి జీవీ స్త్రీ పురుష భేదం లేకుండా రాధా స్వరూపమే.

భాగవతంలో రాధ ఒక వ్యక్తిగా కాక గోపికా స్వరూపాలలో వ్యాపించి ఉంది అనడంలో ఎటువంటి ఆక్షేపణా ఉండదు.

## పాదసూచికలు

1. బ్రహ్మపురాణం.
2. బ్రహ్మాండపురాణము (వావిళ్ళవారి ప్రతి - 1922) (జనమంచి శేషాద్రి శర్మ) ఆధారంగా...
3. శ్రీమదాంధ్ర బ్రహ్మ వైవర్త పురాణం (శ్రీ మట్టుపల్లి శివ సుబ్బరాయ గుప్త విరచితం) ఆధారంగా .....
4. శ్రీ మదాంధ్ర బ్రహ్మ వైవర్త పురాణం (ప్రకాశకులు - పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి) (1953) పిసుపాటి చిదంబర శాస్త్రి ప్రణీతం... ఆధారంగా .....
5. శ్రీ మదాంధ్ర పద్మ పురాణం (పిసుపాటు చిదంబర శాస్త్రి. 1953) ప్రణీతం... బ్రహ్మఖండము పుటలు - 18, 19.
6. శ్రీ మదాంధ్ర పద్మ పురాణం (ద్వితీయ సంపుటము, 1955) పాతాళ ఖండము, పు - 127, పద్యం - 1347. చిదంబర గ్రంథమాల.
7. శ్రీ మదాంధ్ర పద్మ పురాణం (ద్వితీయ సంపుటం, 1955) పాతాళ ఖండం, పుటలు - 145 - 147. చిదంబర గ్రంథమాల.
8. 'నారదీయ పురాణం' (A.P.G.O.M.L. & R.I. ప్రచురణం) అల్లాడ నరసింహ కవి ప్రణీతం (నారదీయ పురాణ అమృత నవనీతం) ఆధారంగా...

9&10. 'విజ్ఞాన సర్వస్వం (6), పు - 531.

11. 'విజ్ఞాన సర్వస్వం (6), పు - 531.
12. వ్యాస ప్రణీత శ్రీమత్స్య మహాపురాణము (ఆంధ్రానువాద సంహితం) ప్రథమ సంపుటం (శ్రీ వేంకటేశ్వర ఆర్ష భారతీ ట్రస్ట్ 1986 ఆధారంతో...)
13. శ్రీ మత్స్య మహాపురాణము (వ్యాస ప్రణీతం, ప్రథమ సంపుటం) శ్రీ వేంకటేశ్వర ఆర్ష భారతీ ట్రస్ట్ 1986 అధ్యాయం 48, శ్లోకం - 1, పు 167.
14. 'రుక్మిణీ సత్యభామాచ సత్యా నాగ్నజితీ తథా
"సుధామాచ తథా శైల్యాగాన్ధారీ లక్షణా తథా
మిత్ర విన్దాచ కాళిన్ది దవా జామ్బవతీ తథా"
"సుశీమాచ తథామాద్రి కౌసల్యా విజయాతథా
ఏవమాదీని దేవీనాం సహస్రాణితు షోడశ'

వ్యాస ప్రణీత శ్రీమత్స్య మహాపురాణం (శ్రీవేంకటేశ్వర ఆర్ష భారతి ట్రస్ట్ 1986) ప్రథమ సంపుటం, 13, 14, 15 శ్లోకాలు, పు - 167.

15. ఆంధ్రస్కాందము (ఆర్ష భారతి ప్రచురణలు - 1959) ప్రథమభాగం, కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు - ఆధారంగా...

16. అష్టాదశ పురాణ సార సంగ్రహం, (మూడవ భాగం), వేమూరి జగన్నాథం.

17. శ్రీ భవిష్య మహాపురాణము (వావిళ్ల వారి ప్రతి, 1938) బ్రహ్మ పర్వం, పంచసప్తతితమాధ్యాయము, పు - 468.

18. 'శ్రీకృష్ణ భగవానుడు తప్పక యీ అదృష్టవంతురాలిచే వారాధితుడై సంతుష్టుడై ఆమెను ఏకాంత ప్రదేశానికి తీసుకెళ్ళాడు' - వ్యాసుడు - 'శ్రీ మద్భాగవతం' (గౌడీయ మఠ ప్రచురణ 1982) దశమ స్కంధం '1' పూర్వభాగం అధ్యాయం '30', పు 521, శ్లో 28.

19. 'రాధాభావన' - హిందీ సాహిత్యం' అయాచితుల హనుమచ్ఛాస్త్రి, పు 193 (భావం)

20. 'రాధా' అంటే ఒక గోపిక అనే అర్థం కూడ ఉంది. - సంస్కృతాంధ్ర నిఘంటువు (సంకలనం - చలమచర్ల వేంకట శేషాచార్యులు, శ్రీ జయంతి పబ్లికేషన్ 1987), పు - 260.





# హరివంశంలో
## శ్రీకృష్ణప్రశస్తి

భారత భాగవతాలు మానవుని ఇహపరాలకు సాధనాలు. భారతం ధర్మార్థ కామసాధనను బోధిస్తే, భాగవతం మోక్షానికి మార్గం సుగమం చేస్తుంది. రెండింటిలోనూ మార్గదర్శకత్వం వహించింది ప్రధానంగా శ్రీకృష్ణుడే.

హరి వంశంతో కూడియున్న గ్రంథాన్నే మహాభారతమని అంటున్నాం. భారతంలో విశ్వరూప సందర్శనాలు గీతా బోధ గావించిన జగద్గురుడు, భారత యుద్ధ రథసారధి, సర్వకార్య నిర్వాహకుడు అయిన శ్రీకృష్ణుని వంశ వర్ణన, పుట్టు పూర్వోత్తరాలు హరివంశంలో వర్ణితమయ్యాయి.

ఆంధ్ర మహాభారత రచన 11 శ॥లో నన్నయ్యతో ఆరంభమయి 14 శ॥ ఎఱ్ఱనతో సంపూర్ణమయింది. 15 శ॥లో పోతన రచించిన ఆంధ్ర భాగవతంలోని కృష్ణుని తత్త్వాన్ని తెలుకునేముందు పోతన భాగవతం కంటె ముందుగా కృష్ణుని గురించిన పూర్తి వివరాలందించే తెలుగు హరివంశంలో ఎఱ్ఱన శ్రీకృష్ణమూర్తిని ఏవిధంగా చిత్రించాడన్నది తెలుసుకోవడం సమంజసం.

ఎఱ్ఱన హరివంశం పూర్వోత్తర భాగాలుగా రచింపబడింది. పూర్వభాగంలోని మొదటి నాలుగు ఆశ్వాసాలు మన్వంతరాల చరిత్ర, పితృదేవతా ప్రస్తావన మొదలయిన ఘట్టాలతో ఉంది. పంచమాశ్వాసంలో శ్రీకృష్ణ జననంతో శ్రీకృష్ణ కథ ఆరంభమయి, నవమాశ్వాసంలో సాందీపని దగ్గర కృష్ణ బలరాములు విద్యనభ్యసించి గురుదక్షిణ సమర్పించినంత వరకు సాగుతుంది. ఉత్తర భాగ ప్రథమాశ్వాసంలో జరాసంధుడు శ్రీకృష్ణుని పైకి దండెత్తడంతో ఆరంభమయి అష్టమాశ్వాసంలో బాణాసుర గర్వభంగం అనంతరం కృష్ణుడు ద్వారకకు తిరిగి రావడంతో ముగుస్తుంది. శ్రీకృష్ణుని జననాది వృత్తాంతం పంచమాశ్వాసంలో మొదలయినా స్యమంతక మణి వృత్తాంతం మాత్రం తృతీయాశ్వాసంలోనే ఉంది.

కృష్ణావతరణానికి ముందుగా భూదేవి రాక్షసులవల్ల తాను పొందుతున్న కష్టాలను దేవతలందరి సమక్షంలోనూ విష్ణుమూర్తికి మొరపెట్టుకుంది. నారదుడు వచ్చి విష్ణువుతో మునుపు విష్ణువు చేత సంహరింపబడిన కాలనేమి కంసునిగా జన్మించినట్లు చెప్పాడు. ఆ కంసుడు నీచుడై అందరినీ హింసిస్తున్నాడని, ఎంతోమంది రాక్షసులు భూమిమీద పుట్టి కంసునికి తోడై జనాన్ని హింసిస్తున్నారని తెలియచేశారు.

"కావున నీవవతార
శ్రీ వెలయగ మర్త్యమున వసించియఖిలదై
త్యావళిద్రుంపుము ధాత్రీ
దేవీభరముడిపి నిలుపు దేవాంశజాలన్" [1]

అని ప్రార్థించి అవతరించమని ప్రోద్బలం చేసిన మీదట విష్ణుమూర్తి దానవ సంహారానికి ఒప్పుకొని తాను జన్మించడానికి అనువైన చోటు తెలియజేయమని బ్రహ్మనడిగాడు. బ్రహ్మ 'కశ్యపుడు వసుదేవునిగా అతని ఇరువురు భార్యలు దేవకీ రోహిణులుగా జన్మించిన విధం' తెలిపి, వారికి విష్ణుతేజం రెండంశలుగా

విభాగించి అవతరించమని తెలిపాడు. విష్ణువు నావతి మీద బ్రహ్మ ప్రణాళికను సిద్ధం చేయడం చూస్తే విష్ణువు కూడా విధాత నియమానికి కట్టుబడి భూమిపై అవతరించినట్లుగా హరివంశంలో కనిపిస్తుంది.

హరివంశంలో నారదుడే కంసుని దగ్గరకు వచ్చి కంసునితో 'మీ పెద తండ్రి కూతురైన దేవకీదేవి కయ్యెడు నెనిమిది యగుచూలు నీకు మృత్యు హేతువు కాగలదని [2] అలా అష్టమగర్భంలో జనించే పురుషుడు -

" దేవతలకెల్ల శరణంబు దేవపూజ్యు
డఖిలమునకు నాధారమనంతకీర్తి
యాత్మభవుడు సమస్తలోకాత్ముడాత
డెవ్వడో చెప్పవే నొయ్యనెరిగెదీవు" [3]

అని వివరించి కంసుని ప్రాణాలను దక్కించుకునే ఉపాయమాలోచించు కొమ్మన్నాడు. అష్టమగర్భంలో పుట్టేవాడు భగవంతుడేనని స్పష్టంగా తెలిపాడు నారదుడు.

అప్పటికే దేవకీ వసుదేవుల వివాహం జరిగిపోయింది. నారదుని మాటలకు కంసుడు లోలోపల కోపించి 'దేవకి ప్రసూతి అయ్యెడు కాలమును నాకెఱింగించమని' [4] ఆప్త జనానికి తెలియజేశాడు. ఇందులో కంసుడు దేవకీ వసుదేవులను బహిరంగంగా బంధించక వారిని స్వేచ్ఛగానే వదిలివారిపై కాపు ఉంచినట్లు తెలుస్తోంది.

విష్ణువు యోగనిద్రను పిలిచి తన ఆజ్ఞపాటిస్తే "విస్మయ సముద్భవ కారిణి అయిన యున్నతి" [5] నిస్తానని చెప్పి, 'కాలనేమి' ఆరుగురు పుత్రులను వరుసగా దేవకి గర్భంలో ఉంచమనీ కంసుడు వారిని సంహరిస్తాడనీ సప్తమ గర్భ సంకర్షణం వల్ల రోహిణికి గర్భం వస్తుందనీ అష్టమ గర్భంలో తాను జన్మిస్తాననీ తెలిపాడు. అదే సమయాన దేవకికి బిడ్డగా యోగనిద్రను జన్మించమన్నాడు. బిడ్డల మార్పిడి

అనంతరం కంసుని బెదిరించి వింధ్యాటవికి వెళ్ళి శుంభనిశుంభులను సంహరించి లోకహితం చెయ్యమనీ సిద్ధులచేత కొలువబడి ఇంద్రుని చేత యోగనిద్ర అభిషేకింప బడుతుందని యోగనిద్రకు తెలిపాడు.

దేవకి ఆరుగురు సంతానాన్ని కంసుడు సంహరించడం సప్తమ గర్భ సంకర్షణం జరిగిన అనంతరం సప్తమగర్భం ధరించిన దేవకిని -

"పదునాలుగు జగముల దన
యుదరంబున నునిచికొన్న యుదితమహిమునే
ర్పొదవంగదాల్చె.............................................."

మహిత శ్రావణమేచకాష్ట మి నిశా మధ్యంబున బ్రహ్మర
ర్క్షమునన్ సోచ్చగ్రహంబులందయిదు విభ్రాజిల్ల పుత్రున్‌యదూ
ద్వహు పుణ్యాంగన గాంచె విశ్వజగదాధారోదయున్ ధర్మని
ర్వహణారంభ ధురీణు నిత్య విభుతావర్ధిష్ణు నం గృష్ణునిన్"

అని కృష్ణ జననాన్ని వివరిస్తూ ఆ బిడ్డ భగవంతుడేనని స్పష్టంగా చెప్పడం జరిగింది.

దేవకీ వసుదేవులు తప్ప 'లక్ష్మివరు మాయ' వల్ల అందరూ గాఢ నిద్రావశులయ్యారు. చీకట్లో సూర్యునిలా నీలికాంతితో వెలుగొందే బిడ్డను కంసుడేంచేస్తాడోనని భయపడుతున్న దేవకి ఒడిలోనుంచి తీసుకొని వేరేచోట దాస్తానని చెప్పి నందగోపుని ఇంటికి వెళ్ళి విష్ణుమాయ చేత నిద్రావస్థలో నున్న యశోద పక్కలోనుంచి యశోద ప్రసవించిన బిడ్డను తీసుకుని వచ్చి దేవకికి ఇచ్చి కంసునితో తమకు ఆడబిడ్డ పుట్టిందని స్వయంగా వెళ్లి చెప్పాడు.ఇందులో ఒకే పద్యంలో బిడ్డను మార్చేసినట్లు తెలియజెప్పాడు ఎఱ్ఱన. యమున దారి ఇవ్వడం సర్పం పడగ పట్టడం వంటివి హరివంశంలో లేవు.

కంసుడు వచ్చి ఆడ శిశువు అని కూడా చూడక చంపబోగా ఆశిశువు గగన తలానికి ఎగిరి (కృష్ణుని గురించి చెప్పకుండా) కంసుడు 'శత్రువుచేత చంపబడిన తరుణాన వాని ప్రాణ రుధిర కుల్యాలను' గ్రోలుతానని చెప్పి వింధ్యాటవీ ప్రాంతాన దేవతగా వెలసినట్లు వర్ణించబడింది.

శ్రీకృష్ణుడు జన్మించే వరకు భగవంతుడే జన్మిస్తున్నట్లుగా తెలిపినా ఆ తరువాత ఎక్కువ మహిమలు చూపినట్లుగా కాక పాత్రపోషణ విధానంలో ఎట్టిన ఎక్కువ ఆసక్తిని చూపినట్లుగా అనిపిస్తుంది. ఇందులో లోకజ్ఞుడయిన వసుదేవుడు తన కుమారుని మార్చిన సంగతి అతి జాగ్రత్తగా కప్పిపుచ్చి, మధురకేతెంచిన నందగోపుని త్వరబెట్టి బాలుని రక్షణకోసం గోకులానికి పంపాడు. తాను కేవలం ప్రాణస్నేహితునిగానే వ్యవహరిస్తూ రోహిణీ గర్భ జనితుడైన సంకర్షణుని భారం నందగోపుని మీద పెట్టి ఓదార్పు పొందాడు.

కొన్నాళ్లకు కంసుడు పంపిన శిశుఘాతకి పూతన నిశాసమయాన బాలుని వెతుకుతూవచ్చి నందగోపుని శకటం క్రింది తల్పం మీద పడుకుని ఉన్న కృష్ణుని ఎత్తుకుని కంసహంతకుడితడే నని పళ్ళు కొరుకుతూ విషపు చనుమొనలు బాలుని నోటికందించగా -

" రక్కసికిని దానెక్కుడు
రక్కసియై కృష్ణుడిట్లు క్రౌర్యావేశం
బక్కజముగ బచరింపగ
నక్కుటిలా వారి గెడసె హోయనుచు భువిన్" [8]

అంటూ ఆ రక్కసి కంటే తానే పెద్ద రక్కసియై పూతన ప్రాణాలు తీసినట్లు చెప్పాడేగాని భగవంతుడు గనుక ఆమెను చంపాడని వాచ్యంగా చెప్పలేదు. మరికొన్నాళ్ళకు శకటాసుర సంహారం సందర్భంలో బాలుని ఏవిధంగా చంపాలా అని ఆలోచిస్తున్న శకటాకార రాక్షసుని ఒక్కతాపుతో చంపాడు కృష్ణుడు.

చిన్నపిల్లవాడు బండిని తన్నడమే అసాధ్యం. గోపకులంతా భయపడ్డారేగాని శకటభంజనం ఎలా సాధ్యమా అని ఆశ్చర్యపోయినట్లుగా కూడా లేదు.

హరివంశంలో గోపకాంతలు కృష్ణుని అల్లరిపనులు యశోదకు చెప్పిన సందర్భంలో కోపంతో కృష్ణుణ్ణి రోటికి కట్టి 'కదలిన మొత్తుదు' అని చెప్పి వెళ్ళింది యశోద. కృష్ణుడు రోటిని ఈడ్చుకుంటూ మద్ది చెట్ల నడుమ నుండి లాగి చెట్లను పడవేసినప్పుడు సైతం అవి పిల్లాడిపై పడితే ఏమయ్యేదోనని భయపడ్డారుగాని అంతపెద్ద మద్దిచెట్లను ఎలాకూల్చాడని ఎవరూ ఆలోచించలేదు. అనాగరకులైన పల్లెవాసులకు ఆలోచించే శక్తిలేనట్లుగా చెప్పడం ఎఱ్ఱన ఉద్దేశమేమో. అది సహజం కూడా! అంతేకాక ఆ చెట్లు నారదునిచే శాపగ్రస్తులైన కుబేర పుత్రులు అని గాని వారికి కృష్ణుడు శాపవిమోచనం కలిగించాడనిగాని కవి చెప్పలేదు.

కృష్ణుడి బాల క్రీడాభివర్ణనం మాత్రం కన్నులకు కట్టినట్లుగా మనోహరంగా చిత్రించాడు ఎఱ్ఱన.

అనేక ఉత్పాతాలు కలిగినా ఆప్రదేశాన్ని నందాదులు వదలక పోవడంతో నారదుడు వచ్చి నందునితో ఆప్రదేశం వదిలివెళ్ళమని చెప్పి

*'విను నారాయణుడాది దేవుడు జగద్విఖ్యాత సత్త్వుండుమే*
*దినికిన్ భారముడింప దైత్యుల వినాశింపంగ క్రీడార్థమై*
*జనియించెన్ భవదీయ సూనుడనగా సంభవ్యుడై కానను*
*ర్వ్యునిగా జూడకు కృష్ణరాముడును దత్తుల్యుండ యత్యున్నతిన్'*

అని చెప్పి పూతనాది రాక్షసుల సంహారం కృష్ణుడే జరిపినట్లుగా చెప్పి బృందావనానికి వెళ్ళమని ప్రేరేపించాడు. అలాగే కృష్ణుని దగ్గరకు వెళ్ళి -

*"త్రైలోక్యంబు ప్రశంసచేంపవడసన్ దక్షుండ నైయింతకున్*
*మూలంబైయిట నందసూనుడనగా ముగ్ధాకృతిన్ లీలనై*

**బాలత్వంబు నటించు నిన్ను మదిలో భావింతురుద్యన్మతుల్**
**హేలా నిర్దళితారి సర్వమును నీయిచ్చావశంబచ్యుతా"[10]**

అని స్తుతించాడు. శ్రీకృష్ణుని భగవత్తత్త్వం గోపాలకులకు తెలియదు కదా! నారదుని నోటి మాటల్లోనే కృష్ణుడు పరమాత్మయని తెలియజేశాడు.

బృందావనానికి నందాదులు తరలివెళ్ళిన అనంతరం కొంతకాలానికి గోవులను, మనుష్యులను వివిధ రోగాలు పీడించాయి. రోగశాంతి కోసం గోవృద్ధులు శివపూజ నొనర్చడం, పూజ జరిపే సందర్భంలో ఒక బ్రాహ్మణునికి పూనకం వచ్చి అక్కడి అశ్వత్థ వృక్షం వల్లనే రోగాలు వస్తున్నాయని, బలరామకృష్ణులు ఆ విషవృక్షాలు నాశనం చేయగలరని చెప్పడం, వారు వృక్షాలను నాశనం చేసి అక్కడి వారందరినీ రోగాల నుండి కాపాడటం జరిగింది.

మిథిలాపురంలోని కుంభకుని గృహంలోని రాక్షసాంశ సంభూతులయిన సప్తవృషభాలను కృష్ణుడు చంపి కుంభకుడి కూతురు నీలను పరిణయ మాడిన వృత్తాంతం హరివంశంలోనే ఉంది. ఈ సంఘటన కృష్ణుని గొప్ప బలవంతునిగా నిరూపిస్తుంది.

వామదేవ భరద్వాజులనే మునులు తీర్థ యాత్రలు చేస్తూ బృందావనానికి వచ్చి గొల్లపిల్లల మధ్యలో రామకృష్ణులను జూసి ఆ ఆకార తేజో విభవాలకు అద్భుతమంది దివ్యదృష్టితో శ్రీకృష్ణుని పరమాత్మునిగా గ్రహించి **ఆనందాతిరేకాలతో**

**"ఏము చదివిన చదువులు నేమువిన్న**
**వినుకులును నేమునడిపెడు వివిధ విధులు**
**నేడు ఫలియించె పరమేశ నీవు కరుణ**
**యలర నిచ్చట ప్రత్యక్షమైతిగాన" [11]**

*'తొలుత గలిగింతు జగముల*
*నిలువుదు దదనంతరంబ నిర్భరలీలా*
*కలనమెయినడుతు పిమ్మట*
*నెలకొని నీమాయ యేమి నేరదువరదా'* [12]

అని సంపూర్ణమైన విష్ణుతత్త్వాన్ని కృష్ణునిలో దర్శించినట్లుగా సుదీర్ఘంగా మునులు స్తుతించారు. వీరు జ్ఞానులు కనుక కృష్ణుని పరమాత్మగా గుర్తించి పూర్వపు అవతారాల వర్ణన కూడా చేస్తూ స్తుతించారు.

కాళీయ మర్దన సంఘటనలో కృష్ణుడు కాళీయుడుండే మడుగు జూసి కాళీయుని గుణాలను తలుచుకున్నాడు ' ఆ దుర్మార్గుని ఆ మడుగు నుండి పంపేయాల'ని అనుకున్నాడు. ఎవరో వచ్చికోరినప్పుడు, తనమీదకు వచ్చిన ఆపదలు తీర్చుకోవడానికి మాత్రమేగాక, దుష్టత్వం ఎక్కడ ఉంటే అక్కడికి స్వయంగా వెళ్ళి దానిని నశింపజేయడం కూడా కృష్ణుడు చేశాడు. కాళీయుని పొగరు అణచ దలచిన కృష్ణుడు -

*ఇది మదీయ పదస్పర్శ నదవిగాంచి*
*యఖిలలోక నమస్కార్యహారి మహిమ*
*మార్జితంబగు గాత పొంపొనరదీని*
*వెక్కి యిప్పీట మటికెద నక్కజముగ* [13]

అని మడుగులోకి దూకాడు. కృష్ణుడు మడుగులోకి దూకాడన్న వార్తవిని అందరూ తల్లడిల్లారు. నందుడు "రూపంబున్ బలవిక్రమంబులు మహారూఢంబులైన" [14] పుత్రుని వల్ల తాను పుణ్యాత్మునిగా గణుతికెక్కడం దైవం చూడలేక పోతోందని వాపోయాడు.

యశోద దుఃఖం, గోపకుల ఆవేదన చూసి బలరాముడు మడుగు అడుగున ఉన్న కృష్ణుని హెచ్చరించినట్లుగా హరివంశంలో ఉంది.

*'మానుష భావమిట్లొకడు మాటిడి లోకహితం బొవర్పగా*
*బూనిన నీ మహామహిమ బుద్ధి దలంపక యిప్పుడిచ్చటన్*
*దీనికి నింత స్రుక్కి బడి దీనత నొందుట మెచ్చుగాదునీ*
*దైన యనుంగు లందఱును నార్తి గలంగుట కృష్ణ చూచితే'* [15]

అని "వీరు నీ సత్త్వం బెఱుంగరు గావున శోకించెదరు. జన్మ సముచితంబు లగు కర్మంబు లప్రతిహతంబులుగా జెల్లించెదవుగావున బంధు ప్రమోదంబవశ్య కర్తవ్యం బిప్పిషాహి మర్దించి యీ దుర్దశనపనయింపు[16] మన్న బలరాముని పలుకులు విని "ద్వైత భ్రాంతి నివృత్తి బొందగ నభేద బ్రహ్మబోధంబు సంభూతంబైన నశేష బంధనములం బోద్రోచు సిద్ధాత్ము నట్లాతడమ్మెయినాత్మ తత్త్వ విదుడై...." [17] కాళీయుని పడగల మీదికి ఉరికి తోకను చేతపట్టుకొని 'లయ కాలకేళి తాండవ, భయంకరుండై భర్గుడిలాగా కాళీయుని పడగల మీద ఆడి మర్దించాడు. దానితో దాసోహమన్నాడు కాళీయుడు. త్రిజగజ్జన స్థితి ధ్వంసము లొనరించే ప్రభువుగా కీర్తించి, తప్పులను క్షమించమన్నాడు.

*'అజసురేంద్రాదులకు జేరనలవిగాని*
*యుష్మదీయ పదాంభోజ యుగళినాదు*
*తలల సోకుట జరితార్థతముడనైతి*
*గడగి నీయాగ్రహము ననుగ్రహమయయ్యె'* [18]

ననిపొగిడి పొంగిపోయాడు. కాళీయ మర్దనంతో కృష్ణుని మహిమను అర్థం చేసుకున్నారు గొల్లలు.

*'ఎన్నడు నిట్టి సాహసము లిట్టి బలోద్ధతులిట్టి ధైర్యముల్*
*విన్నవి కన్నవెయ్యెడల వీరకు లోత్తమ! గల్గెనే జగ*
*త్పన్నుతమయ్యె నీమహిమ సర్వధనంబులు గోపకోటియున్*
*విన్ను శరణ్యుగా బడసెనేడు మొదల్పతి నీవ యంతకున్'* [19]

అంటూ ఆశ్చర్యంతో ఆనందించారు. బలరాముడు ధేనుకాసురుని ప్రలంబుని సంహారించినపుడు రామకృష్ణులు మానవ మాత్రులు కారనీ. ఏదో కారణాన ప్రభవించిన వేల్పులనీ విశ్వసించారు.

శ్రీ కృష్ణుడు నందగోపాదుల చేత ఇంద్రపూజను చేసే ఆచారం మాన్పించి మన చుట్టూ ఉన్న వనాలు పర్వతాలు వేల్పులని తెలిపి గోవర్ధన పూజ చేయించాడు. దానికి కోపించి ఏకధాటిగా వర్షం కురిపించిన ఇంద్రుని గర్వభంగం చేయదలచి గోవర్ధనగిరి నెత్తి ఏడురోజులపాటు గోపకులందర్నీ వర్షం బారి నుండి కాపాడాడు. ఆ సందర్భంలో శ్రీకృష్ణుడు తానే -

*కొండ ధరించుట నాకొక*
*కొండామున్నె వలవాటు కూర్మమనైపె*
*న్గొండ ధరింపనె యమున*
*ట్టుండెయదు తనూజాదద్భుతోరుస్థిరతన్* [20]

అంటూ తెలుపుకొని కూర్మావతారాన్ని కృష్ణుడు తనకు తానే గుర్తు చేసుకున్నట్లు తెలిపిన ఎఱ్ఱన కృష్ణుడు లోకోద్ధారణకు అవతరించిన విష్ణుమూర్తేనని స్పష్టం చేశాడు.

ఇంద్రుని దర్పం అణిగిపోగా అనమయాన 'అతి మానుషము అతి దైవతము అత్యద్భుతము అయిన కృష్ణుని దుష్కర వ్యాపారాన్ని దర్శించి కృష్ణుని గురించి 'ఇతడ క్షోభ్యుడనాద్యనంత విభవుండీశానుడా నమ్రదైవతుడాక్షిప్త సురారి చక్రుడ జిత వ్యాపార విఖ్యాతుడచ్యుతుడాద్యుండ'[21] ని గుర్తెరిగి క్షమించమని వేడుకొని అనేక విధాల కీర్తించాడు. ఈ సందర్భంలో కృష్ణుని భగవత్తత్త్వం ఇంద్రుని ద్వారా నిరూపిత మయింది. శ్రీకృష్ణుడు వైష్ణవ తేజంగాను, భువన నిర్వాహణ ధురంధరుడుగాను, గోలోక పాలకునిగాను ప్రకటించి కృష్ణుని గోపతిగా అభిషిక్తుని చేశాడు. అంతేగాక ఇంద్రుడు తన అంశతో జన్మించిన పార్థునికి అండగా ఉండమని కృష్ణుని కోరడం, కృష్ణుడంగీకరించి భావి భారత కథను ఇంద్రునికి

తెలియజేయడం హరివంశంలో ప్రత్యేకంగా జరిగింది. ఈ సందర్భంలో శ్రీ కృష్ణుని మహాప్రభావాన్ని పూర్తిగా గ్రహించిన గోపకులు కృష్ణుని నిజస్వరూపాన్ని తెలుసుకోగోరినప్పుడు కృష్ణుడు నవ్వి -

*'.........మీకునివ్వి ద్రవ్యగ వేలమిన్నకున్న*
*బోదె మీ బాంధవుడనను బుద్ధిపాలు*
*నవలనేమి పేసెదరు మీరనఘులారా'* [22]

అని కాలక్రమంగా అన్నీ తెలుసుకుంటారని వారిని శాంత పరిచాడు. తానెంతటి వాడినయినా తమలో ఒకనిగా చూసి ప్రేమను పంచితే చాలునని ప్రేమ తత్త్వమే తనదని పరోక్షంగా తెలియజేశాడు.

శ్రీకృష్ణుని నారద భరద్వాజ వామదేవులు, ఇంద్రుడు తత్కారణంగా గోపకులు పరమాత్మగా గుర్తించగా

*"తనవవ యౌవనంబున మదగ్రవు దర్పము శారదాగమం*
*బునదిన రాత్రులంగల ప్రభూత సుఖోచిత రమ్యభంగులున్*
*గనుగొని కామభోగముల గ్రాలుటకై మదినిచ్చగించియ*
*వ్వనరుహలోచనుండు గరువంబగు చోద్యపు నిశ్చయంబునన్"* [23]

*"ఆ పల్లెలో వనెప్పుడు*
*గోపతరుణులెల్లదనదు కోర్కి వలువులీ*
*లాపాత్రములుగ జేయుట*
*కే పారగ మత్పహించి యెనకవు వేడ్కన్"* [24]

అంటూ సామాన్య మానవునిగా యౌవనోదయ సమయాన వాతావరణ ప్రభావంతో 'కామభోగములు గ్రాలుటకై మదినిచ్చగించాడని ఆ పల్లెలోని గోప తరుణలంతా 'తనకోర్కి వలువు లీలా పాత్రములుగా జేయ' డానికి

పూనుకున్నాడని రచించాడు ఎఱ్ఱన. నారదాదులు కృష్ణుని భగవంతునిగా గుర్తించినట్లుగా రచించిన ఎఱ్ఱన పదేపదే కృష్ణుని భగవంతుడని కీర్తిస్తూ వ్రాసిన ఘట్టాలు అంతగా కనబడవు. కేవలం ఒక వంశ చరిత్ర (హరివంశం)ను వ్రాస్తూ అందులో కృష్ణుడనే వాడిని కొందరు భగవంతునిగా భావించి స్తుతించారని మాత్రం చెప్పినట్లుగా తోస్తుంది. ఎఱ్ఱన కృష్ణుని మహాబలవంతుడు సంపన్నుడు అయిన మానవునిగా ఉన్నతమైన మానవుని చిత్రించినట్లే అనిపిస్తుంది.

ఊరివారిని తనవైపుకు త్రిప్పుకోడానికై వేణుగానం చేసినట్లు 'వశీకరించి యమునా తీర కాంతారాలకు' వచ్చేట్లు చేశాడు. అలా వచ్చిన ఆ పరమ పురుషుడయ్యింతుల 'ప్రకట రాగకుశల పేశల లీలల గొఱలి కొఱలినాడు. నాటికి రతుల విన్న నువు పఱిచి తాము డొక్కి దర్వ్యావవైదగ్ధి వలన.'[25] భాగవతంలో గోపికలే హరిని పతిగా కోరారని, వారి కోర్కె తీర్చడానికే రాసలీల జరిపాడని యోగేశ్వరేశ్వరుడైన కృష్ణుండాత్మారాముండై వారలతో రమించాడని[26] వుంటే హరివంశంలో కృష్ణునికే కోర్కె ఉన్నట్లుగా చిత్రితమైంది.

వ్రేపల్లెలో ఉంటూ కేశి అరిష్టాది రాక్షసులను సంహరించిన కృష్ణుడు 'వ్రేపల్లె బల్లిదుడై' వర్తిల్లుతున్న సమయాన కృష్ణుని సంగతి తెలిసిన కంసుడు ధనుర్యాగానికి బలరామకృష్ణులను తీసుకురమ్మని అక్రూరుని పంపాడు.

అక్రూరుడు కృష్ణునితో దేవకీ వసుదేవుల పరితాపం గురించి చెప్పి శ్రీకృష్ణుని ఎన్నో విధాల స్తుతించి మధురకు తీసుకొనిపోయే మార్గంలో మార్గమధ్యాన కృష్ణుడు యమునా జలాలలో అక్రూరునికి తన మహానుభావాన్ని చూపించాడు. అది చూసి తరించి అక్రూరుడు బలరామకృష్ణులను మధురకు తీసుకువెళ్లడం అక్కడ తన మాటవినని చాకలివానిని చంపి గణకుడనే మాలాకారుని కరుణించి కుబ్జను సుందరాంగిని చేశాడు. కువలయా పీడనం గావించి చాణూరుని మట్టుపెట్టి మహామల్లుడుగా గుర్తింపు పొందాడు. అనంతరం కంసుని ప్రాణాలు తీసి

అందరికీ ఆనందం కలిగించాడు. విద్యాభ్యాస కాలంలో బలరామకృష్ణులు అరవైనాలుగు రోజులలో చతుర్వేదాలను షడంగాలను అభ్యసించినట్లు, పన్నెండు రోజులలో ధర్మ తర్క న్యాయ గణిత గాంధర్వ లేఖ్య గంధర్వదంతి రథశాస్త్రాలలో నిపుణులైనట్లు, ఏభయిరోజులలో సాంగాస్త్ర నిగమాన్ని గ్రహించినట్లు, గురుదక్షిణగా మరణించిన గురుపుత్రుని తెచ్చియిచ్చి అనంతరం పరిఘ్యాది ఆయుధకళను పొందినట్లు[27] హరివంశం వివరించింది.

కంసుని మామగారయిన జరాసంధునితో కృష్ణుడు యుద్ధం చేసిన వైనం ఉత్తర భాగంలో విపులంగా ఉంది.

తమపై దండెత్తి వచ్చిన జరాసంధుని పరిమార్చడానికి అకృతాస్త్రులయిన రామకృష్ణులు పరశురాముని సన్నిధికి వెళ్ళి విషయం చెప్పి తమకు కర్తవ్యం బోధించమన్నారు. రామకృష్ణుల రాకకు ఆనందించిన పరశురాముడు వారిని జరాసంధుని జయించననువైన ప్రదేశమయిన 'గోమంత' మనే పర్వతానికి జేర్చాడు. ఆప్రదేశంలో ఉన్నట్లయితే సమరంలో, 'చక్రశార్ఙ్గంబులు గౌమోదకి యను గదయు సౌనంద సంవర్తకంబులను మునల లాంగలంబు' లు సన్నిహితాలవుతాయని, పుణ్య దివ్యరూపాలను ధరించి వైరి భయంకరులౌతారని, అధిక జయసిద్ధి కలుగు తుందని[25] చెప్పిన పరశురాముడు వారిని ఆ పర్వతానికి చేర్చిన అనంతరం దీవించి వెళ్ళిపోయాడు. ఆ పర్వతం దగ్గర చాలాసార్లు యుద్ధం చేసిన జరాసంధుడు పరాజితుడై వెనుదిరిగాడు. ఒక సందర్భంలో జరాసంధుని చంపబోయిన బలరాముని అశరీరవాణి వారించి జరాసంధుని మృత్యువు యాదవుల చేతిలో లేదని తెలియజేసింది. (భాగవతంలో ఆకాశవాణికాక శ్రీకృష్ణుడే భవిష్యత్తును గ్రహించి బలరాముని వారించినట్లుగా ఉంది).

గర్గునిపుత్రుడు కాలయవనుడు కృష్ణునిపై పోరుకు రాగా ద్వారకాపురి కట్టించి మధురావాసులను ద్వారకకు తరలించి చాకచక్యంగా మాంధాత నందనుడైన ముచికుందుడు నిద్రించే గుహలోకి కాలయవనుని రప్పించాడు.

నిద్రాభంగ మయిన ముచికుందుని కోపపు చూపులకు కాలయవనుడు ఆహుతి అయ్యాడు.

ఈ విధంగా యాదవుల చేతిలో మరణం లేని కాలయవనుని కృష్ణుడు ఎంతో నేర్పుగా ముచికుందుని వల్ల మరణించేట్లు చేశాడు.

హరివంశ ఉత్తర భాగం తృతీయాశ్వాసంలో శ్రీకృష్ణుని కళ్యాణాల గురించి ఉంది. ఇందులో అగ్నిద్యోతనుడు గాక నారదుడే రుక్మిణి కళ్యాణవార్తను కృష్ణునికి చేరవేస్తాడు. రుక్మిణి పంపినట్లుగాక త్రిలోక సంచారి అయిన నారదుడే రుక్మిణి మనను గ్రహించి తనంతతానుగా శ్రీకృష్ణుడు రుక్మిణిని పరిగ్రహించేట్లుగా ప్రేరేపిస్తాడు.

కుండిన పురానికి వచ్చిన కృష్ణుని చూసిన రుక్మిణి కృష్ణలీలన్ని తలుచుకొని పరవశించింది. రుక్మి మొదలయిన రాజులందరిని యుద్ధంలో ఓడించి మహావీరుడైన కృష్ణుడు రుక్మిణిని వివాహమాడాడు. రుక్మిణి వివాహానంతరం మిత్రవింద, జాంబవతి, సత్య, కాళింది, భామ, లక్షణ, సుదంత, అనేవారిని వివాహమాడినట్లు హరివంశం వివరించింది.

చతుర్థాశ్వాసంలో నరకాసురుని వృత్తాంతం ఉంది. ఇందులో దేవతలను జయించిన నరకుడు దేవలోక సంపదను 8000 మంది దేవకన్యలను తేవడమే గాక సర్వజీవుల్ని పరిభవించి వస్తువులను స్త్రీలను తెచ్చి ఇచ్చేట్లుగా తన పరిజనులను ఆజ్ఞాపించడం అనుచరులందరూ అప్సరసలను, లక్షలకొలది యక్షకాంతలను, కిన్నెర సిద్ధ సాధ్య విద్యాధర సుందరులను తెచ్చి నరకునికి సమర్పించడం, యజ్ఞయాగాదుల్ని ధ్వంసం చేసి ఋషులను హింసించడం వంటి విషయాలు వివరంగా ఉన్నాయి. ఇంద్రాదులు వచ్చి నరకాసుర వధకు కృష్ణుని ప్రేరేపించిన అనంతరం దుష్టశిక్షణ శిష్టరక్షణ కర్తవ్యంగా కలిగిన శ్రీకృష్ణుడు సత్యాసహితుడై వచ్చి ముందుగా నరకుని నగరాన్ని రక్షిస్తున్న మురాసురాది

అసురులను పరిమార్చి నరకునితో ఘోర యుద్ధానికి తలబడ్డాడు. ఈ సందర్భంలో నరుకుని బాణం తగిలి మూర్ఛపోయిన కృష్ణుడు, కొంతసేపు సత్యభామ నరకునితో పోరిన అనంతరం తేరుకుని లేచి యుద్ధం చేసి చక్రాయుధంతో నరకుని నిహతుని చేశాడు. ఇక్కడ నరకుని అతి వీరుడుగా కృష్ణుని సైతం కొంతసేపు మూర్ఛపోవునట్లు చేయగలిగినవానిగా వర్ణించాడు ఎఱ్ఱన. నరకుని సంహారానంతరం భూదేవి వచ్చి నరకుని కుండలాలు తీసి కృష్ణునికిచ్చి.

> "కరుణన్ పుత్రుని నీవయిచ్చితి త్రిలోక ద్రోహిగా జూచి చె
> చ్చెఱ నిష్ఫాకలబుచ్చితింక దివిజుల్ సిద్ధుల్ తపస్వుల్గత
> జ్వరులై తాల్తురుగాక మోదభరమున్ సౌస్థిత్యమొప్పం జరా
> చర భూతాళియెలర్చుగావుత భవత్సం ప్రాప్తరక్షావిధిన్" [29]

అని తనకు పుత్రుని ఇచ్చిన విష్ణువే చివరకు దుష్టశిక్షణ కావించిన కృష్ణునిగా తలచి నరకపుత్రుని రాజును చేయమని ప్రార్థించింది. 'మందర ధరుడు ధరణీనందను దేహంబు సంస్కరింప' జేసి నరకుని కుమారునికి పట్టం కట్టి నరకుని బంధంలోనున్న కాంతలను విడిపించాడు.

ఆ కాంతలే తాము సుర కన్నెలమని నారదుడు తమతో 'శంఖ చక్రగదా ధరుండగు నారాయణుండు ధరణీ భారావతారణార్థంబ కారణ మానుషుండై నరకాసురంబరిమార్చి' [30] తమకు భర్త అవుతాడని తెలిపాడని, ఆనాటి నుంచి 'ఏమింత కాలంబును శీలంబు గోల్పోక జీవంబు లొడళ్ళ నింపుకుని నిరీక్షిస్తున్నా' [31] మనీ అన్నారు. శ్రీకృష్ణుడు వారిని స్వీకరించి అదితికి నరకుని దగ్గర నుండి తెచ్చిన కుండలాలనిచ్చి శచీంద్రుల చేత కీర్తింపబడ్డాడు. సత్యభామ కోర్కె మీద పారిజాత వృక్షాన్ని పెకిలించుకొని, అడ్డువచ్చిన ఇంద్రునితో పోరాడి ఓడించి, ద్వారకకు చేరాడు.

అనంతరం నారదుడు శ్రీకృష్ణుని ప్రభావాన్ని పుట్టిన నాటినుండి అప్పటి వరకేకాక భవిష్యత్తులో చేయబోయే పనులు గురించి కూడా వర్ణించి యాదవులకు తెలియజేసిఁ అయ్యాది దేవుడు -

*అనుపముఁడప్రత ర్క్యుఁడజరామరుఁడాద్యుఁడనంతుఁడచ్యుతుం*
*డనఘుఁడపేత దోషుఁడవాప్త గుణుండలి వాఙ్మనః ప్రవ*
*ర్తనుఁడు నితాంత భక్తి కలిత స్థితి దన్ భజియించు పుణ్యుల*
*న్మనుచు సమస్త సంపద సమూహములగా బరికించు సత్కృపన్'* [32]

అని కృష్ణుని భగవత్తత్త్వాన్ని వివరించి చెప్పాడు.

ఆ తరువాత నారదుడు కృష్ణుని చూడవచ్చిన రాజులకు 'దక్షిణ' గొప్పదనాన్ని తెలుసుకొని చెప్పడం విప్రపుత్రులను రక్షించడంలో పార్థుడసమర్థుడవగా కృష్ణుడు పార్థుని సారథిగా చేసుకుని ఆ విప్రపుత్రులను కాపాడి తీసుకువచ్చిన సంఘటనను అర్జునుడు ధర్మరాజుకు తెలిపాడు.

అనంతరం రుక్మిణి కోరికమీద కృష్ణుడు పుత్రునికోసం శివుని అర్థించడానికి వెళుతూ బదరీ వనంలో ఋషుల మధ్య సమాధియోగంలో ఉండగా పిశాచనాయకుడైన ఘంటాకర్ణుడు చూసి ఎవరని ప్రశ్నించినపుడు కృష్ణుడు తనను గూర్చి తెలుపుతూ 'యదువంశ సంభవుడనని దుష్ట మర్దన సుజన సంతోషములయందు జాలెడి వాని' నని తన సామర్థ్యాన్ని లక్ష్యాన్ని తెలియజేశాడు. ఘంటాకర్ణుడు కృష్ణుని గూర్చి ఆడుగుతూ

*"అజాలు బుట్టించి తదీయ విద్యయునవార్యంబైన యామ్నాయముల్*
*విజరూపం బెరిగించి యిచ్చి మఖముల్ నిర్మించి తద్ధర్మముల్*
*ఋజు మార్గంబగు శిష్ట వర్గమునకున్ ప్రాద్యంబుగా జూపిన*
*ట్టి జగద్దేశికు గావగా జనుట కంటెం గల్గునే కార్యముల్"* [33]

అంటూ అన్నిటి మూలం కృష్ణుడేనని తాను గ్రహించిన విషయాన్ని తెలియజేశాడు. కృష్ణుని గురించి తలచుకుంటూ ధ్యానంలో కూర్చున్న ఘంటా కర్ణుని సద్భక్తిని గ్రహించి వీనిని కృతార్థు చేయుదునని నిశ్చయించి తన దివ్యరూపాన్ని ధ్యానంలో ఉన్న ఘంటాకర్ణునికి చూపించాడు. హరివంశంలో ఎక్కడా ఎవ్వరికీ తనకు తానుగా కృతార్థుని చేయదలచుకుని తన దివ్యమూర్తిని చూపినట్లు లేదు. పిశాచరూపుడయినా ఘంటాకర్ణుడు చేసే ప్రతి పని కృష్ణుని తలచుకొని చెయ్యడం వల్ల అతడికా అదృష్టం గలిగి తనంతతానుగా దర్శనమిచ్చాడు. ధ్యానంలో దర్శనమిచ్చిన కృష్ణుడే కనుల ముందు నిలిచి ఉండే సరికి పట్టలేని ఆనందంతో అట్టహాసం చేస్తూ

"హరిగంటి గృష్ణు గంటిం
పరమేశ్వరు గంటి భక్త భయహరుగంటిం
పురుషోత్తముదచ్యుతుడీ
శ్వరుడభవుడు వీడె వీడె సమ్ముఖుడయ్యెన్" [34]

అంటూ నృత్యం చేశాడు. ఘంటా కర్ణుడు చేసిన సుదీర్ఘ స్తుతిలో ఇంకేభక్తుడూ పొందలేని పరవశత్వం కనిపిస్తుంది. దశావతారస్తుతి శ్రీకృష్ణలీలలు కలిపి తన్మయంగా గానంచేసి చివరకు శవాన్ని తెచ్చి కృష్ణుని తినమని కోరాడు. దానికి కృష్ణుడు వీడెంత భక్తుడయినా నైసర్గిక దోషం విడువలేదని తలచి ఘంటాకర్ణునిపై కృపజూపి తన చేతితో ఘంటాకర్ణుని తాకగా పరుస వేది సోకిన పరుషలోహం శుద్ధ స్వర్ణమయినట్లుగా పిశాచరూపం పోయిన ఘంటాకర్ణునికి దివ్యరూపం కలిగి మోక్షం సిద్ధించింది.

అనంతరం కృష్ణుడు కైలాసానికి వెళ్ళగా శివుడే కృష్ణుని మాహాత్మ్యాన్ని అభివర్ణించి స్తుతించడమనేది శ్రీకృష్ణుని భగవత్తత్వాన్ని నిరూపిస్తుంది. శ్రీకృష్ణుని నామాలను వాటి అర్థాలను తెలిపి శ్రీకృష్ణుడు సకలచ్ఛందాలలో గాయత్రియనీ

వేదాలలో ప్రణవమనీ వర్ణాలలో అకారమనీ ఆదిత్యులలో విష్ణువనీ ఏకాదశ రుద్రులలో శంకరుడనీ అగ్నులలో పావకుడనీ దేవతలలో పురందరుడనీ గుహ్యకులలో కుబేరుడనీ దేవ మునులలో నారదుడనీ దైత్యులలో ప్రహ్లాదుడనీ సర్పాలలో వాసుకియనీ నదులలో గంగయనీ పర్వతాలలో మేరువుఅనీ సర్వవస్తువులలో ఉత్తమమై ఉంటాడనీ కీర్తించి [35]

"నీ పేళ్ళెన్నియొ యన్నియు
నా పేళ్ళును నోముకుంద నాకున్నీకున్
రూపింపలేదు భేదం
బేవగిదిని విన్ను గనుట యెరుగుట నన్నున్" [36]

అని శివకేశవాద్వైత్వాన్ని తెలిపాడు. పుత్రుని కోరిన కృష్ణునికి తనకంటి మంటచే దగ్ధమైన మన్మధుడే రుక్మిణి కొడుకు ప్రద్యుమ్నునిగా పుడతాడని చెప్పాడు శివుడు.

ఆ తరువాతిదైన పౌండ్రక వాసుదేవుని వృత్తాంతం కైలాసం నుండి తిరిగి వచ్చిన కృష్ణుని దగ్గరకు పౌండ్రకుడు దూతను పంపి యుద్ధానికి ఆహ్వానించగా కృష్ణుడు పౌండ్రకుని ఆయుధాలను నుగ్గుచేసి. పౌండ్రకుని తన చక్రాయుధంతో నిహతుని గావించాడు. తనపైకి వచ్చిన వారిని యుద్ధంలో సంహరించాడు.

కృష్ణుడు క్రమంగా అంగ, వంగ, కళింగ, పాండ్య, కేకయ రాజులను భంజించడం ఎంతో మంది రాజులను సంహరించడం, అశ్వత్థామ కృప కర్ణ దుర్యోధన భీష్ములను కొన్ని కొన్ని సందర్భాలలో గెలవడం కుంతీదేవి సమక్షంలో వేడుకగా భీమార్జునులను పరాజితుల్ని చేసి. వినోదాన్ని కూర్చడం, దంతవక్త్రుని ద్రుమ సేనాదులను చంపడం మొదలయిన సంఘటనలు సంక్షిప్తంగా చెప్పి హరివంశంలో శ్రీకృష్ణుని పరాక్రమ స్వరూపాన్ని వెల్లడి చేశాడు ఎఱ్ఱన.

భీముని చేత జరాసంధుని చంపించడం, నరనాథ రక్షణం, శిశుపాలవధ, పాండవుల చేత సంగ్రామంలో రాజులందరిని విశ్వేషంగా చంపించడం,

పాండవుల్ని సర్వకాల సర్వావస్థలలోనూ కాపాడటం, పరీక్షిత్తుకు ప్రాణదానం చేయడం వంటి కార్యాలు నిర్వహించినట్లు క్లుప్తంగా ఉంది.

పార్వతి వరప్రసాదంగా బాణునికి పుట్టిన ఉష తగినవరుని కోసం ఉద్దేశించి తపస్సు చేయడం, వైశాఖ శుద్ధ ద్వాదశినాడు రాత్రికలలో వచ్చినవాడితో వివాహమవుతుందని పార్వతి తెలిపిన మీదట ఆనాడు తన కలలోకి వచ్చిన (కృష్ణుని మనమడు) అనిరుద్ధుని, చెలికత్తె చిత్రలేఖ మాయా విద్యచేత ఉష మందిరానికి తీసుకురావడం వంటి సంఘటనలు సప్తమాశ్వాసంలో ఉన్నాయి. అలా మాయమైన అనిరుద్ధుని జాడ తెలిసి బాణుని నగరం మీదికి యుద్ధానికి వెళ్లిన కృష్ణుడు బాణుని వైపున తనను అడ్డగించిన శివుని నిద్రాపరవశుని చేసి కుమారస్వామితో పోరాడి తొలగించి చివరగా బాణునితో యుద్ధం చేసి ఓడించి తన అవక్రపరాక్రమాన్ని ప్రదర్శించాడు. బాణుని బాహుద్వయాన్ని తప్ప మిగిలిన బాహువులను ఖండించి గర్వభంగం చేశాడు. ఉషానిరుద్ధుల వివాహానంతరం దేవతలస్తుతులనందుకొని ఇంద్రాదులతో కృష్ణుడు ద్వారకకు రావడం సంక్షిప్తంగా వుండి తత్పురాణప్రశస్తితో ముగుస్తుంది హరివంశం .

హరివంశంలో స్యమంతక మణి వృత్తాంతం ఆరంభంలోనే మూడవ ఆశ్వాసంలో భాగవతంలోని విషయాలతోనే ఉంది. సూర్యుని నుండి మణిని పొందిన సత్రాజిత్తు అది పోయిన అనంతరం ఆ అపహరణ నిందను కృష్ణునిపై వేయడం, కృష్ణుడు దానిని జాంబవంతుని నుండి తెచ్చి యిచ్చి అపనిందను మాపుకోవడం, సత్రాజిత్తు సత్యభామ నిచ్చి కృష్ణునికి వివాహం చేయడం వంటి ఘట్టాలు, శతధన్వుడు సత్రాజిత్తును చంపిన అనంతరం మణికోసం జరిగిన వాగ్వివాదాలు మొదలయిన వాటి తరువాత చివరకు ఆ మణిని బలరామునికి సత్యభామకు కాక అక్రూరునికే ఇచ్చివేసి వాదాలు పరిష్కరించడం వంటివి ఉన్నాయి. ఈ సంఘటనలు పరుల సొమ్మును సొంతం చేసుకోకూడదనే కృష్ణుని స్వభావాన్ని అపనిందను ఎలాగయినా బాపుకోగలిగే ధీరత్వాన్ని తెలియజేస్తాయి.

ఎఱ్ఱన రచించినది వంశ చరిత్ర కనుక ఒక ఇతిహాసంగా హరివంశాన్ని రచించాడు. కృష్ణుని దివ్యాదివ్యుడయిన నాయకునిగా చిత్రించాడు ఎఱ్ఱన. అందుకే హరివంశంలో మహామునులు కృష్ణుని కీర్తించిన సందర్భాలలో మాత్రమే భగవత్తత్త్వాన్ని విష్ణుతత్త్వాన్ని అవసరాన్ని మించకుండా తెలియజేశాడు. తానుగా భక్తి పారవశ్యంతో భగవత్సంకీర్తనం చేయలేదు. ఎఱ్ఱన రచనా ఉద్దేశమూ అదికాదు.

హరివంశంలో చారిత్రక పురుషునిగా దివ్యాదివ్యుడైన నాయకునిగా ఉన్న కృష్ణుడు భాగవతంలోని ప్రతి సంఘటనలోనూ తన లీలల్ని మహాత్మ్యాలను చూపించాడు. ఆయా ఘట్టాలను ఎంతో అంతరార్థాలతో భగవత్తత్త్వాన్ని పొందుపరచి పోతన తన రచన సాగించాడు. మోక్ష మార్గాన్ని చూపడానికి మార్గదర్శకంగా ఉండేట్లుగా భాగవతాన్ని తీర్చిదిద్దాలన్నదే పోతన ఉద్దేశ్యం. వ్యాసుడు కూడా హరివంశంలో కూడిన భారతాన్ని రచించిన తరువాత మనశ్శాంతి కలుగనందుకు చింతిస్తున్న సమయంలోనే నారదుడు వచ్చి భగవత్తత్త్వాన్ని ఉపదేశించి భగవంతుని గుణగానం చేయమని స్ఫూర్తి నిచ్చాడు. అదే తత్త్వాన్ని పోతన తెలుగులో మరింత భక్త్యావేశపూరితంగా రచించాడు. పోతన కావ్యానికీ శ్రీహరి తత్త్వానికీ ఎఱ్ఱన హరివంశం ఒక నేపథ్యంగా పరిణమించింది.



## పాదసూచికలు

1. ఎఱ్ఱాప్రగడ - హరివంశం. పూర్వభాగం పంచమాశ్వాసం, పద్యం 64 పు - 115
2. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, పంచమాశ్వాసం, పద్యం 84, పు - 117
3. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, పంచమాశ్వాసం, పద్యం 85, పు - 117
4. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, పంచమాశ్వాసం, పద్య 94, పు - 118
5. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, పంచమాశ్వాసం, పద్యం 100, పు - 119
6. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, పంచమాశ్వాసం, పద్యం 112, పు - 120
7. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, పంచమాశ్వాసం, పద్యం 116, పు - 120
8. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, పంచమాశ్వాసం, పద్యం 152, పు - 126
9. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, షష్ఠాశ్వాసం, పద్యం 16, పు - 139
10. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, షష్ఠాశ్వాసం, పద్యం 18, పు - 139
11. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, షష్ఠాశ్వాసం, పద్యం 190, పు - 159
12. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, షష్ఠాశ్వాసం, పద్యం 191, పు - 162
13. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 10, పు - 162
14. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 33, పు - 165
15. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 44, పు - 166
16. ఎఱ్ఱాప్రగడ హరివంశము. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 45, పు - 166
17. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 46, పు - 166
18. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, వచనం 45, పు - 166
19. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 65, పు - 168
20. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 179, పు - 181
21. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 193, పు - 182
22. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, సప్తమాశ్వాసం, పద్యం 239, పు - 187
23. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, అష్టమాశ్వాసం, పద్యం 5, పు - 188

24. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, అష్టమాశ్వాసం, పద్యం 6, పు - 188
25. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, అష్టమాశ్వాసం, పద్యం 15, పు - 189
26. పోతన - శ్రీ మహా భాగవతము, దశమం స్కంధం, పూర్వభాగం వచనం 1002
27. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, నవమాశ్వాసం, పద్యం 193, పు - 233
28. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. పూర్వభాగం, పంచమాశ్వాసం, పద్యం 46, పు - 243
29. ఎఱ్ఱన - హరివంశము, ఉత్తరభాగం, చతుర్థాశ్వాసం, పద్యం 180, పు - 332
30. ఎఱ్ఱన హరివంశము. ఉత్తరభాగం, చతుర్థాశ్వాసం, వచనం 196
31. ఎఱ్ఱన హరివంశము. ఉత్తరభాగం, చతుర్థాశ్వాసం, వచనం 196
32. ఎఱ్ఱన హరివంశము. ఉత్తరభాగం, చతుర్థాశ్వాసం, పద్యం 265, పు 342
33. ఎఱ్ఱన, హరివంశం. ఉత్తరభాగం, పంచమాశ్వాసం, పద్యం 186, పు - 363
34. ఎఱ్ఱాప్రగడ, హరివంశం. ఉత్తరభాగం పంచమాశ్వాసం, పద్యం 213, పు - 366
35. భగవద్గీత విభూతి యోగంలోని 21,23,26,30 శ్లోకాలు
36. ఎఱ్ఱన హరివంశం. ఉత్తరభాగం, షష్ఠాశ్వాసం, పద్యం 84 పు 381



# 4

# పోతన భాగవత తత్త్వం

సత్వరజస్తమోగుణాల ఆధిక్యతననుసరించి జీవుని ఉద్ధరించే సాధన మార్గాలు వేదశాస్త్రాలలో ఉన్నాయి. జీవుని నివృత్తికి క్రమంగా తీసుకుపోయే ఈ మార్గాలలో కర్మభక్తి యోగ మార్గాలు ప్రధానంగా కనిపిస్తాయి. ఈ మూడు మార్గాలు జ్ఞానమనే గమ్యం చేరి కలిసి పోతాయి.

ఆచార వ్యవహారాలు, వ్రతాలు, ఉపవాసాలు, పూజలు మొదలయినవి కర్మకి అంగాలు (ఇందులో రాజస ప్రవృత్తి కనిపిస్తుంది). యమనియమాదులు, ఆసన ప్రాణాయామాలు, త్రాటక ధ్యానాలు, కుండలినీ శక్తిని, సుషుప్తిని తెలుసుకోవడం మొదలయినవి ప్రధానంగా గలది 'యోగమార్గం'. మనో నిగ్రహంతో పరమాత్మను తమ హృదయంలో దర్శించే ప్రయత్నం ఇందులో కనబడుతుంది. (ఈ యోగ మార్గంలో తామస ప్రవృత్తి సూచితమవుతుంది) భక్తి మార్గంలో మనసును పరిశుద్ధంగా ఉంచుకోవడం, ప్రేమ దయలను కలిగి తాను నమ్మిన దైవాన్ని లేదా గురువును తుది నిశ్వాసం వరకూ విశ్వసిస్తూ ఉండడం,

ఏకాగ్రత కలిగి సద్గ్రంథ పఠన శ్రవణాదులు గావిస్తూ వాటిపై స్థిరత్వం కలిగి దైవ స్మరణ గావించడం మొదలయినవి[1] (దీనిలో సాత్త్విక ప్రవృత్తి కనిపిస్తుంది).

పై మూడు మార్గాలు 'జ్ఞానం'లో లీనమవుతాయి. 'అహం బ్రహ్మోఽస్మి' 'సోఽహం 'శివోఽహం' అనే వాక్యాలను మననం చేస్తూ బ్రహ్మ నిర్వాణానికి సాధన చేసేవారు జ్ఞానులు. 'కర్మచేత స్వర్గం, జ్ఞానం చేత బ్రహ్మ నిర్వాణం, యోగం చేత పరమాత్మానుభూతి, భక్తి చేత భగవత్సాక్షాత్కారం లభిస్తాయి.'[2]

యోగ మార్గం సామాన్యులకు సాధ్యంకాని మాట వాస్తవం. వయోవర్ణ విభేదాలతో మానవుల కోసం వేద పురాణాలలో వివరించబడిన కర్మకాండను ఆచరించడం కష్ట సాధ్యం. ఆసక్తి కామ్యపూరితాలైన కర్మమార్గం విపరీత బుద్ధిని ప్రేరేపిస్తుంది. అయితే వయోవర్ణ లింగ భేదం లేక సకల జీవులకూ అందుబాటులో ఉండి అనుసరణీయంగా ఉండే యోగ్యమైన మార్గం 'భక్తి-మార్గం' ఒక్కటే. సేవించడమనే క్రియవల్ల భక్తి (భజ సేవాయాం) అనే పదం ఏర్పడుతుంది. సర్వేశ్వరుని మనోవాక్కాయ కర్మలతో సేవించడమే భక్తి. జ్ఞానం, యోగం మొదలయినవి భక్తికి అంగాలుగా ఉండడం వల్ల భక్తి ముఖ్యమైనదిగా తెలుస్తోంది. భక్తి మార్గ ప్రాధాన్యాన్ని సవిస్తరంగా, సర్వాంగ సుందరంగా మాధురీగుణం కలిగిన కథాకథన శిల్పంతో వెల్లడించిన గ్రంథం పోతన భాగవతం.

## భాగవతం ఆంధ్రానువాదం

పోతన భాగవతాన్ని కేవలం వ్యాసభాగవతానికి అనువాదం అని చెప్పుకోలేము. పోతన నన్నయాదులలాగా మూలం మంచి కథను మాత్రమే గ్రహించి అనేక మార్పులతో చేర్పులతో రచించి, మూల గ్రంథాన్ని అనువాదంలో కుదించలేదు. నాచన సోమునిలాగా కొన్ని కథలను మాత్రమే గ్రహించి, నవీన కల్పనలతో అతి స్వతంత్రంగా రచించలేదు. పోతన భాగవతానువాదంలో మూల

భాగవతం దాదాపు రెట్టింపు అయింది (మూలంలోని 18,000 శ్లోకాలు తెలుగులో 30,000 పద్యాలుగా అనువాదంలో పెరిగాయి). పోతన ప్రతిభా ప్రదర్శనమే దీనికి కారణం కాదు. పోతన ఉద్దేశము అది ఎంతమాత్రమూ కాదు. మూల భావాన్ని, అర్థ గాంభీర్యాన్ని ఎంతో శ్రద్ధా నిష్ఠలతో తెలుగులోకి తెచ్చే ప్రయత్నంలో ఎటువంటి లోపానికీ తావీయలేదు పోతన. పురాణమే అయినా 'పరమ ప్రౌఢంగాను, గంభీర విషయ విచారణతోనూ గూఢార్థ గుంఫిత శైలి విరాజితం గాను, గాఢబంధ సమ్మిళితం'[3] గాను ఉండి పండితులకే తప్ప సామాన్యులకు దురవగాహంగా ఉన్న శ్రీ మద్భాగవతారణ్యాన్ని పోతన సరళ సులభ శైలీయుతంగా విషయ విచారణలో వివరణాత్మకంగా ఆంధ్రభాగవతాన్ని ఒక సుందర ఉద్యానవనంగా తీర్చిదిద్దాడు.

మోక్ష శాస్త్రమని సాత్త్వత సంహితమని చెప్పబడి వ్యాఖ్యాన సాయం లేనిదే కొంతయినా అర్థమవడం దుర్లభంగా ఉండే వ్యాసుని "భాగవతం తెలిసి పలుకుట చిత్రంబు శూలికైన దమ్మి చూలికైన!"[4] అటువంటి క్లిష్టాన్వయ పూరితమైన శ్రీమద్భాగవతాన్ని గురించి 'శ్రీధరుల' వంటి

"విబుధ వరుల వలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేట"[5]

పరిచాడు పోతన. మూలాన్ని ఉన్నదున్నట్లుగా కాక విషయ వివరణం గావిస్తూ వ్యాఖ్యాగత విశేషాలను సాధ్యమయినంత వరకూ సంయోజిస్తూ మూలంలోని సర్వార్థాలను తేటతెల్లం జేస్తూ తెనిగించాడు.

అయితే స్వతః సాత్త్వికుడు, పరమ భాగవతోత్తముడూ అయిన పోతన పరమాత్మను స్తుతించే ఘట్టాలలోనూ పరమభక్తుల స్వభావాన్ని చిత్రించే సందర్భాలలోనూ పరవశుడై సహజ పాండిత్యంతో ఆత్మీయతా ముద్రను గూర్చాడు. ఆయా సందర్భాలను పరిశీలిస్తే పోతన తత్త్వమూ పోతన భాగవత

తత్త్వమూ వెల్లడవుతాయి. పోతన తత్త్వాన్ననుసరించే పోతన రచించిన భాగవత (భాగవతుల) తత్త్వమూ ఉంటుంది.

## పోతన భాగవతం - కైవల్య ప్రాప్తి

భాగవతంలోని వస్తువు భక్తి. భాగవతంలోని తత్త్వాన్ని పాండిత్య తర్క వ్యాఖ్యానాల సాయంతో గాక కేవలం భక్తి చేతనే గ్రహించాలి. ఈ భక్తి పరాకాష్ఠకు కలిగే సత్ఫలితమే కైవల్యప్రాప్తి. దానికి అన్ని విధాలా అనుకూలంగా ఉన్నది భాగవతమే. కనుకనే -

*"శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్ లోక*
*క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో*
*ద్రేక స్తంభకు కేళిలోలవిలసద్దృగ్జాల సంభూతనా*
*నా కంజాత భవాండ కుంభకుమహానందాంగనాడింభకున్"*

అని శ్రీకృష్ణ పరమాత్మను, త్రిమూర్తిత్వాన్ని ధ్యానించి శ్రీకైవల్య పదాన్ని చేరడం కోసం భాగవతాన్ని రచిస్తున్నానంటూ ఆరంభించాడు పోతన.

## ఇష్టదేవతా ప్రార్థన

శ్రీకృష్ణుని కైవల్యపదం చేరడం కోసం ధ్యానించి, శివుని బ్రహ్మని కూడా ధ్యానించి సర్వదేవతా సమానత్వాన్ని తెలియపరిచాడు. ఈ వరుసలో ప్రథమస్థానం మహానందాంగనా డింభకునిది. త్రిమూర్తులలో శివుని బ్రహ్మని తలచి విష్ణువును తలవకపోడం విష్ణువు (విశ్వవ్యాపకుడు) శ్రీకృష్ణుడే అని. వారిద్దరికీ భేదం లేదని తెలియచేయడానికే. సృష్టికర్త బ్రహ్మను ముందు తలచుకోక నందనందనుని రూపంలోని విష్ణువును తలుచుకోవడం - అతడు పాలనాధికారం కలవాడైన విష్ణువు అవడమే. మరి విష్ణువునిగాక నందాంగనా డింభకుని ఎందుకు తలుచుకున్నాడు ముందుగా ? అన్న దానికి - విష్ణువు

నందనందనుని రూపంలోనే మోక్షాన్ని ఇస్తాడు గనుక - మరే అవతారాలలోను మోక్ష ప్రదానం జరుగలేదు గనుక.

ఆ తరువాతి స్థానం లయకారకుడైన శివునిది. 'మన్మథ గర్వ పర్వతోన్మూలికి' అనడంలో మనోవికారాలను నిర్మూలించే స్వభావునిగా శివుని ధ్యానించాడు. లౌకిక సుఖ విముఖత్వం శివుని ద్వారా లభించినా శ్రీకైవల్య పదానికి చేర్చేది మాత్రం కేళీలోలుడు విష్ణువే (కృష్ణుడే) యని స్పష్టం చేశాడు పోతన.

సమస్త చరాచర భూత సృష్టి చేసి 'భారతీ హృదయ సౌఖ్య విధాత' అయిన బ్రహ్మకు వందన మాచరించిన తరువాత విఘ్నేశ్వర ధ్యానం చేసి తన భవబంధ నిర్మూలనకూ కైవల్యపదం జేరడానికీ ఆధారభూతమైన భాగవత రచనా పాండిత్యాన్ని ప్రసాదించిన 'వాణి'కి క్షోణితలంబు నెన్నుదురు సోకునట్లుగా' సాష్టాంగ నమస్కారం జేసి, మూల ప్రకృతి ముగురమ్మల మూలపుటమ్మ దుర్గను 'మహత్త్వ కవిత్వ పటుత్వ' సంపదల, కోసం ధ్యానించి లేములు బాపి సిరులిచ్చు లక్ష్మీప్రార్థనతో దేవతా ప్రార్థనలు ముగించాడు పోతన.

జీవించడానికి ధనం ఎంత అవసరం అయినా ధనం కోసమే జీవించలేదు పోతన. అందుకే ధనానికి అధి దేవత అయిన లక్ష్మీదేవిని చివరగా స్తుతించాడు అని చెప్పవచ్చు. అందుకే

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము బాసికాలుచే
సమ్మెట వ్రేటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పెనీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్"[7] అన్నాడు.

పోతన ఇష్టదేవతా స్తోత్రాలలో కైవల్య పదాన్ని తప్ప మిగిలిన వాటిని లక్ష్యపెట్టని భాగవతుల తత్త్వం గ్రంథం మొదట్లోనే గోచరిస్తుంది. 'పండా కలవాడే పండితుడు, పరతత్త్వాన్ని తెలుసుకునే శక్తి గల బుద్ధే పండా'[8] తన సహజ

పాండిత్యంలో ఈ పరతత్త్వాన్ని తెలుసుకున్నాడు. కనుకనే పోతన కైవల్య ప్రదాత అయిన శ్రీహరికి ప్రథమ స్థానాన్నిచ్చి కీర్తించాడు. సంపదకు ప్రాధాన్యం ఇస్తే 'శరీరము బాసి కాలుచే సమ్మెట వ్రేటులన్ బడయు' గలవని భయద్దాడు. 'శ్రీ'నివాసుడు కనుక శ్రీహరికిస్తే లక్ష్మికిచ్చినట్లే శ్రీహరి ప్రసన్నమయితే లక్ష్మి కూడా ప్రసన్న మయినట్లే - జీవన గమనానికి కావలసిన సంపదకు లోటులేనట్లే.

పోతన భాగవతం లో ప్రతిపాద్య వస్తువు శ్రీకృష్ణ పరబ్రహ్మం అవడం వల్ల శ్రీకృష్ణ ధ్యానంతో ఆరంభించాడు. తన ఇష్టదేవతా నమస్కృతి పూర్వకమయిన ధ్యానంలోనే వస్తు నిర్దేశం చేసి ఉత్తమోత్తమమయిన కావ్య రచనా విధానాన్ని అవలంభించాడు. 'విలసద్భ్యాల .... ' అనడంలో సృష్టికర్తృత్వం 'లోక రక్షైకారంభకు' డనడంలో స్థితి కర్తృత్వం 'దానవోద్రేక స్తంభకుడ'నడంలో లయకారకత్వం సూచించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులకభేద నిరూపణ కావించాడు. ఈ స్వరూపమే మహానందాంగనా డింభకుడని నిరూపించాడు.

'జ్ఞానం చేతనే కైవల్యం. శ్రుతుల చేతను, కర్మోపాసనాదికాల చేతను, మోక్షప్రాప్తి లేదు. ఆత్మజ్ఞానం ఒక్కటే కైవల్యం. ఆత్మజ్ఞాన ప్రాప్తికోసం శ్రవణ మనన నిదిధ్యాసలనే త్రివిధ సాధనాలు విధించబడ్డాయి. నిదిధ్యాస అంటే చింతించటమే'[9]. ముందు శ్రవణం, తరువాత మననం, ఆపైన నిదిధ్యాస (చింతించడం) జరుగుతుంది. శ్రీకృష్ణ పరబ్రహ్మం గురించి చింతించడం బ్రహ్మ జిజ్ఞాస చేయడమే. ఏకాగ్రతలో ధ్యానం చేయడమే నిదిధ్యాస. పోతన 'శ్రీకైవల్య పదంబు చేరుటకునై చింతించెద'నని చెప్పి, నిదిధ్యాస చేస్తూ భాగవతాన్ని ఆరంభించాడు.

ఇక పరతత్త్వాన్ని తెలుసుకున్న పోతన దానిని గురించి ఇతరులకు చెప్పకపోవడం స్వార్థం అవుతుందేమో... నిస్స్వార్థంగా తాను అవగాహన చేసుకున్న పరతత్త్వాన్ని లోకానికి పంచిపెట్టి పరోపకారం చేసి తరిద్దామనుకున్నాడు. అందుకే

"జగద్ధితంబుగా..."[10] భాగవత రచనా రూపంలో పరతత్త్వ వివేచనను లోకానికి పంచాలని నిశ్చయించుకున్నాడు. కావ్యం విశ్వశ్రేయస్సు కోసమేనన్న విషయం తన భాగవత రచన ద్వారా రుజువు చేశాడు. వ్రాస్తున్నది లోకులందరి కోసం అయినప్పుడు వారికిష్టమయ్యే రీతిలోనే వ్రాయడం కవి బాధ్యత. అందుకే -

"కొందఱకు దెనుగుగుణమగు
గొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగునే
నందఱ మెప్పింతు గృతులనయ్యైయెడలన్" [11]

అంటూ లోకంలోని అన్ని వర్గాల వారికి ఇష్టమయ్యేట్లుగా వ్రాస్తానన్నాడు.

## పోతన భాగవతం - హరిహరాద్వైతం

పోతన చాటి చెప్పిన మరొక విషయం ఏకేశ్వర వాదం, లేదా అద్వైత తత్త్వం. పోతన కృతిని ఆరంభిస్తూ తన అనుభవం దానికి ఉదాహరణగా చూపాడు. దేవతాస్తుతిలో అంతమంది అధిష్ఠాన దేవతలను తలచుకున్నా పోతన ఉద్దేశ్యంలో పరమాత్మ ఒక్కడే. 'శ్రీ మన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహాలుడైన'[12] పోతన చంద్రగ్రహణ సమయంలో గంగాస్నానం చేసి బాహ్యాంతర శుద్ధుడైన పులినతల మండప'[13] మధ్యంలో 'మహేశ్వరధ్యానం'[14] చేస్తూ 'కించిదున్మీలిత నేత్రుడయి'[15] ఉండగా చిరునవ్వుతో కనిపించినది సీతారాములు. ఆ రాముడు తనను తాను రామభద్రునిగా పరిచయం చేసుకుని భాగవతాన్ని తెలుగు చేయమని చెప్పాడు. దానికిగాను 'భవబంధాలు తెగుతాయని' అన్నాడు.

మహేశ్వర ధ్యానంలో ఉన్న పోతనకు శ్రీరాముడు కనబడటమే వింత. అయితే తన చరిత్రతో నిండి ఉన్న రామాయణాన్ని గాక ఏక వింశత్యవతారాలు అందులోనూ ప్రధానంగా దశావతారాలకు ముఖ్యంగా శ్రీకృష్ణ చరిత్రకు విపుల

ప్రాధాన్యం వహించిన భాగవతాన్ని వ్రాయమనడం మరీ వింత. ఈ వింతలకు తోడు.

*"పలికెడిది భాగవతమట*
*పలికించు విభుండు రామభద్రుండటనే*
*పలికిన భవహరమగునట....*[16]

అని తెలిసి కూడా భాగవతాన్ని శ్రీకృష్ణుని సమర్పణగా ఆరంభం చేశాడు. ఏ పేరన పిలిచినా ఏ రూపమున ధ్యానించినా పరమాత్ముడొక్కడే. అతడు నామ విరహితుడు. తేజోమయుడు అనంతుడు'[17] పోతనకు కృష్ణుడు వేరుగా, రాముడు వేరుగా, శివుడు వేరుగా అనిపించలేదు. 'పోతన దృష్టిలో అందరూ ఒక్కటే. అంతటి సువిశాలమైన హృదయంతో సాగింది భాగవత రచన'[18]. తాను అనుభవించిన దానినే పోతన ఈ విధంగా లోకానికి అందించాడు.

*"చేతులారంగ శివుని పూజింపడేని*
*నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని*
*దయయు సత్యంబులోనుగా దలపడేని*
*కలుగనేటికి తల్లుల కడుపుచేటు"* [19]

అని శివపూజ హరికీర్తన చేయనివానిని, దయాసత్యాలను పాటించని వానిని నిందించాడు. భాగవతం విష్ణు కథామయమే అయినా అందులో శివుని కథలూ ఉన్నాయి. భాగవతుల దృష్టిలో శివకేశవులు సమానులు. శివునికి కూడా విష్ణువుకున్న గుణాలే నిరూపించబడ్డాయి. అలాగే శ్రీరాముడే శ్రీకృష్ణుడు.

## భాగవతం- మానవత్వం

పోతన భాగవతం మానవత్వాన్ని కూడా చాటి చెపుతుంది.

*"దయయు సత్యంబు లోనుగా దలపదేని*
*గలుగ నేటికి దల్లుల కడుపు చేటు"* [20]

అనే పద్య పాదాలలోనూ "నితాంతాపార భూతదయయును దాపస మందార నాకు దయసేయగదే'[21] అనే పద్య పాదాలలోనూ మనిషికి భగవంతుని మీద భక్తితో బాటు సత్యం, భూతదయ అనేవి తప్పనిసరిగా ఉండాల్సిన లక్షణాలుగా తెలిపాడు. భూతదయకు సత్యానికి మించిన మానవత్వమేముంటుంది? సత్యం అంటే బ్రహ్మం. బ్రహ్మం నుండే ఈ సకల ప్రపంచం పుట్టి, అందులోనే నిలిచి, అందులోనే కలిసిపోతుంది. అలాగే 'దయ' కూడా. భాగవత సేవ వలన నిశ్చలమైన భక్తి ఉదయిస్తుంది. భక్తి గుండె నిండా నిండినపుడు రజోగుణం, తమోగుణం నశించి వాటివల్ల కలిగే కామలోభాలు అహంకారం నశించి మనసు సాత్త్వికమయి ఈశ్వర తత్త్వజ్ఞానం కలుగుతుంది. అప్పుడు జీవులన్నింటిలోనూ భగవంతుడున్నాడనే గ్రహింపు వస్తుంది. ఆ గ్రహింపు వచ్చినప్పుడు భగవంతుడు వ్యాపించి ఉన్న జీవులన్నిటిని ప్రేమించడం వాటిపై దయ చూపడం జరుగుతుంది. ఈ విధమైన స్థితి మనిషికి కలిగించేది భాగవతం. "అన్ని భూతాలలోనూ అంతర్యామియై ఉన్నాడని బోధిస్తుంది కనుక భూతదయ భాగవతం చెప్పిన పరమోత్కృష్ట ధర్మం"[22] గా తెలుస్తోంది.

## భాగవతంలో పాత్రలు

భాగవతంలో వచ్చే ప్రధానపాత్రలు భాగవతులు (భక్తులు), భగవంతుడు, భగవద్వ్యతిరేకులు. భక్తులు నాయికా సమానమయితే వారు నాయకుడైన భగవంతుని దరికి చేరడానికి పడే తాపత్రయం, ప్రయత్నం వారు చేసే సాధనల్లో కనిపిస్తుంది. ఈ ప్రయత్నానికి భగద్వ్యతిరేకులు కలిగించే ఆటంకాలు, వేధింపులు ఆ రాపిడిలో భగవద్విరహం భరించలేక అన్ని విధాలుగాను శరణాగతులయిన భక్తులను భగవంతుడు కాపాడి తన వద్దకు చేర్చుకుని వారికి

తృప్తిని కలిగించడం, భగవత్వ్యతిరేకుల మదమణచడం భాగవతంలోని ప్రధానవస్తువు. ఇంచుమించుగా కథలు మారినా ప్రధానాంశం ఇదే. ఇదే భగవత్తత్త్వంగా కనిపిస్తుంది. ఆయా వివరాలు విచారించే ముందు భక్తుల లక్షణాలు, భగవద్వ్యతిరేకుల-లక్షణాలు తెలుసుకోవడం అవసరం.

## భక్తుల లక్షణాలు

భగవంతుని త్రికరణ శుద్ధిగా ప్రేమతో సేవించడమే భక్తి. నారదుని మతం ప్రకారం "భగవంతుని మీద మిక్కిలి ప్రేమ కలిగి ఉండడం, భగవంతునికి సమస్త కర్మలను అర్పించి తృప్తి పడడం, భగవంతుని విస్మరణం వలన వ్యాకుల పడడం భక్తి కలిగినపుడు కార్యసిద్ధిని, అమృతత్వాన్ని పొందడం, సుఖదుఃఖాలలో కాంక్షనుగాని, వ్యథనుగాని పొందకుండడం"[23] అనేవి భక్తుల లక్షణాలు.

భక్తులకు "మైత్రి కరుణ సుఖదుఃఖాల ఎడ సమత్వము, ఓర్పు, సదా సంతుష్టి పరాత్పరునియందు బుద్ధినర్పించడం, పరిశుద్ధత, సమర్థత, తాటస్థ్యము, శత్రువులను కూడా సమభావనతో చూడడం మానావమానాలను సమభావనతో చూడడం, శీతోష్ణ సమత్వము, నిందాస్తుతుల యందు సమత్వము, మౌనము, స్థిరమైన మతి'[24] అనేవి తప్పనిసరిగా ఉండవలసిన లక్షణాలు. పోతన భాగవతంలో ప్రహ్లాదాది భక్తులను పై గుణాల సమ్మేళనంగానే తీర్చిదిద్దినట్లు స్పష్టమవుతుంది.

*"పొడిచిన దిట్టిన గొట్టిన*
*బడుమందురుగాని పరమ భాగవతులుదా*
*రొడ బడరు మాఱుసేయగ'*[25] అని

*"వెలగరు కలగరు సాధులు*
*మిళితములై పరుల వలన మేలుంగీడున్*
*వెలకొనిన నైన వాత్మకు*
*నొలయవు సుఖదుఃఖచయము యుగ్మములగుచున్"*[26]

అని భాగవతులెలా ఉండాలో బోధించాడు పోతన. అలాగే భక్తులు విడువవలసిన లక్షణాలు "ద్వేషము, మమకారము, అహంకారము, జంకడము, సంతోషము, క్రోధము, భయోద్వేగము, అపేక్ష, దిగులు, సంకల్పము, అసంతృప్తి, దుఃఖము, కోరిక శుభాశుభములను విడనాడక పోవడం"[27] అనేవి. భక్తుడే అయినా తనలో ఈ లక్షణాల కవకాశమిస్తే అతడు దిగజారిపోక తప్పదు (రావణాది రాక్షసులు భక్తులే అయినా ఆ గుణాలవల్లే వారు దిగజారిపోయారని చెప్పవచ్చు). భగవంతుడు జీవులన్నిటి యందు వున్నాడని గ్రహించిన వారే భాగవతోత్తములు. వీరు స్వపర బేధం లేక సకలప్రాణులను సమదృష్టితో చూడగలిగిన విశాల హృదయులు.

"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణేగవి హస్తిని
శుని చైవ శ్వపాకేచపండితా స్సమదర్శినః" [28]
"సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధు షు
సాధుష్వపి చపాపేషు సమ బుద్ధిర్వి శిష్యతే"[29]

అనే భగవద్గీతా శ్లోకాలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

ఇక భాగవత కథానాయకుడు భగవంతుడు. సమగ్రమైన ఐశ్వర్య వీర యశశ్శ్రీజ్ఞాన వైరాగ్యాలారు 'భగ' మనబడుతాయని ఈ ఆరుగుణాలు కలవాడు భగవంతుడని విష్ణుపురాణం చెబుతుంది.[30] అంతేకాక జీవుల ఉత్పత్తి వినాశనాలను గమనాగమనాలను విద్యావిద్యలను ఎరిగినవాడే భగవంతుడని కూడా తెలుస్తోంది.

నిజానికి భాగవతంలో ప్రతిపాదింపబడిన భగవద్గుణాలను వాగ్బుద్ధీంద్రియ మానసాలు నిరూపించలేవు. పరాపరాలకు పరమమై, అనన్యమై, సర్వవ్యాపకమైన భగవంతుడు నిర్గుణుడు. తటస్థ లక్షణాలు కలిగిన పరబ్రహ్మం.

అయినప్పటికీ భూమిలో ఉన్న గంధాది గుణాలను ఆశ్రయించిన వాయువులాగా సర్వగుణ రూపుడై భగవంతుడు ప్రకాశిస్తూంటాడు.

భక్తి మార్గం ద్వారా కైవల్య పద ప్రాప్తి, సత్యం, భూతదయ కలిగిన మానవత్వం నిర్గుణతత్త్వం, సర్వస్వ శరణాగతి అనే భావాలను వ్యక్తీకరిస్తూ, భగవద్గుణ మాహాత్మ్య సంకీర్తనం ద్వారా భక్తి ప్రాధాన్యాన్ని వివరించి పతితలను మోక్షప్రవణులుగా నొనరించడం భాగవత పరమ ప్రయోజనం.

భాగవతంలోని భక్తులు ముక్తి పొందడానికి భక్తి ఏవిధంగా సహకారి అయిందో ఆయాభక్తుల స్వభావం ఏవిధంగా ఉందో పరిశీలించవలసి ఉంది.

'భగవంతుని మీద మిక్కిలి ప్రేమ కలిగి ఉండడమే భక్తి'[31] అని తెలుపుకున్నప్పటికి ఆర్త, అర్థార్థి, జిజ్ఞాసు, జ్ఞాని అనే నాలుగు రకాల భక్తులున్నట్లు భగవద్గీత తెలియజేస్తోంది.[32] క్లేశ పరిహారార్థం భగవంతుని ఆశ్రయించినవారు (ఉదా. గజేంద్రుడు, ద్రౌపది) ఆర్తులు. పాప పరిహారాన్ని కోరి భగవంతుని ప్రార్థించేవారు అర్థార్థులు. ఏమిటో తెలుసుకుందామన్న కోరిక 'జిజ్ఞాస'. ఈ జిజ్ఞాస కలవాడు జిజ్ఞాసువు. తాత్త్వికుడై సర్వదా భగవత్సమాహిత చిత్తుడై భగవంతుని యందే భక్తి కలిగి ఉన్నవాడు జ్ఞాని.

*"గుణ మహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి స్మరణాసక్తి, దాస్యాసక్తి సఖ్యాసక్తి వాత్సల్యా సక్తి, కాంతాసక్తి ఆత్మనివేదనాసక్తి తన్మయతాసక్తి, పరమ విరహాసక్తి రూపా ఏకధా అపి ఏకాదశధా భవతి"* [33]

అంటూ నారదభక్తి సూత్రాలలో ఆసక్తి పూర్వకమైన భక్తిలోని రకాలు తెలుపబడ్డాయి. సూరసాగరంలోని భక్తి రసామృత ధారలో

***వైరాగ్య పూర్ణభక్తి వైధీభక్తి (నవవిధభక్తి) ప్రేమరూప భక్తి, పుష్టి మార్గభక్తి, అద్వైతపూర్వకభక్తి'*** [34]

అనే విధానాలు వివరించబడ్డాయి.

## నవవిధ భక్తులు

భక్తి త్యాగరూపమైనదేగాని కోరికతో కూడినది కాదు. భక్తులు ధన సంతతి స్వర్గాదులనే కాక మోక్షాన్ని కూడా కోరరు. కోరికలతో కూడినది ఉత్తమ భక్తికాదు. యదార్థ భక్తులు సాలోక్యాన్నీ సార్షినీ సామీప్యాన్నీ సాయుజ్యాన్నీ దేనినిచ్చినా కూడా తృప్తి పొందరని కపిల భగవానుడన్నాడు.[35] భక్తి ప్రభాసంతోనూ సేవా ప్రకాశంతోనూ పోలిస్తే మోక్షమనేది మహా మోహతిమిరమే అని భక్తుడి ఉద్దేశ్యం. అటువంటి నిస్వార్థమైన భక్తి భాగవతంలో నవవిధ లక్షణాలతో కనిపిస్తుంది.

"శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్య సఖ్యమాత్మనివేదనం
*ఇతి పుంసార్పితా విష్ణోభక్తిశ్చేన్నవ లక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మ న్యేధీతముత్తమమ్'* [36]

త్రికరణ శుద్ధిగా సఖ్యం శ్రవణం దాస్యం వందనం అర్చనం సేవనం కీర్తనం చింతనం ఆత్మనివేదనం అనే నవవిధ లక్షణాలను కలిగి హరిని నమ్మినట్లయితే అంతకన్నా భద్రమైనది మరొకటి ఉండబోదని ఉదాహరణ ప్రాయంగా భక్తుల చరిత్రలను వ్యాఖ్యానించి భక్తిని రసస్థితికి చేర్చినది పోతన భాగవతం.

నవవిధ మార్గాలలో పయనించిన భక్తులుగా శ్రవణానికి పరీక్షిత్తు, కీర్తనానికి నారదుడు, స్మరణానికి ప్రహ్లాదుడు, పాదసేవనకు కృష్ణుని భార్యలు, బలిచక్రవర్తి,

అర్చనకు అంబరీషుడు, వందనానికి కుంతీపాండవులు, దాస్యానికి అక్రూరుడు, సఖ్యానికి కుచేలుడు, ఆత్మనివేదనకు గజేంద్రుడు, భీష్ముడు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చును.

ముందుగా ఈ భాగవతోత్తముల మార్గాలను భాగవతంలో తీర్చిదిద్దిన తీరు పరిశీలించడం సమంజసం.

## శ్రవణం - పరీక్షిత్తు

సదా పరమేశ్వరుని గాథలు ఆలించడం వాని గాథలు ప్రేమతో చదవడం వాని లీలలు వినగోరడం, వినడంలో తన్మయులై సర్వం మరచిపోవడం శ్రవణభక్తి[37] .

ఎవరు భాగవత కథామృతాన్ని చెవులతో విని మనసుతో ఆస్వాదిస్తారో వారు విషయ సుఖాలకు లొంగనివారై శ్రీహరి పదకమలాలను ఆరాధించి పవిత్రులై ముక్తిని పొందుతారు.[38] దీనికి ఉత్తమ ఉదాహరణ పరీక్షిత్తు.

ఉత్తరాభిమన్యుల పుత్రుడైన పరీక్షిత్తు ఆగర్భ భక్తి తత్పరుడు. తల్లి గర్భంలో ఉండగానే అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం బారినపడి తల్లడిల్లి 'అంగుష్ఠమాత్రదేహుడిగా ఆవిర్భవించి తనను గర్భంలో బ్రహ్మాస్త్రం బారినుండి కాపాడి అంతర్ధానం పొందిన విష్ణుని' గాంచిన ధన్యాత్ముడు. పరిక్షీణ ప్రాణాలతో జన్మించిన అనంతరం తల్లి గర్భంలో మునుపు తాను జూచిన విభుని అమర్యానిస్తూ ప్రపంచంలోమున్న వరులలో అతను కనిపిస్తాడమోనని పరీక్షిస్తూ ఉండేవాడు కనుకనే అతను పరీక్షిత్తని పిలువబడ్డాడు.

తాను చేసిన పొరపాటుకు శృంగి ఇచ్చిన శాపానుసారం ఏడు రోజులలో తక్షకునిచేత మరణం పొందుతానని తెలిసి పశ్చాత్తాపపడి గంగాతీరంలో నిరశన దీక్షతో ప్రాయోపవిష్టుడై శాపాన్ని అనుభవించడానికి ధైర్యంగా సిద్ధపడ్డాడు. చిత్తం గోవింద పదాయత్తం గావించి -

"చూడుడు నా కల్యాణము
పాడుడు గోవిందుమీది పాటలు దయతో
నాడుడు హరిభక్తుల కథ
లేడహములలోన ముక్తికేగగ నిచటన్" [39]

అంటూ ఏడు రోజులు మునులు హరికీర్తన గావిస్తే తాను విని ముక్తి నొందుతానని అన్నాడు. మరణం దగ్గర పడ్డ పరీక్షిత్తు పూజలు యజ్ఞయాగాలు చేసే మానసిక స్థితిలో లేడు. పరీక్షిత్తు భక్తాగ్రేసరుడు. భక్తిసముద్రం ఉప్పొంగినకొద్దీ కర్మనావలు ఎందుకూ కొరగావు. ఆ భగవంతుని కథలు వినడమూ అతనిని పదే పదే తలచుకోవడమనే దృఢమైన ఓడలే పనికి వస్తాయి. 'నిర్వేదమూలో ద్విజశాప రూపః' (1-19-14) అని శృంగి శాపాన్ని అనుగ్రహంగా తలచాడు. అందుకే శ్రవణ మార్గాన్ని ఎన్నుకున్నాడు పరీక్షిత్తు.

పరీక్షిత్తును అనుగ్రహించ దలచిన శుకమహర్షి తాను తన తండ్రి వ్యాసుని ద్వారా గ్రహించిన భాగవతామృతాన్ని పరీక్షిత్తుకు ప్రసాదిస్తానని దానివల్ల విష్ణు సేవా బుద్ధి విస్తరిల్లుతుందని అన్నాడు. భవభయాన్ని పోగొట్టే మార్గాన్ని తెలియజేశాడు. భయం లేని స్థితి ముక్తి. భవ భయాన్ని పోగొట్టడమంటే ముక్తి నివ్వడమే. ఆ ముక్తిని భాగవత శ్రవణం ద్వారా పొందడానికి సన్నద్ధుడయాడు పరీక్షిత్తు. భాగవత గాథనాకర్ణించడానికి ముఖ్యమైన అర్హత వైరాగ్యం. దానికి సంపూర్ణ అధికారి అయిన పరీక్షిత్తు

"సతుల హితుల విడిచి చుట్టాలవిడిచి యి
ల్లాలి విడిచి బహుబలాళి విడిచి
రాజు హృదయ మిడియె రాజీవ నయనుపై
ధనము విడిచి బిడ్డధనము విడిచి" [40]

మృత్యుభయాన్ని నిరసించి ధర్మార్థ కామాలు సన్యసించి, పురుషోత్తముని మీద చిత్తాన్ని విన్యసించి హరిలీలా లక్షణాల నాకర్ణించడానికి మహోత్సాహంతో శ్రద్ధతో పూనుకొన్నాడు.

శుకుని భాగవతగాథా సుధాసాగరంలో పరీక్షిత్తు ఓలలాడాడు. పరిపూర్ణ భగవత్తత్త్వాన్ని శుకుని ద్వారా గ్రహించాడు. శుకుని మాట ప్రకారం కుశాసనుడై జనార్దనుని చింతించసాగాడు. ముని శాపబద్ధుడై తక్షకుని విషాగ్నిచేత భస్మీభూతుడయ్యాడు. భాగవత శ్రవణం ఫలితంగా ముక్తిని పొందాలన్నది పరీక్షిత్తు ధ్యేయం. ప్రాణభీతి ముందు నుంచీ లేదు. తాను మరణించేలోగా ముక్తిని పొందే ప్రయత్నం చేయాలన్నదే పరీక్షిత్తు కోరిక. అది అనాయాసంగా శుకుని ద్వారా శ్రవణ భక్తి మార్గాన లభించింది. తక్షక విషాగ్ని అన్నది కేవలం కారణం మాత్రమే. శ్రవణ భక్తి మననం ద్వారా జ్ఞానం తత్ఫలితంగా వైరాగ్యం మోక్షానికి సోపానాలయ్యాయి.

## కీర్తనం - నారదుడు

భగవంతుని గుణాలనూ రూపాన్నీ వర్ణిస్తూ కీర్తిస్తూ గానం చేయడమే కీర్తనం. సంకీర్తనం చేస్తూ తరించినవాడు నారదుడు.

'తన చేతి వల్లకీ తంత్రీ చయంబున సతత నారాయణ శబ్ద మొప్పనానన సంభూత హరిగీత రవ సుధాధారల'తో సర్వకాలాల్లోనూ హరిగీతాలనే పాడుకుంటున్నట్లుగా చిత్రించబడ్డాడు.

అనుభవ పూర్వకంగా వ్యాసునికి ఇచ్చిన సందేశంలో -

**హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ**
**సురుచి భ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ**

*హరినామస్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ*
*కరమై యుండదయోగ్య దుర్మలి నవత్కాకోలగర్తాకృతిన్'* [41]

అంటూ హరికీర్తనకున్న ప్రాముఖ్యాన్ని తెలియజేశాడు. హరిలీలావర్ణన మనేది సంగీతపరమైతే అది సంకీర్తన మవుతుంది. 'కీర్తించడమంటే నిరంతరం ప్రభునిపై పాటలు పాడి, పాడే సమయాన పరవశులై శరీరము మరచి నృత్యం సలపడం.[42]

'నారదుడు ఎల్లవేళలా ఈశ్వరదత్తమై తనంత తానే మోగు వీణాలాపాలతో బాటు నారాయణ కథాగానం చేస్తూ చరించినట్లు[43] భాగవతం చెబుతుంది.

*'తీర్థపాదుడైన దేవుండు విష్ణుండు*
*తన చరిత్ర మేము దవిలి పాడ*
*జీరబడ్డవాని చెలువన నేతెంచి*
*ఘనుడు వా మనమున గానవచ్చు'*[44] నని

*'ఈ సంసారంబను వననిధిలో మునిగి*
*కర్మవాంఛలచే వేదన పొందెడు వానికి*
*విష్ణుని గుణవర్ణనము తెప్ప'*[45]

వంటిదన్నాడు నారదుడు. హరిగుణ కీర్తి వర్ణనా మాహాత్మ్యాన్ని గురించి చెప్పిన తీరు నారదుని భక్తి మార్గ విధానాన్ని తెలుపుతుంది. నారదుడు చరించే తీరులో నారదుని భక్తి మార్గవిధానం గోచరిస్తుంది. అన్ని ఘట్టాలలోనూ నారదుడు వీణ వాయిస్తూ హరికీర్తనం, గుణగానం గావిస్తూ ఉన్నట్లే తెలుస్తోంది.

*'వాయించు వీణ నెప్పుడు*
*మ్రోయించు ముకుంద గీతములు జగములకున్*
*జేయించు చెవుల పండువు*
*మాయించు నఘాళి నిట్టి మతి మఱిగలడే'* [46]

అని నారదుడు గురించి సూతుడు గొనియాడిన విధము వల్ల సంకీర్తనా భక్తి మార్గంలోనే నారదుడు చరించి, అకుంఠిత బ్రహ్మచర్య దీక్షను సాగించిన పరమ భాగవతోత్తముడని (భవబంధాలకు దూరంగా ఉండగలిగాడని) స్పష్టం అవుతోంది.

## స్మరణం - ప్రహ్లాదుడు

స్మరణం లేదా చింతనం అనే పదానికి తలపు, జ్ఞప్తి, నిరంతర మననం అనే అర్థాలున్నాయి. పరమాత్మ రూపాన్ని భావించి ఒకే నామాన్ని తైలధారలా స్మరిస్తూ ఏకాంతవాసం కోరుతూ ప్రతిశ్వాసలోనూ ఆనామాన్నే ఉచ్చరిస్తూ ఉండే రీతిని స్మరణ భక్తి'[47] అంటున్నాం.

ఈ విధమైన స్మరణం ద్వారా పరమాత్మను తన ఆత్మలో నిలుపుకున్న భాగవతోత్తముడు ప్రహ్లాదుడు. ప్రహ్లాదుడు సద్గుణవంతుడు. భక్తకోటికి ఆదర్శప్రాయుడు. ఉత్తమోత్తమ లక్షణాలన్నీ ప్రహ్లాదునిలో చోటుచేసుకున్నాయి[48] సాత్త్విక భావాలు కుదురుకున్న చోట అరిషడ్వర్గాలకు తావుండదు. లౌకిక దృష్టి పన్నగిల్లుతుంది. వైరాగ్యం ఉద్భవిస్తుంది. ప్రహ్లాదుని దగ్గర వైరాగ్యం బాల్యం నుంచి దాస్యం చేసింది.

వైరాగ్యం నిండియున్న ప్రహ్లాదుని మనసు భగవచ్చింతనామృతంతో ఆర్ద్రమయింది.

*'హరి పదాంభోజయుగ చింతనామృతమున*
*నంతరంగంబు నిండి నట్టైన నతడు*
*నిత్య పరిపూర్ణుడగుచు నన్నియును మఱచి*
*జడత లేకయు మందున జడుని భంగి'* [49]

ఈ జడత్వం దైహికం కాదు మానసికం. మానసిక జడత్వం వల్ల జీవితం యాంత్రికం అవుతుంది. మనిషి ఈ లోకంలో ఉన్నా లేనట్లే. ప్రహ్లాదునిది అదే స్థితి.

దైహికంగా చేసే కార్యాలలో మనస్సు లగ్నం కాలేదు. ఆయాకార్యాల పట్ల జడత్వం పొందిన మనసు హరిపాదాంబుజ ధ్యానంలో లగ్నమయింది.

*"పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్*
*హాసలీ*
*లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత*
*శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాద సం*
*ధాముండై మఱచెన్ సురారి సుతు డే తద్విశ్వమున్...*[50]

సర్వకాల సర్వావస్థలలోనూ తైలధారలా నిరంతర ధ్యాన భజనలు సాగించాడు. వైరాగ్యం భక్తిని పెంచితే; భక్తి గుండె ధైర్యాన్ని, విశ్వాసాన్ని కలిగిస్తుంది. వ్యతిరేక శక్తులెన్ని పనిచేసినా ఎదుర్కొనే బలాన్నిస్తుంది. ఆ బలం బాల్యంలోనే ప్రహ్లాదునికి అబ్బి, తన మనసును హరిభక్తి నుంచి మరల్చ జూసిన హరిద్వేషి అయిన తండ్రికి ఎదురు తిరిగేట్లు చేసింది. హరిభక్తి మానమన్న తండ్రికి సూటిగా సమాధానం ఇవ్వడం సైతం వృథాగా భావించిన ప్రహ్లాదుడు గురువుల వైపు తిరిగి

*"ఇనుమయస్కాంత సన్నిధినెట్లు భ్రాంత*
*మగు హృషీకేశు సన్నిధి నా విధమున*
*గరగుచున్నది దైవ యోగమునజేసి*
*బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంతమగుచు"*[51] అని

"అంబుజోదర దివ్యపాదార వింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు చేరనేర్చు?" [52]

అని అంటూ పరోక్షంగా తండ్రికే సమాధానమిచ్చాడు.

"చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబుగాక
విష్ణు భక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగము తోడి పశువుగాక" [53]

అని అంటూ చక్రిని తలవని తన తండ్రి హిరణ్యకశిపుని జన్మ జన్మేకాదని ధైర్యంగా తామస ప్రవృత్తిగల తండ్రిని ఎదిరించి పలికాడు. దానికి కోపించిన తండ్రి బాధించి చంపించ జూసినా 'హరినామ స్మరణామృత పానం' గావించి 'అమృతు'డయ్యాడు.

'సదా శ్రీమన్నారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాదనా ధీమద్రైన' [54] ప్రహ్లాదుడు తన తోటి బాలురకు సైతం తాను తల్లి గర్భంలో ఉండి నారదుని ద్వారా విన్న విష్ణుతత్త్వాన్ని బోధించి వారిని హరిభక్తులుగా మోక్షాసక్తులుగా మార్చాడు.

చక్రి ఇందు గలడందులేడనే సందేహమే లేని ప్రహ్లాదుడు సర్వవ్యాపియైన పరమాత్మను తండ్రికి స్తంభంలో చూపి నరసింహాకృతిలోనున్న శ్రీహరి చేతిలో తండ్రికి ముక్తి ప్రసాదించి తండ్రి ఋణం తీర్చుకున్నాడు.

దుష్ట సంహారం గావించిన నరసింహుడు వరం కోరుకొమ్మనినప్పుడు ప్రహ్లాదుడు వరదుడవైతే కోరికలు వృద్ధి పొందకుండా వరమిమ్మన్నాడు. అయినా శ్రీహరి రాక్షస రాజుగా మన్వంతరమంతా నిఖిల భోగాలను అనుభవించి తర్వాత

కర్మబంధాలను ఖండించుకుని కాలక్రమాన శరీరాన్ని వదలి ముక్త బంధుడై తనను (శ్రీహరిని) చేరుకునేట్లుగా వరం ఇచ్చాడు.

## సేవనం (పాదసేవనం): బలి, రుక్మిణి

సేవ అనే పదానికి 'శుశ్రూష, కొలువు'[55] అనే అర్థాలున్నాయి. సేవ అష్టవిధాలు 1. భాగవత వాత్సల్యము, 2. భగవత్పూజ పట్ల అనుమోదం, 3. భగవదర్చన, 4. భగవద్విషయము నందదంభం, 5. భగవత్కథాశ్రవణేచ్ఛ, 6. స్వరనేత్రాంగ వికారం, 7. సదాభగవదనుస్మరణం, 8. అమాంసభక్షణం[56].

వాస్తవానికి వ్యవహారంలో రెండు రకాలుగా సేవకు అర్థం చెప్పుకోవడం జరుగుతుంది. తమ అవసరాలను సైతం తీర్చుకోలేని స్థితిలో ఉన్న రోగులకు, వృద్ధులకు, వికలాంగులకు సానుభూతితో, జాలితో నిస్వార్థంగా చేసే సాయం, ఇచ్చే చేయూత సేవగా పరిగణింపబడుతుంది. ఇదే 'మానవసేవే మాధవసేవ' అనే నానుడికి దారి తీసింది. అదే విధంగా తమకన్నా అన్ని విధాలా ఉన్నత స్థితిలోనున్న జ్ఞానులు, గురువులు, మహాత్ములు అయిన వారిపట్ల గౌరవాభిమానాలతో, భక్తి ప్రపత్తులతో (వారు వారిపని చేసికొనగలిగిన స్థితిలో ఉన్నప్పటికీ) మనస్ఫూర్తిగా ఆనందంగా చేసే ప్రతిపనీ (పాద ప్రక్షాళనం, పాదపూజ, వీవనతో విసరడం, పాదాలు ఒత్తడం, అన్నపానాదులు అందించడం వంటి సమస్త కార్యాలు) సేవే. ఇక్కడ జ్ఞానులను, మహాత్ములను, గురువులను భగవత్స్వరూపులుగా భావించి వారిని సేవించడం ద్వారా దైవాన్నే సేవిస్తున్న అనుభూతిని పొంది, భగవత్సాన్నిధ్యాన్ని పొందగోరే మానసిక స్థితికి చేరుకుంటారు.

భగవంతుని పరంగా భగవదర్పితంగా చేసిన పని ఏదయినా సేవ అనిపించుకుంటుంది.

సేవ అనేది భయంతోగానీ బలవంతంగా గానీ అనిష్టంగా గానీ చేసేది ఎంత మాత్రమూ కాదు. హృదయంలో అపరిమితమైన ప్రేమాభిమానాలు భక్తి ప్రపత్తులు కలిగి మనఃపూర్వకంగా ప్రభువు మనసెరిగి తన తృప్తికోసం చేసేది అది. ఇటువంటి సేవలో పాద ప్రక్షాళనానికి పాదపూజకు పాదాభివందనానికి పాదాలు పట్టడానికి ప్రాధాన్యం ఎక్కువ. అయాచర్యల ద్వారా తాము ఆ వ్యక్తికి లేదా ప్రభువుకు లేదా గురువుకు ఎంతగా అధీనులయినదీ స్పష్టం అవుతుంది. ఇదే సేవ. ఇటువంటి సేవ ద్వారా ధన్యులయిన భాగవతులు భాగవతంలో కొందరు కనిపిస్తారు.

చక్రవర్తి అయిన బలి యజ్ఞం చేస్తున్న సమయాన వచ్చిన వామనునికి 'నమస్కరించి తన గద్దియ నునిచి పాదంబులు దుడిచి, తన ప్రాణవల్లభ పసిండిగిండి నుదకంబులు వోయ, నడుగుంగొమరుని చరణంబులు గడిగి తడియొత్తి తత్సమయంబున'[57]

*"వటుని పాద శౌచవారి శిరంబున*
*బరమ భద్రమనుచు బలినహించె"*[58]

చక్రవర్తి అయినప్పటికీ బాలుడైన బ్రాహ్మణవటువు పట్ల ఉన్న గౌరవాభిమానాలు ఆ బాలుని భగవత్స్వరూపునిగా తలచిన ఉద్దేశం ఈ పాదసేవ చేసిన విధానంలో వ్యక్తమవుతుంది. ఈ సేవ చేసిన బలి తన సర్వస్వం భగవదర్పితం గావించి, భగవచ్చరణారవిందాన్ని శిరస్సున దాల్చి ధన్యుడయ్యాడు.

భగవంతుని సర్వవిధాలా సేవించే భాగ్యం కృష్ణుని సతులకే దక్కింది.

*"ఇంటికి వచ్చిన నెదురేగు దెంచుచు*
*నాసీత వస్తువులందు కొనుచు*
*సౌవర్ణ మణిమ యాసనములు వెట్టుచు*
*బదములు గడుగుచు భక్తితోన*

సంవాపిత స్నాన జలములందిచ్చుచు
సద్గంధ వస్త్రభూషణములొసగి
యిష్ట పదార్థంబు లిడుచుదాంబూలాదు
లొసగుచు విసరుచునోజమెఱసి

శిరముదువ్వుచు శయ్యపై జెలువు మిగుల
నడుగు లొత్తుచు దాసీ సహస్రయుక్త
లయ్యు గొలిచిరి దాసులై హరినుదారు
ద్వారాధిప సదనలు దారు దగిలి"[59]

అనే పద్యం సేవ అనే పదానికి అద్దం పట్టినట్లుగా ఉంది. వేలకొలది దాసీలున్నా తామే కృష్ణునికి దాసులై సేవచేశారు. సర్వస్వం అర్పించగలిగినప్పుడే ఎదుటి వ్యక్తి కోసం ఎటువంటి పని అయినా ప్రీతితో చేయడం సాధ్యమవుతుంది.

పదారు వేల మందీ కృష్ణుని పతిగా భావించి పతిసేవ జేసి పతివ్రతలుగా తెలియబడుతున్నా రుక్మిణి కృష్ణుని కేవలం పతిగానే కాక పరమాత్మగా కూడా విశ్వసించి సేవించిన భక్తురాలు.

"జలజనాభ! సకల జగదంతరాత్మవై
నట్టిదేవ నీ పదారవింద
యుగళి సామరాగ యుక్తమైనామది
గలుగువట్లు గాక దలపు మనఘ" [60]

అంటూ జలజనాభుని పాదసేవ కోరుకుంది. ఆకారణంగా "అస్మదీయ సంసేవయకాని యన్యము భజింపవు పుట్టిన నాట నుండి"[61] అని కృష్ణుడు సంతసించి రుక్మిణి పట్ల బద్ధానురాగుడయ్యాడు.

మిథిలానగరవాసి శ్రుతదేవుడనే బ్రాహ్మణోత్తముడు, బహుళాశ్వుడుగా ప్రసిద్ధి కెక్కిన మిథిలా నగరరాజు కృష్ణుని పద సేవకు నోచుకున్న భాగవతులు.

## అర్చనం - అంబరీషుడు

'స్తోత్ర పాఠాలతో శాస్త్రయుక్తంగా ప్రభుని సర్వాంగాలను పూజించడం, ధూపదీప నైవేద్యాలు నీరాజనాలు అర్పించి బహువిధ పుష్పాలతో శృంగారించడం'[62] అర్చనాభక్తి. అర్చన మంటే పూజ. ఈ అర్చన విధానానికి అంబరీషుని ఆదర్శంగా చెప్పుకోవచ్చు. అంబరీషుడు భగవంతుని అర్పించి తరించిన భాగవతుడు.

"చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద
 వలుకులు హరి గుణ పఠనమంద
కరములు విష్ణు మందిర మార్జనములంద
 శ్రవములు హరికథాశ్రవణ మంద
చూపుల గోవింద రూప వీక్షణమంద
 శిరముగేశవ నమస్కృతులయంద
పదములీశ్వర గేహపరిసర్పణములంద
 కామంబు చక్రికైంకర్యమంద

సంగమచ్యుత జన తను సంగమంద
ఘ్రాణమసురారి భక్తాంఘ్రికమలమంద
రసన తులసీ దళములంద రతులు పుణ్య
సంగతుల యందు యారాజచంద్రమునకు"[63]

సర్వకర్మలు భగవదర్పణం జేసి శ్రీహరిని అర్చించాడు అంబరీషుడు. సర్వం విష్ణుమయంగా తలచి 'రాజర్షి' అయి రాజ్యపాలన గావించాడు. హరిధ్యానం వలన పెంపొందిన భక్తి ఐహిక సుఖాలపైన వైరాగ్యాన్ని కలిగించింది.

అతనికీహమానె హరులందు గరులందు
ధనములందు గేళివనములందు
బుత్రు లందు బంధు మిత్రులయందును
బురమునందు నంతిపురమునందు'[64]

సంసార వ్యామోహం లేక భక్తి వైరాగ్య పరవశుడైన అంబరీషునికి శ్రీహరి తన చక్రాన్ని రక్షణగా ఉంచాడు.

అర్చన విధానంలో భాగాలు - వ్రతాలు, ఉపవాసాలు, పూజలు. అంబరీషుడు ద్వాదశీవ్రతం చేసి కార్తీక మాసాన మూడు రాత్రులుపవసించాడు. హరిని అభిషేకించి పూజించాడు.

అనంతరం అంబరీషుడు సంపూర్ణ విరక్తుడై రాజ్యాన్ని కొడుకులకిచ్చి అరణ్యాలకు పోయి తపస్సుచే చివరకు హరిని చేరాడు.

## వందనం - కుంతి, పాండవులు

'అన్నిటా భగవంతుడు కలడని భావించి జీవకోటి అంతటికి నమస్కరించడం వందన భక్తి. కనిపించే జగమంతా ఆ పరమాత్మ స్వరూపం అని అన్నిటికి ఉత్కృష్ట స్థానాన్నిచ్చిన విధానం ఇందులో కనిపిస్తుంది'.[65] భక్తిమార్గంలో వందనానికి ప్రముఖ స్థానం ఉంది. ఎదుటి వ్యక్తి మీద ఉండే గౌరవాన్ని భక్తిని సూచించే సులభమైన చర్య వందనం ఒక్కటే. నమస్కారం స్తుతి స్తోత్రం అనే అర్థాలు వందనానికి ఉన్నాయి.[66]

కుంతి, పాండవులు, ద్రౌపది తమ దుఃఖవేళల్లో నిస్సహాయ స్థితిలో హరికి కేవలం వందనమాచరించి, స్తుతించి తమకు కలిగిన కష్టాలనుంచి విముక్తిని పొందారు. వందనాచరణం ద్వారా వారు సర్వకాల సర్వావస్థలలోనూ కృష్ణుని కృపకు పాత్రులయ్యారు. ఆ మార్గంలోనే కృష్ణుని మనసు చూరగొని కృష్ణుని

తమకు సారథిగా, సచివునిగా, వియ్యముగా, సఖునిగా, బంధువుగా, విభునిగా, గురువుగా, దేవరగా చేసుకోగలిగారు.

ఉత్తర గర్భస్థ శిశువును అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం నుంచి రక్షించిన సందర్భంలో కుంతి ఎన్నో విధాల స్తుతించి వందన మాచరించింది.

*'పురుషుండాద్యుడు ప్రకృతికి*
*బరుడవ్యయుడఖిల భూతబహిరంతర్భా*
*మరుడును లోకనియంతయు*
*బరమేశ్వరుడైన నీకు బ్రణతులగుహరీ!'* [67]

అని తమకు సర్వకాల సర్వావస్థలలోనూ అనేక విధాల రక్షించిన కృష్ణునికి ప్రణతులర్పించింది.

చిత్తం భగవదాయత్తమయితే భక్తి వెల్లువయితే కలిగేది పరమాత్మ జ్ఞానం. తత్ఫలితంగా మోహవిచ్ఛేదనమయి వైరాగ్యం కలుగుతుంది. ఆ స్థితిని పొందిన కుంతి 'నాకు మోహ విచ్ఛేదనము సేయుమయ్యా' అంటూ కోరుకుంది.

*శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా*
*లోకద్రోహి నరేంద్ర వంశ దహనా! లోకేశ్వరా! దేవతా*
*నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణ సంధాయకా!*
*నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!"* [68]

అని ప్రార్థిస్తూ సంసార బంధనాలు తెంపమని కోరుతూ వందన మాచరించింది.

దాస్యం : అక్రూరుడు

సేవ, పని అనే అర్థాలను దాస్యం అనే పదం సూచిస్తుంది. శ్రీధరీయ వ్యాఖ్యానం దాస్యం అనే పదానికి కర్మార్పణమని నిర్వచించింది.[69] తాము చేసే పని భగవదర్పణంగా భగవంతుని కోసంగా చెయ్యడం దాస్యభక్తి. కింకర శబ్దంతో

కైంకర్యం అనే మాట వచ్చింది. దాసత్వానికీ సేవకూ భేదం ఉంది. సేవ తమకు నచ్చిన తీరులో తమ తృప్తి దీర ప్రభువు ఇష్టాన్ని గ్రహిస్తూ సమయానుకూలంగా చేసేది. దాసత్వమనేది ప్రభుని ఆజ్ఞ మేరకు ప్రభువు చెప్పినట్లుగా చేసేది. ఇందులో దాసుడి సొంత ఆలోచనకు తావులేదు. నవవిధ భక్తిమార్గాలలో దాస్యభక్తితో భగవంతుని సేవించి తరించిన భక్తులు అక్రూరుడు, ఉద్ధవుడు, ఆంజనేయుడు.

అక్రూరుడు కృష్ణభక్తుడు. ధనుర్యాగ మనే మిషతో ఆ కృష్ణుని రప్పించి. వధించాలనే తలంపుతో నున్న కంసుడు కృష్ణుని మధురకు తీసుకువచ్చే కార్యం అక్రూరునికి అప్పజెప్పాడు. ప్రభువు చెప్పిన పనిని ఎటువంటి వ్యతిరేకతా లేకుండా అమలు పరిచి కృష్ణుని, బలరాముని బృందావనం నుండి మధురకు తీసుకు వచ్చాడు. కంసునికి దాస్యం చేస్తున్న అక్రూరుడు కంస ప్రభువు తనకు అప్పజెప్పిన కార్యానికి ఏ మాత్రం చలించక

> వైరముతోడనైన గెలువన్ ననుబంచి శుభంబు సేసెని
> ష్కారణమైన ప్రేమనిదె, కంసుని బోలు సఖుండుగల్గునే '[70]

అంటూ తననాకార్యానికి నియోగించి అయినా తనకు గోవిందుని దర్శించే భాగ్యం కలిగించినందుకు కంసుని పొగిడాడు. అప్పటిదాకా కంసుని మాటను పాటించిన అక్రూరుడు కృష్ణుని దరికి వచ్చిన వెంటనే కృష్ణునికి దాసుడయిపోయాడు. యమునా జలంలో కృష్ణుని రూపాన్ని చూసి తరించిన అక్రూరుడు మధురకు వచ్చిన వెంటనే బలరామకృష్ణులను -

> "నా యింటికి విచ్చేయుము
> మీ యంఘ్రి సరోజరేణు నికరము సోకన్
> నా యిల్లు పవిత్రం బగు
> శ్రీయుత నీ భటుని బెద్ద సేయందగదే"[71]

అని ప్రార్థించి తాను కృష్ణుని భటుడినని అంటే దాసుడునని కృష్ణుని మాట తాను ఆచరిస్తానని తెలియజేశాడు. కంసుని వధానంతరం వస్తానన్న కృష్ణుని పలుకులు తలదాల్చి కంసుని వద్దకు వెళ్ళి రామకృష్ణుల ఆగమన వార్త చెప్పి తన కార్యాన్ని నిర్వహించాడు.

కంస వధానంతరం తన యింటికి ఉద్ధవ బలరామ సహితుడై వచ్చిన కృష్ణుని పూజించి, కృష్ణుని పాదాలు తన తొడల మీదవుంచుకున్నాడు. కృష్ణుని పరాత్పరునిగా ఎరిగిన అక్రూరుడు తనివితీరా కీర్తించి చివరకు నానాధనాగార కాంతా పుత్రాదుల తోడి బంధాన్ని తెంపమని కోరాడు. తద్వారా వైరాగ్యాన్ని ప్రసాదించమని కోరాడు. దానికి కృష్ణుడు అక్రూరుడన్నిటికీ అర్హుడేనని తెలిపి "పరమ భాగవతుండవైన నీవు మాక భీష్టంబు లొనరింప నర్హుడవు" అని ఆదరించి హస్తినలో పాండవులు పుత్రమోహితుడైన ధృతరాష్ట్రుని వద్ద ఉన్నారని వారి వద్దకు పొమ్మని చెప్పాడు. కృష్ణుని ఆనతిమేరకు అక్రూరుడు హస్తినకు పాండవుల క్షేమం తెలుసుకుని కుంతి ద్వారా కౌరవుల దురాగతాలువిని ధృతరాష్ట్రునికి హితబోధ గావించి వచ్చి రామకృష్ణులకు అన్నీ వివరించి చెప్పాడు. ఈవిధంగా దాసత్వం వహించి, కార్యనిర్వహణ గావించి కృష్ణుని ప్రీతి కలిగించి తరించాడు.

## సఖ్యం - కుచేలుడు, అర్జునుడు

'ఉపాస్యుని భక్తుడు సఖునిగా భావించి అహేతుకమైన ప్రేమపూర్వం వ్యవహారం చెయ్యడం సఖ్యభక్తి.[72] ఇష్టదేవునికి అంతరంగ సఖునిగా ప్రేమమయమైన విస్వార్థమైన భావం కలిగి ఉండడం దీని ప్రధాన లక్షణం. అంతేకాదు భగవంతుని స్నేహితునిగా భావించి భగవద్గుణాలను అలవరుచు కోవడం సఖ్యభక్తి. కుచేలుడు, అర్జునుడు శ్రీకృష్ణుని స్నేహితునిగా పొంది తరించినవారు.

## కుచేలుడు

కుచేలుడుగా పేరు తెచ్చుకున్న సుదాముడు గోవిందసఖుడు. సాందీపని వద్ద గురుకుల వాసంలో సుదాముడు కృష్ణునితో కలిసి విద్యాభ్యాసం చేసినవాడు. 'మానధనుడు, విజ్ఞాన రాగాది విరహిత స్వాంతుడు, శాంతుడు, ధర్మవత్సలుడు, ఘనుడు విజితేంద్రియుడు బ్రహ్మవేత్త అయి భరింపరాని దారిద్ర్యంలో ఉన్నా ఇతరుల నడుగబోక 'తనకు తానబ్బినట్టి కాసు పదివేల నిష్కములో'గా భావించి జీవిస్తూ పుత్రదారాభిరక్ష 'ఒకవిధం'గా [73] నడుపుతున్నాడు. ఇటువంటి పరిస్థితిలో భార్య ప్రోద్బలంతో కృష్ణుని దగ్గరకు పోవసిద్ధమయ్యాడు. 'కృష్ణుని దగ్గరకు వెళ్ళడం 'ఇహపర సాధనమగునని' మదిలో తలచాడు. భార్య ఇచ్చిన అటుకులను తీసుకుని 'గోవింద సందర్శనోత్సాహి' అయి బయలుదేరాడు కుచేలుడు.

తనను పేక్షించదని ఎంతో నమ్మకంతో ద్వారకకు వచ్చిన మిత్రుని కృష్ణుడు ఎందుకుపేక్షిస్తాడు? అల్లంత దూరం నుంచి కుచేలుని చూసి వచ్చి కౌగిలించుకుని 'బంధు స్నేహ స్ఫురణ'తో తీసుకువచ్చి తన తల్పం మీద కూర్చోబెట్టాడు. అంతేకాక ఆ పేద విప్రుని పాదాలు కడిగి, ఆ జలాన్ని తలమీద జల్లుకున్నాడు కృష్ణుడు. ముందుగా విప్రోత్తముని పూజించే విధానాన్ని కృష్ణుడు ఆచరించాడు. ఆ అపూర్వ స్వాగతానికి, సాదరాభిమానాలకు కుచేలుడు "మేనం బులకాంకురం బులంకురింప. నానంద బాష్పజలబిందు సందోహు" డయ్యాడు. ఆ తరువాత బాల్యమిత్రునిగా చేరదీసి బాల్యం నాటి ముచ్చట్లు గుర్తు చేసుకుని ఎంతో ఆనందించాడు.

*'.....తలప గృహక్షేత్ర ధనదార పుత్రాదులందు*
*నీ చిత్తంబు చెందకుంట తోచుచున్నది...'* [74] అనీ

'మనంబున గాము మోహితులుగాక
యర్థిమై యుక్త కర్మంబులాచరించి
ప్రకృతి సంబంధములు వాసి భవ్యనిష్ఠ
దవిలి యుందురు కొందరుత్తములు భువిన్' [75]

అని తన కరుణా కటాక్షాలను పొందడానికి కుచేలుని కున్న అర్హతను పరోక్షంగా స్పష్టం చేశాడు శ్రీకృష్ణ పరమాత్మ. అంతేగాక తన భక్తులు భవార్ణవాన్ని దాటడంలో సందేహం లేదనీ తెలిపాడు.

"సకల భూతాత్మకుండునైన యేను తపోయజ్ఞ దానశమదమాదుల చేత సంతసింప"[76] నని "నాయందు భక్తిచేసి నాకునుపాయనంబుగనేమి పదార్థంబు దెచ్చితి? వప్పదార్థంబు లేశమాత్రంబైన బదివేలుగా నంగీకరింతు నట్లుగాక నీచవర్తనుడై మద్భక్తి దగులని దుష్టాత్మ్ముండు హేమాచలతుల్యంబైన పదార్థంబు నొసంగిన నది నామనంబునకు సమ్మతంబు కాదు".[77] అని తనకోసం భక్తితో ఏమి తెచ్చావని అడగడంలో తనభక్తులు ఏవిధంగా ఉండాలని భగవంతుడు కోరుకుంటున్నాడో వ్యక్తమవుతుంది. అంతేకాక కుచేలుడు తన సఖుడే అయినా (సఖ్యం భక్తిలో భాగం కాబట్టి) ఆ సఖుడు తనకోసం తెచ్చినది భక్తితో తెస్తేనే స్వీకరిస్తానని సూచించాడు. ఆ భక్తియేలేనినాడు ఏం తెచ్చినా వద్దన్నాడు.

"దళమైన బుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయని భక్తిన్
గొలిచిన జనులర్పించిన
వెలమివి రుచిరాన్నముగనె యేను భుజింతున్"[78]

అని అన్నాడు అయితే ఇవన్నీ సఖునికి చెప్పవలసిన పనేమిటి? తనను ఏ దృష్టితో చూసినా భక్తి అనేది మనసులో ప్రధానంగా కలిగి ఉంటేనే దానికి సార్థకత అని

తెలియజేయ డానికేననిపిస్తుంది. ఇంత చెప్పినా తాను తెచ్చిన అటుకులు 'దగనర్పింపను నేరక మోము వాంచి వలుకక యున్నాడు' కుచేలుడు. అయితే అది శ్రీకృష్ణుని మాటలు అర్థం చేసుకోలేదని కాదు. ఆ పరమాత్మ కోరే భక్తి తనలో ఉందా అని సందేహించసాగాడు కుచేలుడు. నిజమైన భక్తుడు తనను భక్తుడినని చాటుకోడు. ఎంతభక్తి కలిగి వున్నా ఆ పరమాత్మను తృప్తి పరిచేభక్తి తన వద్ద లేదనే భావిస్తాడు. తన భక్తిలో ఏం లోపముందోననే తలుస్తూ ఉంటాడు. నిజానికి అటువంటివాడే నిజమైన భక్తుడు. భక్తుడు తనను తాను గుర్తించకున్నా ఆ పరమాత్మ భక్తుని మనస్థితిని తప్పక గ్రహిస్తాడు. ఇదే జరిగింది కుచేలుని విషయంలో.

'ఇతండు పూర్వభవంబున నైశ్వర్య కాముండై నన్ను సేవింపడు ఐనను నిక్కుచేలుండు నిజకాంతా ముఖోల్లాసంబు కొఱకు నాయొద్దకుంజను దెంచినవాడు. ఇతనికి నింద్రాదులు బడయరాని బహువిధంబులైన సంపద్విశేషంబు లీక్షణంబయొడ గూర్పవలయు' [79] నని తలచి కుచేలుని కొంగున నున్న అటుకులు తానే తీసి పిడికెడు ఆరగించాడు. ఇక్కడ కుచేలుడు సేవించినది ఐశ్వర్యం కోసం కాదు. నిజానికి కృష్ణుని చేత సేవలందుకున్నాడు. భగవంతుడే మెచ్చి సేవ చేసేటటువంటి ఉన్నత వైఖరి కుచేలునిది. కేవలం భార్యను సంతోషపరచాలని ఆ కారణంగా కృష్ణుని దర్శనం చేసుకోవచ్చునని కృష్ణుని దగ్గరకు వచ్చాడు. అటువంటి నిష్కాముడైన భక్తుని కటాక్షించడానికి పరమాత్మ ఎంతమాత్రం జాగుచేయడు. అందుకే ఇంద్రాదులు కూడా పొందలేని బహువిధాలైన సంపద్విశేషాలు క్షణంలో సమకూర్చాడు. అయితే ఈ విషయం కుచేలునికి తెలియలేదు.

బాల్య సఖుడయిన పరమాత్మ ఇచ్చిన ఆదరానికి ఎంతో సంతోషించి 'సమధిక స్వర్గ భోగాను భవుండుగా' తలుస్తూ ఆ మర్నాడు 'నందనందన సందర్శనానంద లోలాత్ముడై' తన మనసులో

> నాపుణ్య మరయనెట్టిదొ
> యాపుణ్యనిధిం బ్రశాంతునచ్యుతునఖిల
> వ్యాపకు బ్రహ్మణ్యుని జి
> ద్రూపకు పురుషోత్తముని బరుంగనుగొంటిన్' [80]

అని పొంగిపోయాడు. నిజానికి కృష్ణుడు కుచేలుని చేతిలో ఏ ధనాన్నీ ఉంచలేదు. అయినా కుచేలునికి ఆ దృష్టేలేదు. కృష్ణుడు తన చిన్ననాటి సఖుడే అయినా అతనిని అచ్యుతునిగా అఖిల వ్యాపకునిగా కనుగొన్నానని పరవశించాడు. ఈ 'కనుగొనుట' సఖుని పరమాత్మగా గుర్తించడమే. అటువంటి బ్రహ్మానందాను భూతి నోలలాడిన వానికి లౌకిక సంపదలేపాటి ఆనందాన్ని ఇస్తాయి? తనకు అటువంటి సంపదలివ్వక పోవడానికి గల కారణాన్ని కూడా కుచేలుడు ఊహించాడు.

> 'శ్రీవిధి యిట్లు నన్ను బచరించి ఘనంబున విత్తమేమియు
> న్నీని తెఱంగుగానబడెనెన్న దరిద్రుడు సంపదంధుడై
> కానక తన్నుజేరొ డని కాక శ్రితార్తిహరుండు సత్కృపాం
> బోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నను జేయుకుండునే' [81]

అని తృప్తి పడ్డాడు. నిధికన్నా పరమాత్మ సన్నిధే సుఖం అని సంతోషించాడు. అయినా గృహానికి చేరిన కుచేలునికి సకలైశ్వరాలు కంటబడ్డాయి. ఆ ఐశ్వర్యాన్ని స్వీకరించి 'సుఖంబున నుండ నట్టి యెడం దనకు మనోవికారంబులు వొడమకుండ వర్తించుచు'[82] హరిదయావలోకనం వల్లనే తనకివన్నీ కలిగాయని తలచాడు.

కుచేలుడానందించినది హరి ఇచ్చిన లౌకిక సుఖాలకు మాత్రమే కాదు. కృష్ణుడు అటుకులు తినబోతూ 'ఇంద్రాదులు బడయరాని బహువిధంబుల సంపద్విశేషంబు' లిస్తావని భావించడంలో కేవలం లౌకిక సంపదలే ఇమిడిలేవు.

కేవలం లౌకిక సంపదలిచ్చి భగవంతుడు తన భక్తుని దూరం చేసుకోడు. బహువిధాలైన సంపద్విశేషాలలో ఇంద్రాదులకు కూడా లభ్యం కాని జ్ఞాన వైరాగ్య భక్తి సంపదలు కూడా ఉన్నాయి. అందుకే అన్ని సుఖాలు అనుభవిస్తూ కూడా 'మనో వికారంబులు వొడయకుండా' ఉన్నాడు. 'గోవిందుని చరణారవిందంబుల యందు భక్తి ప్రతిభవంబున గలుగుగాక' అని కోరుకోగలిగాడు. నిఖిల భోగంబులయందు నానక్తిం బొరయక 'రాగాది విరహితుండును నిర్వికారుండును' అయి అఖిలక్రియయందు ననంతుని యనంత ధ్యానసుధారసంబునం జొక్కుచు విగత బంధనుడై యపవర్గప్రాప్తి [83] నొందాడు. సఖ్య భక్తి ద్వారా భక్తి జ్ఞాన వైరాగ్యాలను తద్వారా మోక్షాన్ని పొందిన భాగవతుడుగా కుచేలుని వృత్తాంతం వ్యక్తం చేస్తుంది.

## అర్జునుడు

ఉపాస్యుని సఖునిగా భావించి అహేతుక ప్రేమపూర్ణ వ్యవహారం చేసిన భక్తునిగా కుచేలుని చెప్పుకుంటే ఇష్టదేవునికి అంతరంగ సఖునిగా ప్రేమ మయమైన, నిస్వార్థమైన భావాన్ని కలిగి ఉన్న భక్తునిగా అర్జునుడు కనిపిస్తాడు. శ్రీకృష్ణుని తనకు సారధిగా సఖుడుగా సచివునిగా బాంధవునిగా గురువుగా దైవంగా చేసుకున్న నరుడు అర్జునుడు.

అన్నిట తన సఖుడు తన అండనుండగా తనకు భయం లేదని 'భగవంతుడే నాసఖుండు ఇంక నాకేమి కొరత' అని భావించి, అన్నీ వానికి తెలుపు కోవడం బాధ కలిగితే వాని దగ్గర కూర్చుని ఏడవడం, సంతోషం కలిగినప్పుడు వానితో పంచుకుని ఆనందించడం, ఆ భగవంతుడే తనకు సర్వస్వమని భావించి వానితో కలిసి మెలసి తిరగడం, పాడడం వంటివి చేస్తూ వానిని విడిచి ఉండలేక పోవడం వాని సఖ్యమే పరమావధిగా భావించి ఆనంద పారవశ్యాలు పొందడం అనేది అర్జునుని సఖ్యభక్తి.

" చెలికాడ రమ్మని చీరునన్నొక వేళ
మన్నించు నొకవేళ మఱది యనుచు
బంధు భావంబున బాటించు నొకవేళ
దాతయై యొకవేళ ధనములిచ్చు
మంత్రియై యొకవేళ మంత్రమాదేశించు
బోద్ధయై యొకవేళ బుద్ధిపెప్పు
సారథ్యమొనరించు జనువిచ్చి నొకవేళ
గ్రీడించునొకవేళ గేళిసేయు
నొక్క శయ్యాసనంబున నుండు గవ్వ
తంద్రికైవడి జేసిన తప్పుగాచు
హస్తములు పట్టి పొత్తునవారగించు
మనుజవల్లభ మాధవు మరుపురాదు."[84]

అనే పద్యం కృష్ణార్జునుల మధ్య ఉన్న సఖ్యాన్ని స్పష్టం చేస్తుంది.

సఖ్యభావమే అయినా కుచేలుని సఖ్యంలోనూ అర్జునుని సఖ్యంలోనూ కొద్దిగా అంతరం కనిపిస్తుంది. కుచేలునిది వినయం, సంకోచం, గంభీరత్వం నిండిన సాత్విక స్వభావం. కుచేలుడు విప్రుడు కనుక అతని భక్తి సాత్విక ప్రధానమయినది. క్షత్రియుడైన అర్జునుని భక్తి రజోగుణ ప్రధానమయినది. అందుకే చనువు నిస్సంకోచం, కృష్ణుని అండనుండగా తనకేమిటన్న ధైర్యం, అపరిమితమైన ప్రేమ అర్జునునిలో కనిపిస్తాయి.

## ఆత్మనివేదనం: గజేంద్రుడు

తన సర్వస్వం పరమాత్మదేనని, తాను అనేది లేదని మనస్సు ప్రాణం శరీరం అన్నీ భగవంతునికి అర్పణ చేసి తనలోని శక్తి అంతా భగవంతుని లీలా

విశేషమేనని, అతని విభూతి సర్వస్వమేనని, మనసా వాచా కర్మణా తలపోస్తూ వుండడమే ఆత్మార్పణం. అన్నీ వానికి అర్పితం కనుక తాను చేస్తున్నాను, చేస్తాను; ఇది నాది, నేను పొందుతున్నాను పొందుతాను అనే భావనలు లేక అన్నీ అతని ఆధీనం చేసినందు వల్ల 'చేసెడివాడు చేయించెడువాడు' అన్నీ ఆ పరమాత్మే అని ఎరిగి వుండడం ఆత్మనివేదన. వాని ఆధీనమైన తరువాత కర్మగాని బంధంగాని సుఖదుఃఖ భావన గాని ఉండవు. సర్వకాలాలలోనూ 'ఇది శరీరం' అనే భావన లేకుండా ఉండడమే ఆత్మార్పణం.[85]

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపే భ్యో మోక్ష యిష్యామి మాశుచః"[86]

అనే భగవద్గీతా శ్లోకాన్ని నిరూపించే భక్తి లక్షణం ఆత్మ నివేదనం.

గజేంద్రుడు కష్టకాలంలో భగవంతుని ప్రార్థించి దిక్కుతోచని పరిస్థితిలో సర్వస్వ శరణాగతి అంటూ భగవానునికి ఆత్మ నివేదనం చేశాడు.

మొసలివాత పడిన గజేంద్రుడు వెయ్యేళ్ళు పోరి, అలసి, శక్తి శూన్యుడై భగవచ్ఛరణాగతి పొందాడు. మొదట పశుబలంతో పోరి తరువాత 'కలడు కలడనెడు వాడు కలడో లేడో'[87] అని పరమాత్మ అస్థిత్వాన్ని శంకించినంతకాలం మొసలి బారినుండి విముక్తి లభించలేదు. చివరికి సమస్త విశ్వానికి రక్షకుడున్నాడని విశ్వసించి...

*"లావొక్కింతయు లేదు ......*
*నీవే తప్పనితః పరంబెఱుగ మన్నింపందగున్ దీనునిన్*
*రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!"*[88]

అని ఆత్మ నివేదన గావించి -

"అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబుదా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు" [89]

అయిన హరిని హుటాహుటి రప్పించుకున్నాడు. కైవల్య ప్రాప్తిని పొందాడు. ఆత్మ నివేదనతో భక్తుడు పిలిస్తే భగవంతుడు ఒక్క క్షణం కూడా నిలువలేక ఉన్న పళంగా, పరుగున వచ్చి రక్షణ నిస్తాడు అన్నది స్పష్టం అవుతుంది.

ఇక్కడ మరొక్క విశేషం ఉంది. భగవంతుడు ఇలా ఉంటాడని భావించి గజేంద్రుడు అంతకు మునుపు అర్చించినట్లు కనబడదు. ఆత్మ నివేదన గావించిన భక్తుని బ్రోవ వచ్చిన భగవంతుని రూపం ఇలా ఉంటుంది సుమా అని పోతన వర్ణించాడు. జీవి వేల జన్మలుగా సంసారచక్రంలో బంధనాలలో కూరుకుపోయి అందులో నుండి వెలువడ లేక పరమాత్మకై తపించి ప్రార్థించిన మైనం ఆత్మనివేదన చేసి శరణాగాతుడైన జీవిని పరమాత్మ హుటాహుటిని వచ్చి రక్షిస్తాడనే సత్యం గజేంద్రమోక్ష గాథలో సంకేతంగా కనిపిస్తాయి.

భాగవతంలో .........

"తనువృాద్భాషల పఖ్యముప్ శ్రవణమున్..."

అనే పద్యం నవవిధ భక్తులను బోధించగా

"కామోత్కంఠతగోపికల్......."

"అలకనైన చెలిమినైన"

"బాంధవమునవైన బగనైన వగనైన భీతినైన....."

అనే పద్యాలు కామం, భయం, వైరం, బంధుత్వం అనే మనోవికారాలు భగవత్పరంగా వృద్ధి చెందితే అవి కూడా భగవత్సాన్నిధ్యాన్ని చేర్చే మార్గాలే అవుతాయని స్పష్టం

చేస్తున్నాయి. ఈ విధానాలు పరిశీలించినట్లయితే కామంతో గోపికలు, భయంతో కంసుడు, వైరంతో శిశుపాలుడు, బంధుత్వంలో వృష్ణివంశ వీరులు పరమాత్మలో నైక్యమైనట్లు భాగవతం నిరూపిస్తుంది.

**కామం - గోపికలు**

"భక్తి పరాకాష్ఠే ప్రేమ. ఇది ప్రతిఫలాపేక్ష లేనిది. కృష్ణునికి ఆనందం కలిగించడమే దీని లక్షణం"[90]. ఇటువంటి ప్రేమకు పరాకాష్ఠ కామోత్కంఠత. ప్రేమ అధికమై ఆత్మ నివేదన గావించిన గోపికలు కృష్ణునికి దూరంగా ఏమాత్రం ఉండలేకపోయారు. ఫలితంగా వారికి కలిగినది కామోత్కంఠత. వారిది భగవత్కామం. కనుకనే అది మధుర భక్తి.

సర్వకాల సర్వావస్థలలోనూ కృష్ణునే ధ్యానిస్తూ కృష్ణగత ప్రాణులయ్యారు.

శరత్కాలం నాడు వేణు గానాన్ని విన్న గోపికలు వివశలై ఉన్నవారు ఉన్నట్లుగా సంకేత స్థలానికి పరుగులు తీశారు. సమస్తం వదిలి తన దగ్గరకు వచ్చిన గోపికలను పరీక్షిస్తూ 'తిరిగి పొండని' ధర్మ సూత్రాలు వల్లె వేశాడు కృష్ణుడు.

మా సర్వస్వమూ నువ్వేనని భావించి మాతో ఈ విధంగా పలకడం న్యాయం కాదన్నారు. అన్ని బంధాలూ తెంచుకొని వచ్చిన మమ్ము దాసులుగా స్వీకరించమన్నారు.

*"భవదాలోకన హాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్*
*భవదీయాధర పల్లవామృతముచే బాపందగుం, బాపపే*
*ని వియోగానలహేతి సంహతులచే నీఱై భవచ్చింతలన్*
*భవదంఘ్రిద్వయ వీథి బొందెదము నీపాదంబులా నన్ ప్రియా!"*

అని అంటూ తమ విరహానలాన్ని శాంతింప జేయనట్లైతే అందులోనే హుతులై

కృష్ణుని చేరుతామని తెలిపి శరణు వేడారు. "యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుడు ఆత్మారాముడై వారలతో రమించాడు."[92] వారి కోరిక తీర్చాడు.

'యత్ర యత్ర మనో దేహీధారయేత్స కలంధీ యా
స్నేహా ద్ద్వేషాద్ భయాద్వాపియాతి తత్తత్స్వరూపతామ్' [93]

అని భగవంతుడైన కృష్ణుడు తెలిపిన విధంగా ద్వేషం వల్లనో స్నేహం వల్లనో భయం వల్లనో చిత్తం సమగ్రంగా దేనియందు నిలుస్తుందో అది దాని సారూప్యం పొందుతుంది. గోపికలు మొట్టమొదట కామబుద్ధితో నేకాగ్రచిత్తులయారని తలచినా వారికి ధ్యేయమైన భగవంతుడు పరిశుద్ధుడు కనుక ఆయన నిజతత్త్వ ప్రభావంతో గోపికల యంతః కరణంలో ఉన్న కామ రూప మాలిన్యం తొలగించాడు. వారి ఏకాగ్రత మాత్రం తనపైన అలాగే ఉండేట్లు చేశాడు.

## భయం - కంసుడు

కంసుడు మృత్యుభీతి అధికంగా కలవాడు. చెల్లెలి అష్టమ గర్భం వల్ల తనకు మరణం వాటిల్లుతుందని ఆకాశవాణి తెలిపిన వెంటనే ఉలికిపడి ఎంతో ప్రేమతో అత్తవారింటికి సాగనంపుతున్న ప్రియమైన చెల్లెల్ని చంపబోయాడు. వసుదేవుని ప్రార్థనతో అప్పటికి శాంతించినా నారదుని వల్ల తాను కాలనేమి అనే రాక్షసుడననీ దేవమయుడైన చక్రి దేవకీ పుత్రుడై జన్మించి "భూతలంబు సెరుపబుట్టి నట్టి చెనటి దైత్యుల నెల్లజంపు" [94] నని ఎరిగి కలత చెంది దేవకీ వసుదేవుల్ని పట్టి బంధించి వారి ఆర్గురు పుత్రుల్ని వధించాడు. హరిని గర్భంలో మోస్తున్న దేవకిని చూసి "చక్రి యెప్పుడు పుట్టు? పుట్టునపుడె పట్టి పురుటింటిలో తెగ జూతు" [95] నంటూ హరిపుట్టుక కోసం తానే ఎక్కువగా ఎదురుచూశాడు. హరిని చంపాలనే ధ్యాసతో వేరొక ఆలోచన మాని

"తిరుగుచు గుడుచుచు ద్రాగుచు
నరుగుచు గూర్చుండి లేచుచనవరతంబున్
హరిదలచి దలచి జగమూ
హరిమయమని" [96]

చూడసాగాడు కంసుడు. అనుక్షణం హరిమీద ధ్యాసతో కలత చెందుతూ

"శ్రవణ రంధ్రములనే శబ్దంబు వినబడు
నది హరి రవమని యాలకించు
నక్షి మార్గమున నెయ్యది పూడబడునది
హరి మూర్తిగా నోపునంచుజూచు
దిరుగుచో దేహంబు తృణమైన సోకిన
హరికరాఘాత మోయనుచు నులుకు
గంధంబు లేమైన ఘ్రాణంబు సోకిన
హరిమాలికా గంధమనుచు నదరు

బలుకులెవ్వియైన బలుకుచో హరిపేరు
వలుకబడియె ననుచు బ్రమసి పలుకు
దలపు లెట్టిదైన దలచి యాతలపులు
హరి తలంపులనుచు నలుగదలచు" [97]

ఈ విధంగా క్షణమైన మరపులేక హరిని భయంతోనే తలచుకోసాగాడు. నందుని పుత్రిక యోగమాయను దేవకి అష్టమ గర్భంగా దలచి బాలిక అని అయినా చూడక చంపజూశాడు. ఆ బాలిక యోగమాయ గనుక తన నిజరూపం దాల్చి కంసుని మరణానికి కారణభూతుడైన వీరుడు క్షేమంగా వేరే చోట పెరుగుతున్నాడని చెప్పగా విని ఆ పలుకులు ములుకులై చెవుల చిలికిన

నులికిపడి జళుకుగదిరిన మనంబున ఘనంబుగ వెఱ గం"[98] దాడు. ప్రాణ భీతి అధికమై పూతనను పంపి ఎంతోమంది పసి పిల్లలను చంపించాడు. ఎన్నో విధాల ప్రయత్నించి కృష్ణుని హత మార్చలేని కంసుడు ధనుర్యాగ నెపంతో రామకృష్ణులు తన అనుచరులను చంపి ధనువును విరిచిన వార్త విని ఆ రాత్రి నిద్రకు దూరమై కలత చెందాడు. తనకు మృత్యువు తప్పదని గ్రహించి చలించిపోయాడు. కంసుడి మనసులో చెలరేగిన భయం వల్లనే

*"కర్ణరంధ్రములుచే గప్పిన లోపలి*
*ప్రాణఘోషము వినబడకడిందె*
*దోయాది కములందు దొంగి చూచినయంత*
*దలగానరాదయ్యె దనువు మీద*
*గరశాఖ నాసికాగ్రంబు పైనిడి చూడ*
*గ్రహ తారకలు రెండు గానగపడె*
*వెలుగున నిలుచుండి వీక్షింపగా*
*మేనినీడ పరంధ్రమై నేలదోచె*

*నడుగు జాడ దృష్ట మౌట లేదయ్యెను*
*దరువులెల్ల హేమ తరువులగుచు*
*మొఱయుచుండె గాల మృత్యువు దగ్గర*
*బుద్ధి యెల్ల గలగె......................." [99]*

ఇంతటికి గురి అయిన కంసుడు కలత నిద్రలో గరళం దిన్నట్లు ప్రేతం పరిభ్రమించినట్లు, నగ్న భావుడయినట్లు, శిరసున తైలం పడినట్లు, ఖరపతి నెక్కినట్లు, రక్త కుసుమ మాలను ధరించి ఒక్కడే పోతున్నట్లు కలగని 'మరణ హేతుక భ్రాంతి జింతాక్రాంతుడై నిద్రం చెందక' వేగపొగాడు.

ఆ మర్నాడు కువలయా పీడమనే యేనుగును జంపి, చాణూర ముష్టికులను వధించిన బలరామకృష్ణులను జూచి భయ విహ్వాలుడయ్యాడు. వారిని తన వద్దకు రానీయకుండా 'నగరవాకిటికి' తరిమి కొట్టమని, నందుని బంధించమని, వసుదేవుని చంపమని, ఉగ్రసేనుని సైతం వదలి పెట్ట వద్దని మంత్రులను ఆజ్ఞాపించాడు.[100] కానీ చివరకు కృష్ణుని చేత చిక్కి మరణించాడు.

మృత్యుభీతితోనైనా తనను చంపబోయే కృష్ణుని పుట్టకముందు నుంచి కృష్ణుడు తనను చంపేవరకూ ప్రతిక్షణమూ కృష్ణుని మీద ధ్యాసతో గడిపి చివరకు కృష్ణునిలో ఐక్యమయ్యాడు కంసుడు.

వైరం - శిశుపాలుడు

శిశుపాలాదులు వైరంతో హరిని చేరినట్టివారు. రాజసూయ యాగం నిర్వహించదలచి ధర్మరాజు కృష్ణుని పూజించగా చూసి సహించలేని శిశుపాలుడు అభ్యంతరం చెప్పి

"జారుడు జన్మావధియును
జోరుడు మున్ప్రోకలాడు సుమహితపూజా
చారక్రియలకు నర్హుడె...."[101]

అంటూ ఎన్నో విధాల నిందించి కృష్ణుని చక్రాయుధానికి బలి అయ్యాడు. శిశుపాలుని గాత్రం నుండి తేజం వెలువడి కృష్ణునిలో కలిసింది.

"మధుదైత్యాంతకు మీద మత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా
వధినే ప్రొద్దు దదీయ రూప గుణ దివ్యధ్యాన పారీణ ధీ
విధి యొాటన్ శిశుపాల విభుడు తానిర్ధూత సర్వాఘుడై
విధి రుద్రాదుల కందరాని పదవిన్ నే పొందెనుర్వీశ్వరా"[102]

అని శుకుడు పరీక్షిత్తుకు చెప్పిన విధానంలో రుద్రాదులకు సైతం అందరాని పదవిని శిశుపాలుడు వైరంతో పొందినట్లు స్పష్టం అవుతుంది.

జయ విజయుల శాపానికి క్రోధం కారణం. కనుక క్రోధం తోటే శిశుపాల దంతవక్త్రులు భగవానుని స్మరించారని, కాముక భావంతో బ్రహ్మవాణికి శాపం ఇవ్వడం వలన 'శ్రుతి' రూపంలోని వాణి (శ్రుతి రూప గోపికలు) గోపికలుగా అయి కామంతో కృష్ణుని జేరడం జరిగిందని, భయంతో శుక్రాచార్యుడు కాలనేమి మొదలయిన వారికి శాపం ఇవ్వడం వల్ల (శుక్రాచార్యుడు తపస్సుకు పోగా బృహస్పతి శుక్రాచార్యుని రూపంలో వచ్చి కాలనేమికి పౌరోహిత్యం నెరపడం, తన పౌరోహిత్యం ఎక్కడ చెల్లకపోతుందోనని భయంతో కాలనేమిని శపించగా పృథ్వి మీద కంసుడిగా జన్మించడం జరిగింది)......భయంతోనే కంసుడు భగవానుని స్మరించాడని బృహస్పతి దుర్వాసుడు మొదలయిన వారి వల్ల ఆయా శాపాలు లభించడం వల్ల వారు యాదవులుగాను, పాండవాదులగాను జన్మించి స్నేహంతో భగవంతుని జేరారని ఈ కారణాల వల్ల కామక్రోధ భయ స్నేహాలతో భగవంతుని భజించి శాపవిముక్తులయారని తెలుస్తోంది. నిర్గుణ భగవానుని ప్రాప్తి తామస రాజస సాత్త్విక గుణాలు వదిలి జీవినిర్గుణుడయినప్పుడే కలుగుతుంది. బ్రహ్మవంటి ఉన్నతులిచ్చిన శాపం భగవత్కృప వల్ల తప్ప దూరం కాదు. కనుక రాసక్రీడలో మధుర స్పర్శ ద్వారా గోపికలకు ముక్తి లభించింది.

ఒక్కొక్కరి మనోభావాలననుసరించి ఒక్కొక్కరూ ఒక్కొక్క రీతిలో పరమాత్మను సేవిస్తారు. ఈ సేవించడానికి ప్రధానంగా కావలసిన భక్తి ప్రేమ విశ్వాసాలు. తనది అనే వస్తువు మీద లేదా వ్యక్తి మీద ఉండే ప్రేమ ఆ భగవంతుని మీద ఉండాలి. ఆ పరమాత్మ తనవాడేననే (తాను పరమాత్మకి సంబంధించిన వాడినని) ఆత్మీయత ఉండాలి. ఈ ఆత్మీయతను ప్రేమను ఇష్టాన్ని వ్యక్తం చేసే విధానంలోనే మనకీ నవవిధ భక్తి మార్గాలు కనిపిస్తున్నాయి.

నవవిధ భక్తి మార్గాలను వాటి క్రమాన్ని పరిశీలిస్తే మానవునిలో భక్తి

క్రమంగా వృద్ధి చెందడానికి ఉపయోగపడే సాధనల వరుస గోచరిస్తుంది. ప్రథమంగా భగవల్లీలను వినడం (శ్రవణం), తద్వారా హృదయం స్పందించి నోరారా భగవంతుని కీర్తిస్తూ (కీర్తనం), అంతర్ముఖులై భగవన్నామాన్ని స్మరిస్తూ (స్మరణం), చేతల ద్వారా సేవిస్తూ (సేవనం), అర్చిస్తూ (అర్చనం), దాస్యం చేస్తూ భగవంతునికి దగ్గర అయిన భగవంతుని సఖునిగా (సఖ్యం) భావన చేస్తూ తనవానిగా చేసుకుని చివరకు తనవాడైన ఆ పరమ సఖునికి పరమాత్మకి ఆత్మార్పణం (ఆత్మ నివేదనం) చేయడం ద్వారా ముక్తి పొందే క్రమ స్పష్టం అవులోంది.

అయితే ఒక్కొక్కసారి భక్తుల మానసిక స్థితిననుసరించి ఇదే క్రమంలో భక్తి వృద్ధి చెందాలనే నియమం పాటింపకపోవచ్చు. ఏఒక్క భక్తి మార్గాన్నయినా అనుసరించి భగవంతుని చేరవచ్చునని చెప్పబడానికి పైన చెప్పిన ఉదాహరణలు తార్కాణంగా నిలుస్తాయి.

కొంతమందికి శ్రవణం ద్వారానే భక్తి తారస్థాయికి జేరి ఆత్మార్పణం గావించగలిగే స్థితికి చేరుకోవచ్చును. కొందరిలో తొమ్మిది విధానాలలోను క్రమక్రమంగా భక్తి వృద్ధి అవుతూ వచ్చి ఆత్మార్పణ చేయగలిగే స్థాయికి భక్తుడు రావచ్చును. కొందరు ఏదో ఒక సంఘటనవల్ల స్ఫూర్తిని జ్ఞానాన్ని పొందో లేదా పూర్వజన్మ సుకృతం వల్లో భగవత్కృప లేదా గురుకృప కలిగి ఒక్కసారిగా అన్నీ త్యజించి భగవంతునికి ఆత్మ నివేదన గావించి ముక్తి పొందవచ్చును. ఆయా సాధనలలో భక్తి మార్గాలలో దేనిని అవలంబించినా ప్రధానంగా చేయవలసినది మాత్రం ఆత్మనివేదనం (ఆత్మార్పాణం).

ఈ ఆత్మ నివేదనం ప్రేమకు ఆర్తికి పరాకాష్ఠ. ఆత్మార్పణ గావించనిదే పరమాత్మ కరుణ లభించదు. 'త్రికరణ శుద్ధి'లో ఆత్మకు లేదా మనస్సుకు అధిక ప్రాధాన్యం ఉంది. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అని భగవంతుడు తెలిపిన దాని సారాంశం ఈ ఆత్మనివేదనమే. ఆత్మ నివేదన గావించిన జీవిలో పరమాత్మ కరుణ లభించినందుకు సూచనగా వాత్సల్య

మాధుర్యాలు ఉద్భవిస్తాయి. వాత్సల్య భక్తికి ప్రతీక యశోద అయితే, మాధుర్య భక్తికి ప్రతీకలు గోపికలు.

కనుకనే భాగవతం నవవిధభక్తి మార్గాలను వివరించినా 'అలుకనైన చెలిమినైన....' అంటూ ఏదో విధంగా భగవంతుని మీద మనసు లగ్నం చెయ్యడాన్ని ప్రధానంగా నొక్కి చెప్పింది. అలా లగ్నం చెయ్యగలిగితే పరమాత్మ స్పందించి తనలో ఐక్యం చేసుకుంటాడని తానే సర్వస్వమూ అయి దర్శన మిస్తాడని అలా చెయ్యకుండా భగవంతుడూ ఉండలేడని అదే పరమాత్మ స్వభావమని భాగవతం నిరూపించింది.

పోతన నిరూపించిన భాగవత తత్త్వము ఇదే.



## పాదసూచికలు

1. సమర్థ సద్గురు శ్రీ గజానన మహారాజ్ సచ్చరిత్ర - మల్లిక (అరాద్ది వకుళమాల), షష్ఠప్రకరణం, పు - 139 (భావం)
2. శ్రీ రాధా గోవింద చంద్రిక (రామానంద గౌడీయ మఠం - 1982) త్రిదండి భక్తి సుధీర దామోదర మహరాజ్, పు - 30.
3. భాగవతానుశీలనం, ధూళిపాళ శ్రీరామమూర్తి, పు - 92
4&5. (పోతన) శ్రీ మహాభాగవతము (టాగూర్ పబ్లిషింగ్ హౌస్ (1975) (పరిష్కర్త - బులుసు వేంకట రమణయ్య (ప్రథమ భాగం,) ప్రథమ స్కంధము, పు - 4, శ్లోకం - 19.
6. పోతన - శ్రీ మహాభాగవతము (టూగూర్ పబ్లిషింగ్ హౌస్ 1975) పరిష్కారం బులుసువేంకట రమణయ్య, ప్రథమ స్కంధం (పీఠిక) అవతారిక, ప - 1, పు 1
7. పోతన 'శ్రీమహాభాగవతము (టాగురు పబ్లిషింగ్ హౌస్, 1975) ప్రథమ స్కంధం, పద్యం 13, పు - 3

8. తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు - పోతన సహజపాండిత్యం, పు - 4

9. తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు - పోతన సహజపాండిత్యం, పు - 25

10. పోతన శ్రీమద్భాగవతము ప్రథమ స్కంధం, పద్యం 13, పు - 3

11. పోతన శ్రీమద్భాగవతము ప్రథమ స్కంధం, పద్యం 20 పు - 4

12, 13, 14, 15. పోతన, శ్రీమహాభాగవతము (టాగూర్ పబ్లిషింగ్ హౌస్, 1975) ప్రథమస్కంధం, వచనం - 15, పు - 3.

16. పోతన, శ్రీమహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్యం - 18, పు - 4

17. శిష్టా లక్ష్మీకాంత శాస్త్రి - పోతన భాగవత రచన, పు - 90

18. పప్పు వేణుగోపాల్ - పోతన గారి భాగవత తత్త్వం - మానవత్వం, పు - 4

19. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమస్కంధము, పద్యం - 14, పు - 3

20. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమస్కంధము, పద్యం - 14, పు - 3

21. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధము, పూర్వభాగం పద్యం - 1270, పు - 358

22. పప్పు వేణుగోపాల్, పోతనగారి భాగవత తత్త్వం - మానవత్వం, పు - 10

23. నారదభక్తి సూత్రాలు (అనువాదకులు - దొడ్ల వెంకటరామరెడ్డి)

24. ఎఱ్ఱాప్రగడ సూర్యనారాయణ శాస్త్రి, మోక్ష సోపానములు, పు - 110

25. పోతన భాగవతము - పంచమస్కంధం - 482 పద్యం

26. పోతన భాగవతము పంచమస్కంధం - 483

27. ఎఱ్ఱాప్రగడ సూర్యనారాయణ శాస్త్రి - మోక్ష సోపానములు పు - 110

28. భగవద్గీత - కర్మసన్యాసయోగం, శ్లోకం - 18

29. భగవద్గీత - ఆత్మా సంయమన యోగం శ్లోకం - 9

30. ఐశ్వరస్య సమగ్రస్య వీరస్య యశశ్రియః
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాంభగ ఇతీరణా'

విష్ణుపురాణం, అధ్యాయం - 6

31. 'సాత్వస్మిన్ పర(మ) ప్రేమ రూపా' నారదమహర్షి - నారద భక్తి సూత్రాలు (అనువాదకులు - దొడ్డ వేంకట రామరెడ్డి) (రామకృష్ణ మఠ ప్రచురణం - 1983) సూత్రం 2, పు - 10

32. చతుర్విధా భజంతేమాం జనాః సుకృతినోర్జున
అర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ
(భగవద్గీత, జ్ఞానవిజ్ఞానయోగం, శ్లోకం - 16)

33. నారదమహర్షి - నారదభక్తి సూత్రాలు (రామకృష్ణ మఠ ప్రచురణం) (అనువాదం - దొడ్ల వెంకటరామరెడ్డి) సూత్రం 82, పు - 300.

34. 'సూరదాసు' - సాహిత్యోపన్యాసాలు (ఉపన్యాసాల సంకలనం), పు - 7

35. చర్ల గణపతి శాస్త్రి - 'భక్తి తత్త్వ దర్శనం', పు -11.

36. వ్యాసమహర్షి - శ్రీమద్భాగవతం (శ్రీరామానంద గౌడీయ మఠ ప్రచురణ - 1982) సప్తమ స్కంధం, అధ్యాయం - 5, పు - 91.

37. సద్గురు మాతాజీ కృష్ణ ప్రియగారి నుండి సేకరించిన విషయం

38. పప్పు వేణుగోపాల్ - పోతన గారి భాగవత తత్త్వము - మానవత్వము, పు - 13

39. పోతన - శ్రీ మహాభాగవతము - బులుసు వెంకట రమణయ్య, ప్రథమస్కంధం, పద్యం - 505, పు - 85.

40. పోతన - శ్రీ మహాభాగవతము ద్వితీయస్కంధం పద్యం 53, పు 103.

41. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమస్కంధం, పద్యం 94, పు - 20

42. సద్గురు మాతాజీ కృష్ణప్రియగారి నుండి సేకరించినది. చైతన్య మహాప్రభు కూడా దీనికి ఉదాహరణమే.

43. పోతన - శ్రీ మహాభాగవతము ప్రథమ స్కంధం వచనం 128, పు - 26

44. పోతన - శ్రీ మహాభాగవతము ప్రథమ స్కంధం వచనం 130, పు - 26

45. పోతన - శ్రీ మహాభాగవతము ప్రథమ స్కంధం వచనం 131, పు - 26

46. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధం, పద్యం 133, పు - 27

47. సద్గురు మాతాజీ కృష్ణప్రియగారి నుండి సేకరించినది.

48. "తనయందు నఖిల....' పోతన - శ్రీమహాభాగవత సప్తమ స్కంధం పద్యం - 115 పు - 706.

49. పోతన - శ్రీ మహాభాగవతము, సప్తమ స్కంధం, పద్యం 122, పు - 707.
50. పోతన - శ్రీ మహాభాగవతము, సప్తమ స్కంధం, పద్యం 123, పు - 708.
51. పోతన - శ్రీ మహాభాగవతము, సప్తమ స్కంధం, పద్యం 149, పు - 711.
52. పోతన - శ్రీ మహాభాగవతము, సప్తమ స్కంధం, పద్యం 150, పు - 711.
53. పోతన - శ్రీ మహాభాగవతము, సప్తమ స్కంధం, పద్యం 170, పు - 714.
54. పోతన - శ్రీమహాభాగవతము, సప్తమ స్కంధం పద్యం 256, పు - 730.
55. శబ్దరత్నాకరము, (భక్తి అనేపదానికి ఇచ్చిన వివరణంలో) సీతారామాచార్యులు, పు - 586.
56. సేవ - సూర్యరాయాంధ్ర నిఘంటువు
57. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం, వచనం 546, పు - 75
58. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, వచనం 547, పు - 75
59. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం, ఉత్తరభాగం పద్యం 223 పు - 454
60. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం, ఉత్తరభాగం పద్యం 260 పు - 459
61. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం, ఉత్తరభాగం పద్యం 267 పు - 460
62. సద్గురు మాతాజీ కృష్ణప్రియగారి నుండి సేకరించినది
63. పోతన - శ్రీ మహాభాగవతము, నవమ స్కంధం, పద్యం 82, పు - 112.
64. పోతన - శ్రీ మహాభాగవతము, నవమ స్కంధం, పద్యం 88, పు - 112.
65. సద్గురు మాతాజీ కృష్ణప్రియగారి నుండి సేకరించినది.
66. వందనం - సూర్య రాయాంధ్ర నిఘంటువు
67. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధం, పద్యం 186, పు - 34.
68. పోతన - శ్రీమహాభాగవతము, ప్రథమ స్కంధం, పద్యం 200, పు - 36.
69. "శ్రీధరీయవ్యాఖ్య 7-5-24" ఖండవల్లి సూర్యనారాయణ శాస్త్రి - భక్త పోతన మహాభాగవత రచన, పు - 107

70. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, పద్యం 1190, పు - 347

71. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం, పద్యం 1241 పు 355

72. సద్గురు మాతాజీ కృష్ణప్రియ నుండి గ్రహించినది

73. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, ఉత్తర భాగం, పద్యం 965, పు - 549

74 & 75. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, ఉత్తర భాగం, పద్యం 990, పు - 552

76. పోతన - శ్రీమహాభాగవతము దశమ స్కంధం, వచనం - 998, పు - 553

77. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, ఉత్తర భాగం, పద్యం 1009 పు - 554

78. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, ఉత్తర భాగం, పద్యం 1010, పు - 554

79. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, ఉత్తర భాగం, వచనం 1010, పు - 555

80. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, ఉత్తర భాగం, పద్యం 1016, పు - 555

81. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, ఉత్తర భాగం, పద్యం 1019, పు - 556

82. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, ఉత్తర భాగం, వచనం 1028, పు - 557

83. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం ఉత్తర భాగం, వచనం 1031, పు-557

84. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధం, పద్యం 369, పు - 65

85. సద్గురు మాతాజీ కృష్ణప్రియగారి నుండి సేకరించినది.
86. భగవద్గీత, మోక్షసన్యాసయోగ, శ్లోకం - 66.
87. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం, పద్యం 90, పు - 13.
88. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం, పద్యం 95, పు - 14.
89. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం, పద్యం 95, పు - 14.
90. త్రిదండి శ్రీ భక్తిధీర దామోదర మహరాజ్ - రాధాగోవింద చంద్రిక (గౌడీయ మఠ ప్రచురణ), పు - 69.
91. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, పద్యం 997, పు - 321.
92. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, పద్యం 1002, పు - 322.
93. వ్యాసుడు - శ్రీ మద్భాగవతము, ఏకాదశ స్కంధం, నవమాధ్యాయము, శ్లోకం - 22.
94. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, పద్యం 52, పు - 207.
95. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, పద్యం 83, పు - 210.
96. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, పద్యం 85, పు - 210.
97. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, వచనం 87, పు - 211.
98. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, వచనం 157, పు - 220.
99. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, పద్యం 1300, పు - 361.

100. "వల్లవ బాలురన్ నగర వాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుడీ".... పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వ భాగం, పద్యం 1371, పు - 370.

101. పోతన - శ్రీ మహాభాగవతము, (రెండవ భాగం) దశమ స్కంధం, ఉత్తర భాగం, పద్యం 791, పు - 527.

102. పోతన - శ్రీ మహాభాగవతము, (రెండవ భాగం) దశమ స్కంధం, ఉత్తర భాగం, పద్యం 799, పు - 528.





# భాగవతములో విశిష్టాద్వైతం

భక్తునికి భగవంతునికి గల అవినాభావ సంబంధాన్ని తెలుపుతూ జీవాత్మ పరమాత్మల మధ్య అభేదాన్ని చెప్పే అద్వైత సిద్ధాంతాన్ని అధిగమించి జీవేశ్వరుల భిన్నత్వంలోనే ఉన్న తాదాత్మ్య మాధుర్యాన్ని చవిచూపిస్తుంది భాగవతం.

ఆది శంకరుల అద్వైతాన్ని ఆళ్వారుల భక్తి భావానికి సమన్వయం చేసి శ్రీరామానుజాచార్యులు నిర్మించిన విశిష్టాద్వైతం 'వ్యాసభాగవతంలో అంతర్వాహినిగా ఉన్న విషయాన్ని' గ్రహించి సిద్ధాంతీకరించినదే.[1] రామానుజుల విశిష్టాద్వైతం పోతన భాగవతంలో మరింత మెరుగులు దిద్దుకుని స్థిరపడింది.

మేధాయుక్తి కంటె హృదయ స్పందనకే ఎక్కువ ప్రాధాన్యమిస్తూ తర్కం చేత బీడు వారిన హృదయాలమీద 'భక్తి వృష్టి'ని కురిపించి శాంతినిచ్చి సస్యశ్యామలం గావిస్తుంది విశిష్టాద్వైతం.

అద్వైత సిద్ధాంతానుసారంగా నిర్గుణ నిరాకార నిరంజనుడిగా చెప్పబడే బ్రహ్మాన్ని విశిష్టాద్వైతం స్థూలం చేసి పరబ్రహ్మ సగుణుడేనని సాకారుడేనని తెలిపి భగవంతుని అందుబాటుగావిస్తుంది. అంతేగాక భక్తుడు భగవంతుని

చేరటానికి ఆటంకంగా ఉన్న జాతిమత వర్ణలింగ భేదాలను తొలగించి గుణ కీర్తనాదుల చేత ఆ పరమాత్మ శీఘ్రంగా ప్రసన్నుడవుతాడని తెలుపుతుంది.

స్వభావ సిద్ధంగా కళ్యాణ గుణ సందోహుడైన పురుషోత్తముడే పరబ్రహ్మం, అతడే సర్వేశ్వరుడు. ఈ బ్రహ్మమే విష్ణు భగవాన్, వాసుదేవ, కృష్ణ, హరి మొదలయిన నామాలతో భాగవతంలో వ్యవహరింప బడుతున్నాడు.

చతుర్ముఖుడు, శివుడు పృథివ్యంతరిక్షాలు లేని కాలంలో నారాయణు డొక్కడే ఉన్నాడనీ[2] శ్రీమన్నారాయణుడే చిదచిద్విశిష్టమైన తత్త్వం అనీ[3] రామానుజాలు తమ విశిష్టాద్వైతంలో స్పష్టం చేశారు. అనేకమైన అచింత్య శక్తులు బ్రహ్మంలో గోచరిస్తాయి. కనుక సృష్ట్యాది శక్తులు అతడిలో అంతర్గతంగా అగ్నిలోని ఉష్ణత్వం లాగా ఉంటాయనీ, అతడా సృష్టికి కారణభూతుడనీ స్వప్రయోజనం కోసంకాక క్రీడార్థంగానే ఆయా జీవుల పాపకర్మల నాధారంగా జేసి సృష్టిని కల్పిస్తాడనీ రామానుజాల విశిష్టాద్వైతం బోధిస్తుంది.

విశిష్టాద్వైత్యంలో ఈక్రింది అంశాలు ముఖ్యంగా కనిపిస్తాయి. 1) శ్రీమన్నారాయణుడే పరతత్త్వం, 2) శ్రీమన్నారాయణుడే సర్వదేవాత్మకుడు, 3) నిరపాయమైన ప్రపత్తి భక్తితో శ్రీ మన్నారాయణుని (పరమ పదాన్ని) చేరుకుంటారు. 4) శ్రీమన్నారాయణుని భక్తులు 'అర్చిరాది మార్గం' ద్వారా వైకుంఠానికి చేరుకుంటారు. విశిష్టాద్వైతంలోని యీ అంశాలు భాగవతంలో ఏవిధంగా ఉన్నాయో తెలుసుకోవలసి ఉంది.

## 1. శ్రీమన్నారాయణుడే పరతత్వం

విశిష్టాద్వైత సిద్ధాంతంలో శ్రీమన్నారాయణుడే పరతత్త్వమనే అంశం ప్రధాన మైనది. ఈ విషయం భాగవతంలో భక్తులు పరమాత్మను స్తుతించే సందర్భాలలో సువ్యక్తం అవుతుంది. సూతుడు నారాయణ కథను శౌనకాది ముని శ్రేష్ఠులకు తెలుపుతున్న సందర్భంలో - 'కాష్ఠంబు కంటే ధూమం, ధూమం

కంటే ద్రయీ మయింబయిన వహ్ని యెట్లు విశేషమో' అదే విధముగా 'తమో గుణం కంటె రజోగుణం, రజోగుణం కంటే సత్త్వగుణం బ్రహ్మప్రకాశకాలని, తొల్లి మునులు సత్త్వ మయుండయిన భగవంతుడు హరి నధోక్ష జుంగొలిచి' రని' మోక్షమిచ్చుట జేసి నారాయణుండు సేవ్యుండు' అనీ

*మహదహంకార తన్మాత్ర సంయుక్తుడై*
*చారుషోడశ కలాసహితుడగుచు*
*బంచమహాభుత భాసితుండై శుద్ధ*
*సత్త్వుడై సర్వాతిశాయి యగుచు*
*జరణోరు భజ ముఖ శ్రవణాక్షినాసాశి*
*రములు నానా సహస్రములు వెలుగు*
*నంబర కేయూర హారకుండలకిరీ*
*టాదులు పెక్కు వేలమరుచుండ*

*పురుషరూపంబు ధరియించి పరుడనంతు*
*డఖిల భువనైక వర్తన యత్నమమర*
*మానితోదార జలరాశి మధ్యమమునను*
*యోగనిద్రా విలాసియై యొప్పు చుండు"*[4]

నని ఇదే సకలావతారాలకు మొదటిదైన శ్రీమన్నారాయణ దేవుని విరాజమానంబైన దివ్యరూపమని తెలిపి సకలావతారాలకీ ఆధారం ఆదిదైవం శ్రీమన్నారాయణుడేనని స్పష్టం చేశాడు.

"హరికృష్ణుండు బలానుజన్మడెడలేదా విష్ణుడా నేర్పడన్"[5] అంటూ విష్ణుమూర్తికి కృష్ణునికి భేదమే లేదన్న విషయాన్ని సైతం తెలియజేశాడు.

*"పురుషుండాద్యుండు ప్రకృతికి*
*బరుడవ్యయుడఖిల భూత బహిరంతర్భా*

*నరుడును లోక నియంతయు*
*బరమేశ్వరుడైన నీకు బ్రణతులగుహరీ"* [6]

అని ప్రార్థించిన పలుకులలోని ప్రతి పదమూ కృష్ణుడే పరతత్త్వమనే విషయం స్పష్టమవుతుంది.

శ్రీకృష్ణుని పరతత్త్వంగా గుర్తించిన భీష్ముడు అవసానదశలో పీతాంబరధారి, చతుర్భుజుడు, ఆదిపురుషుడు, పరమాత్మ అయిన శ్రీకృష్ణుని మనోవాగ్దర్శనాలతో హృదయంలో నిలుపుకుని 'వాసుదేవ పరబ్రహ్మమునందు'[7] కలిశాడని భాగవతం తెలుపుతోంది.

శుకమహర్షి పరీక్షిత్తుకు హరివిరాడ్రూపాన్ని వివరించి -

*"హరిమయము విశ్వమంతయు*
*హరి విశ్వమయుండు సంశయము పనిలేదా*
*హరిమయము గాని ద్రవ్యము*
*పరమాణు లేదు వంశపావన వింటే'* [8]

అని పరతత్త్వసారాన్ని ఒక్కమాటలో చెప్పాడు.

## 2. శ్రీమన్నారాయణుడే సర్వదేవాత్మకుడు

బ్రహ్మ నారదునికి పరతత్త్వాన్ని విశ్వప్రకారాన్ని వినిపించే సందర్భాన

*"నానా స్థావర జంగమ ప్రకరముల్ నాయంత నిర్మింప వి*
*జ్ఞానంబేమియు లేక తొట్రుపడనిచ్చున్ నాకు సర్వాను సం*
*ధానారంభ విచక్షణత్వము మహోదారంబుగా నిచ్చెను*
*న్నేనాయీశ్వరునాజ్ఞగాక జగముల్ నిర్మింపశక్తుండనే"*

అని తనకు విశ్వాన్ని సృష్టించే శక్తిని జ్ఞానాన్ని ప్రసాదించింది ఈశ్వరుడేనని 'వాసుదేవ వ్యతిరిక్తంబు లేదు, సిద్ధంబు (నారాయణ నియమ్యంబులు లోకంబులు) దేవతలు నారాయణ శరీర సంభూతులు. వేదయాగ తపోయోగ గతి విజ్ఞానంబులు నారాయణ పరంబులు. (జ్ఞాన సాధ్యంబగు ఫలంబు నారాయణునధీనంబు)[10] అని తెలుపుతూ తాను ముందు తెలిపిన ఈశ్వరుడు నారాయణుడని స్పష్టం చేశాడు.

చివరగా "..........ముక్కంటియును మహామునులు నేను సలిలనభస్థుల చరములు మొదలైన వివిధ జీవులతోడి విశ్వమెల్ల -

విష్ణుమయము పుత్ర వేయేల బ్రహ్మాండ
మతని జేనలోన నడగి యుండు
బుద్ధి నెరుగరాదు భూతభవద్భవ్య
లోకమెల్ల విష్ణులోనమండు"[11]

అని తెలిపి సర్వారాధ్యుడు, సర్వాధారుడు, సర్వాత్ముడు అయిన మన్నారాయణుడే పరతత్త్వమని బ్రహ్మ స్పష్టం చేయడం వల్ల భాగవతం శ్రీమన్నారాయణుని పరతత్త్వమనే విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని నొక్కి చెప్పిందని తెలుస్తోంది.

విశ్వాత్ముడు విశ్వేశుడు
విశ్వమయుండఖిలనేత విష్ణుండజుం డీ
విశ్వములో దానుండును
విశ్వము దనలోన జాల వెలుగుచునుండున్'[12]

అనే విషయం భాగవతమంతా ఏదో విధంగా అనేక సందర్భాలలో ప్రతి స్కంధంలోనూ నిరూపితమయింది.

ఇక మొసలివాత పడ్డ గజేంద్రుడు

"లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగిన దుదినలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుగు నతని నే సేవింతున్"[13] అని

'అఖిలరూపముల్ దనరూపమైనవాడు....'[14] అనీ

"స్త్రీ నపుంసక పురుషమూర్తియును గాక
తిర్యగమర నరాది మూర్తియునుగాక
కర్మగుణ భేదసదసత్ప్రకాశిగాక
వెనుకనన్నియు దానగు విభుదలంతు"[15]

అంటూ రూపానికి అతీతమైన సకలాధారమైన శక్తి నిరాకారుని గజేంద్రుడు ప్రార్థించగా కదలివచ్చి మకరిని ద్రుంచి కరిని కాపాడి మోక్షాన్ని ఇచ్చినది మాత్రం-

"అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబుదా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోది యై"[16]

ఉన్న 'భక్త జన పాలన పరాయణుండు నిఖిలజంతు హృదయారవింద సదన సంస్థితుండును'[17] అయిన నారాయణుడే. గజేంద్రుడు తనకు రూపు తెలియని పరతత్త్వాన్ని ప్రార్థించగా నారాయణుడు 'సిరి'కి సైతం చెప్పక శంఖచక్రాలను గరుడవాహనాన్ని 'చీరక' పరుగున వచ్చిన వైనం పరిశీలిస్తే గజేంద్రుడు వర్ణించిన పరతత్త్వ లక్షణాలు కలవాడు శ్రీమన్నారాయణుడేనని అర్థం అవుతుంది.

శ్రీ మహావిష్ణువే సర్వదేవతలకు అంతరాత్మయై వెలయువాడని బ్రహ్మాదులను సైతం సృష్టించి వారికి విశేష ప్రభావాన్ని వరాలను ఇచ్చి ఆయా

పదవులలో ప్రతిష్ఠించినవాడు శ్రీమన్నారాయణుడే అనే విశిష్టాద్వైత సిద్ధాంత అంశం భాగవతంలో అనేకమార్లు నిర్ధారితమయింది.

బాలభక్తుడు ధ్రువుడు నారాయణుని సేవిస్తూ 'తత్తద్దేవతా రూపంబులచే నానా ప్రకారంబుల దారువులందున్న వహ్ని చందంబునం ప్రకాశింతువు'[18] అని స్తుతించడం శ్రీమన్నారాయణుడే సర్వదేవాత్మకుడనే భక్తుల విశ్వాసాన్ని ధ్రువపరిచే ఉదాహరణ.

అదే విధంగా శుకుడు పరీక్షిత్తుకు భక్తి మార్గాన్ని తెలుపుతున్న సందర్భంలో

**"అఖిల భూతములందు నాత్మరూపంబున**
**నీశుండు హరియుండు నెల్ల ప్రొద్దు"[19]**

అని హరిని సర్వభూతాత్మకునిగా తెలిపాడు.

భాగవతంలో కృష్ణుడు, విష్ణువు, నారాయణుడు, హరి అనేవి పర్యాయ పదాలుగానే వాడబడ్డాయి.

శివుడు బాణుని రక్షించమని శ్రీకృష్ణుని వేడిన సందర్భంలో - "దేవా నీవు బ్రహ్మ స్వరూపంబగు జ్యోతిర్మయుండవు, నిఖిల వేద వేదాంత నిగూఢుండవు నిర్మలుండవు, సమానాధిక రహితుండవు, సర్వవ్యాపకుండవు"[20] అంటూ కీర్తించడం, బ్రహ్మ తాను గోవత్స గోపబాలకులనపహరించగా కృష్ణుడు ఆయా రూపాలతో ఏడాది పాటు చరించగా సృష్టికర్తనేనేనన్నఅహంకారం వీడి ఎన్నో విధాలస్తుతించి 'నీవు జీవాత్మ స్వరూపుండవు, సకలాత్మలకు నాత్మయైన పరమాత్మ స్వరూపకుండవునని యెవ్వరెఱుంగుదురు వారు గదా గురువని యెడు దినకరుని వలన బ్రాప్తంబైన యుపనిషదర్థ జ్ఞానంబగు సునేత్రంబునం సంసారమిధ్యా సాగరంబు దరించిన చందంబున నుండుదురని"[21] ప్రార్థించడం కంటే హరి విశ్వాత్మకతకు మరొక నిదర్శన మేముంటుంది.

## 3. పరమపదం (వైకుంఠం)

నామరూప రహితమయిన పరతత్త్వాన్ని ప్రార్థించిన గజేంద్రునికి శ్రీమన్నారాయణుడు సారూప్యాయాన్ని ప్రసాదించాడు. గజేంద్రుడు ముక్తి పొందాడు.

*'హస్తిలోకనాథుడ జ్ఞాన రహితుడై*
*విష్ణురూపుడగుచు వెలుగుచుండె"* [22]

*"హరిచరణ సేవ కతమున*
*గరివరునకు నధికముక్తి గలిగె"* [23]

పరతత్త్వమైన శ్రీమన్నారాయణుని సేవించిన భజించినవారు పరమపదమైన వైకుంఠాన్ని ముక్తి ధామాన్ని చేరుకుంటారనే విశిష్టాద్వైత అంశానికి గజేంద్రుని మోక్ష కథనం ఉదాహరణం.

అజామిళుని యమభటులు తీసుకుపోబోగా విష్ణునిర్దేశకులు వచ్చి అజామిళుడు అంత్యకాలాన నారాయణశబ్దాన్ని (పుత్రనామాన్ని) నోట పలికినందున నరకానికి తీసుకు పోరాదని వాదించి యమభటులను వెనుకకు పంపడం జరిగింది.

*"పద్మనయను మీద భక్తి యోగంబెల్ల*
*ముక్తి యోగమనుచు మొద లెఱుంగు*
*వారి వారి వారి వారి జేరిన వారి....."* [24]

త్రోవలోనికి యమభటులు రారని భాగవతం తెలుపుతోంది. ఎంత దుర్మార్గు డయినా నారాయణుని భజనచేసినట్లయితే వాడు తప్పక మోక్షానికి, పరమ పదానికి, వైకుంఠధామానికి జేరుతాడు.

శ్రీ మన్నారాయణుని స్థానమైన పరమపదం (వైకుంఠపదం) చేరి (పొంది) తద్దివ్యమంగళ విగ్రహ సందర్శనలో ఆనందించుతాడనేది విశిష్టాద్వైత సిద్ధాంతం.

భృగుమహర్షి ముని జనముల కోర్కెపైన త్రిమూర్తులలో అధికులెవరో పరీక్షించిన వైనం గుర్తు చేసుకోదగినది. తనను తన్నిన భృగువుతో విష్ణువు

'ఓ తపోధనా! యీ గతినీ వచ్చుటెఱుగ లేక

*"మన్న నా తప్పు మన్నించి నన్ను గరుణ*
*జూచి యీ దివ్య మణియమ మ్మూర్తిదనరు*
*రుచిర సింహాసనమున గూర్చుండు దివ్య*
*తాపసోత్తమ! యభయప్రదాన నిపుణ"* [18]

అని అన్నాడు. అంతేకాక "మునీంద్రా! భవదీయ పాదాబ్జహతి మద్భుజాంతరంబునకు భూషణం బయ్యె భవదాగమనంబు మాబోటి వారికి శుభావహంబుగాదె యేను ధన్యుండనైతి'[26] నని పలికి భృగుమహర్షిని ఆనంద పరిచాడు. ఈ సంఘటనతో సత్త్వమూర్తిగా విష్ణుని గ్రహించిన మునీశ్వరులంతా సందేహాన్ని వదిలి -

*"చిన్మయాకారుండు శ్రీ పతీశు*
*డనుపము డనవద్యు డఖిల కల్యాణ*
*గుణాకరుడాదిమధ్యాంత రహితు*
*డైతనర్చి పుండరీకాక్షుడొకడ*
*కాక గణుతింప దైవమొక్కరుడు వేఱ*
*కలడె...."*[27]

అని నిర్ణయించుకుని 'హరి పదాబ్జాత యుగళంబు నర్థి గొలిచి అవ్యయానందంబయిన వైకుంఠాధామంబు' నొందారు.

అసాధారణులైన మునీశ్వరులు సైతం విష్ణుని పరతత్త్వంగా కొలిచి భజించి వైకుంఠ ధామాన్ని చేరిన వైనంతో విశిష్టాద్వైతాన్ని మరింత దృఢంగా భాగవతంలో తెలిపినట్లయింది.

## 4. అర్చిరాది మార్గం

విశిష్టాద్వైత సంప్రదాయంలో సర్వోత్కృష్టమైన మోక్షస్థానం అయిన వైకుంఠాన్ని చేరడానికి నిర్దిష్టమైన మార్గం తెలుపబడింది. దానికి అర్చిరాది మార్గమని పేరు. ఈ మార్గాన శ్రియః పతి సాధర్మ్యాన్ని పొందిన ముక్తునికి పునరావృత్తి ఉండదు.

ఈ జీవి (ఆత్మ) పరమాత్మతో కూడి తత్సమానమైన ధర్మాలను పొందుతాడు. జీవుడు కర్మకృతమైన శక్తి సంకోచాలు తొలగి సర్వసాక్షాత్కార కర్తృత్వం, సంసార బంధరాహిత్యం, సర్వదుఃఖాభావం అనే విశేష మహిమలతో వెలుగొందుతూ పరమానంద భరితుడవుతాడు.

భక్తి ప్రపత్త్యాది నిష్ఠుడైన సాధకుడు ప్రాకృతమైన తన దేహాన్ని విడిచి పరమపదాన్ని చేరే ఈ అర్చిరాది మార్గంలో తొలుత సూర్యమండలాన్ని, తరువాత వాయుమండలాన్ని, ఆ తరువాత మనస్తత్త్వాదిష్ఠాతయైన ప్రద్యుమ్నుని, అటు తరువాత తమశ్శబ్దవాచ్యమైన ప్రకృతికి అధిష్ఠాత మహదాదులకు సృష్టికర్తయైన అనిరుద్ధుని, అక్కడినుండి రజశ్శబ్ద నిర్దిష్టమైన జీవున కధిష్ఠాతయైన సంకర్షణుని అక్కడి నుండి శుద్ధసత్త్వానికి అధిష్ఠాతయైన వ్యూహవాసుదేవుని, ఆ తరువాత పరమాత్మయైన పరవాసుదేవుడైన కృష్ణుని చేరి అమృతత్త్వాన్ని పొందుతాడని వ్యాసభారతం తెలుపుతోంది.[28]

భాగవతంలో మైత్రేయుడు విదురునికి వృథువొందిన అచ్యుత లోకగమనాన్ని గురించి చెబుతూ - వృథు చక్రవర్తి యోగమార్గాన

"ప్రాముల్ విడిచి పవను పవను

వందు నాకాశమాకాశమందు, తేజ

మందు తేజంబు నుదకంబువందు, నుదక

మర్థి గాయంబు మేదినియందు గలిపె

బూని వానియధోచిత స్థానములుగ" [29]

మరియు "భూమి నుదకంబునందును, నుదకంబును దేజమందును, దేజంబును వాయువునందును, వాయువు నాకాశంబునందును, నాకాశంబును మనంబున, మనంబు నింద్రియంబుల, నింద్రియంబుల దన్మాత్రల, దన్మాత్రల భూతాదియైన యహంకారంబునందు, నహంకారంబు మహతత్త్వంబు నందును గూర్చి యట్టి సర్వ కార్య హేతుభూతంబైన మహత్తత్త్వంబును జీవోపాధి భూతంబయిన ప్రకృతియందు గలిపి జీవ భూతుండయిన పృథుండు జ్ఞాన వైరాగ్యంబుల చేత బ్రహ్మ నిష్ఠుండై మాయోపాధింబాసి ముక్తుండయ్యె"[30] నని తెలిపి భక్తి ప్రపత్యాది నిష్ఠుడైన సాధకుడు ప్రాకృతికమైన దేహాన్ని విడిచిన తరువాత అమృతత్వాన్ని పొందే విధానాన్ని తెలియజేశాడు.

అదే విధంగా కపిలుడు తల్లి దేవహూతికి ముక్తి మార్గాన్ని వివరిస్తూ -

"పరికింపన్ నిజభక్తి యుక్తి గరిమంబాటిల్లు పంకేరుహో

దరవిన్యస్త సమస్త ధర్మముల శాంతస్వాంతులై సంగముం

బరివర్జించి విశుద్ధ చిత్తులగు చున్, బంకేజపత్రేక్షణే

తర ధర్మైక నివృత్తులై సతతమున్ దైత్యారిజింతింపుచున్" [31]

"మరియు నహంకారమమకార శూన్యులై

యర్థి వర్తింపుచునర్చిరాది

మార్గగతుండును, మహనీయ చరితుండు

విశ్వతో ముఖుడును విమలయశుడు
జగదుద్భవ స్థాన సంహార కారణుం
డవ్యయుడ జుడు బరాపరుండు
బురుషోత్తముడు నగు పుండరీకాక్షుండు
నైన సర్వేశ్వరునందు బొంది

మానితంపునరావృత్తిత మార్గమయిన
ప్రవిమలా నంద తేజో విరాజమాన
దివ్యపదమున సుఖియించుధీరమతులు
మరలిరారెప్పటికిని జన్మముల బొంద"[33]

అని అర్చిరాది మార్గాన పరమాత్మను చేరిన వారికి పునర్జన్మ లేదన్న విషయాన్ని తెలిపాడు.

పరమాత్మరూపమైన వాసుదేవ పరబ్రహ్మము నందు గలిసే మార్గాన్ని శుకుడు పరీక్షిత్తుకు తెలుపుతూ - "వైష్ణవ పదారోహణంబు సేయువాడు నిర్భయుండై మెల్లన లింగదేహంబున బృథివ్యాత్మకత్వంబు నొంది యట్టి పృథివ్యాత్మకత్వంబున ఘ్రాణంబున గంధంబును, జలాత్మకత్వంబున రసనేంద్రియంబును, రసంబును దేజోరూపకత్వంబున, దర్శనంబున రూపంబును, సమీరణాత్మకత్వంబున దేహంబున స్పర్శనంబును, గగనాత్మకత్వంబున శ్రవణంబును శబ్దంబును నతిక్రమించిన భూత సూక్ష్మేంద్రియ లయస్థానంబైన యహంకారావరణంబున సంప్రాప్తుండై యందు మనోమయంబును దేవమయంబునునైన సాత్త్వికాహంకార గమనంబున మహత్తత్త్వంబు సొచ్చి గుణ త్రయంబున లయించి ప్రధానంబునొంది ప్రధానాత్మకత్వంబున దేహంబును నుపాధి పరంపరావస్థానంబున బ్రకృతిం బాసి యానందమయుండై యానందంబునం బరమాత్మ రూపంబైన వాసుదేవ బ్రహ్మంబునందు గలియును"[33] అని వివరించి ఈ పథంలో వెళ్ళినట్లయితే

కల్పశతాలయినా ఆ జీవి మరలిరాడని తెలిపిన క్రమముక్తి మార్గం 'అర్చిరాది మార్గమే'.

విశిష్టాద్వైతాన్ని ప్రచారం చేసిన శ్రీరామానుజాచార్యులు (1017 - 1137) 120 సంవత్సరాలపాటు జీవించారు. పోతన భాగవతాన్ని 15 శ॥లో రచించాడు. దీనిని పరిశీలిస్తే వ్యాస భాగవతంలో అంతర్వాహినిగా ఉన్న విశిష్టాద్వైత లక్షణాలను గ్రహించి విశిష్టాద్వైతాన్ని సిద్ధాంత రూపంగా శ్రీరామానుజాచార్యులు ప్రకటించి ప్రచారం చేశారనీ, ఆ సిద్ధాంతాలను మరింత విస్తృతంగా ఉదాహణ రూపంగా పోతన తన భాగవతంలో నిరూపించాడని చెప్పవచ్చు.



1. రామానుజాల విశిష్టాద్వైత నిర్మాణానికి 'పాంచరాత్ర సిద్ధాంతాలు, కపిలుని సాంఖ్య యోగం మిగుల తోడ్పడినట్లు పండితాభిప్రాయము - అనుభవానందస్వామి - సర్వ సిద్ధాంత సారభము (7), పు - 235.
2. 'ఏకోహవై నారాయణ ఆసీన్న బ్రహ్మానేశానః, నేమే ద్యావా పృథివీ' (వేద సంగ్రహము) అనుభవానందస్వామి, సర్వసిద్ధాంత సారభం, పు - 245.
3. 'శ్రీమన్నారాయణ ఏవ చిదచిద్విశిష్టాద్వైత తత్త్వం' (శ్రీభాష్యం 1.1.1 - శ్రీరామానుజాలు) అనుభవానందస్వామి సర్వసిద్ధాంత సారభం, పు - 245.
4. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధం పద్యం - 62, పు 12
5. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధం పద్యం - 64, పు 14
6. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధం పద్యం - 186, పు 34
7. పోతన - శ్రీ మహాభాగవతము, ప్రథమ స్కంధం వచనం - 227, పు 41
8. పోతన - శ్రీ మహాభాగవతము, ద్వితీయ స్కంధం పద్యం - 17, పు 94
9. పోతన - శ్రీ మహాభాగవతము, ద్వితీయ స్కంధం పద్యం - 81, పు 107
10. పోతన - శ్రీ మహాభాగవతము, ద్వితీయ స్కంధం పద్యం - 84, పు 107

11. పోతన - శ్రీ మహాభాగవతము, ద్వితీయ స్కంధం పద్యం - 91 - పు 112
12. పోతన - శ్రీ మహాభాగవతము, ద్వితీయ స్కంధం పద్యం - 100 - పు 113
13. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం పద్యం - 75 - పు 11
14. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం పద్యం - 87 - పు 13
15. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం పద్యం - 85 - పు 12
16. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం పద్యం - 95 - పు 14
17. పోతన - శ్రీ మహాభాగవతము అష్టమ స్కంధం వచనం - 97 - పు 14
18. పోతన - శ్రీమద్భాగవతము, చతుర్థస్కంధం వచనం 280, పు - 380
19. పోతన - శ్రీ మహాభాగవతము, ద్వితీయ స్కంధం పద్యం 36, పు - 99.
20. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం వచనం 441, పు - 483.
21. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం వ 567, పు- 267
22. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం పద్యం - 121, పు 17
23. పోతన - శ్రీ మహాభాగవతము, అష్టమ స్కంధం పద్యం - 125, పు 18
24. పోతన - శ్రీ మహాభాగవతము, షష్ఠ స్కంధం పద్యం - 191, పు - 613
25. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం ఉత్తరభాగం వ 1276, పు- 589.
26. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం ఉత్తరభాగం వ 1278, పు 589
27. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం ఉత్తరభాగం వ 1279, పు - 589.
28. పీఠిక - ఆంధ్ర మహాభారతము (మోక్షధర్మ పర్వంలో ఉంది) సంశోధిత ముద్రణము (ఆరవ సంపుటము శాంతిపర్వం) 1977 (చలమచర్ల రంగాచార్య), పు - 61.
29. పోతన - శ్రీ మద్భాగవతము, చతుర్థ స్కంధం పద్యం 653, పు - 448.
30. పోతన - శ్రీ మహాభాగవతము, చతుర్థ స్కంధం వచనం 654, పు - 448.
31. పోతన - శ్రీ మహాభాగవతము, తృతీయ స్కంధం వచనం 1016, పు - 32.
32. పోతన - శ్రీ మహాభాగవతము, తృతీయ స్కంధం పద్యం 1017, పు - 321.
33. పోతన - శ్రీ మహాభాగవతము, ద్వితీయ స్కంధం వచనం 32, పు - 99.





# శ్రీకృష్ణావతార ప్రయోజనాలు

భూమిమీద ఎన్నో జీవులు జన్మనెత్తుతూంటాయి. అవన్నీ అవతారాలు కావు. ఆ జీవులు జననానికి పరమాత్మ జననానికి తేడా ఉంటుంది.

"జీవుడు ఎన్ని జన్మలెత్తినా మాయావశచిత్తుడై అవిద్యోపాధితో ఉంటాడు. పరమాత్మకు ఉపాధి ఉండదు. భూత భవిష్యత్ వర్తమానాలు తెలిసినవాడై మాయా నియామకుడై జన్మిస్తాడు పరమాత్మ'.[1] జీవుడు పునర్జన్మను తప్పించుకోలేడు. జన్మ జీవుని అధీనంలో లేదు. 'విశ్వమంతా వ్యాపించిన బ్రహ్మం లేదా పరమాత్మ జన్మరహితుడయినప్పటికీ జన్మ పరమాత్మ అధీనంలోనే ఉంటుంది. కనుక లోకంలో ధర్మాన్ని సంస్థాపించడం కోసం దేవ తిర్యఙ్మనుష్యాది దేహాలను ధరించి పరమాత్మ అవతరిస్తాడు.

అజోఽపిసన్నవ్యయాత్మాభూతానా మీశ్వరోఽపిసన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా[2]

అనే భగవద్గీతా శ్లోకాన్ని అనుసరించి జన్మరాహిత్యం భగవంతుని సహజ లక్షణమైనా ధర్మ సంస్థాపనార్థం అవతారం దాలుస్తాడని స్పష్టమవుతుంది.

భగవంతుని కళ భూమి మీద ప్రసరించి, ఒక వ్యక్తి చేత లేదా ఒక జీవి చేత లోక కళ్యాణం కోసం ఘనకార్యాలను చేయించడమే అవతరణం. కనుక ఆ కళ లేదా ఆ వ్యక్తి చేసిన ఘనకార్యాల తారతమ్యాన్ని బట్టి అవతార భేదాలు కూడా ఏర్పడతాయి.[3]

అన్నీ పరమాత్మ అవతారాలే అయినా ఒక్కొక్క అవతారం లోనూ భగవచ్ఛక్తి ఎంతవరకు అవసరమో అంతవరకే ఉపయోగించడం జరుగుతుంది. అల్పశక్తితో కార్యం జరుగవలసి ఉన్నప్పుడు 'పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం' రీతిలో అధిక శక్తిని ఉపయోగించడం అనవసరం. కనుకనే కొన్ని అవతారాలలో భగవచ్ఛక్తి తక్కువగాను, మరొక అవతారంలో అధికంగానూ ఉపయోగించవలసి వచ్చింది. ఆయా అవతారాలలో ఉపయోగించిన శక్తిని బట్టే అంశ, అంశాంశ, ఆవేశ, కళ, పూర్ణ, పూర్ణతమ అవతారాలేర్పడ్డాయి. అయితే 'భగవంతుడు ఎప్పుడైతే తన అశేషగుణాలను ప్రకటిస్తాడో అప్పుడు ఆ అవతారం పూర్ణతమావతారం అనబడుతుంది'.[4]

విశ్వంలో నిగూఢంగా వున్న శక్తి విశేషం ఒక వ్యక్తిలో అభివ్యక్తమయి లోక క్షేమానికి ఉపకరించినట్లయితే ఆ వ్యక్తి అవతార పురుషుడుగా పిలువబడతాడు. 'మేధ' అనే శక్తి వ్యాసునిలో అభివ్యక్తమై పురాణాది నిర్మాణం గావించి లోక కళ్యాణానికి తోడ్పడింది. అంతటా ఉన్న మేధాశక్తి అందరిలోనూ పరిమితంగా ఉండి వ్యాసునిలో అపరిమితంగా ఉండడం వల్ల లోక కళ్యాణ కారణమై వ్యాసుని ఆచార్యునిగా భగవదవతారంగా నిలబెట్టింది. శౌర్యాది శక్తులు లేకుండా ఒక్క మేధాశక్తి మాత్రమే ఉండడం వల్ల వ్యాస మహర్షి పూర్ణావతారం కాలేదు. ఇదే విధంగా అర్జునునిలో పరాక్రమ శక్తి భీమునిలో బలశక్తి ధర్మజునిలో సత్యవాదిత్వ శక్తి అభివ్యక్తమై ఆయా విషయాలలోనే వారు వీరులయారు కనుక వీరెవరూ పూర్ణావతారులు కారు. వీళ్లు అంశావతారులవుతారు.[5] ఏదో ఒక శక్తి కాక సర్వశక్తులు కలిగి ఆ శక్తులను లోక కళ్యాణానికి వినియోగించి శ్రీకృష్ణుడు

పూర్ణ తమావతారుడుగా కొలువబడుతున్నాడు. శ్రీకృష్ణుడు సర్వశక్తుల సమ్మేళనంగానే కాక ఏ శక్తిని ఎప్పుడు ఎలా ఉపయోగించి ధర్మ స్థాపన గావించాలో తెలిసిన లోకజ్ఞునిగా కనిపిస్తాడు.

## కృష్ణావతార కారణాలు

ధర్మానికి గ్లాని సంభవించి అధర్మం పెరిగిపోయినప్పుడు సాధు రక్షణ దుష్కృత వినాశనం కావించి ధర్మాన్ని స్థాపించడానికై ప్రతియుగం లోనూ తనకు తానై అవతరిస్తానని భగవద్గీతలో శ్రీకృష్ణుడు స్పష్టం చేశాడు. భగవంతుడ వతరించడానికి ధర్మానికి గ్లాని, అధర్మం పెచ్చుపెరిగి పోవడం, సాధుజనులు దుష్టుల వల్ల కష్టాలు పడడం సంభవించాలి. ద్వాపరంలో కృష్ణావతారానికి పూర్వ పరిస్థితుల గురించి ఆలోచిస్తే -

ఆర్యావర్త మధ్య దేశాన నాయక మణిలా ఉన్న మధురా నగరానికి రాజు సాధుజన ద్వేషి, రాజ్య కాంక్షతో తల్లిదండ్రులను సైతం కారాగారంలో ఉంచినవాడు, సోదరిని చంపబోయిన వాడు, సోదరిని ఆమె భర్తను బంధించినవాడు, దుష్ట రాక్షస సహాయకుడు, బంధువిరోధి, (చివరకు శిశు హంతకుడు) అయిన కంసుడు. మగధరాజు అశస్త్ర వధ్యుడు, అపార సేనా సహితుడై ఎంతోమంది రాజులనోడించి తెచ్చి శివునికి బలి యిచ్చేవాడు అయిన జరాసంధుడు. కాముకుడై 16000 కన్యలను నిర్బంధించిన ప్రాగ్జ్యోతిష పురాధిపతి అయిన నరకుడు, గుడ్డివాడై పుత్రప్రేమతో జ్ఞాన శూన్యుడయిన ధృతరాష్ట్రుడు. వీరు కాక ఎంతో మంది ప్రత్యక్ష పరోక్ష రాక్షసులు భూమికి భారమయ్యారు. వీరు చేసే ఆగడాలకు దౌష్ట్యాలకు భూమిమీద సాధుజనులు ఎన్నో కష్టాలకు గురి అయి అల్లాడసాగారు.

"...... వేల సంఖ్యల దైత్యవిభులు దన్ను నాక్రమించిన భారమాగ జాలక భూమి"[6] సాధుజనులకు ప్రతినిధిగా గోరూపంలో "కన్నీరు మున్నీరుగా రోదిస్తూ"[7]

బ్రహ్మతో తన కష్టాలను మొరపెట్టుకుంది. సృష్టికర్త అయిన బ్రహ్మ ఎంతో మంది వేల్పులతోనూ గోరూపంతో ఉన్న భూదేవితోనూ పాలకుడు రక్షకుడు అయిన విష్ణువు దగ్గరకు వెళ్ళి అద్భుత సమాధిగతుడై పురుషసూక్తంతో మహావిష్ణువును ప్రార్థించాడు. గోవు ధర్మానికి ప్రతీకగా చూపబడుతుంది. భూమి గోవుగా రావడం అనేది భూమి మీదున్న ధర్మాత్ముల ఆక్రందనలే గోరూపంలో చేరాయని చెప్పడానికే. ఆవిధంగా ధర్మమే మొరపెట్టుకోడానికి వస్తే అంతకన్నా భగవంతుడవతరించడానికి కావలసినపరిస్థితులేముంటాయి. భగవదాజ్ఞతో యాదవకులంలో అమరులంతా తమ తమ అంశలతో పుట్టునట్లుగాను ఆ శ్రీదయితుడు వసుదేవునికి జన్మించి 'భారమంతయున్ బాపునట్లు' గాను హరిపూజార్థం సురకన్నెల సుందరాంగనలుగాను శేషుడు హరికి అగ్రజుడుగాను పుట్టేట్లుగా ఈ ప్రపంచమంతా ఏ 'మాయ' ఆవరించి ఉందో ఆ 'మాయ' సైతం కార్యార్థమై భూమిమీద పుట్టేట్లు గాను నిర్ణయం జరిగింది.

త్రేతాయుగంలో శ్రీరామునిగా అవతరించిన శ్రీహరి దుష్టశిక్షణ శిష్టరక్షణ జేసి ధర్మాన్ని స్థాపించడానికి గాను స్వచ్ఛమైన 'మానవత్వాన్ని' ప్రదర్శించి మానవధర్మాన్ని లోకానికి చాటి ఆదర్శ మానవునిగా వెలుగొందాడు. తిరిగి అవే గుణాలు ప్రదర్శించి నెగ్గుకు రాగలిగే పరిస్థితులు ద్వాపరయుగంలో లేవు. రాక్షస ప్రవృత్తితో చెలరేగిన ఎంతోమంది రాజులతోను, వారి దౌష్ట్యాలతోను నీతి నిజాయితీలకు పూర్తిగా సమాధికట్టిన కాలం ద్వాపరంలో నెలకొంది. నిజాయితీగా ముందడుగు వేస్తే దుష్టశిక్షణ సాధుజన రక్షణ ధర్మ సంస్థాపన చేయడం సాధ్యం కాని పరిస్థితులు నెలకొన్నాయి.

త్రేతాయుగంలో మానవత్వానికి ధర్మానికి కట్టుబడి జరిగిన దుష్టశిక్షణ ద్వాపరంలో ఆయా పరిస్థితుల కనుకూలంగా అధర్మం మోసం వంటివి ధర్మస్థాపన

కోసం ఉపయోగించి, మానవాతీత శక్తులను (భగవచ్ఛక్తిని) ఉపయోగించి చేయవలసి వచ్చింది. దీనికి కారణంగా లక్ష్యం ఉత్తమమైన దయినపుడు లోక కళ్యాణానికే అయినప్పుడు ఏ మార్గాన్ని అనుసరించి అయినా దానిని సాధించడమే ముఖ్యమనే సిద్ధాంతం శ్రీకృష్ణావతారంలో స్పష్టంగా కనబడుతుంది. వజ్రాన్ని వజ్రంతో కోసినట్లుగా అధర్మాన్ని అధర్మంతోనయినా సరే జయించి ధర్మాన్ని రక్షించాలన్న ఉద్దేశం కృష్ణావతారంలో వెల్లడవడమే కాక అడుగడుగునా శ్రీకృష్ణుడు సాక్షాత్తూ భగవానుడేనన్న సత్యాన్ని నొక్కి చెప్తుంది. అయితే కృష్ణుడు అవలంబించిన ఈ విధానం పైకి అధర్మంలా కనబడినా నిజానికి సూక్ష్మధర్మం మాత్రమే.

కృష్ణావతారంలో శ్రీకృష్ణపరమాత్మ ఎంతోమంది కష్టాలను తొలగించడమే కాక ఎంతోమందిని భవబంధవిముక్తులను చేయడానికి పూనుకున్నాడు. మునుపు రామావతారంలో ఎంతో మందికిచ్చిన వాగ్దానాలు వరాలు శ్రీకృష్ణునిగా తీర్చడం జరిగింది. ఈ విధంగా శ్రీకృష్ణుని ద్వారా ద్వాపరంలో జరిగిన ప్రతిచర్య ప్రతిలీలా భూభారాన్ని తగ్గించడానికీ, కొందరికిచ్చిన వాగ్దానాలు తీర్చడానికి, శాప విమోచనాలు చేయడానికీ, ధర్మసంస్థాపనకి దారితీస్తూ భగవత్తత్త్వాన్ని వెల్ల డించేట్లుగా స్పష్టం అవుతుంది. ఈ లీల శ్రీకృష్ణ జననానికి ముందునుంచే ఆరంభమయింది.

భూదేవికి అభయమిచ్చి ఏర్పరచిన పథకం ప్రకారం దేవకీ వసుదేవులకు శ్రీకృష్ణుడు ఉద్భవించవలసి ఉంది. కంసునిగా పుట్టిన కాలనేమిని ప్రధానంగా సంహరించాల్సి ఉంది. ఈ కార్యాలు అతిసామాన్యంగా జరిగితే భగవత్తత్త్వం వెల్లడి కాదు. భగవానుని ఒక్క చర్యలో అనేకం ఇమిడి ఉంటాయి.

కంసుని రెచ్చగొట్టి రాక్షస ప్రవృత్తిని మరింత పెంచాలి. కంసుని చంపడానికి తనకు కారణాలు కల్పించుకోవాలి. అందుకై ఎంతో ప్రేమతో నూత్న వధువు

అయిన సోదరిని (దేవకిని) అత్తవారింటికి చేర్చడానికి ఎంతో ఉత్సాహంతో స్వయంగా రథాన్ని నడుపుతున్న కంసుని అశరీరవాణి ద్వారా -

> "తుష్టయగు భగిని మెచ్చగ
> విష్టుడవై రథము గడపె దెఱుగవు మీదన్
> శిష్టయగు నీతలోదరి
> యష్టమ గర్భంబు నిన్ను హరియించుజుమీ" [8]

అంటూ హెచ్చరింపజేశాడు. ప్రాణభీతి ముందు కంసుడి సోదరప్రేమ చచ్చిపోయింది. వెంటనే దేవకి కొప్పుపట్టి ఖడ్గంతో ఖండించబోయాడు. అయితే వసుదేవుని అర్థింపును పిల్లల్ని కంసునికిస్తానన్న మాటను మన్నించి శాంతించాడు. కానీ మాట తప్పక మొదటి పుత్రుని తెచ్చి ఇచ్చిన వసుదేవుని నిజాయితీకి మెచ్చి

> "కొడుకు నీవు మరలిగొని పొమ్ము వసుదేవ
> వెఱపులేదు నాకు వీని వలన
> వల్ల వీనికి భవదష్టమ పుత్రుండు
> మృత్యువట వధింతు మీద వతని" [9]

అని వదిలిపెట్టాడు. కంసుని ఈ సాత్త్వికత కంసుని మరణానికి 'అడ్డు'గా తలచిన భగవానుడు తిరిగి నారదుని ద్వారా

> "................. మందలోపలనున్న నందాదులును వారి
> భార్యలు బుత్రులు బాంధవులును
> దేవకి మొదలగు తెఱవలు వసుదేవు
> దాదిగా గల వర్ష్ణియాదవులును
> మరలుగాని నిజంబు నరులు గారని చెప్పి
> కంసుండ! నీవు రక్కసుడవనియు

దేవమయుడు చక్రి దేవకీదేవికి
బుత్రుడై జనించు భూతలంబు
సెఱుప బుట్టినట్టి చెనటి దైత్యులనెల్ల
జంపు ......................................." [10]

అని చెప్పించాడు. దానితో తాను 'నారాయణ కర ఖడ్గ విదారితుడగు కాలనేమి'నని యెఱిగినవాడై కంసుడుగ్రుడై దేవకీ వసుదేవులను పట్టి బంధించి వారు కన్న పుత్రులారుగురిని చంపాడు.

కంసునిలో రాక్షస ప్రవృత్తి పూర్తిగా మేల్కొంది. తన సహచరులైన 'బాణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టికారిష్ట ద్వివిద పూతనాది సహాయసమేతుడై'[11] యాదవులందరినీ యుద్ధంలో ఓడించాడు. చెల్లాచెదరైన యాదవులు 'నిషధకురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాల సాళ్వ'[12] దేశాలకు పోగా కొందరు మాత్రం కంసునికి లొంగి కంసుని కొలువసాగారు.

దేవకి సప్తమ గర్భంగా ఆది శేషుని అంశను ధరించింది. తనకు తోడుగా పెరగవలసిన శేషాంశను రక్షించాలనే ఉద్దేశ్యంతో దేవకీ గర్భాన ఉన్న శేషాంశను రోహిణీ గర్భంలో నిల్పమని యోగమాయని నియోగించి తాను దేవకికి అష్టమ గర్భాన ఆవిర్భవిస్తానని, నందుని భార్య యశోదకు బిడ్డగా యోగమాయను జన్మించమని భగవంతుడు ఆనతిచ్చాడు. యోగ మాయా ప్రయోగం వల్ల దేవకీ గర్భాన ఉన్న శేషాంశ రోహిణీ గర్భాన జన్మించి బలభద్రుడని బలరాముడని సంకర్షణుడని పిలువబడుతూ దినదిన ప్రవర్ధమానంగా పెరుగసాగాడు. అక్కడ దేవకీ సప్తమ గర్భం జారినట్లుగా అందరూ భావించారు.

## శ్రీకృష్ణుని ఆవిర్భావం

అష్టమ గర్భాన శ్రీహరి తేజం ప్రవేశించి పెరుగజొచ్చింది. ఆ కారణాన దేవకి మునుపెన్నడు లేని వింత కాంతులతో వెలుగొంద సాగింది. దేవకీ గర్భస్థుడైన పరమాత్మను బ్రహ్మాది దేవతలు వచ్చి ఎన్నో విధాలుగా స్తుతించి భగవదవతరణాకై స్వాగతం పలికి వెళ్ళారు.

తన ప్రార్థనను విని బాలునిగా ఆవిర్భవించబోతున్న పరమాత్మను తలుచుకొంటూ ఉప్పొంగిపోయింది భూదేవి. అందుకు సాక్ష్యంగా భూమిపైన ఉన్న పంచభూతాలు పరవశించిన తీరును పరిశీలించినట్లయితే భూదేవి ఆనందం అవగతమవుతుంది.

*స్వచ్ఛంబులై పొంగె జలరాసులేడును*
*గలఘోషణముల మేఘంబులుఱిమె*
*గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె*
*దిక్కులు మిక్కిలి తెలివిదాల్చె*
*గమ్మని చల్లని గాలిమెల్లన వీచె*
*హోమానలంబు చెన్నొంది వెలిగె*
*గొలకులు కమలాళి కులములైపిరినొప్పె*
*బ్రవిమలతోయలై పాఱెనదులు*
*వరపురగ్రామ ఘోషయై వసుధయొప్పె*
*విహగరవపుష్పఫలముల వెలసెవనము*
*లలరుసోనలు గురిపిరయ్యమరవరులు*
*దేవదేవుని దేవకీదేవి గనగ"* [13]

అంత 'శుభలగ్నాన' [14]

జలధరదేహు నాజాను చతుర్బాహు
　　సరసీరుహాక్షు విశాలవక్షు
చారుగదాశంఖ చక్రపద్మవిలాసు
　　గంఠకౌస్తుభమణి కాంతి భాసు
గమనీయ కటిసూత్రకంకణ కేయూరు
　　శ్రీవత్సలాంఛనాంచిత విహారు
మరుకుండల ప్రభాయుతకుంతలలలాటు
　　వైడూర్య మణిగణ వరకిరీటు
బాలు బూర్ణేందు రుచిజాలు భక్తలోక
పాలు సుగుణాలవాలు గృపావిశాలుడు"[15]

దేవకికి ఉద్భవించాడు. పుట్టినది భగవంతుడని గ్రహించి దేవకీ వసుదేవులు ఎన్నో విధాల స్తుతించి-

"ఒంటినిల్చి పురాణయోగులు యోగ మార్గనిరూఢులై
కంటిమందురుగాని నిక్కముకానరీభవదాకృతిం
గంటి, భద్రముగంటి, మాంసపు గన్నులంగనబోల, దీ
తొంటిరూపు దొలంగ బెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్"[16]

అని ప్రార్థించి చతుర్బాహువుల తోనున్న పరమాత్మని బాలరూపునిగా మారమని వేడుకున్నారు.

ఆ పరమాత్మ దేవకీ వసుదేవులకు వారి పూర్వజన్మలో వారికి తానిచ్చిన వరాన్ని గుర్తుచేసి వారికిది చివరి జన్మయని తెలిపి బాలుని రూపాన్ని పొందాడు. హరియాజ్ఞ ప్రకారం హరి మాయ తనకు తోడుగా ఉండడం వలన ఆ బిడ్డను తీసుకుని యమునను దాటి వ్రేపల్లెలో నందుని సతి యశోద వద్ద నుంచి యశోదకు

పుట్టిన ఆడ శిశువును తీసుకువచ్చి దేవకికి ఇచ్చాడు. దేవకి వద్ద మంచి బిడ్డను తీసుకుపోయే సమయాన కారాగారానికి ఆవల ఉన్న కావలివారు గాఢనిద్రలో ఉండడం, వసుదేవుని బంధించి ఉంచిన సంకెళ్ళు కారాగారానికి ఉన్న తాళాలు వాటికవే తొలగిపోవడం, సర్పం తన పడగలతో బిడ్డను కప్పి కాపాడుతూ వెంటరావడం, యమున వసుదేవునికి దారి ఇవ్వడం, యశోద తదితరులు సైతం నిద్రలో మునిగి ఉండడం, యశోద బిడ్డకు తిరిగి కారాగారానికి తెచ్చి వసుదేవుడు బందీ అయిన వెంటనే అప్పుడే జన్మించిన రీతిలో యశోద బిడ్డ కారాగారంలో ఏడవడం - అన్నీ భగన్మాయకు లోనై జరిగినవే.

భగవంతు డవతరించిన వెంటనే తన తండ్రి వసుదేవుని చేత చేయించిన మొదటి కార్యం రహస్యంగా బిడ్డలను మార్పిడి చేయడం. నిజానికిది ఎంతటి నేరమైనా నేరంగా పరిగణింపబడలేదు. కారణం అది భగవత్సంకల్పం. కంసుని పాపం పండడానికి మరింత గడువు, పూతనాది రాక్షస గణాలను పరిమార్చవలసిన కర్తవ్యం ఇంకా మిగిలి ఉండడమే.

దేవకి అష్టమ గర్భాన శిశువు జన్మించడం తెలిసి కంసుడు ఆడశిశువని కూడా చూడక చంపజూసి మరింత పాపం పెంచుకున్నాడు. ఆ శిశువు యోగమాయ కనుక కంసుని చేతబడి చావక ఆకాశానికి ఎగిరి 'గదా శంఖ చక్రపద్మ శరచాపాసి శూలధారిణియునై యెనిమిది కరంబులం గరంబొప్పుచూ'[17]

*"తెంపరి వైపారింబోరివి దేవకి బిడ్డల జిన్ని గుఱ్ఱలం*
*జంపితి వంతనైన మపశాంతి వహింపకటాలమీద నా*
*ప్పింపగనిప్పిరో! యిదియు బీరమె? నా పరపన్ జనియించివిన్*
*జంపెడి వీరుడొక్కదెవ పత్ప్రతి వొందెడువాడుదుర్మతీ"* [18]

అవి కంసుని హెచ్చరించి మరింత భయభీతునిగావించింది.

*"పాపుడ బాలఘాతకుడ, బంధువిరక్తుడ, దుష్టచిత్తుడం*
*గోపమడం జరన్మృతుడ గ్రూరుడ, బ్రాహ్మణ హంతభంగి మీ*
*పాపల జంపితిం! బయలిపల్కులనమ్మితి సాధులార నా*
*పాపములుగ్గడింపక కృపాపరులై కవరే! శమింపరే"* [19]

అంటూ కంసుడు తనకు తానుగా తన పాపాలను ఏకరువు పెట్టుకుని వసుదేవుని క్షమార్పణ వేడడం - విరక్తుడై దేవకీ వసుదేవులను బంధ విముక్తుల జేయడం, కంసునిలో తిరిగి సాత్విక ధోరణి ప్రవేశించిన దానికి చిహ్నం. దానిని తొలగ దోయడం కంసుని చేత మరిన్ని పాప కార్యాలు చేయించడం కంసుని మంత్రుల ద్వారా జరిగింది. కంసుని చంపే శిశువు భద్రంగా మరొక్కచోట పెరుగుతున్నాడని తెలిసి

*"ఇట్టైన దడయనేటికి*
*బట్టణముల మందలందు బల్లెల నెల్లం*
*బుట్టెడి పెరిగెడి శిశువుల*
*బట్టి వధించెదము మమ్ముబంపు మధీశా"* [20]

అని అనడమే గాక శ్రీహరి నెలవులైన దేవతలను గోవులను బ్రాహ్మణులను "తితిక్షామ్నాయ కారుణ్య సత్యములను యోగ తపో దమంబులను శ్రద్ధా శాంతులను విష్ణుదేహములన్నిటిని"[21] సంహరించినట్లయితే శ్రీహరి అంతమొందుతాడని కంసుని ఎగదోసి కంసుని ఆజ్ఞతో చెలరేగి సాధుజనులను హింసించి వధించి తమ పాపాలను తద్వారా కంసుని పాపాలను పెంచసాగారు. వీరి పాపాల పెంపుకోసమే వేచి చూస్తున్న భగవానుడు నందుని యింట యశోద నోముల పంటగా జన్మించిన చిన్న బాలునిగా కొనియాడబడుతూ వెలుగొంద సాగాడు.

ఇక్కడ భగవానుడు దేవకీ వసుదేవులకే ఎందుకు జన్మించాలి? యశోద దగ్గర ఎందుకు పెరగాలి? తన అవతరణకు ముందుగానే దేవకికి జన్మించిన ఆర్గురు శిశువులు కంసుని చేత ఎందుకు చంపబడాలి? అది తెలిసినా భగవంతుడెందుకు ఉపేక్షించాలి? అష్టమ గర్భంగానే తిరిగి దానిని రోహిణి గర్భాన ప్రవేశపెట్టడం ఎందుకు? యశోదకు యోగమాయ ఎందుకు జన్మించాలి? అనే సందేహాలు వస్తాయి.[22] భగవానుడు శ్రీకృష్ణునిగా దేవకీవసుదేవులకు పుట్టడానికి గల కారణం భాగవతంలోనే కనిపిస్తుంది.

స్వాయంభువ మన్వంతరంలో పృశ్ని సుతపులు భార్యాభర్తలుగా ఉండి పన్నెండు వేల దివ్య వర్షాలు తీవ్ర తపస్సుచేసి శ్రీహరి ప్రత్యక్షమై వరం కోరుకోమనగా శ్రీహరినే కొడుకుగా పుట్టమని కోరుకున్నారు. ఆకారణాన ఆ జన్మలో వారికి శ్రీహరి పృశ్ని గర్భుని గాను, తరువాతి జన్మ అయిన అదితి కశ్యపులకు వామనునిగాను జన్మించి, ద్వాపరంలో మూడవసారికూడా దేవకీ వసుదేవులుగా జన్మించిన పృశ్ని సుతపులకే కొడుకుగా ఆవిర్భవించాడు. జన్మించిన వెంటనే శ్రీహరి రూపుగా కనబడి -

'ఇప్పుడు మూడవబాముున
దప్పక మీ కిరువురకుమ దనయుడనైతిం
జెప్పితి పూర్వము మీయం
దెప్పటికిని లేదు జన్మమిటపై వాకున్'[23]

వందను డనియుం పరమా
నందంబగు బ్రహ్మమనియు నమదలచుచువా
పెందెరువు నొందెదరువా
యందలి ప్రేమమున భవమువందరు మీరల్'[24]

అని తెలిపి దేవకీ వసుదేవులకు (పృశ్ని సుతపులకు) ఇక జన్మలు లేనట్లు ఆ జన్మలోనే ముక్తి లభించేట్లు తెలిపాడు.

దేవకికి పుట్టిన శ్రీకృష్ణ పరమాత్మ యశోద వద్దకు మారి ఆమె స్తన్యాన్ని గ్రోలి తన లీలలతో ఆనందింపజేశాడు. యశోద స్తన్యాన్ని గ్రోలి ఆమె వద్దే పెరగడానికి గల కారణం కొంత భాగవతం తెలుపుతుంది. ద్రోణుడనే వసువు అతడి భార్య ధరాదేవి వసుధపై జన్మించమని బ్రహ్మతమకు తెలుపగా 'విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి మాకిచ్చి తేని మహి జన్మింతుమ'ని కోరారు. దానికి హరిని సేవించే భాగ్యాన్ని కోరిన కారణం వల్ల కృష్ణుని పెంచగలిగారని భాగవతం చెప్తున్నది. అయితే దీనికి సంబంధించిన ఒక వ్యావహారిక కథ మరింత విపులంగా యశోదను కృష్ణునికి తల్లిని చేసిన కారణాన్ని వివరిస్తుంది.

ఒక వనంలో జీర్ణపర్ణ కుటీరంలో ద్రోణుడు ధర అనే ద్విజ దంపతులు నివసించేవారు. వారు అతి పేదవారు. హరిభక్తులు. పతివ్రత అయిన ధరాదేవి భర్తకు అనుకూలవతిగా ఉంటూ భర్త యాచించి తెచ్చినదానిని వండిపెట్టి అతిథి అభ్యాగతులను ఆదరిస్తూ తాను తినీ తినక జీవిస్తూ ఉండేది.

ఒకనాడు ఒక యువకుడు తన ముసలి తల్లిదండ్రులతో ఆపర్ణశాలకు వచ్చి తన తల్లిదండ్రులు ఆకలితో నున్నారని, వారి ఆకలితీర్చమని అర్థించాడు. భర్త భిక్షం తెచ్చిన వెంటనే భోజనం పెడతాననీ విశ్రమించమనీ కోరింది ధరాదేవి. ఎంతకూ ఆమె భర్త రాని కారణాన ఆ యుకుడు మరొక ఇంటికి పోయి తల్లి దండ్రులకు తిండి పెట్టించి వారి ప్రాణం నిలుపు కుంటానని పోబోగా అతిథి ఈశ్వర స్వరూపుడని తమ ఇంటికి వచ్చిన అతిథి నిరాశతో తిరిగి పోరాదని తలచి వారిని ఆపి తానే ప్రక్క గ్రామానికి వెళ్ళి ఒక వణిజాని దుకాణానికి పోయి తన పరిస్థితిని చెప్పి సరుకులు ఇవ్వమని యాచించింది.

ఆమె సౌందర్యానికి ముగ్ధుడైన ఆ వణిజుడు సరుకులను ఇచ్చి ధరాదేవిని కాముక దృష్టితో ఆపాద మస్తకమూ చూస్తూ తాను చేసేది వ్యాపారమని ఈ సరుకులను గ్రహించి దాని ప్రతిఫలంగా డబ్బో అది తేలేకపోయినట్లయితే ఆమె వద్ద నున్న దానిని మరేదైనా ఇవ్వమని కోరాడు. దానికి తన వద్ద ఏమీ లేదనీ ఉన్నట్లయితే తప్పక ఇవ్వగలననీ అతడు తీసుకోవచ్చుననీ భగవంతుని మీద ప్రమాణం చేసి చెప్పింది. ఆ కాముకుడు తన కాముక భాషలో ధరాదేవి స్తనాల వైపుకు చూపాడు. తాను భగవంతునిపై ప్రమాణం చేసి మాట ఇచ్చిన కారణంగా అతడు కోరిన మాంసపు ముద్దల వంటి స్తనాలు తన వక్షానికి వ్యర్థంగా ఉండడమెందుకని వాటిని ఇచ్చి అతిథులకు కావలసిన భోజన సామగ్రి తీసుకోవచ్చని తలచి అక్కడ ఉన్న పదునైన కత్తితో స్తనాలను కోసి ఆ వణిజునిపై విసరి రక్తధారలు కారుతుండగా సామాగ్రిని తీసుకుని అతి వేగంగా ఇంటికి వచ్చి యువకుని కిచ్చి స్పృహ తప్పి పడిపోయింది.

కొంతసేపటికి లేచి చూడగా యువకుడు చతుర్భుజుడైన శ్రీహరిగాను తల్లిదండ్రులు శివపార్వతులుగాను దర్శనమిచ్చారు. శ్రీహరి 'మాకై స్తనాలను దానమిచ్చినందువల్ల ద్వాపరాంతంలో నీకు పుత్రుడనై నీస్తన్యాన్ని గ్రోలి నీకత్యంత సుఖాన్ని ఇస్తానని 'వరం ఇచ్చాడు. పార్వతి కూడా 'నేను నీ పుత్రికనై జన్మిస్తానంది. ఇంతలో ద్రోణుడు కూడా వచ్చి భగవద్దర్శనం గావించుకున్నాడు. ఆ ద్రోణుడే అష్టమ వసువుగా జన్మించగా ధరాదేవి అతని భార్య అయింది. వీరినే బ్రహ్మ భూమిపై పుట్టి గోవంశాన్ని పాలించమనగా శ్రీహరి పాదసేవను ప్రసాదించి నట్లయితే భూమిపై జన్మిస్తామని అన్నారు. దానికి బ్రహ్మ శ్రీహరి మీకు పుత్రుడై తన లీలలతో సుఖాన్ని చేకూరుస్తాడని తెలియజేశాడు. ఈ కారణంగా దేవకికి పుట్టిన శ్రీకృష్ణుడు యశోద వద్దకు జేరి ఆమె స్తన్యాన్ని గ్రోలి తన లీలలతో యశోదా నందులను ధన్యులను చేసినట్లుగా కథ ప్రచారంలో ఉంది." [25]

శ్రీహరి తన అవతరణకు ముందుగా దేవకికి పుట్టిన ఆరుగురు పుత్రులను కంసుని బారి నుంచి రక్షించకపోవడానికి కారణం -

పూర్వం స్వాయంభువ మనువుకాలంలో మరీచి మహర్షికి భార్య ఊర్ణాదేవికి ఆరుగురు పుత్రులు. వీరు ధర్మ విచక్షణులు బలశాలురు. అయినప్పటికీ ఒకనాడు తాను సృష్టించిన కన్యనే కామించాడని బ్రహ్మను పరిహసించి బ్రహ్మకోపానికి గురి అయి రాక్షస వంశాన జన్మించేట్లుగా బ్రహ్మచేత శాపాన్ని పొందారు. తరువాతి జన్మలో వారు హిరణ్యకశిపునికి పుత్రులైపుట్టి పూర్వజన్మ జ్ఞానం కలగడం వల్ల శాంతులై తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి 'దేవదానవ గంధర్వసిద్ధ మహోరగాల చేత మానవులచేత చావులేకుండా వరాన్ని పొందారు. అది తెలిసి హిరణ్యకశిపుడు తనని కాదని బ్రహ్మకోసం తపస్సుచేసి వరాలు పొందారన్న కోపంతో వారిని త్యజించి పాతాళ లోకంలో పెక్కు సంవత్సరాలు నిద్రావశిష్టులై ఉండి తరువాత జన్మలో కంసునిగా పుట్టిన కాలనేమి చేత చంపబడేట్లుగా శపించాడు.

ఆ శాపకారణంగా దేవకికి పుట్టిన ఆరుగురు పుత్రులు నిస్సహాయులై కంసుని చేత చంపబడ్డారు. [26]

త్రేతాయుగంలో శేషాంశ అయిన లక్ష్మణుడు శ్రీరామునికి తమ్ముడైపుట్టి సేవించిన కారణాన శ్రీరాముడు తాను మరు జన్మలో తమ్ముడైపుట్టి సేవిస్తానన్నాడు. కనుక సప్తమ గర్భంగా శేషాంశ ముందుగా దేవకి గర్భాన చేరింది. కంసుని వాత పడకుండా ఉండేందుకు గర్భంలో ఉండగానే వసుదేవుని మరియొక భార్య గర్భంలో ఆ అంశను యోగమాయ ప్రవేశపెట్టింది. ఈ విధంగా బలరాముడు కృష్ణునికి అగ్రజునిగా జన్మించాడు.

ఈ విధంగా కృష్ణావతరణంలోని ప్రతి అంశమూ ఒకదానికొకటి అవినాభావ సంబంధం కలిగి ఉన్నాయి. కృష్ణావతరణం అతి జాగ్రత్తగా ఏర్పరచిన పథకంగా జరిగిందని చెప్పవచ్చు. [27]

## గోకులంలో శ్రీకృష్ణుని ప్రకటనం

శ్రీకృష్ణ పరమాత్మ కంసుని కనుగప్పి గోకులం చేరి యశోదకు పుట్టిన శిశువుగా పెరుగుతుండగా దానవ వీరులు కంసుని ఆజ్ఞ మేరకు దౌర్జన్యంతో సజ్జనుల పాపాలను అమితంగా ఆర్జించి తత్ఫలితంగా "బలము యశము సిరియు ధర్మమాయువు భద్రంబు" కోల్పోసాగారు. భగవంతుని తమ బిడ్డగా పొందిన యశోదా నందులతోబాటు ఆ బాలుని ప్రతిచేష్టకు ప్రతిలీలకు పరవశించి గోపికలు గోపకులు సకల శుభాలను పెంచుకోసాగారు.

భగవంతుని గొప్పగా భావించి భయభక్తులతో గౌరవంగా పూజలర్పించిన వారి కన్నా భగవంతుని తమలో ఒకనిగా కలుపుకుని తమ ప్రాణంలో ప్రాణంగా భావించి ఇష్టంతో ప్రేమతో స్నేహంతో కలిసిమెలసి జీవించిన వ్రజవాసులు ధన్యులవడంలో అతిశయోక్తిలేదు. గోకులంలో కృష్ణుడు అనేక అద్భుతాలు లీలలు చేసినా కృష్ణుని మానవాతీతునిగా పరమాత్మగా 'పెద్ద' చేసి తమ నుండి దూరంగా ఉన్నతంగా నిలబట్టి పూజించలేదు.

ఆ రూపంగా తనను దూరం చేసే అవకాశం భగవంతుడు వారికి ఇవ్వలేదు. నోటిలో విశ్వమంతా చూపించి తానే విశ్వమంతటికి ఆధారమని తెలియజెప్పి 'కలయో వైష్ణవ మాయయో' అంటూ అయోమయావస్థలో "బాలుభంగి నితడు భాసిల్లుగాని సర్వాత్ముడాది విష్ణుడగుట నిజము" [29] అని గ్రహించిన యశోదను సైతం వైష్ణవ మాయలో (స్వయంగా పుత్ర వ్యామోహంలో) పడవేశాడు. తనను పరమాత్మగా తెలుసుకున్నప్పటికీ ఆ భక్తులు తనను ఆత్మీయునిగా చేరడం భగవంతునికి ఆనందకరమనే విషయం తెలుస్తుంది.

*లోకములు నిదుర బోవగ*
*బోకొట్టుచు నిదురబోవి శుభగుడు రమణుల్*

జోకొట్టిపాడ నిదురం
గైకొను క్రియనూరకుండె గనుదెరవకయున్" [30]

అన్న పోతన పద్యం శ్రీకృష్ణునికి గోపికలలాలింపు (లోని మాధుర్యం) ఎంత ప్రీతికరమో స్పష్టం అవుతుంది.

బాలకృష్ణుడు వ్రజవాసుల ప్రాణంలో ప్రాణంగా పెరుగుతూనే తనను హతమార్చవచ్చిన దానవులకు ఎటువంటి జాప్యం చేయక సద్గతులు ప్రసాదించాడు.

భగవంతుడు మోక్షాన్ని భక్తుల కన్నా భగవద్వ్యతిరేకులకే త్వరగా ఇస్తాడని అనిపిస్తుంది. భక్తులను కరుణించడంలో చేసే జాప్యం భగవంతుడు భగవద్ద్వేషుల విషయంలో చేయడు. సన్మార్గుడైన పుత్రుని గురించి కన్నా దుర్మార్గుడైన పుత్రుని గురించే తల్లిదండ్రులకు ఆరాటం అధికంగా ఉంటుంది. ఏమాత్రం అవకాశం వచ్చినా దుర్మార్గుడైన పుత్రుని గురించే ఆలోచిస్తారు. భగవంతుడు సర్వజగత్తుకూ తండ్రి కనుకనే దుర్మార్గులను దుష్టులను శిక్షించి వారికి సద్గతి నివ్వడంలో జాప్యాన్నీ చేయడు. దుర్మార్గులయిన వారి విషయంలో స్త్రీ పురుష భేదాన్ని గాని వావివరుసల్ని గాని జంతుభేదాన్ని గాని పాటించడు.

## పూతనోద్ధరణం

బాలకృష్ణుని బారిపడి సద్గతిని పొందిన వారిలో పూతన మొదటిది. పూతన స్త్రీ; అందునా ఎంతో ప్రేమచూపుతూ ఎవరి వారింపులు లెక్కచేయక బాలకృష్ణుని నోటికి తన స్తనాన్ని అందించింది. అంత ప్రేమను ప్రదర్శించినా కంసుని పనుపున ఎంతోమంది శిశువులను బలిగొంటూ తనను మట్టుపెట్టాలని వచ్చిన పూతన లోగుట్టు తెలుసుకుని నవ్వుకుని -

'ఆలోకేశ్వరుడా చరాచర విభుండా బాలగోపాలుడా
బాలధ్వంసిని'[31]

ఒడిలోకి జేరి -

"బిగి చన్నుగవ గేల బీడించి కబళించి
    గ్రుక్క గ్రుక్కకు గుటుగుటుకు మనుచు
నొకరెండు గ్రుక్కల నవిదప్రాణంబులు
    సైతము మేనిలో సత్త్వమెల్ల

ద్రావె; వదియును గుండెలు దల్లడిల్ల
జిమ్మ దిరుగుచు నిలువ శిరముద్రాల
నితబాలుర క్రియ వాడువీవుగావు
చన్ను విడువుము విడువుము చాలు...."[32]

గిలిగిల్లాడి కూలింది. పడుతూ తన అతి సుందరమైన కామరూపాన్ని వదలి ఆరుక్రోసుల పొడవున్న తన వికార రాక్షస రూపంతో ప్రాణాలను వదిలింది.

బాలకృష్ణుడు ప్రప్రథమంగా 'దుర్జనవధ' ప్రారంభించింది స్త్రీతో. స్త్రీ అయినా దుష్టుడైన కంసుని సాంగత్యంలో ఉండి తనను చంపవచ్చిన దుష్టురాలు. తక్షణం ఆమెను వధించి ఆ రాక్షస దేహం నుంచి మోక్షాన్ని ప్రసాదించాడు.

విషం నింపుకు వచ్చినా పాలిచ్చిన పూతన తల్లిలా నటిస్తూ వచ్చింది. కేవలం కపటంతోనయినా తల్లిలా వచ్చిన పూతనకు సద్గతి లభించింది. పూతనకు మోక్షం లభించడానికి కారణం పూర్వ జన్మలోని పూతన సంకల్పం .

పూతన పూర్వజన్మలో బలి చక్రవర్తి పుత్రిక రత్నమాలయని, ఆమె బలిచక్రవర్తి దగ్గరకు వచ్చి వామనమూర్తిని చూసి ముచ్చటపడి 'ఇట్టి పుత్రకుడు

దారొక్కనినన్ జనుబాల నిత్తుగా' అని కోరుకున్న కారణాన ఈ జన్మలో పూతనయై శ్రీహరిని స్పృశించి పాలిచ్చి తరించిందని శ్రీగర్గ భాగవతం తెలియజేస్తోంది. '33

మనసులో కలిగిన సంకల్పం ఏదయినా నెరవేరి తీరుతుంది. శ్రీహరికి పాలివ్వాలని తలచిన రత్నమాలకోరిక పూతనగా పుట్టడానికి కారణమైంది. అయితే వామనమూర్తి ఇంతింతై విశ్వమంతా వ్యాపిస్తున్నప్పుడు వామనుని కపటిగా భావించి కోపంతో చంపబోయి బలిచక్రవర్తి చేత వారించబడినా వామనుని చంపాలనే కోపం మనసులో అలాగే నిలిచి పోవడంతో పూతనగా పుట్టి రాక్షస ప్రవృత్తిలో చంపాలని రావడం సంభవించింది.

పూతన పూర్వజన్మ భావనలను నెరవేర్చడానికే భగవానుడు తనను చంపాలని వచ్చిన పూతన స్తన్యాన్ని గ్రోలి చివరకు సద్గతిని కలిగించాడు.

పూతన ఏడు రోజులపాటు పసిపిల్లల నందరినీ చంపుతూ రావడమెందుకన్న సందేహానికి 'తోటమాలి అనవసరమైన కలుపు మొక్కలను మొలకలోనే తీసివేసినట్లు ఆ పసిపిల్లలంతా ఆ దినాలలో కంసుని పక్షాన్ని ప్రబలం చేయడానికి వ్రజంలో జన్మించిన అసంఖ్యాకులయిన అసురులనీ వారిని పూతన చేత ఆ విధంగా భగవానుడు చంపించాడనీ కృష్ణుని పక్షాన ఉన్న బాలల వంక పూతన కన్నెత్తి కూడా చూడలేదని 'శ్రీభాగవత కథ' అనే గ్రంథం వ్యాఖ్యానించింది.[34]

## శకటభంజనం

ఒకనాడు రోహిణీ నక్షత్ర దినాన 'బాలకుండొదిగిల పడనేర్చె'నని యశోదమ్మ ఎంతో సంబరంతో వేడుక చేయదలచింది. వ్రజకాంతలనందరినీ ఇంటికి పిలిచింది. విప్రులతో వేద మంత్రాలు చదివించి అభిషేచనాలు చేయించింది. అందరినీ సన్మానించవదలచింది. బాలకృష్ణునికి పాలుపట్టి పానుపుమీద పడుకోబెట్టి నిదురబుచ్చింది. ఆ తరువాత ....

కృష్ణునికై చేసే వేడుక సందడి లోపడి కొంతసేపు కృష్ణుడినే మరిచింది యశోద. ఆ కొంత సేపయినా కారణం ఏదయినా తనవారు తనను మరువడం కృష్ణునికి నచ్చని పనే.

*'నిదురించిన శిశువాకొని*
*కినుకుచు జనుగోరికెరలి కిసలయవిలస*
*న్మృదు చక్రచాపరేఖాస్పద*
*పదమున దన్నె నొక్కబండిన్ దండిన్.'* [35]

శయ్యపైన నిదురిస్తున్న శిశువు బండిని తన్నడమేమిటి ? తన్నినంత మాత్రాన 'దివి బ్రక్కటంబై యెగసి యిరుసు భరమున గండ్లున్ వికటంబుగ నేలం'[36] బడడమూ ఆ బండిలోని సరస పదార్థంబులు వ్యర్థంబులై నేలం గూల'[37] డమేమిటి?

ఈ సందర్భంలో గొల్లల ఇళ్ళలో పెద్ద పెద్ద లోగిళ్ళూ వాటిలో పెద్ద పెద్ద బండ్లూ, వాటిపైన పాల దుత్తలూ వెన్నకుండలూ పండ్ల బుట్టలూ ఉండడం సహజమే. పిల్లవాడికి నిద్రాభంగం కలుగకుండా నిశ్శబ్దంగా ఇంటి లోపలిభాగంలో ఉన్న ఒక పెద్ద బండి కింది మెత్తని శయ్యపరచి పడుకో బెట్టింది. యశోదమ్మ ఎవరి గురించి ఆ ఉత్సవం చేస్తోందో ఆ బిడ్డని మరచి ఉత్సవంలో లీనమయింది.

'బహిర్ముఖమైన మనసుకు అంతరంగంలోని పరమాత్మ పిలుపు వినబడుదు' బాలకృష్ణుని ఏడుపు యశోదమ్మకు వినబడలేదు. ఫలితంగా తన బండిలోని సరస పదార్థాలన్నీ వ్యర్థమై నేలపాలయేట్లుగానూ 'యశోదా నంద ముఖ్యులైన గోపగోపికా జనంబులు పనులు మఱచి వచ్చ్యంబులు మాని యుబ్బుసెడి'[38] భయపడి వచ్చేట్లుగానూ శబ్దం చేస్తూ శకటాన్ని తన్నాడు. అందరి దృష్టి తనవైపుకు ఆకర్షించుకున్నాడు. అనేక విధాల అనునయించి పాలు పట్టింది

యశోద. బాలునికి అనేక బలి విధానాలతో స్వస్తి పుణ్యాహ వచనాలతో ఆశీర్వాదాలు చేయడం జరిగింది.

శకట భంజనాన్ని శకటాసుర భంజనంగా కూడా చెప్పటం జరుగుతోంది. వ్యాస పోతన భాగవతాలలో శకటాసురుడన్న పదం కూడా లేదు. బాలకృష్ణుడు శకటాన్ని తన్నినట్లుగానే వర్ణింపబడింది.

హిరణ్యాక్ష పుత్రుడైన ఉత్కచుడు శకటాన్ని ఆవహించాడనీ లోమస మహర్షి ఇచ్చిన శాపం శ్రీకృష్ణచరణ స్పర్శతో తీరిందనీ చెపుతారు పెద్దలు. ఒకసారి లోమశ మహర్షి ఆశ్రమంలోని చెట్లని పీకిపారేసిన ఆ గడుగ్గాయిని దేహ రహితుడై పడి ఉండమని మహర్షి శపించాడనీ తక్షణం ఆయన పాదాలపై పడి వేడుకోగా ప్రసన్నుడై ఆ శాపాన్ని ఈ వరంగా మార్చాడనీ చెబుతారు.

## తృణావర్తుని ఉద్ధరణం

తృణావర్తుని రాకను ముందుగానే గమనించాడేమోనన్నట్లుగా తల్లి చేతిలోని బాలకృష్ణుడు కొండంత బరువు పెరగడంతో 'ధరగావ బుట్టిన మహాపురుషుడు కాబోలు'[39] ననే అనుమానం యశోదకు కలిగింది బరువు మోయలేక భూమి మీద ఉంచింది. తృణావర్తుడు వచ్చి కృష్ణుని ఆకాశానికి ఎగరేసుకుపోయాడు. తల్లి చేతిలో కొండంత బరువుగా తోచిన కృష్ణుని తృణావర్తుడు ఎగరేసుకు పోగలిగాడంటే తల్లి భూమి పై నుంచగానే కృష్ణుడు బరువు తగ్గినట్లుగా భావించాలి. తల్లి ఒడి నుండి దిగడానికి బరువయ్యాడు అనీ తృణావర్తుని పైకి తీసుకు పోవడానికి వీలుగా తేలిక అయ్యాడనీ తృణావర్తుడు ఆకాశానికి గొనిపోయిన అనంతరం తిరిగి కొండంతగా బరువు పెరిగాడనీ భావించవలసి ఉంటుంది. (లఘిమాసిద్ధి వల్ల తేలికగానూ గరిమ సిద్ధి వల్ల బరువుగానూ అవుతారు). ఈ కారణం వల్లే కృష్ణుని ఆకాశానికి ఎత్తుకెళ్ళి తృణావర్తుడు బరువు మోయలేక వదిలివేయ ప్రయత్నించాడు.

భగవానుని పట్టుకునే వరకే జీవి ప్రయత్నం. ఏదో విధంగా ప్రయత్నించి పట్టుకోవడం అంటూ జరిగాక వదలడం ఆ జీవి తరం కాదు. అప్పుడు జీవిని పట్టుకునేది భగవంతుడే ఆకాశమార్గంలో కొండంత బరువు పెరిగిన బాలుని చేతిలో ఆ రాక్షసుడు -

*మెడబిగియబట్టుకొని డిగ*
*బడియెడి బాలకుని చేత బర్వతవిభుచే*
*విడివడ జాలక వాడురి*
*బడిబెగడెదు ఖగము భంగి భయము బొంది* [40]

హరి కరతల పీడనంతో 'పరవశుడై' ఆల మీద భగ్నాంగుడై కూలాడు.

పూర్వం పాండు దేశాన్ని పాలించే సహస్రాక్షుడు అనే రాజు యజ్ఞయాగాది క్రతువులనేకం చేసినప్పటికీ స్త్రీలోలుడై దూర్వాసమునిని అలక్ష్యం చేసిన కారణంగా రాక్షసుడయేట్లు శాపం పొందాడనీ అనంతరం శ్రీకృష్ణపాదస్పర్శ చేత కృతార్థుడయేట్లుగా దూర్వాసుడు శాపవిమోచనం తెలియజేశాడనీ ఈ సహస్రాక్షుడే తృణావర్తుడనీ శ్రీ గర్గభాగవతం తెలుపుతోంది.[41]

ఒకనాడు యశోద కృష్ణునికి పాలిచ్చి ఒడిలో కూర్చో బెట్టుకుని ముద్దుచేసే సమయంలో యశోద వాత్సల్య ప్రేమకు పరవశుడైన పరమాత్మ ఆవులించి తననోటిలో తల్లికి విశ్వాన్ని చూపాడు. బాలుని వదనగహ్వరంలో 'వారి నిధులు, దిశలు, భూమి వన ద్వీపశైలాలు' సకలమూ దర్శించిన యశోద' కన్ను మోడ్చి చోద్యపడింది. సమస్త ప్రాణికోటి నాయందే ఉంది. నేను వాని యందులేను[42] అనే విషయాన్ని బోధిస్తూనే అటువంటి విశ్వాన్నే తనలో దాచుకున్న తాను ప్రేమ భక్తి వాత్సల్యాలకు లొంగి వారి ఒడిలోకి చేరుతానని తెలియజేశాడు కృష్ణుడు.

అనంతరం శ్రీకృష్ణుని నామకరణ మహోత్సవం రహస్యంగానే గర్గముని జరిపించాడు. యదు వంశానికి పురోహితుడైన గర్గుడు వసుదేవుని కోరిక మేరకు

కంసునికి తెలియరాదని నందుని ఇంటిలో రోహిణీ పుత్రునికి బలరాముడనీ యశోదా నందుల తనయునికి కృష్ణుడనీ నామకరణ చేశాడు. 'భగవన్నామాన్ని ఏకాంతంలోనే స్మరించాలి, జపించాలి. నిజమైన భక్తుడు తన సాధనను ఎప్పుడూ రహస్యంగానే ఉంచుతాడు. సత్యసాధన చౌకబారు ప్రదర్శనలను మన్ననలను ఆశించదని'[43] రహస్యంగా నామకరణం గావించడంలోని అంతరార్థం.

తొల్లి యీ శిశువు ధవళారుణ పీతవర్ణుండై యిప్పుడు నల్లనైన కతమున గృష్ణుడయ్యెనని' ' ఈ పాపనికి గుణరూప కర్మంబు లనేకంబులు గలుగుటం జేసి నామంబులనేకంబులు గల' వని 'ఈశాబకుని వలన మీరు దుఃఖముల దరియింతు, రీ యర్భకుని చేత దుర్జన శిక్షణంబును, సజ్జన రక్షణంబును నగు నీ కుమారుడు నారాయణ సమానుండని'[44] చెప్పి అందరికీ ఆనందాన్ని గూర్చి వెళ్ళాడు గర్గముని.

## ఉలూఖల బంధనం

శ్రీకృష్ణుడు తన బాల క్రీడలతో అందరినీ ఆనందింపజేస్తూ పెరుగసాగాడు. తన ఈడు బాలురతోను బలరాముని తోను కలిసి అనేక చిలిపి చేష్టలతో వ్రజవాసులందరినీ మురిపిస్తూ ఆట పట్టిస్తూ అందరి ఇళ్ళూ తనవిగా భావించి ఆయా ఇళ్ళలోజేరి వెన్న దొంగిలిస్తూ పాలను తాగేస్తూ, గోపికలు పాలను పితుకకముందే దూడలకట్లు విప్పేస్తూ, అందరి ఇళ్ళలోనూ జేరి పాలు పెరుగు అపహరించి మిత్రులకూ వానరాలకూ పెడుతూ తిరుగ సాగాడు.

నారాయణుని కర్పించిన నైవేద్యాన్ని తానే ఎంగిలిచేసి నేనే భగవానుడనని తెలిపేవాడు.కృష్ణుని ఈ చేష్టలకు విసిగి యశోదకు గోపికలు చెప్పరాగా వారి మాటలు అసత్యాలని తల్లికి నమ్మబలికే వాడు.

తల్లికి తన పట్ల ప్రేమ చెదరకుండా మరియొక సారి మృద్భక్షణ చేశాడనే కారణంగా నోరు తెరిపి చూపమన్న యశోదకు నోటిలో విశ్వరూప ప్రదర్శనను గావించి యశోదను -

*"కలయో వైష్ణవ మాయయో యితర సంకల్పార్థమో సత్యమో*
*తలపన్ నేరక యున్నదాననో యశోదాదేవిగానో పర*
*స్థలమో బాలకుడెంత? యీతని ముకస్థం బైయజాండంబు ప్ర*
*జ్వలమై యుండుట కేమిహేతువో! మహాశ్చర్యంబు చింతింపగన్"*

అంటూ సందేహం కలిగేట్లు అయోమయావస్థలో పడవేశాడు. చివరికి ఒకనాడు ఇంటిలోనే దధి భాండ వికలనాదులు గావించి యశోద చేత పట్టుబడ్డాడు.

తన చిలిపి పనులతో గోపికలను తిప్పలు పెట్టి పట్టుకుందామని ఎంత ప్రయత్నించినా గోపికలకు చిక్కని బాలకృష్ణుడు యశోదకు పట్టుబడి రోటికి కట్టబడ్డాడు. కారణం ఎవరు ఏరూపంలో పట్టదల్చుకుంటే వారికి ఆవిధంగానే పట్టుబడతాడు భగవంతుడు. భగవంతుడయినా మానవ రూపం దాల్చినప్పుడు తల్లికి ప్రథమస్థానం ఇచ్చాడు.

తనను కట్టడానికి అవస్థపడుతున్నా ప్రయత్నం మానని తల్లిని కరుణజూసి-

*"బంధవిమోచనుడీశుడు*
*బంధింప బెనంగు జనని పాటోర్చి మహా*
*ద్బంధుడు గావున జననీ*
*బంధంబున పట్టువడియె బాటించి...."*

తన చేతికి చిక్కిన పరమాత్మని ఎంతో ప్రయత్నించి రోటికి కట్టింది యశోద. ఎవరికీ పట్టుబడని పరమాత్మ తల్లికి పట్టు బడటంలో తల్లిపై ఉండే కరుణతో బాటు కర్తవ్యం గోచరిస్తుంది. అది యమళార్జున భంజనం.

## యమళార్జున భంజనం

నారదుని శాపానికి గురియై ఇంటి పెరట్లోనే మద్ది చెట్ల రూపంలో విముక్తికై నిరీక్షిస్తున్న నలకూబర మణిగ్రీవుల శాపవిమోచనం కృష్ణుని తక్షణ కర్తవ్యం.

మహాత్ముల మదిలో కలిగిన సంకల్పాన్ని భగవానుడు తీరుస్తాడు. స్త్రీలతో కూడి జలక్రీడలాడుతూ వివస్త్రులై మదిరాపాన మత్తులై నారదుని రాకను గమనింపని స్థితిలో నున్న నలకూబర మణి గ్రీవులను చూసి "వీరికి క్రొవ్వడంగించి బుధుల గలుపుట యొప్పున్"[47] అనే సదుద్దేశంతో నారదుడు వారికి శాపమిచ్చి 'మీరలు శ్రీమదాంధులరు గావున భూలోకంబున నర్జున తరువులై నూఱు దివ్య వర్షంబులుండుట మీద గోవింద చరణారవింద పరిస్పందనమున ముక్తులగుదుర"[48] ని విమోచనం తెలియజేశాడు. ఈ మాట ప్రకారం వారి శాపవిమోచనం తన కర్తవ్యంగా భావించాడు పరమాత్మ. అయితే అది ఒక క్రీడగా జరగాలి. ఎవరికీ అనుమానం రాకూడదు. అంతు పట్టకూడదు. (ఆధ్యాత్మికరంగంలో సాధనలు, గురువు శిష్యునికి తెలిపే ఉపదేశాలు ప్రసాదించే ముక్తి, దివ్యానందాలు అన్నీ గోప్యంగానే జరుగుతాయి. ఏ ఇద్దరు శిష్యులకు ఒక్కవిధంగా బోధించడం జరుగదు. శిష్యులందరికీ తెలిపే సామాన్య విషయాలు కొన్ని ఉన్నప్పటికీ ప్రతి శిష్యునికి వ్యక్తిగతంగా తెలిపే విషయాలు కొన్ని ఉంటాయి. కారణం ఏ ఇద్దరి వ్యక్తుల మనస్తత్వమూ ఒక్కలా ఉండకపోవడమే. శిష్యులస్థితిని బట్టి వారికి తగిన మార్గంలో బోధించేది శిక్షించేది సద్గురువు ఒక్కడే. అందుకే అంతాగోప్యంగా జరుగుతుంది). జగద్గురుడైన శ్రీకృష్ణుడు నలకూబర మణి గ్రీవులకు ముక్తిని కలిగించి వారికి బోధించవలసి ఉండడంవల్ల తల్లిచేత రోటికి కట్టబడ్డాడు. తల్లి అటు 'కనుమరుగు' కాగానే రోటిని ఆరెండు మద్ది చెట్ల నడుమ నుండి ఈడ్చి ఆమహావృక్షాలను కూల్చాడు. వాటి నుండి తేజోరూపంలో వెలువడిన నలకూబర మణిగ్రీవులు బాలకృష్ణునికి మ్రొక్కి అనేక విధాల

స్తుతించగా "నను నమ్మితిరుగు నభ్యులకును బంధము నన్ను జూడ విరియును"[49] అని

కారుణ్యమానసుండగు
నారదువచవమున జేసి వను బొడగమటన్
మీరు ప్రబుద్ధులరైతిరి
చేరెన్ నామీది తలపు సిద్ధము మీకున్"[50]

అని కృష్ణుడు వారిని బంధ విముక్తులగావించాడు.

మహాత్ములశాపం కూడా వరంగానే పరిణమిస్తుంది. శాపం సాధారణంగా ఒక స్థాయికి చెందిన సత్పురుషులలో ఏదో ఒక చిన్న లోపము వల్లనో లేక జరిగిన పొరపాటు వల్లనో వారికి మహాత్ములు మునులు విధించే శిక్షగా గాథల్లో కనిపిస్తుంది. ఈ శాపాల పర్యవసానం పరిశీలిస్తే పరమాత్మ చేతిలో వారికి ముక్తి లభించడమేనని తెలుస్తుంది. ఎన్నో ఏళ్ళ తపఃఫలం ఒక శాపావసానంగా వీరికి లభిస్తోంది. నారదాది మహర్షుల శాపాలు అటువంటివే . (ఒక్కొక్కసారి శాపవశంగా భూమి మీదకు వచ్చిన వారు మహాత్ములై ఆదర్శవంతమయిన జీవితాన్ని గడిపి, బోధకులై ఎంతో మందికి గురువులై లోకాన్ని మంచి మార్గంలో నడిపించినట్టివారై ఉండి అనంతరం పరమాత్మలో ఐక్యమవడం కూడా జరుగుతుంది). నారదుని శాపం వల్ల నలకూబర మణిగ్రీవులు కృష్ణుని దర్శన స్మర్శనలమ పొంది బంధాలు తొలగి సన్మార్గులై కృష్ణసేవా తత్పరులయ్యారు.

## వత్సాసుర ఉద్ధరణం

జరుగుతున్న అనేక ఉత్పాతాలను చూసి వృద్ధ గోపకులు వ్రేపల్లెలో కృష్ణునికి కీడు తలపెట్టడానికి చాలా మంది రాక్షసులు వస్తున్నారని ఆలోచించి బృందావనానికి వెళ్ళడం అన్నివిధాల శ్రేయస్కరమని తలచి బృందావనానికి పయనమయ్యారు.

బృందావనంలో బాలభగవానుని కమనీయ లీలలు మొదలయ్యాయి.

వేణులూదుచు వివిధ రూపములతో
 గంతులు వైతురు కౌతుకమున
గురుకంబళాదుల గోవృషంబుల బన్ని
 పరవృషభములని ప్రతిఘటింతు
రల్లులు దట్టించి యంఘ్రుల గజ్జెలు
 మొరయ దన్నుదురోలిముమ్మరముగ
బన్నిదంబులు వైచిఫలమంజరులు గూల్చి
 వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప

వన్య జంతు చయంబుల వాని వాని
పదరు పదురుచు వంచించి పట్టబోదు
రంబుజాకరముల జల్లులాడ జనుదు
రాకుమారులు బాల్య విహారులగుచు" [51]

ఇలా ఆనందంగా విహరిస్తున్న కృష్ణుడు గోపాలురతో కలసి గోవత్సాలను మేపసాగాడు. ఆ సమయంలో ఒక రాక్షసుడు గోవత్సరూపంలో వారలను హింసించాలనే ఉద్దేశ్యంతో వచ్చి కలిసి తిరుగసాగాడు. కృష్ణుడు అది గమనించి ఆవత్సాసురుని పాదాలు తోక గట్టిగా పట్టి చెట్టుకేసి మోది చంపాడు. గోవుల్ని దూడల్ని చంపకూడదు, 'గోహత్యాపాతకం' చుట్టుకుంటుంది. అయినా అన్నింటికీ అతీతుడైన కృష్ణపరమాత్మ గోవత్స రూపంలో ఉన్న రాక్షసుని పరిమార్చడమే లక్ష్యంగా భావించడం. ఇక్కడ సామాన్య ధర్మానికి అతీతమైన సూక్ష్మ ధర్మ పరిపాలనే ద్యోతకమవుతోంది.

వత్సాసురుడు సైతం శాపవశాన వచ్చి కృష్ణుని చేత హతమయినవాడే. పూర్వం మురాసురుని కొడుకయిన ప్రమీలుడు వశిష్ఠుని ఆశ్రమంలో బ్రాహ్మణ

రూపాన వచ్చి నందినీ ధేనువును దానమిమ్మని అడుగగా నందిని అసుర స్వభావంతో ఉండే వత్సరూపాన్ని పొందమని ప్రమీలునికి శాపం ఇచ్చింది. ఆ అసురుడు పశ్చాత్తాపం చెంది క్షమార్పణ వేడగా ద్వాపరాంతంలో శ్రీకృష్ణుని గోవులలో చేరి కృష్ణునిచే సంహరింపబడి ముక్తి నొందుతావని శపించిన కారణంగా వత్సరూపాన్ని పొందిన అసురుడు కృష్ణుని చేతిలో హతమయి శ్రీహరిని కలిశాడు.[52]

## బకాసురుని ఉద్ధరణ

ఒకనాడు పర్వతమంతటి ఆకారంలో ఉన్న బకం గోవులను కాస్తున్న గోపాలురను మింగసాగింది. చివరకు ఎంతకూ మింగుడు పడని కృష్ణుని బయటకు కక్కేసింది. తిరిగి తనను పట్టడానికి వస్తున్న బకాన్ని కృష్ణుడు దాని ముక్కుపట్టి విరిచి చంపాడు. దేవతలు కృష్ణునిపై పుష్పవర్షాన్ని కురిపించారు.

ఈ బకాసురుడు పూర్వజన్మలో హయగ్రీవుడనే రాక్షసుని కొడుకైన ఉత్కళుడు. ఇంద్రుని జయించి నూరు సంవత్సరాలు ఇంద్ర పదవి లోనున్నట్టివాడు. అటువంటి ఉత్కళుడు జాబాలిఆశ్రమ ప్రాంతంలోని చేపలను పట్టిన కారణంగా కొంగగా పుట్టేట్లు జాబాలి చేత శాపం పొందాడు. అయితే ఉత్కళుడు తాను చేసిన తప్పుకు పశ్చాత్తాప పడగా జాబాలి ద్వాపరాంతంలో కృష్ణుని చేత చంపబడి ముక్తి నొందేట్లు పరిహారం చెప్పాడు.[53] ఆ కారణంగా బకాసురుడై కృష్ణుని చేతిలో హతమయ్యాడు. ముక్తిని పొందాడు.

## అఘాసురుని ఉద్ధరణ

బకుని అన్న అఘాసురుడు కొండచిలువ రూపంలో కృష్ణుని మట్టుపెట్టడానికై వచ్చాడు. ఆకాశానికి భూమికి తన నోటిని వ్యాపింపజేసిన ఆ కొండచిలువ నోటిని చూసి గుహగా భావించి కృష్ణుని పిలుపును వినక లోపలికి

వెళ్ళారు గోపబాలురు. అది చూసి వారిని రక్షించే నిమిత్తం కృష్ణుడు తానూ సర్పగహ్వారంలోకి వెళ్ళి కంఠద్వారం సమీపంలో నిలిచి శరీరాన్ని పెంచసాగాడు. అష్ట సిద్ధులలో ఒకటైన మహిమ అనే సిద్ధివల్ల శరీరం పెరుగుతుంది. దానితో -

*ఊపిరి వెడలక కడుపున*
*వాపొదవిన బాము ప్రాణవాతంబులు సం*
*తాపించి శిరము ప్రక్కలు*
*వాపికొనుచు వెడలి చనియెబడుఘోషముతోన్.*[54]

ఆ విధంగా హతమయిన సర్పంలో నుంచి గోపాలురంతా బయట పడ్డారు. ఆ సర్పం నుండి ఒక అద్భుత తేజస్సు ఆకాశ మార్గాన వచ్చి కృష్ణునిలో కలిసి పోయింది.

అఘాసురుడు పూర్వ జన్మలో శంఖుడనే రాక్షసుని కొడుకు. వీడు యౌవన బలగర్వంతో ఇతరులను నిందించే స్వభావం కలిగియుండి మలయాచలంలో తపస్సు చేసుకుంటున్న అష్టావక్రమునిని చూసి పరిహాసించాడు.దానికి ముని క్రోధంతో సర్పరూపం పొందమని శపించి అఘాసురుడు వేడుకోగా కృష్ణుడు అతడి పొట్టలోకి ప్రవేశించినపుడు ముక్తి కలుగుతుందని శాపవిమోచనం తెలిపాడు.[55]

ఆకారణంగా అఘాసురుడు అజగర రూపాన వచ్చి కృష్ణుని చేత హతుడై శాప విముక్తిని పొందాడు.

## కాళీయ మర్దనం

ఏ పాదరేణువులను శిరోధార్యంగా భావించి తలదాల్చే భాగ్యానికై ఋషులు యోగులు మునులు దేవతలు తలుస్తారో తపిస్తారో ఆ పాదాలతో శ్రీకృష్ణపరమాత్మ కాళీయుని పడగలపై తాండవమాడి కాళీయుని ధన్యుని చేశాడు.

కాళీయుని విషవహ్నిశిఖలు అప్పటికే కాళింది మడుగును ఆ ప్రాంతపు గాలిని విషపూరితం చేశాయి. ఆ ప్రాంతాన తిరిగే పశుపక్ష్యాదులు ఎన్నో నశించాయి. విషపూరితమయిన ఆమడుగులోకి కృష్ణుడు దూకి కాళీయ గర్వభంగం గావించాడు.

పరమశివుడు క్షీరసాగర మథనంలో పుట్టిన హాలాహలాన్ని పానం చేసి గుట వేయక గొంతులోనే దాచుకుంటే విషానికే విషమయిన కృష్ణ పరమాత్మ పసితనంలోనే పూతన విషపుపాలను తాగి జీర్ణించుకున్నాడు. అటువంటి కృష్ణయ్యను తాకి కాళీయుని కాలకూట విషం అమృతమయమయింది. అది కృష్ణయ్య సంకల్పమే.

గరుత్మంతునికి భయపడి కాళింది మడుగులో నివసించే కాళీయునికి ఆ మడుగు వీడిపోలేని బంధనం ఏర్పడింది. తన అహంకారాన్నే పెట్టని కోటగా చేసుకుని అందులో తాను బందీనయ్యాననే విషయమే తెలుసుకోలేకపోయాడు కాళీయుడు. ఆ కోటలోకి పరమాత్మ తానుగా ప్రవేశించాడు. పరమాత్మ ప్రవేశించాక ఇక అహంకారానికి తావేది? కాళీయుని చుట్టుముట్టిన అహంకారవిషం పటాపంచలయింది. దానితో కాళీయునికి బంధవిముక్తి కలిగింది. ఇరుకైన అహంకార హ్రదాన్ని వీడి విశాలమయిన ఆనందార్ణవానికి చేరుకుని స్వేచ్ఛను పొందాడు కాళీయుడు.

శ్రీకృష్ణుడు ఎంతోమంది రాక్షసులను సంహరించాడు. కానీ కాళీయుని మాత్రం మదమణిచి వదిలిపెట్టాడు. 'కాళీయుడు ఇంద్రియాధ్యాసం కాళింది అనేభక్తిలో ఇంద్రియా ధ్యాసం కలిగినట్లయితే శుద్ధభక్తి ఉండలేదు. రాగద్వేషాలు విషయ వికారాలు మొదలయినవి విషం వంటివి. ఇంద్రియాలలో నుండి విషయవికారాలనే విషాన్ని తీసివేయాలేగాని ఇంద్రియాలను నశింపజేయగూడదు.

కృష్ణుడు కాళీయ మర్దనం ద్వారా తెలియజేసిన విషయం ఇదే. కాళీయుని పడగలను అణచినట్లుగా ఇంద్రియాలను అణిచివేయాలని. ఇంద్రియాలకు సత్సంగం కలిగించాలి. ఆవిధంగా ఇంద్రియాలకు భక్తిరసం ప్రాప్తిల్లి అవి శుద్ధం అవుతాయి. భోగం వల్ల ఇంద్రియాలు క్షీణిస్తాయి. భక్తివల్ల పోషింపబడతాయి.[56] కాళీయునికి సత్సంగమే కాదు భగవత్సంగం లభించి పునీతమయాడు.

స్వాయంభువు మన్వంతరంలో వేదశిరస్సు అనే బ్రాహ్మణుని ఆశ్రమానికి అశ్వశిరస్సనేవాడు వచ్చి ఆ ఆశ్రమంలోనే తాను తపస్సు చేసుకుంటానని కోరాడు. 'వద్దుపొమ్మన్న' గరుత్మంతుని వలన భీతి పొందమని వేదశిరస్సును శపించాడు. ఈ శాపకారణంగా వేద శిరస్సు భక్తుడు కనుక కాళీయునిగా మారినా కృష్ణ పరమాత్మ పాదాలను పాదముద్రలను శిరస్సున ధరించే భాగ్యం లభించింది అని గర్గభాగవతం తెలియజేస్తోంది. [57]

## దావాగ్నిపానం

సకల చరాచర జగత్తు పరమాత్మలోనే ఉంది. పరమాత్మ నుండి ఆవిర్భవించింది. కనుక సర్వమూ ఆ పరమాత్మలోనే లయమవుతుంది కూడా. పంచభూతాలలో ఒకటి అయిన అగ్ని పరమాత్మకు భిన్నం కాదు.[58] ఆ కారణంగానే గోగోప గోపికా బృందాన్ని చుట్టు ముట్టిన దావాగ్నిని అవలీలగా పానం చేసి ఆర్తులను రక్షించాడు కృష్ణుడు.

సంసారరూపమైన దావాగ్ని నలువైపులా మండుతూ జీవాత్మ నాక్రమించినపుడు గోపాలురవలె కన్నులు మూసుకునిభగవంతుని ప్రార్థించి నట్లయితే సమస్త సంకటాలను పానం చేసి ఏ దుఃఖం లేకుండా చేస్తాడని భగవన్నామజపం సాంసారిక దావాగ్నిని చల్లారుస్తుందని ఆ దావాగ్నిపానం తెలియజేస్తుంది.

## బ్రహ్మదేవుని శరణాగతి

అహంకారమనేది ఎంతటి వాడినయినా ప్రలోభంలో పడవేస్తుంది. సకల జగాలకు సృష్టికర్త అయిన బ్రహ్మను కూడా అహంకారం వదలలేదు. అహంకారం పరమాత్మ ఎదురుగావున్నా గుర్తించనీయదు.

రాక్షస వధ కావిస్తున్న బాలకృష్ణుని బాలరూపంలో ఉన్న పరమాత్మగా గ్రహించలేక పోయాడు బ్రహ్మ.

*"బాలుండయ్యు నితండ ఘాసురుడు ద్రుంపన్ బాలురం గ్రేపులన్*
*ఏలీలన్ బ్రదికించెనొక్కొ? భువి నూహింపం గడుజోద్య"* మంటూ

ఆశ్చర్యపోయాడేగాని భూదేవి కోర్కెమీద తాను ప్రార్థించగా దుష్ట శిక్షణార్థం, భూభారహరణార్థం దిగి వచ్చిన భగవానుడే ఈ బాలుడన్న విషయాన్నే విస్మరించాడు. బాలుని పరీక్షించాలనే కోరికతో గోవత్సాలను గోపబాలురనందరినీ ఒక్కక్షణకాలం దాచాడు. బ్రహ్మముచ్చటను తీర్చదలచిన కృష్ణుడు బ్రహ్మ నుంచి వారందరినీ తీసుకు రాకుండా తాను ఆయాగోపబాలుర గోవత్సాల రూపాలలో చరించాడు.

బ్రహ్మకు ఒక్కక్షణం అయితే మానవకాలంలో ఒక సంవత్సరం అవుతుంది. ఆ విధంగా ఏడాది పాటు వారందరి రూపాలను కృష్ణుడే ధరించాడు. ఆ ఏడాది కాలంలోనూ గోపబాలుర రూపాలలో వారి వారి తల్లిదండ్రులను అలరించాడు. గోవత్సాలుగా గోవులను తరింపజేశాడు.

ఆకాలంలో బృందావనమంతా కృష్ణమయంగానే ఉండి -

**"ఘోషజనులకెల్ల గుఱ్ఱలపై వేడ్క**
**పూట పూట కెలమి బొటమరించె**

*నిచ్చ క్రొత్త యగుచు నీరజాక్షుని మీద*
*వేడ్క తమకు దొల్లి వెలసినట్లు"[60]*

బ్రహ్మ చేసిన పనికి కృష్ణునే తమ పుత్రునిగా పొంది వ్రజంలోని స్త్రీలంతా యశోదలయ్యారు. వారి భర్తలంతా 'నందులై' బ్రహ్మానందాన్ని పొందారు. అంతకు ముందుకన్నా తల్లులకు పిల్లల పైన ప్రేమ అధికమయింది. పుత్రునిగా కృష్ణయ్యను లాలించి పునీతులయ్యారు.

ఇదే అదృష్టం గోవులు సైతం పొంది వాటి లేగదూడల రూపంలో ఉన్న కృష్ణునికి ఎనలేని ప్రేమతో పాలిచ్చి సాకి సుఖానుభూతిని పొందాయి.

ఈ ఏడాది కాలంలోనే కొందరికి పెళ్ళిళ్లు జరిగినట్లు కూడా తెలుస్తోంది. తమ బాలికలను మరొక గోపబాలునికి ఇచ్చి వివాహం చేశామని తల్లిదండ్రులు తలచారేగాని ఈ గోపబాలుని రూపంలో ఉన్న కృష్ణయ్యకే ఇచ్చి వివాహం చేసినట్లు వారు ఎరుగరు. ఈ విధంగా ఆ బాలికలంతా పెళ్ళి ఆడినది కృష్ణయ్యనే.[61] అన్ని రూపాలలోనూ అందరికీ చేరువయి తన ప్రేమను పంచి అందర్నీ ప్రేమ సూత్రంతో బంధించాడు శ్రీకృష్ణుడు.

బలరామునికి మాత్రం ఒకనాడు ఏ బాలుని చూసినా కృష్ణయ్యనే చూసినట్లు అనిపించసాగింది. ఆశ్చర్యంతో అడిగిన బలరామునికి కృష్ణుడు జరిగిన విషయం చెప్పి సందేహనివృత్తిగావించాడు. ఏడాది నిండిన అనంతరం బ్రహ్మవచ్చి చూసి అయోమయంలో పడ్డ బ్రహ్మను జూసి తనమాయా జాలాన్ని విప్పి తన లీలా రూపాలనన్నీ దాచాడు కృష్ణుడు.

ఇది చూసి బ్రహ్మ అబ్బురపడ్డాడు.

*"క్రతుశతంబుల బూర్ణకుక్షివి, కాని నీవిటుక్రేపులున్*
*మతులునై చనుబాలు ద్రావుచు జొక్కియాడుచుగౌతుక*

*స్థితి జరింపగ దల్లులై విలసిల్లు గోవుల గోపికా*
*సతులధన్యతలెట్లు సెప్పగ జాలువాడ గృపానిధీ!"* [62]

అని గోపికల అదృష్టాన్ని పొగిడి వారి పాదధూళి శిరమున దాల్చిన చాలని, కృష్ణుని అనేక విధాల స్తుతించాడు.

బ్రహ్మను తన లీలతో అయోమయంలో పడవేసి సృష్టికర్తనన్న గర్వాన్ని ఖర్వం చేసి పరబ్రహ్మ స్వరూపమే తానన్న విషయాన్ని నిరూపించాడు. కృష్ణ పరమాత్మ బృందావన మంతా తానే అయి సర్వాంతర్యామిగా వెలుగొందాడు. క్రీడాపరుడైన బాలకృష్ణుని మహత్తును తనకు తానై తెలుసుకోగోరి బాలురను క్రేపులను గోపనం గావించాడు బ్రహ్మ.

కృష్ణుని పరీక్షించ దలచిన బ్రహ్మ అహంకారం రజోగుణంతో కూడుకున్నది. దానికి ఫలితంగా బ్రహ్మ దర్శించిన విశ్వరూపాకృతి బ్రహ్మయొక్క రజః ప్రధాన తత్త్వానికి అనుగుణమై మనోహరమైన కృష్ణ స్వరూపమేకాక అణిమాది సిద్ధులు మాయాది శక్తులు మహదాది చతుర్వింశతి తత్త్వాలు పొడగట్టాయి.

## గోవర్ధనోద్ధరణం - ఇంద్రగర్వభంగం

గోపాల గోవత్స రూపాలతో బ్రహ్మదేవుని అహాన్ని అణిచిన కృష్ణుడు గోవర్ధనోద్ధరణం చేసి ఇంద్రుని గర్వాన్ని అణిచాడు.

ఆచారంగా వస్తున్న ఇంద్రపూజను మానిపించి గోవర్ధనపర్వతాన్ని పూజింపజేశాడు శ్రీకృష్ణుడు దానికి కారణంగా-

*కర్మమున బుట్టు జంతువు*
*కర్మమున వభివృద్ధి బొందు గర్మమునజెడుం*
*గర్మమె జనులకు దేవత*
*కర్మమెసుఖదుఃఖములకు గారణమధిపా"* [63]

అని కర్మసిద్ధాంతానికి పట్టం కట్టాడు. కర్మతోనే జగత్తంతా నడుస్తున్నప్పుడు ఇంద్రపూజ అనే మూఢాచారం వదలమని తెలిపాడు.

*"కర్మమునకు దగు ఫలములు*
*కర్ములకు నిడంగ రాజుగాని సదాని*
*ష్కర్ముడగు నీశ్వరుండును*
*గర్మ విహీనునికి రాజుగాడు మహాత్మా !"[64]*

అని కర్మిష్ఠులకు మాత్రమే ఈశ్వరుడు ఫలితాలిస్తాడనీ కర్మహీనులకు ఇవ్వడనీ స్పష్టం చేశాడు. కర్మేదైవమనీ కర్మను వదిలి ఇతర సేవచేయడం 'సతిపతిని విడిచి జారుం జేరిన విధమని'[65] తెలియజేశాడు. పశువులను పర్వతాలను బ్రాహ్మణోత్తములను పూజించమని ప్రోత్సహించాడు.

*"బహు రస్నానంబు పెట్టుండు బ్రాహ్మణులకు*
*నచలులై పూజలొనరింపుడచలమునకు*
*నధమ చండాలశునక సంహతికి దగిన*
*భక్ష్యములనిండు కసవుల పసులకిండు"[66]*

అని తెలిపిన శ్రీకృష్ణుని పలుకులలో కులమతాలన్నిటిని మాత్రమే కాక సకల జాతులను సమానంగా ఆదరించమనే సర్వకాలికమైన సందేశమూ ధ్వనిస్తుంది. ఆస్తికులలో మానవతా దృక్పథాన్ని కలిగించాడు.

కృష్ణునిమాటలు అక్షరాలా పాటించారు. వ్రజవాసులు. దానికి ఇంద్రుడు కోపించి ఎడతెగని వర్షధారల్ని శిలలను పిడుగులను ఏకాధాటిగా కురిపించాడు. ప్రధానంగా 'నిలింపపతి సొంపుదింపు తలంపుతో'[67] ఈకార్యాన్ని నిర్వహించిన కృష్ణుడు గోపకుల రక్షణభారాన్ని కూడా స్వీకరించాడు. ఫలితంగా

"కిరియై ధరయెత్తిన హరి
కరిసరసిజముకుళమెత్తుగతి త్రిభువనశం
కరకరుడై గోవర్ధన
గిరి యెత్తెంజక్క నొక్కకేలన్ లీలన్"[68]

భాగవతంలో కృష్ణుడు గోవర్ధనాన్ని ఎత్తడం వింతకాదు. భాగవతం శ్రీ కృష్ణుని మానవ మాత్రునిగా కాక పరిపూర్ణ భగవన్మూర్తిగా నిరూపిస్తుంది.

కనుకనే వరాహావతారాన భూమినే ఉద్ధరించిన హరికి గోవర్ధనోద్ధరణం కష్టంకాదని చెప్పడానికే గోవర్ధనాన్ని చిటికిన వ్రేలిమీద ఏడు అహోరాత్రులు నిలిపినట్లు చెబుతూ -

"దండిన బ్రహ్మాండబులు
చెండుల క్రియ బట్టియెగుర జిమ్మెడు హరికిన్
గొండ బెకలించి యెత్తుట
కొండొక పనిగాక యొక్కకొండా తలపన్"[69]

అంటూ శ్రీకృష్ణుని భగవంతునిగా మరీ మరీ నొక్కి చెబుతుంది భాగవతం. ఛత్రంలా పట్టిన గోవర్ధనం అడుగుకు పుత్రమిత్రకళత్ర సమేతంగా గొల్లలందరూ చేరి ఏడహోరాత్రులు కృష్ణుని మీద దృష్టిని నిలిపి గడిపారు.

గోవర్ధనోద్ధరణం అటు గోపజనులకు ఇటు దేవేంద్రునికి కూడా కళ్లు తెరిపించిన సంఘటనం.

'కనులు దెఱువని కడు జిన్ని పాపడై
దానవి చనుబాలు ద్రావి చంపె"[70] నని

అంటూ శ్రీకృష్ణుని దానవ సంహారాలన్నీ జ్ఞాపకం చేసుకుని -

"ఓ నంద గోపవల్లభ
నీ నందనుడా చరించు నేర్పరి తనముల్
మానవులకు శక్యంబులె
మానవ మాత్రుండె నీ కుమారుడు దండ్రీ" [71]

అంటూ సందేహం వెలిబుచ్చారు. నందుడు గర్గముని సంకేతాన్ని గుర్తుకు తెచ్చుకుని 'శంకలేదు, కృష్ణుడు లోకరక్షకుండయిన పుండరీకాక్షుని నిజాంశమని' సందేహాన్ని తీర్చడం వల్ల కృష్ణుని అనంతుడుగా గోపకులు గ్రహించి పూజించారు.

త్రిలోక రాజ్యమదంతో తనను పూజించని కారణాన తామస గుణంప్రకోపించి గోపకులను కృష్ణుని వేధించి "సద్యోమృత్యువు బొంద జాల్ గురియించి"[72] శౌర్యాన్ని ప్రకటించిన దేవేంద్రుడు నిగర్వుడై కృష్ణుని పాదాక్రాంతుడయ్యాడు. శ్రీకృష్ణుని 'జగము భర్తగ గురునిగ జనకునిగ'[73] గుర్తించిన దేవేంద్రుడు కృష్ణుని కీర్తించగా ఇంద్రునితో 'నీ సమదోద్రేకముద్రుంచి వైచుటకు నీజన్మంబు దప్పించితి'[74] నని తెలియజేసి 'నా ఆజ్ఞసేయు చుండుము నీయధికారంబు నందు నిలువు సురేంద్ర శ్రీయుతడవై మదింపకుమని[75] బుద్ధి గరపితన శక్తిని తెలియజేశాడు.

'గో' అంటే ఇంద్రియాలు అనే అర్థం ఉంది కనుక ఇంద్రియాలను భోగమార్గం నుంచి భక్తి మార్గాన నడిపే సమయంలో విషయ వాసనలనే వర్షం బాధిస్తుందని ఇంద్రియాల వాసనా వర్షం కురిసే సమయాన సత్త్వగుణాన్ని ఆశ్రయించాలి కనుక సత్త్వగుణానికి చిహ్నమైన చిటికిన వ్రేలుతో కృష్ణుడు గోవర్ధనాన్ని ఎత్తాడని, సద్గ్రంథ పఠనం భాగవతుల సహవాసం విషయవాసనలతో పోరాడేశక్తి నిస్తుందని '[76] శ్రీమద్భాగవత రహస్యం అనే గ్రంధం తెలుపుతోంది.

## వరుణలోక గమనం

అనంతరం ఏకాదశీవ్రతమాచరించిన నందుడు ద్వాదశీవ్రత పారాయణ చేయాలనే సంకల్పంతో తెలియక అసుర సమయంలో స్నానమాచరించి అసురుని చేత వరుణలోకానికి తీసుకుపోబడ్డాడు. గొల్లల హాహాకారాలు విని శ్రీకృష్ణుడు వరుణలోకానికి వెళ్ళి తండ్రిని తీసుకువచ్చాడు. ఈ సందర్భంలో వరుణుడు శ్రీకృష్ణ సందర్శన భాగ్యం లభించినందుకు అమితానందాన్ని పొందాడు.

దిక్పాలకపతి ఇంద్రుడినే పాదాక్రాంతునిగా చేసుకున్న కృష్ణునికి దిక్పాలకుడైన వరుణుడు దాసోహమనడంలో ఆశ్చర్యంలేదు. అజ్ఞానవశాన వరుణుని భటుడు చేసిన తప్పు (నందుని అపహరణం) వరుణునికి కృష్ణ సందర్శన భాగ్యాన్ని కలుగజేసిందని తృప్తి చెందాడు వరుణుడు. వ్రజవాసులు ఈ సంఘటనతో కృష్ణుని ఈశ్వరునిగా గ్రహించారు. దానితో వారు వైకుంఠాన్ని దర్శించాలనే కోరికను కృష్ణునికి వెల్లడించారు.

## గోపాలకులకు వైకుంఠ దర్శనం

వైకుంఠ దర్శనాన్ని కోరుకున్న గొల్లలను జూసి శ్రీకృష్ణుడు తననే నమ్ముకున్న వ్రజవాసులను ఉద్ధరించదలచి మునులకు దీర్ఘ సమాధి నిష్ఠా ఫలితంగా లభించేటటువంటిది, తమఃపరమయి ప్రకాశిస్తూ ఉండేది అయిన ఆ సనాతన సత్యజ్ఞాన అనంత బ్రహ్మాత్మక లోకాన్ని వ్రజవాసులకు చూపించి వారిని ఆనందింపజేశాడు.

## గోపికలు ....

వ్రజంలో కృష్ణుడే తమ సర్వస్వంగా భావించి జీవించినవారు గోపికలు. గోపికలు రెండు రకాలు.

1.నిత్యసిద్ధ గోపికలు 2. సాధన సిద్ధ గోపికలు

సాధన సిద్ధ గోపికలలో ఎన్నో భేదాలున్నాయి - శ్రుతిరూప గోపికలు, ఋషి రూప గోపికలు, సంకీర్ణ రూప గోపికలు, అన్యపూర్వ గోపికలు, అనన్యపూర్వ గోపికలు మొదలయినవారు.[77] వేదాభిమానం గలదేవతలు పరబ్రహ్మ సాక్షాత్కారంకోసం గోకులంలో ఆవిర్భవించారు. వీరు శ్రుతి రూప గోపికలు. ఋషులు భగవదనుభవం కోసం బ్రహ్మాత్మకమైన ముక్తిని పొందగోరి గోపికలుగా జన్మించారు. వీరు ఋషిరూప గోపికలు. సంకీర్ణ వనంలో భగవంతుని శ్రీరాముని మనోహర రూపాన్ని గాంచి కామించిన స్త్రీలు కామరూప గోపికలు. వివాహానంతరం సంసార సుఖాలను అనుభవిస్తూ వాటిపై ఏవగింపు కలిగి ప్రభువుపైన ప్రేమ భావాన్ని గలిగిన పురుషులు లేదా స్త్రీలు గోపికా రూపులుగా జన్మించారు. వీరు అన్యపూర్వగోపికలు. జన్మత: సిద్ధించిన వైరాగ్యం కలవారు అనన్యపూర్వ గోపికలు (శ్రీశుకుడు మొ). ఈ విధంగా ఎన్నో రకాల భక్తులు గోపికలై [78] శ్రీ కృష్ణుడే తమ సర్వస్వంగా నమ్ముకుని ఉన్నారు.

## గోపికా వస్త్రాపహరణం

బృందావనంలోని గోపకన్యలు ఒకసారి శ్రీకృష్ణుని పతిగా చేయమని కోరుతూ కాత్యాయనీవ్రతం చేసి నగ్నలై జలక మాడుతున్న సమయాన కృష్ణుడు గోపకులతో వచ్చి చీరలు అపహరించి కదంబవృక్షం మీద కూర్చున్నాడు. ఎన్ని రకాలుగా వేడుకొన్నప్పటికీ చీరలివ్వక ఒడ్డుకు వచ్చి రెండు చేతులెత్తి నమస్కరించిన గాని ఇవ్వనని పట్టుబట్టి మ్రొక్కు చెల్లించిన అనంతరం వస్త్రాలిచ్చాడు.

ద్వైత ఆవరణ తొలగించుకున్నప్పుడే భగవంతుడు లభిస్తాడు. ఆత్మపరమాత్మల మధ్య 'వాసన' అనే తెర ఉన్నంత కాలం భగవదనుభూతి కలుగదు. అజ్ఞాన వాసనా వృత్తుల ఆవరణాను తొలగించే ప్రయత్నమే గోపికా

వస్త్రాపహరణం, శ్రీకృష్ణుడు అపహరించినవి లౌకిక వస్త్రాలు కావు."అహంకారం, అజ్ఞానము, కామవాసనలను అపహరించాడు. "[79] తనను కోరే జీవాత్మలయిన గోపికలను సర్వసంగ పరిత్యాగ సూచికంగా సిగ్గుని, దేహాభిమానాన్ని వదలమన్నాడు. సర్వం సమర్పిస్తేనే గాని భగవంతుడు జీవుని స్వీకరించడు.

"వస్త్రం దేహాన్ని ఆచ్ఛాదించిన విధంగా అజ్ఞానము, వాసన ఆత్మనాచ్ఛాదిస్తాయి. పరమాత్మను దూరం చేస్తాయి. వలువల నపహరించే లీల బుద్ధిగత వాసనను, బుద్ధిగతమైన అజ్ఞానాన్ని అపహరించేలీల"[80] ఈ విషయం గోపికలు కూడాగ్రహించారు గనుకనే నీటి బయటికి నగ్నలుగానే వచ్చి చేతులెత్తి మొక్కగలిగారు. తమలో ఆ కొద్దిగా మిగిలియున్న దేహాభిమానాన్ని వదిలి భగవంతునిలో ఐక్యం కావడానికి. తగిన అర్హతను సంపాదించుకున్నారు. అందుకే కృష్ణుడు -

*"లక్షణవతులార లజ్జించి చెప్పరు*
*గాని మీ మర్మముల్ గానబడియె*
*నను గొల్వజింతించివారు నాచేతను*
*సత్యంబు మీ నోము సఫలమగును*
*గామితార్థంబుల కలిమి జెప్పగనేల*
*నమగొల్వముక్తికి నడువవచ్చు"*[81]

నని వరమిచ్చాడు దాని ఫలితమే రాసక్రీడ. పంచాధ్యాయము గల రాసక్రీడ శ్రీమద్భాగవతానికి పంచప్రాణాలు. పంచాధ్యాయము గల రాసక్రీడ నివృత్తి ధర్మ పరమఫలమని శ్రీధరీయ వ్యాఖ్య."[82] శ్రీకృష్ణునికి గోపికలకు ఉన్న సంబంధం అలౌకికమయినది. ఆత్మపరమైనది ఆకర్షించే అయస్కాంతతత్త్వం కృష్ణునిదైతే ఆకర్షింపబడే 'ఇనుము'తత్త్వం గోపికలది. ఇనుము తప్ప మరే వస్తువు అయస్కాంతం చేత ఆకర్షింపబడనట్లే గోపిక అయితే తప్ప మరొకరు అంతగా

పరమాత్మ చేత ఆకర్షింపబడరు. ఇనుము వంటి దృఢత్వం స్థిర చిత్తం ఇంద్రియ నిగ్రహం ఉండడం పరమాత్మచే ఆకర్షింపబడటానికి ఎంతో అవసరం.

'గో' అంటే ఇంద్రియం 'ప' అంటే రక్షించేది. పా అనేది వ్యాకరణ సూత్రం చేత పిగా మారుతుంది. గోపి అంటే ఇంద్రియాలను రక్షించుకోవడం. ఆ పని చేసే జీవికి గోపిక అనే నామం బిరుదులాంటిది. బ్రహ్మ విద్యాభ్యాసకులు బ్రహ్మంలో కలిసే యత్నం చేస్తూ పతిసమాగమం కోరిన సతులుగా పరిగణింపబడతారు. స్త్రీ తమ ఇంద్రియబలాన్ని స్వేచ్ఛగా పోనీయక వెనుకకు మళ్ళించి ఆ శక్తినంతా పతినిమిత్తం వినియోగించే విధంగా మోక్షాభ్యాసకులైన జీవులు ఇంద్రియ వ్యాపారాలను బాహ్యంగా సంచరింపనీయక లోనికి త్రిప్పుతూ అంతర్ముఖులై బ్రహ్మంలో లీనం చేస్తారు. కనుక సర్వాహంకార మమకారాలను విడచి సమస్త ప్రాణాలను పతికోసం అర్పించే స్త్రీలాగా అభ్యాసకుడు భగవంతునికై శరీరాన్ని మనసునూ అర్పించి పౌరుషహీనుడై స్త్రీ అనబడతాడు. అభ్యాసకుడైన జీవుడు గోపిక అనే నామానికి తగి ఉండడం వల్ల ఆ అభ్యాసకుడు గోపిక అవుతాడు. ఇటువంటి లక్షణాలున్న ప్రతిజీవి స్త్రీ పురుష వయోభేదం లేకుండా గోపికే అవుతుంది.

"అన్ని ఇంద్రియాలతోను భక్తి రసాన్ని గ్రోలుతూ తన స్త్రీత్వాన్ని లేక పురుషత్వాన్ని మరిచిపోయేవారే గోపికలు తన పురుషత్వం లేక స్త్రీత్వం జ్ఞాపకం వస్తున్నట్లయితే గోపికాభావం మేల్కోదు. ఆ సర్వోత్కృష్టమైన గోపికాభావంతో తనదేహంపై ధ్యాసను పూర్తిగా విస్మరించాలి[83]. దీనిని బట్టి బృందావనంలో రాసక్రీడకై వచ్చిన ప్రతిగోపిక స్త్రీ స్వరూపమే కానవసరంలేదు. పురుషులూ స్త్రీలు అందరూ గోపికలై శ్రీకృష్ణునికై ఎవరికి వారే యమునా తీరానికి వచ్చారు. స్త్రీలకు ప్రక్కనున్నవారు పురుషులనే భావన ఉండదు. గోపికల దృష్టిలో పరమాత్మ ఒక్కడే పురుషుడు. పరమాత్మ స్పర్శన దర్శన స్మరణాదులవల్లే వీరు చైతన్య

వంతులవుతారు. తమతోటి సాధకులంతా లేదా గోపికలే అనే భావనతో ఉంటారు. గోపికాతత్త్వాన్ని జీర్ణించుకున్న పురుషరూపులు తమను తాము అంతర్గతంగానే కాక బాహ్యంగా కూడా స్త్రీవేషధారణలో పరమాత్మ దరికి పరుగు తీశారంటే అతిశయోక్తి కాబోదు. (రామకృష్ణ పరమహంస సాధనలో రాధికాభావనతో స్త్రీరూపధారణ చేసుకునేవారని వినికిడి) రామావతారంలో రాముని దివ్య మంగళ స్వరూపాన్ని చూసి మోహించిన ఋషులకు శ్రీరాముడు గోపికలై జన్మించి తనను పొందమన్నాడేగానీ స్త్రీలుగా జన్మించమని గాదు అన్నది.

ఇక్కడ రూపం ప్రధానం కాదు. హృదయం ప్రధానం. కృష్ణుని చెంతకు సంకేత స్థలానికి వచ్చిన గోపికలను కృష్ణుడు పరీక్షార్థం తిరిగి వెళ్ళమన్నాడు.

గోపికలను భరించినవారు పెద్ద చిన్న ఎవరయినా సరే గోపికలకు భర్తలే అని చెప్పవచ్చు. గోపికా స్థితి వచ్చిన వారికి పురుషులైన స్త్రీలయినా సంసార బాధ్యత భరించే ఓపిక సహనం ఉండదు. చిత్తం శరీరము అంతా పరమాత్మ వైపుకే ఆకర్షింపబడుతున్నపుడు సాంసారికంగా బాధ్యతలు మోయగలిగిన స్థితిలో ఉండరు. కనుక వీరి బాధ్యతను భరించేవారే వీరికి భర్తలు.

వారి దగ్గరకే కృష్ణుడు పొమ్మన్నాడని అర్థం చేసుకోవాలి. రాసక్రీడలో ప్రేమ భక్తి వృద్ధి చెంది భగవద్విరహాన్ని భరించలేని వారికే ప్రవేశం లభిస్తుంది. 'రాసక్రీడ భాగవత ఫలం'.

## రాసక్రీడకు ఆహ్వానం

శరద్ పౌర్ణమి రాత్రి యమునా తటవనంలో శ్రీకృష్ణుడు జనన్మోహనంగా ఆలపించిన వేణుగానం గోపికలకు రాసక్రీడ కోసం ఇచ్చిన ఆహ్వానం. మనోహరమైన వేణుగీతిని విన్న గోపికలు ఉన్నవారున్నట్లుగా చేస్తున్న పనులను వదిలి గోవింద సందర్శనాయత్త చిత్తలై పరుగుదీశారు. వారు తరలివచ్చింది పరమపురుషుని సందర్శనార్థమే గానీ పరపురుషుని పొందుకోసం కాదు.

పరపురుషుని జారుని పొందడానికి అయినట్లయితే ఏ అలంకారాలు లేక ఏ పడతీ పరుగు పెట్టదు. ఇంటి వారికి తెలియకుండా సద్దుమణిగాక ఎవరికీ అనుమానం రాని రీతిలో, అందంగా అలంకరించుకుని మరీ విటుని కలియ పోతుందనడంలో సందేహం లేదు.

కానీ ఇక్కడ గోపికల స్థితి ఏమిటి? వీరు ఇళ్ళనుండి బయలు దేరినప్పటికి ఇంకా సద్దుమణగలేదన్న దానికి నిదర్శనంగా గోపికలంతా ఇంకా పనులలోనే ఉన్నారు. పాలు పితకడం పాలుకాగబెట్టడం వంట వండుతూండడం వంటి పనులు అందరూ చేసుకుంటూనే ఉన్నారు.

సంకేతవేణుగానం విన్న గోపికలు పని చేయగలిగేస్థితిని కోల్పోయి కృష్ణాయత్తచిత్తలై పరుగులుతీశారు.[84]

ఒక్కసారి గోపికలు ఇల్లువెడలిన స్థితిని పరిశీలించినట్లయితే మరణకాలం ఆసన్నమయినప్పుడు ప్రాణాలు ఏ పనులను ఏ బంధువులను ఏ బంధాలను లెక్కించక తక్షణం వెడలిపోయే తీరు స్ఫురిస్తుంది. గోపికలకు ఇది లౌకిక భావ మరణమే. గోపికలు తమ అత్యంత అవసరమైన పనులను పూర్తి చేసుకున్నవారు కారు. పాలుతాగే పిల్లలను వదిలించుకుని వెళ్ళడం ఏ తల్లీ చేయగలిగే పనికాదు. వీరు తమనుతాము అందంగా అలంకరించుకున్న వారుకారు. కృష్ణపరమాత్మను చేరాలనే తపన ఆ పరమ పురుషునిలో ఐక్యమవాలనే ఆరాటం భవబంధాల నన్నింటినీ త్రోసి పుచ్చి గోపికలను పరుగుపెట్టేట్లు చేశాయి. (భగవానుని దగ్గరకు వచ్చిన 16000 గోపికలలో పది రకాలమంది ఉన్నారు. సత్వరజస్తమో గుణాలు నిర్గుణముకలవారు, ప్రతి ఒక్క గుణము మరొక గుణంతో కలుపుతూ (సాత్త్విక రాజసం, సాత్త్విక తామసం, సాత్త్విక సాత్త్వికం మొ॥ విధంగా) పది రకాలు అవుతారు).

తీరా అన్ని బంధాలు కాలదన్ని వెళ్ళిన ఈ జీవాత్మలైన గోపికలకు పరమాత్మ మళ్లీ ప్రలోభంలో పడవేయజూశాడు.

"ఇలువడి నున్న జేసి హృదయేశుల నుగ్గులు వుచ్చి యత్తమా
మలనెరియించి సోదరుల మానము మూర వుచ్చి, తల్లిదం
డ్రుల రుచిమాన్చి, బంధులకు రోత యొనరు జారవాంఛలన్
వలవరి సత్కులాంగనలు వత్తురె? లోకులు నూచిమెత్తురే"[85]

అని భయ పెట్టాడు.

"ప్రాణేశుడెఱిగిన బ్రాణమునకు దెగు
దండించు నెఱిగిన ధరణివిభుడు
మామ యెఱింగిన మనువెల్ల జెడిపోవు
దలవరి యెఱిగిన దగులు సేయు
దలిదండ్రు లెఱిగిన దలలెత్తకుండుదు
రేరా లెఱింగిన నెత్తి పాడుచు
నాత్మజులెఱిగిన నాదరింపరు చూచి
బంధువు లెఱిగిన బహి మొనర్తు
రి తరులెఱిగిరేని నెంతయు జుల్కగా
జూతురిందు నందు సుఖములేదు
యశము లేదు నిర్భయానందమును లేదు
జారుజేర జనదు చారుముఖికి"[86]

అంటూ కృష్ణుడు పలికిన పలుకులలో వాస్తవం ఉంది. ఇల్లూవాకిలి ధ్యాస లేక భగవంతుని పైనే తన దృష్టిని కేంద్రీకరించి సన్యాసిని అయిన స్త్రీని ఎవరు మాత్రం సహించగలరు? భరించగలరు? అటువంటి స్త్రీకి అన్ని రకాలుగాను అందరి

నైపు నుండి సూటి పోటి మాటలు తగలకపోవు. మీరాబాయి, సక్కుబాయి వంటి భక్తురాంగ్ర జీవితాలే ఇందుకు నిదర్శనంగా చెప్పుకోవచ్చు. ఇంటిని ఇంటి వారిని లెక్కించక వదిలి కృష్ణుని ధ్యానంలో లగ్నమయి కృష్ణునిలో ఐక్యమైన విషయం సర్వవిదితమే. వీరికి ఆదర్శం గోపికలే (వీరూ గోపికలే) కనుకనే 'సుఖములేదు యశములేదు జారు జేరజనదు' అంటూ తన వద్దకు రావాలంటే సుఖమూయశయూ అన్నీ వదులు కోవాలి. ఆలోచించుకోమన్నాడు 'జారు చేరవలదు' అంటూ తనను జారునిగా కూడా తెలుపుకున్నారు. ఎన్నిటికో తెగించిన మగువే జారుని పొందు కోరుకుంటుంది. కృష్ణుడు జారుడు అనుకున్నట్లయితే కష్టనష్టాలు నిష్టురాలు భరించి సహించే భక్తులే కృష్ణుని పొందగలుగుతారు.

అంతేకాక "జారయతి, శిథిలయతి తాపత్రయమితి జార:శ్రీకృష్ణ పరమాత్మేతి భావ:"[87] అనే వ్యుత్పత్త్యర్థం పరమార్థంలో గ్రహించినది. తాపత్రయాన్ని బోద్రోలు వాడు అని దీని అర్థం. కృష్ణుని జేరిన గోపికలకు లౌకిక తాపత్రయాలు ఏవిధంగానూ బాధించవు. తన వద్దకు వచ్చిన గోపికలకు తనపైన ఎంతటి దృఢమైన ప్రేమ భక్తులున్నాయో పరీక్షిస్తున్నాడు భగవానుడు. ఏమాత్రం చంచలత ఉన్నా గోపికలలో కొందరయినా భగవానుని ఈ మాటలకు వెనుకకు తిరిగిపోయేవారే. పతివ్రతా ధర్మాలను ఆచరించడం మర్యాద అనిచెప్పాడు. సనాతన ధర్మాలను గుర్తుచేశాడు. అన్నీ వదలి తనను చేరవచ్చిన జీవులకు పరమాత్మ చెప్పవలసిన మాటలా ఇవి అని అనిపించకపోవు. కృష్ణుడు చెప్పిన ప్రతి ధర్మ సూత్రంలోనూ గూడార్థం ఇమిడి ఉంది. 'పతి కురూపి అయినా పామరుడైనా రోగియైనా ఆ 'పతివల్ల ఎటువంటి ఆనందమూ లభింపక పోయినా ఆపతిని అంటిపెట్టుకుని పరువుప్రతిష్టల 'పేరుతో మర్యాద 'పేరుతో ఎన్ని బాధలయినా పడుతూ పెద్దలు చెప్పిన ధర్మం 'పేరుతో భరిస్తూ పడి ఉంటారు. కానీ అన్ని కష్టాలు పడినా భగవంతుని భజించి ఆ సంసారం నుండి ముక్తిని పొందుదామని ఉండదు. పరమాత్మ పొందు కోరి పరమానందాన్ని అనుభవించే

జీవులు అతి తక్కువ. ఈకారణంగానే కృష్ణుడు 'సనాతన ధర్మం పేరుతో ఇంటిని సంసారాన్ని బంధువులను కోరుకుంటారా - అన్ని ధర్మాలూ వదిలి నావారయి పరమానందాన్ని పొందుతారా' అనే విషయాన్ని తెలుసుకో గోరాడు.

ఆరంభశూరత్వం చూపి, పరమాత్మను చేరే ఆధ్యాత్మిక మార్గంలో అడుగుబెట్టి, ఎదురయ్యే కష్టనష్టాలను తట్టుకోలేక వెనుకంజ వేసినట్లయితే జీవిగతి రెంటికీ చెడ్డరేవడే అవుతుంది. ఆధ్యాత్మిక రంగంలో అడుగుబెట్టిన ఏభక్తుడూ సుఖపడి ఎరుగడు లౌకికంగా. రామదాసు త్యాగయ్య వంటి రామభక్తులు, సక్కుబాయి మీరాబాయి వంటి కృష్ణభక్తులు ఎవరైన లౌకిక జీవితంలో ఎన్నో కష్టాలను అవమానాలను పొందినా ఆధ్యాత్మిక రంగంలో అఖండ గౌరవ మర్యాదలను అందినవారే. భగవంతుని తమ హృదయపీఠం మీద అధిష్టించుకున్నవారే. ఆత్మానందాన్ని పొందినవారే.

అన్ని ధర్మాలను బోధించిన కృష్ణుడే భగవద్గీతలో -

"సర్వధర్మాన్పరి త్యజ్యమామేకంశరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యోమోక్షయిష్యామి మాశుచః" [88]

అని కూడా అన్నాడంటే అర్థం ఏమిటి?

ధర్మాన్ని పాటించడం జీవి ధర్మమే అయినా పరమాత్మను చేరుకునే యత్నంలో అది ఆటంకంగా ఉన్నప్పుడు ఆ ధర్మాన్ని పరిత్యజించినా ఏమాత్రం తప్పుకాదనీ అలా తనను శరణు వేడితే సకల పాపాల నుండి విముక్తిని కలిగిస్తానన్నాడు భగవంతుడు. ఈ విషయాన్ని సహజంగానే నరనరాల్లోనూ జీర్ణించుకున్న జీవులు గోపికలే. కనుకనే అన్ని ధర్మాల సంకెళ్ళనూ తెంపుకుని పరమాత్మ కోసం వచ్చారు.

పరమాత్మ పరీక్షలో నిగ్గుదేరారు. పరమాత్మకే సమాధానం చెప్పి తమమాట వెగ్గించుకున్నారు.

*"పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మ ప*
*ద్ధతి యౌనంటివి, దేహ ధారిణులకున్ ధర్మజ్ఞ చింతింపుచున్.*
*పతిపుత్రాదిక నామమూర్తివగుచున్ భాసిల్లునీయందుద*
*త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించుటన్యాయమే."[89]*

అంటూ పతులలోను బిడ్డలలోనూ, బంధువులలోనూ అంతర్యామివై ఉన్న నిన్ను చూసుకునే వారిని మేము సేవించాము. నువ్వు అధిష్ఠానంగా నుండనట్లయితే వారు మాకు బంధువులుకారు. కనుక వారికోసం మమ్ములను ఇళ్ళకు పొమ్మన వద్దని' కృష్ణుని సేవించితే వారందరిని సేవించినట్లే అవుతుందనీ అన్నారు. ధర్మజ్ఞా! అని సంబోధనలో అన్ని ధర్మాలూ తెలిపిన వాడివి మా (గోపికల) ధర్మాన్ని తెలుసుకోలేవా అనే దెప్పి పొడుపూ వినిపిస్తుంది.

గోపికలకు సర్వస్వం కృష్ణుడేనని కృష్ణుని వదిలి వెనుకకు వెళ్ళలేమని తెలుపుతూ

*"భవదాలోకన హాస గీతజములై భాసిల్లుకామాగ్నులన్*
*భవదీయాధర పల్లవామృతముచే బాపందగుంబాపవే*
*భవదంఘ్రిద్వయ వీధి బొందెదమునీ బాదంబులానం ప్రియా"[90]*

అని తాము తిరిగి వెళ్ళే ప్రసక్తి లేదని విరహాగ్నిలో మరణించయినా నీ పాదసన్నిధికే చేరుతామని కుసుమశరుని శరపరంపరా పరవశులై యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపాలు విని నవ్వి 'యోగీశ్వరేశ్వరుండయిన కృష్ణుండాత్మారాముండై వారలతో రమించెనప్పుడు'.[91] కృష్ణ భగవానుడు వారితో రమించడానికి వారి నుండి ఏ అర్హతను ఏ సమాధానాన్ని ఆశించాడో ఆ అర్హతను పొందిన గోపికలు ఆ సమాధానాన్నే ఇవ్వడంతో వారితో రమించాడు.

గోపికలాశించిన అధరామృతానికి అర్థం - ధర అంటే భూమి అని, అధర అంటే భూమికి సంబంధించనిదని, అది కృష్ణ ప్రేమామృతమని, జ్ఞానా మృతమని అర్థం చెప్పుకోవాలి.

## గోపికా విలాపం

పరమాత్మతో రమించే అవకాశం కలిగిన అనంతరం జీవుడు సాధనను విడువకూడదు. అలా విడిచినట్లయితే పతనం తప్పదు. అహంకారం పనికి రాదు. అహంకారంతో ఆవృతులయిన జీవులను పరమాత్మ సహించలేడు. తనను చేరిన వారిలోని ఏచిన్న లోపాన్ని అయినా కూడా తొలగించే విధానాన్ని అవలంబిస్తాడు. అది ఆ భక్తుల పట్ల పరమాత్మకు ఉండే ప్రేమ వల్లనే జరుగుతుంది. శ్రీకృష్ణుని

> "కరుణాలోకమునం బటాంచలకచాకర్షంబులన్ మేఖలా
> కరబాహుస్తన మర్శనంబుల నఖాంకవ్యాప్తులన్ నర్మవా
> క్పరిరంభంబుల మంజులాధర సుధాపానంబునం."[92]

'కరిగి పోతున్న గోపికలు కృతార్థులై మరుని చిక్కులజొక్కి'[93] యుండగా 'మక్కువ శాంతి సేయుటకు మన్ననసేసి ప్రసన్నుడౌటకుం'[94] గాను తిరోహితుడయ్యాడు. వారి మధ్య నుండి అదృశ్యుడైనది వారికి మరింత తనపట్ల ఆసక్తిని వీడని బంధాన్ని పెంచి వారిని పునీతులను చేయడానికే.

భగవంతుని విషయంలో తృప్తి పనికిరాదు. గోపికలకు భగవంతుడు తమవాడయ్యాడని తమపట్ల ఆసక్తుడయ్యాడని తృప్తి కలిగే సరికి వారి సాధన కుంటుపడే అవకాశం ఉంది. అది వారిని భగవంతునికి దూరం చేసే అవర్థాన్ని కలిగిస్తుంది. సాధనలలో కల్ల సర్వోత్తమమైన సాధనం భగవానుని కోసం ఆర్తితో చేసే రోదనమే. ఆ అనుభవమూ ఆ సాధన గోపికలకు తన వియోగం ద్వారా సిద్ధింపచేయాలనే కృష్ణుడు అదృశ్యుడయ్యాడు.

వాస్తవానికి సర్వవ్యాపి అయిన భగవంతుడు ఎక్కడికీ వెళ్ళిపోయే ప్రసక్తిలేదు. జీవుల హృదయాలలోను ఉంటాడు. గోపికల హృదయాలలోనూ నిండి ఉన్నాడు. కాని గుర్తించలేని జీవులు కంటికి కనిపించని పరమాత్మకై దర్శనదానాన్ని యాచిస్తూ పరితపించడం జరుగుతుంది. ఆపరితపించడంలోనే పరిపూర్ణత్వమూ ఉంటుంది. 'వియోగం అంటే విశిష్టమైన యోగం. బహిరంగంలోని వియోగం అంతరంగంలో సంయోగం' అవుతుంది. స్మరణం మననం ప్రేమాలాపాలు అంతరంగంలో కలిగే సంయోగం.

గోపికలు కృష్ణవియోగంలో ఉన్మాదులయ్యారు. "పున్నాగకానవే పున్నాగవందితు..." [94] అంటూ పూలను చెట్లను జడపదార్థాలన్నింటిని కృష్ణుని జాడ అడుగసాగారు.

*'నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబుపై*
*జల్లెడివాడు మౌళి పరిసర్పితపింఛమువాడు నవ్వురా*
*జిల్లెడు మోమువాడొకడు చెల్వల మానధనంబుదెచ్చెనో*
*మల్లియలార! మీ పొదలమాటున లేడు గదమ్మ చెప్పరే* [95]

అంటూ కృష్ణుని రూపాన్ని పదే పదే తలచుకుంటూ కృష్ణుని జాడ చెప్పమని వేడుకోసాగారు. మదనోన్మత్త చిత్తలైన గోపికలు అంతర్ముఖులై తమలో కృష్ణుడున్నట్లు తామే కృష్ణుడయినట్లు భావించసాగారు. ఆ కృష్ణ లీలలను తామే అనుకరించసాగారు.

**"లోక మెల్ల గుక్షిలోపల నున్నది**
**మాధ వుండ నేను, మాత నీవు**
**చూడు మనుచు నొక్క సుందరి యొకతెకు**
**ముఖము దెఱచి చూపు ......."** [96]

"కాళియ ఫణి యిది వీరలు
కాళియ ఫణి సతులు మ్రొక్కగడగిరినే గో
పాలకుమారుడ ......." [97]

నంటూ ఆడసాగింది మరొక గోపిక. మొదట కృష్ణునికి దాసోహం అన్న గోపికలు కృష్ణలీలలు అనుకరిస్తూ అనుకరిస్తూ 'కృష్ణోహం' అనసాగారు.

ధ్యానంలో తన్మయత కలుగగానే గోపిక లన్నింటిలో కృష్ణుని కోసం చూసి చూసి చివరకు కృష్ణమయమయి పోయారు. కృష్ణ వియోగం వల్ల గోపికలు పొందిన విరహంలో కృష్ణుడు వారికి మరింత దగ్గరయ్యాడు. వారి ప్రేమకు వారి సర్వస్వ సమర్పణకు పరవశుడయిన హరి -

"పాయవిగేహశృంఖలలు బాపి నిరంతర మత్పరత్వముం
జేయుచునున్న మీకు బ్రతిసేయ యుగంబులనైన నేర; నన్
బాయక కొల్చు మానసము ప్రత్యుపకారముగా దలంచినా
పాయుట దప్పుగా గొనక భామినులార కృపన్ శమింపరే [98]

అని పలుకుతూ తాను వారిని మన్నిస్తూ వారికి పూర్తిగా అధీనుడయ్యాడు.

శ్రీకృష్ణ విరహాగ్నివల్ల గోపికలకు అప్రాకృత రసాత్మకమైన శరీరాలు లభించాయి. కృష్ణునితో రాసక్రీడ జరిపే అవకాశం భాగ్యమూ లభించాయి.

## రాసక్రీడ

గోపికలు తన్మయాసక్తి నుండి మేల్కొనిన తరువాత రాసక్రీడ జరిగింది. 'రాసమ'నే శబ్దానికి మూలం రసం. రసం అంటే స్వయంగా కృష్ణ భగవానుడే. 'రసోవైసః.' ఏ దివ్య క్రీడలో అయితే ఒకే రసం (కృష్ణపరమాత్మ) అనేక రసాలుగా

అనంత రస సమాస్వాదనం జరిగిందో, ఒకే రసంగా రస సమూహం ప్రకటనమై స్వయంగా తానే ఆస్వాదకుడు గానూ, ఆస్వాద్యంగానూ అయి లీలా ధామంగాను విభిన్న ఆలంబనల రూపంలోనూ క్రీడించిందో ఆదివ్య క్రీడకే రాసక్రీడ అనిపేరు.

గోపికలందరిలోనూ పరమ విరహాసక్తి జనించిన కారణం చేత ప్రతి గోపిక తాను కృష్ణుని ప్రక్కనే ఉండగోరింది. కృష్ణునికి వారి కోరిక నెరవేర్చక తప్పదు. భగవానుడు స్వతంత్రుడే అయినా ఈ దశలో భక్త పరాధీనుడై వారి ఇష్ట ప్రకారం ప్రేమాతిశయంతో వర్తించ వలసి ఉంటుంది. కనుక యోగమాయ ద్వారా అందరి వద్ద అన్ని రూపులతోనూ ఉండి వారితో రాస లీల జరిపాడు.

శుద్ధమైన జీవాత్మ పరమాత్మతో విలాసంగా క్రీడించడమే రాసక్రీడ! మాయా వరణ రహితుడైన శుద్ధ జీవికి పరబ్రహ్మతో సమ్మేళనం. తనను ఆరాధించే జీవిని ఆనంద పరచడం పరమాత్మ కృత్యం. గోపికలనానంద పరచడానికే కృష్ణుడు రాసక్రీడను జరిపాడు. అయితే కృష్ణుడు ఆనందించ లేదా అంటే - తన భక్తులయిన గోపికలు ఆనందించారు. కనుక పరమాత్మ ఆనందించాడు.

'రాసలీల యొక్క యదార్థ స్వరూపము పరమ రస స్ఫూర్తి'.[99] దాని ఆస్వాదం కేవలం పరమ భావమయులు శ్రీకృష్ణ ప్రేమ స్వరూపులు అయిన గోపికల మధుర హృదయాలలో తప్ప ఇతరులకు దుర్లభం.

ఎనిమిదేళ్ళ ప్రాయంలో ఉన్న కృష్ణ పరమాత్మకు గోపికల ఆత్మలతోటే తప్ప లౌకిక శరీర సంబంధం కాదు. వారిది లౌకిక కామము కాదు.

మరి ఈ సందర్భంలో శృంగార రసాన్ని పోషించుతూ తెలుపడానికి కారణమేమిటనే సందేహం వస్తుంది. గోపికలై వచ్చినది స్త్రీ భావం తోటి పురుషోత్తమునికి తమను తాము అర్పించుకునే ఉద్దేశం తోటి. స్త్రీ గా తాను పతిగా భావించే పరుడు పరాత్పరునికి అర్పించుకున్నట్లుగా చెబుతున్నప్పుడు కవికి 'శృంగార రస నిర్వహణం' తప్ప గత్యంతరం లేదు. శృంగారం రసరాజం.

అందరికీ అనుభవ పూర్వకంగా అర్థంకాగలిగిన పరిభాష శృంగార భాషే. ఆ శృంగార పరిభాషలో చెబితే తప్ప అటు కవికి ఇటు పఠితకు జీవాత్మ పరమాత్మలో ఐక్యమవడం అనే ఏకతా సూత్రంలో తృప్తి కలుగదు. కనుక శృంగార రస నిర్వహణం జీవాత్మ పరమాత్మల కలయిక సందర్భంలోనూ వాడబడుతోంది.

'రాసక్రీడ కామ క్రీడ కాదు. కామ విజయ క్రీడ. శ్రీకృష్ణుడు వత్సలీలలో బ్రహ్మ గర్వాన్ని, అగ్నిపానం చేసి అగ్ని గర్వాన్ని, గోవర్ధనాన్ని ఎత్తి ఇంద్రుని గర్వాన్ని తొలగించాడు. వరుణ దేవునికి శరణాన్ని ప్రసాదించాడు. రాస క్రీడలో మన్మథుని జయించాడు'. [100]

రాస క్రీడలో శ్రీ కృష్ణునికి గోపికలకు దైహికమైన సంయోగం లేదు. గోపికల పాంచ భౌతిక శరీరాలు వారి వారి ఇండ్లలోనే ఉన్నాయి. వారి సూక్ష్మ శరీరాలతోనే భగవత్సమాగమం జరిగింది. కనుకనే కృష్ణమాయ చేత మోహితులైన వ్రజ గోపికల భర్తలు తండ్రులు మొదలయిన ఆత్మీయులు తమ తమ పత్నులను పుత్రికలను తమ వద్దనే ఉన్నట్లు భావించి కృష్ణుని పట్ల ఎట్టి దోష దృష్టిని చూపలేదని వ్యాస భాగవతం తెలుపుతోంది[101].

*గోప జనములందు గోపికలందుమ*
*సకల జంతులందు సంచరించు*
*నామహాత్మునకు బరాంగవలెవ్వరు*
*సర్వమయుడు లీల సలిపెగాక* [102]

సర్వాంతర్యామి అయిన భగవంతుడు గోపికల సూక్ష్మ దేహాలతో జరిపిన రాసలీల ఫలితంగా గోపికలలో ఏకాంత భక్తి సుస్థిరమయింది.

గోపికా కృష్ణుల రాసక్రీడ అనేది కృష్ణుడు గావించిన శిష్ట రక్షణం. గోపికలు శిష్టులు. వారికి వచ్చిన ఆపద శ్రీకృష్ణ వియోగం. గోపికలకు కృష్ణుడు దూరమవడం

అనేది అన్నిటినీ మించిన ఆపద. విరహాగ్నిలో వేగి పోతున్న గోపికల హృదయాలను రాసక్రీడ ద్వారా శాంతపరచాడు. భరించలేని వియోగం నుంచి వారికి రక్షణ కలిగించాడు.

## సుదర్శనుని ఉద్ధరణం

సుదర్శనుడనే గంధర్వుడు రూపసిరి సంపదలతో గర్వించి విమాన సంచారం చేస్తూ ఒకచోట ఆంగీరసమునుల విరూపాన్ని చూసి నవ్వినందుకుగాను వారిచే సర్పరూపం పొందేట్లుగా శపించబడ్డాడు. క్షమార్పణ వేడిన సుదర్శనునికి శ్రీకృష్ణ పాద స్పర్శతో శాప విమోచనం అవుతుందని ఆంగీరసుడు తెలిపాడు. [103] ఆ శాపం సుదర్శనుని పాలిటి వరమయింది.

ఒక రాత్రివేళ మహాసర్ప రూపంలో సుదర్శనుడు దాన ధర్మాది సత్కర్మలు చేసి పడుకుని వున్న నందుని పట్టి మింగబోగా కృష్ణుడు ఆ సర్పాన్ని కాలరాచాడు. తత్కారణంగా సర్పరూపం నుండి విముక్తి పొందిన విద్యాధరుడు కృష్ణుని పాదాలకు మొక్కి తన శాప వృత్తాంతాన్ని చెప్పి, ప్రదక్షణ నమస్కారాదులు చేసి, శ్రీకృష్ణుని ఆజ్ఞతో తన లోకానికి వెళ్ళాడు. జీవుడు తన శరీరమూ, ప్రపంచమూ సుందరమైనదని తలచినపుడు 'పాపం' ప్రారంభమవుతుంది. భగవంతుని సౌందర్యాన్ని కీర్తించినపుడు భక్తి ఉదయిస్తుంది. అదే జరిగింది సుదర్శనుని విషయంలో.

ఏదయినా సత్కార్యం చేసిన అనంతరం ఆత్మ ప్రశంసలోనూ ప్రమాదం లోనూ నిష్క్రియతలోనూ మునిగి ఉంటారు. అప్పుడు అహంకారం వారిని ఆవహిస్తుంది. నందుడు దాన ధర్మాలు చేసి తృప్తిగా నిశ్చింతగా నిద్రించాడు. అందువలన అహంకారం అనే సర్పం నందుని ఆవహించింది. దానిని గుర్తించి నందుడు 'కృష్ణ కృష్ణేతి వచనంబులతో దన్ను విడిపింపు మని' మొర

పెట్టుకున్నాడు. దాని ఫలితంగా నందుడు ఆ అహంకార సర్పం బారినుండి రక్షించబడ్డాడని ఒక వ్యాఖ్య.

## శంఖచూడుని ఉద్ధరణం

ఒకనాడు గోపికలు కృష్ణ బలరాములతో గూడి ప్రకృతి సౌందర్యంలో లీనమై మధుర గీతిక లాలపిస్తూ ఆనందిస్తున్న సమయాన శంఖచూడుడనే కుబేర అనుచరుడు వచ్చి గోపకాంతలను ఉత్తర దిశగా తరుముకు పోసాగాడు. గోప కాంతలు కృష్ణా రామా అంటూ పెట్టిన కేకలకు రామ కృష్ణులు వచ్చి వానితో తలబడ్డారు.

కృష్ణుడు శంఖచూడుని చంపి వాని తలపైన ఉన్న రత్నాన్ని పెరికి బలరామునికి తెచ్చి ఇచ్చాడు.

శ్రీకృష్ణుని చేతిలో నిహతుడయినవాడు తప్పక పుణ్య భాగుడేనని భావించాలి. గోలోకంలో శ్రీకృష్ణునికి శ్రీదాముడనే సఖుడున్నాడు, రాధాదేవి తన సవితి విరజతో కృష్ణుడు గడిపిన కారణాన కినుకతో శ్రీహరిని విరజతోనే గడపమని కఠినంగా పలికినందుకు శ్రీకృష్ణుడు మారుపలుకక పోయినా శ్రీదాముడు విని సహింపలేక పోయాడనీ ఆవిధంగా పలుక తగదనీ ధూర్తవై యిట్లు నామ్రోల దూలనాడ వద్దని రాధని వారించాడనీ, అదివిని రాధ 'జనకు నుతించుచున్ జనని శాపము లాడితి వో శుంఠ వే - దనుజాడవై ధరిత్రిని వృథా జలధిం బడి పీడ చెందుమా' అంటూ శపించిందనీ శ్రీదాముడు రాధను 'కృష్ణునికి దూరంగా వంద ఏళ్ళు వియోగ బాధవనుభవిస్తావని శపించగా కృష్ణుడు వారి శాపాలను మాన్పలేనని తెలిపి వారిరువురికి వరాలిస్తూ - శ్రీదామునితో 'నీ యంశముతో రక్కసి-నైయుననిన్ బుట్టి యట్టి వైవస్వత మన్వాయత కాలమునన్నే - బాయక రాసములు జేయు

పట్టున నీ వున్ వచ్చి నా చేత నిహతుడవై శాప విముక్తుడ వవుతావని తెలియజేశాడు. ఆ శ్రీదాముడే శంఖచూడుడై గోపికలను తరుముకెళ్ళాడని కృష్ణుని చేత సంహరింపబడిన తరువాత శంఖచూడునిలోని అంశ శ్రీదామునిలో కలిసి పోయిందని గర్గ భాగవతం తెలుపుతోంది[104].

## వృషభాసుర వధ

ఒకనాడు మహావృషభం ఒకటి హఠాత్తుగా గోకులంలోకి ప్రవేశించి మునిగాళ్ళతో దువ్వుతూ రంకెలు వేస్తూ పదఘట్టనం చేస్తూ రభస చేయ సాగింది. వ్రజవాసులందరూ భయభ్రాంతులయి కృష్ణునితో మొరపెట్టుకోగా కృష్ణుడు దానిని సంహరించాడు.

అరిష్టాసురుడనే నామాంతరం గల వృషభాసురుడు పూర్వజన్మలో వరతంత్వుడనే భూసురుడు. బ్రహ్మచారి, బృహస్పతికి శిష్యుడు. ఒకనాడు గురుని ఎదుట నిర్లక్ష్యంగా పాదాలను చేతిని జాపి తిరస్కరించిన వరతంత్వుని చూసి గురువయిన బృహస్పతి కోపించి కఠినంగా 'ఎద్దుగా జన్మించమని' వరతంత్వుని శపించాడు. ఆ కారణంగా వంగ దేశంలో వరతంత్వుడు వృషభరూపంలో ఉంటూ సురవిరోధితో మైత్రి సలిపి రాక్షసత్వాన్ని అలవరుచుకున్నాడు. ఈవిధంగా శాపగ్రస్తుడైన వృషభాసురుడు వ్రజానికి వచ్చి శ్రీ కృష్ణుని చేతిలో సంహరింపబడి శ్రీహరిని చేరాడు[105]

## కేశి ఉద్ధరణం

కంసుని ఆజ్ఞ మేరకు కేశి అనే రాక్షసుడు తన మాయతో పెద్ద అశ్వరూపం ధరించి భయంకరంగా సకిలిస్తూ బృందావనం చేరాడు. కృష్ణుడు ఆమాయా అశ్వంతో పోరు సలిపి ప్రాణాలు తీయగా సురలు పుష్ప వర్షం కురిపించారు.

కేశి పూర్వం ఇంద్రుని అనుచరుడయిన కుముద నామకుడు. తేజస్వి, వర్చస్వి. తత్త్వవిదుడైన కుముదకుడు ఇంద్రునికి గొడుగు పట్టి మెప్పించిన వాడు. వృత్రాసుర సంహారానంతరం ఇంద్రుడు బ్రహ్మహత్యాదోష నివారణకై అశ్వమేధయాగం చేయగా కుముదకుడు యాగాశ్వాన్ని అపహరించుకు పోయాడు. ఇది యెరిగిన ఇంద్రుడు కుముదకుని అశ్వ రూపంలో రాక్షస జన్మనెత్తమని శపించాడు. ఆ కుముదకుడే కేశి నామంతో అశ్వరూపంలో వచ్చి కృష్ణుని చేతిలో నిహతుడయి తన శాప వృత్తాంతాన్ని కృష్ణునికి చెప్పి ప్రణమిల్లి విష్ణులోకానికి చేరుకున్నాడు[106].

## వ్యోమాసుర వధ

అడవిలో కొండ దగ్గర గోపబాలురతో శ్రీకృష్ణుడు దొంగాట లాడుతున్న సమయాన వ్యోమాసురుడనే రాక్షసుడు గోపకుని వేషాన వచ్చి గోపకులను మెల్లిగా కొండ గుహ దగ్గరకు తీసుకు పోయి వారిని దాచియుంచగా శ్రీకృష్ణుడు వ్యోమాసురుని దొంగ బుద్ధిని గ్రహించి వానిని ఒడిసి పట్టి సంహరించి గోపబాలురను రక్షించాడు.

వ్యోమాసురుడు పూర్వ జన్మలో భీమరథుడనే శ్రీహరి భక్తుడు. ఇతడు ఎంతో చక్కగా రాజపాలనం చేసి కొడుకుకు రాజ్యాన్ని అప్పగించి మలయాద్రి పై లక్ష వర్షాలు శ్రీహరికై తపమాచరించాడు. ఆ సమయంలో పులస్త్యుడనే మునివరుడు శిష్యులతో కూడి రాగా భీమరథుడు లేవకుండానే వారికి నమస్కరించిన కారణాన భీమరథుడు గర్వంతో ఆ విధంగా ప్రణామ మాచరించాడని కోపించి దనుజుడవమని శపించాడు. భీమరథుడు శరణు వేడగా వ్రజంలో ఉదయించిన చక్రి చేత శాప విముక్తి నొందుతావని తెలియజేశాడు. వ్రజంలో భీమరథుడు వ్యోముడుగా పుట్టి కృష్ణుని చేతిలో నిహతుడయ్యాడు[107].

## అక్రూరుని ఆగమనం

వ్యోమాసురుని వధతో శ్రీకృష్ణునికి వ్రజవాసులతో ఋణం తీరిందా అన్నట్లుగా నారదుని చేత ప్రేరితుడైన కంసుని పనుపున అక్రూరుడు ధనుర్యాగానికి బలరామకృష్ణులను తీసుకు వెళ్ళేందుకు గాను బృందావనానికి వచ్చాడు.

శ్రీకృష్ణుని మధురకు గొనిపోవచ్చిన అక్రూరుడు గోపికలకు మిక్కిలి క్రూరుడుగా కనిపించాడు. తమనుండి కృష్ణుని దూరం చేయవద్దని ఎంత ప్రయత్నించినా ఫలితం శూన్యమే అయింది. కృష్ణుడు మధురకు పయనమై పోయాడు. వియోగం చేత, విరహం చేత ప్రేమకు పుష్టి కలుగుతుంది. వియోగ రూపమైన విశిష్టమైన యోగాన్ని గోపికలకు దానం చేసే నిమిత్తంగా శ్రీకృష్ణుడు మధురకు చేరాడు.

మధురకు వెళ్ళేనాటికి శ్రీకృష్ణునికి పదకొండేళ్ళు. పరమాత్మ స్వరూపమైన శ్రీకృష్ణునికి లౌకికమైన బాల్యయౌవన కౌమారాదులు ఉండవు. కనుకనే దుష్టశిక్షణ పసితనం నుంచే ప్రారంభించాడు.

కృష్ణయ్య తన ప్రభావాన్ని తన ఆకర్షకతత్వాన్ని బృందావనమంతా వెదజల్లాడు. బృందావనంలోని ప్రతి జీవిలోను, అణువణువులోనూ తన ప్రేమను నింపి రసప్లావితం చేశాడు. పొంగి పొరలే కృష్ణప్రేమలో గోపగోపీజనమంతా పునీతమయ్యారు. బృందావనమంతా పులకించి పోయింది.

అయితే స్వయం భగవానుడైన శ్రీకృష్ణుడు కేవలం బృందావనానికే అంకితమయి ఉండలేదు. బృందావనం శ్రీకృష్ణుని హృదయమే అయినా విశ్వమంతా వ్యాపించే విష్ణుతత్త్వం శ్రీకృష్ణునిలో పురివిప్పుకుంది. ఎంతోమంది ఆర్తులు భక్తులు లోకమంతా కృష్ణుని ఆగమనానికై ఎదురు చూస్తున్నారు.

బృందావనంలో తన పని ముగించుకున్న మురళీలోలుడు చేయవలసిన కార్యాలు ఎన్నో ఉన్నాయి. ద్విభుజుడుగా, మురళీలోలుడుగా, గోపాలునిగా, గోపికా మానస చోరునిగా బృందావనం అణువణువునా చరించిన కృష్ణుడు తన పరిధిని పెంచుకునే నిమిత్తం బృందావనం వదిలి మధురానగరానికి రాజకీయాలలోకి పయన మయ్యాడు.

## బృందావన లీలా తత్త్వం

ఏ అవతారంలోనూ ప్రదర్శించని మాధుర్య గుణాన్ని శ్రీకృష్ణావతారంలో భగవానుడు బృందావనంలో ప్రదర్శించాడు. ప్రధానంగా శ్రీకృష్ణుడు ప్రదర్శించిన చోరలీల జీవత్వాన్ని అపహరించి అమృతత్వాన్ని ప్రదర్శించే ఆనందలీల.[108] బృందావనంలో ప్రతి ఇల్లూ కృష్ణయ్యదే. కనుకనే వెన్న, పెరుగు యధేచ్ఛగా తీసుకు తిన్నాడు అందరి ఇళ్ళలోనూ. నిజానికి ఇది చోరత్వం కాదు. కృష్ణుడు నవనీత చోరుడనే బిరుదాన్ని మరి ఎలా ధరించాడు? ఎనలేని చనువు ఆత్మీయత కృష్ణయ్యకు ఇచ్చిన గోపికలు కృష్ణుడు తమవద్ద నుండి తమ ఇంటి నుండి వెన్న దొంగిలించాడని ఎలా అనగలిగారు? వారి వాదం ఎంతవరకు సమంజసం? ఇది గోపికల మనసులలో కృష్ణుడు ప్రేమాభివృద్ధిని గావించి వారి మనస్సులను తన మీదే నాటుకునేట్లుగా చేసిన లీల.

గొల్లెతలకు పాలు పెరుగు వెన్న మీగడ నెయ్యి మొదలైనవి జీవనాధారం. వీటిమీద వారికి ఉన్న అభిమానం ధన కనక వస్తు వాహనాల మీద కూడా లేదు. వారికి గోధనమే ధనం. వారు ఆవులను దూడలను గవ్యాలను ఎంతో ప్రేమిస్తారు.

తనకన్నా ఇతరాన్ని అధికంగా భావించడం భగవంతునికి ఎంతమాత్రం ఇష్టం ఉండదు. అందులోనూ తనను ఎంతగానో ప్రేమించే వారు తనను చూసి మైమరచే వారు అయిన గొల్లెతల మనసుల్లో పాలు పెరుగు వెన్న మీద అభిమానం ఉండడం సహించలేక పోయాడు.

వసుమతీనాథయెవ్వని మీద నాకను
గ్రహబుద్ధి వొడము నాఘనుని విత్త
మంతయు గ్రమమున నపహరించిన వాడు
ధనహీనుడగుచు సంతాపమొందు
విడుతురు బంధులవ్విధమున నొందిలి
యై చేయునది లేక యఖిల కార్య
భారంబులుడిగి మద్భక్తులతో మైత్రి
నెఱపుచు విజ్ఞాన నిరతుడగుచు

*బిదపవాడవ్యయానందపదమయాత్మ*
*బరగ శ్రీ విష్ణులోక సంప్రాప్తినొందు*[109]

అనేది భగవంతుని స్వభావం, తత్త్వం. భక్తులు దేనిమీద ప్రేమను పెంచుకుంటారో దానిని వారికి దూరం చేసి వారి దృష్టిని తనవైపుకు తిప్పుకుంటాడు.

ఈ కారణంగానే తన కృపకు సంపూర్ణ అర్హులయిన గోపికలను మరింత శుద్ధపరిచే విధానం అవలంబించాడు. ఈ కార్యమే **చోరలీల.**

తమకెంతో ప్రీతికరమైన వాటికి నష్టం కలగడం వల్ల గోపికలు వాటిని కాపాడుకోవాలనే ధ్యాసతో కృష్ణుని దొంగతనం చేస్తూండగా పట్టుకోవాలనే ఉద్దేశంతో కృష్ణుని కోసం వేయికళ్ళతో ఎదురు చూసేవారు. ఎదురుచూసే గోపికల కన్నుగప్పి ఏకకాలంలో అనేక కృష్ణరూపాలతో అందరి ఇళ్ళలోనూ పాలుపెరుగు వెన్న గ్రహించి అదృశ్యుడయేవాడు. ఇది నవనీత చోరుని లీల.

గోపికలకెల్లవేళలా కృష్ణుని లీలల్ని తలచుకుంటూ చెప్పుకుంటా (శ్రవణమననాదులు) ఉండేట్లు చేసి వారి హృదయాలను తన ధ్యానతో నిర్మలంగా మృదువుగా నవనీతంలా ఘృతంలా అయ్యేట్లు చేశాడు. వారి

మనసులనపహరించే నిమిత్తమే ఆయా పదార్థాలను హరించాడు కృష్ణుడు.

కృష్ణుడు ఏ అవతారాలలోనూ చేయని మరో లీల బృందావనంలో చేశాడు అది '**గోచారణ లీల**' గోవంటే ఆవు. గోచారణమంటే పశువులను (గోవులను) మేపడానికై త్రిప్పడం. శ్రీకృష్ణుడు తన శక్తి సామర్థ్యాలను తనమాయా శక్తితో మరగు పరుచుకుని మందలో సామాన్యుల మాదిరి క్రీడించాడు.

*"వేదాంత వీధుల విహరించు విన్నాణి*
*విహరించు కాంతార వీధులందు*
*ఫణిరాజు శయ్యపై బవళించు సుఖభోగి*
*పల్లవ శయ్యల బవ్వళించు*
*గురుయోగి మానస గుహలగ్రుమ్మరు మేటి*
*గ్రుమ్మరు నద్రీంద్ర గుహలలోన*
*గమల తోడ బెనంగి కడుడయ్యుచతురుడా*
*భీరజనుల తోడ బెనగిడయ్యు ..."* [110]

ఈ విధంగా గోవులు కాస్తూ 'రాపూర్ణ చంద్రికా గౌతమీ గంగా....' అంటూ అటూ ఇటూ తనకు దూరంగా పోతున్న గోవులను ఎలుగెత్తి పిలిచేవాడు. అలా పిలువగానే గోవులు పరుగున దరికి జేరేవి. పరమాత్మ చేత ఆకర్షింపబడని జీవి ఏది? గోవులు సాధుస్వభావం కలవి కనుక పరమాత్మ పిలుపును వినిపించుకుని అతి శీఘ్రంగా పరమాత్మను చేరుకోగలిగాయి.

సాధు స్వభావులకే పరమాత్మ పిలుపు వినబడుతుంది. వారికే పరమాత్మ దరికి చేరగలిగే అర్హత అదృష్టం కలుగుతాయి. క్రూరస్వభావులకు ఈ అవకాశం తక్కువ. కనుకనే భగవంతుని పిలుపు వినదలచిన జీవులు తమ క్రూరత్వాన్ని

సాధనల ద్వారా తగ్గించుకుని సాధుత్వాన్ని పెంచుకోగలగాలి. అప్పుడు కృష్ణుడు ఎలుగెత్తి పిలిచి తనవైపుకు ఆకర్షించుకుంటాడు.

కృష్ణుడు గోవిందుడు. గోవులకు విందును అంటే "ప్రియాన్ని సంతోషాన్ని"[111] కూర్చేవాడు. గోవిందుడంటే మనస్సు మొదలయిన ఇంద్రియాలని నడుపు అంతర్యామి [112] (గవాంఇంద్రః) అని మరొక అర్థం.

గోవిందుడయిన కృష్ణుడు జీవుల సర్వేంద్రియాలను సక్రమమైన మార్గంలో నడిపేవాడు. సాధు స్వభావులయిన జీవులు తమ సర్వేంద్రియాలను భగవదర్పణం చేసినట్లయితే వ్యవహారంలో ఆయా ఇంద్రియాలు అటూ ఇటూ చెదరినపుడు (ఇంద్రియలోలత్వం కలిగినపుడు) వాటి రక్షణ భారం వహించిన గోపాల కృష్ణుడు వాటిని తనవైపు కే తిరిగేలా చేసుకుంటాడు.

ఎంతటి భక్తునికైనా లోక వ్యవహారంలో కలిగే ఇంద్రియ చాంచల్యాన్ని భగవంతుని కథా శ్రవణం భాగవతుల సంసర్గం ద్వారా అదుపులో ఉంచుకునే అవకాశం ఉంది. భక్తుని (సాధు స్వభావులు) సర్వేంద్రియాలను తన అధీనంలో ఉంచుకుని పాలించేదే శ్రీకృష్ణుని గోచారణ లీల అంతరార్థం.

గోచారణకు పర్యవసానమే **రాసలీల**. ఇంద్రియాలను సర్వకాల సర్వావస్థలలోనూ భగవంతునికే అర్పించిన జీవులను భగవంతుడు తన వద్దకు పిలుస్తాడు. వారితో రాసలీల జరుపుతాడు.

శ్రీకృష్ణుడు వేణుగానలోలునిగా నిరంతరం వేణువును ధరించి సంచరించాడు బృందావనంలో. ఏ అవతారం లోనూ చేయని మనోహరమైన వేణువాదనను శ్రీకృష్ణావతారంలోనే గావించాడు భగవానుడు.

వేణువుతో దివ్యరాగాలను ఆలపించి బృందావనాన్ని చైతన్యవంతం చేశాడు. కృష్ణుని వేణునాదం చైతన్యాన్ని కలిగించడమే కాక జీవిలో నిద్రాణంగా ఉన్న ప్రేమను జాగృతం చేస్తుంది. హృదయంలో కల్లోలం రేపుతుంది. భగవంతుని పట్ల ఆసక్తిని పెంచుతుంది. ఆ తరువాత జీవిలో పరమాత్మ పట్ల విరహావేదనను

రగిలిస్తుంది. పరమాత్మకు దూరంగా లోకంలో ఉండలేని స్థితిని జీవికి కలిగిస్తుంది. పరమాత్మ జాడను తెలుపుతూ జీవికి పరమాత్మ సంకేతాన్ని తెలుపుతుంది. చివరకు జీవిని పరమాత్మ దగ్గరకు ఆకర్షించి జీవాత్మ (గోపికల) పరమాత్మల సంధాన కర్తగా వ్యవహరిస్తుంది. ఇది సద్గురువు వ్యవహారం. కనుక ప్రేమ భక్తులకు గోపికా ప్రవృత్తి కలవారికి వేణువు సద్గురువు వంటిది అనడంలో సందేహం లేదు.

ఈ కారణం వల్లనే కృష్ణుని వేణువు గోపికలకు మాత్రమే వినిపించేది. అంటే గోపికలే కృష్ణుని వేణుగానం లోని సంకేతాన్ని అర్థం చేసుకున్నారు. ఒకవిధంగా వేణునాదంతో కృష్ణుడు రాసక్రీడకు ఆహ్వానించినది గోపికలనే. (గోపనము గలది గోపిక) వారికే ఆ అర్హత కలిగింది. అది వినగలిగి కృష్ణుని వద్దకు వచ్చిన వారే (రాగలిగిన వారే) గోపికలని చెప్పుకోవచ్చు. ముల్లోకాలనూ మోహింపజేసే వేణునాదం కృష్ణావతారానికి మధురమైన అలంకారం.

వేణువులో ఉన్న ఏడు రంధ్రాలలోనూ ఆరు రంధ్రాలు ఐశ్వర్య వీర్య యశశ్శ్రీజ్ఞాన వైరాగ్యాలనే భగవానుని షడ్గుణాలకు సంకేతమని ఏడవది పై ఆరు ధర్మాలతోనూ కూడిన అప్రాకృత దేహధారియైన స్వయం భగవానుని తెలియజేస్తుందనీ ఒక వ్యాఖ్య. కనుకనే గోపికలకే వేణునాదం వినబడింది.

ఈవిధంగా కృష్ణభగవానుడు గోచారణ లీల, నవనీత చోరలీల, రాసలీల అనేవి, వేణుగానం ఆలపించడమనేది ఆచరించి తన చిలిపి చేష్టలతో ప్రేమతత్త్వంలో బృందావనాన్ని ప్రేమవనంగా మార్చాడు. ఇవి బృందావనానికే సొంతం చేశాడు. బృందావనంలోని ముగ్ధ జీవుల మధ్య ఎటువంటి రాజకీయమూ ప్రదర్శించకుండా ఆనందమయ జీవితాన్ని గడిపాడు. ఏ అవతారంలోనూ ప్రకటించని ఆయాతత్త్వాలను కృష్ణ భగవానుడు బృందావనంలోనే ప్రత్యేకంగా

ప్రకటించి గోప గోపీ జనంతో ఆడిపాడి అమితానందాన్ని పంచిపెట్టి, ఒక ప్రత్యేకతను తన 'బృందావన జీవితానికి' కలిగించాడు. అనంతరం అక్రూరునితో మధురకు పయనమయి రాజకీయపు తొడుగును ధరించి కొత్త అధ్యాయాన్ని ఆరంభించాడు.

## శ్రీకృష్ణుని మధురాగమనం

శ్రీకృష్ణుడు మధురకు పయనమయ్యాడు. దారిలో యమునలో స్నానానికై దిగిన అక్రూరునికి నీటిలో బలరామకృష్ణులు దర్శన మిచ్చారు. అటు రథంమధ్యంలోనూ ఇటు నీటిలోనూ ఒకేసారి కనిపించడంతో ఆశ్చర్యపోయి మళ్ళీనీటిలోకి చూసిన అక్రూరునికి శంఖచక్రగదా పద్మాలతో, చతుర్భుజాలతో ఆ భోగి భోగ పర్యంక మధ్యాన శయనించినట్లుగా కృష్ణుడు విష్ణురూపాన్ని దర్శింపజేశాడు. కృష్ణుడు శ్రీమన్నారాయణుని రూపాన్ని అక్రూరునికి దర్శింప జేయడంలో ఒక అంతరార్థం గోచరిస్తుంది. గోకులంలోనూ బృందావనంలోనూ ఉన్నంత వరకు ద్విభుజుడుగా మురళీధరునిగా ఉన్న శ్రీకృష్ణుడు మధురకు చేరుకున్నప్పటి నుంచి నారాయణాంశతోనే వ్యవహరిస్తానని చతుర్భుజునిగా శంఖచక్రగదా పద్మాలను ఉపయోగించ వలసిన (పద్మంలాస్యానికి విలాసానికి చిహ్నం) సమయం వచ్చిందని తెలియజేశాడని అనిపిస్తుంది.

గోకులంలో ఉన్నంత వరకు తనను చంపవచ్చిన దుష్టులను సంహరించడం గోపకులను ఎన్నో విపత్తుల నుండి రక్షించడం వంటి కార్యాలను చేసిన కృష్ణుడు బృందావనం విడిచి అవతార ప్రయోజన పరిధిని పెంచుకుంటూ దుష్టశిక్షణ కోసం తానే తరలివెళ్ళాడు. అంతేకాదు భగవంతుని అనేక విధాలుగా తమతమ హృదయాలలో నిలుపుకొని భగవద్దర్శనానికై తపిస్తున్న లోకంలోని ఎంతోమంది భక్తులకోసం బృందావనం వదలి మధురకు వెళ్ళాడు.

మధురానగరం ప్రవేశించి కంసవధానంతరం అక్రూరుని ఇంటికి వస్తానని చెప్పి అక్రూరుని పంపివేసి బలరామ గోపకుల సహితంగా మధురానగర వీధులలో తిరుగుతూ మధురానగర వాసులకు తన దర్శన భాగ్యం కలిగించి కనుల విందు చేయసాగాడు. ఆ మధుర మూర్తిని దర్శిస్తూ

*"నందతప: ఫలంబు సుగుణంబుల పుంజము గోపకామినీ*
*బృందము నోము పంట సిరి విందు దయాంబుధి యోగిబృందముల్*
*డెందములందు గోరెడు కడింది నిధానము సేరవచ్చెనో*
*సుందరులార! రండు చవి చూతము కన్నుల కోర్కె తీఱగన్"*[13]

అంటూ మధురానగరంలోని మగువలంతా గోవింద సందర్శనానికి కుతూహల పడుతూ చేస్తున్న పనులను వదలి హుటాహుటిని వచ్చి చూసి 'హరిరూపు నేత్రముల వెంటను లోగొని' పరవశించసాగారు.

మధురానగరంలో ప్రతి ఒక్కరూ శ్రీకృష్ణుని చూసి పరవశించిన వారు కాదు. సాత్త్వికమైన మృదుహృదయం ఉన్నవారే కృష్ణసందర్శనానికి ఆనందించారు. తామస రాజస ప్రవృత్తులతోనున్న కొందరు కృష్ణునికి ఎదురు తిరుగక పోలేదు. అటువంటి వారిని కాలయాపన చేయకుండా తక్షణమే మట్టుపెట్టాడు శ్రీకృష్ణుడు.

## రజకుని వధ

కృష్ణుడు మధురానగరంలో విహరిస్తూ దారిలో కనబడిన రజకుని చూసి అతడి మూటలోని మంచి ధౌత వస్త్రాలను కట్టుకోవడానికి ఇవ్వమన్నాడు. దానికి వ్యతిరేకించి కంసుని సేవకుడనే మిడిసిపాటుతో కృష్ణుని నిందించిన రజకుని ఒక్క చేతి దెబ్బతో హతమార్చాడు. 'శ్రీరామావతారంలో సీతాదేవిని అకారణంగా నిందించి ఆమెను అడవులకు పంపేట్లు చేసిన చాకలే ఈ చాకలి అని

తెలుస్తోంది'[114]. రజకుడు చావగానే మిగిలినవారు పారిపోగా మూటలోని వస్త్రాలను అందరికీ పంచాడు కృష్ణుడు.

రజకుని వధ వల్ల మధురకు వచ్చిన వెంటనే పరోక్షంగా కంసునితో పోరాటం ప్రారంభించాడని చెప్పవచ్చును. రజకుడు కంసుని మనిషి. కంసుని వస్త్రాలను ఉతికే చాకలి. భగవంతుడు ఎవరికైనా అవకాశం ఇస్తాడు. రామావతారంలో సీత మీద ఎంతటి నిందమోపినా ఎటువంటి శిక్ష పొందలేదు రజకుడు. ఆ స్వభావం కృష్ణావతార కాలంలోనూ రజకునిలో కొనసాగింది. కృష్ణుడు తనకు వస్త్రాలిమ్మని 'నిన్నుమేలందెదు'నని తెలిపినా ఆ అవకాశాన్ని వినియోగించుకోలేని మూర్ఖుడయి "పయోఘృత దధిగ్రాసంబులన్ మత్తులై యిట్టాడం జనె గాక గొల్లలకు మీ కెబ్బం గి నోరాడెడిన్ - గట్టా! ప్రాణము గోలు పోయెదు సుమీ కంసోద్ధతిన్ బాలకా"[115] అంటూ పరుషవాక్యాలను పలికాడు. కృష్ణుడు వెంటనే వానిని హతమార్చి "దోసములం బాపి కరుణతో పరమి"[116] చ్చాడు. మరణాన్ని ప్రసాదించి 'పరాన్ని' సైతం ఇచ్చాడు కృష్ణుడు. ఈవిధంగా రజకుని చంపి తనకు వ్యతిరేకంగా ప్రవర్తించిన వారిని బ్రతుకనివ్వననే సందేశాన్ని కంసునికి పరోక్షంగా పంపాడు అనే చెప్పుకోవాలి. (రజకుని వధానంతరం పారిపోయిన మిగిలిన వారు ఈ వార్తను కంసునికి చేరవేయక మానరు కదా)

## వాయకుని ఉద్ధరణ

అడగకుండానే సంతోషంగా వాయకుడిచ్చిన బహువర్ణాత్యంత మృదు పటాభరణాలను శ్రీకృష్ణుడు స్వీకరించి వాయకునికి సారూప్యం, ఐశ్వర్యం ప్రసాదించి, మనసారా తనకర్పించిన దానికి ఎన్నో రెట్లు భాగ్యాలను అందిస్తానని మధురానగర వాసులకు తెలియపరిచాడు.

త్రేతాయుగంలో సీతారాముల వివాహకాలంలో మిథిలాపురిలోని ఒక వాయకుడు జనక మహారాజా ఆజ్ఞమేరకు చిత్ర రీతులుగానేసిన పట్టు పీతాంబరాలను యివ్వగా వాటిని జనకమహారాజా జామాతలయిన రామలక్ష్మణులకిచ్చాడు వారు అవి ధరించి వెలుగొందుతుండడం చూసిన వాయకుడు 'రామలక్ష్మణులకెన్నడు సన్నని పట్టుపుట్టముల్ మన్ననినిట్టు లిచ్చెదనో యేమొ' అని మదిలో తలచిన కారణాన ఆ వాయకుడే ద్వాపరంలో తిరిగి జన్మించి బలరామ కృష్ణులకు వస్త్రాలను నేసి ఇచ్చి తృప్తి నొంది కృష్ణుని చేత ధన ధాన్యాలతో బాటు కైవల్యాన్ని కూడా పొందాడు.[117]

## సుదాముని ఉద్ధరణం

వాయకుని కరుణించిన బలరామకృష్ణులు సుదాముడనే మాలాకారుని యింటికి వెళ్ళి సుదాముడిచ్చిన అర్ఘ్యపాద్యాదికాలను తాంబూలాదులను ఘన సురభికుసుమదామాలను స్వీకరించాడు. సుదాముడు కోరిన 'పాదకమల సేవను పాదార్చకుల తోడి నెయ్యాన్ని నిరంతర అపార భూత దయలతో బాటు బలాయుఃకాంతి కీర్తి సంపదలను కూడా ఇచ్చాడు.

పూర్వం చైత్ర రథవనంలో హేమమాలి అనే యువకుడు సతీ సమేతంగా ఎంతో నియమ నిష్ఠలతో భక్తి గలిగి ఉండేవాడు. అతడు శ్రీహరి దర్శనం కోరుతూ అయిదువేల అరవిందాలతో శంకరుని పూజించి ప్రసన్నుని చేసుకుని విశ్వనాయకుడైన విష్ణుమూర్తి తన గృహానికి వచ్చి మన్ననగొని వెళ్ళేట్లుగా వరం కోరాడు. తత్ఫలితంగా శంకరుడు ద్వాపరాంతాన ఆ కోరిక నెరవేరుతుందని వరమిచ్చాడు.[118] తత్కారణంగా ద్వాపరాంతంలో సుదామునిగా పుట్టడం హరి శ్రీకృష్ణుడై సుదాముని ఇంటికి స్వయంగా వెళ్ళి సుదాముని సేవలందుకోవడం జరిగింది.

## కుబ్జా ఉద్ధరణం

శ్రీకృష్ణుడు సుదాముని కరుణించిన అనంతరం రాజవీధిలో చందన పాత్రతో వెడుతున్న కుబ్జను చూసి ఎవరి దానవంటూ పలకరించాడు. ఆమె చేతిలోని చందనం తమకిస్తే చక్కదనంతో ఆమె ప్రకాశిస్తుందన్నాడు. భగవంతునికి, మహాత్ములకు కరుణ గలిగి కృప చూపాలంటే వారికి సేవ చేయాలి. సేవ చేసే అవకాశాన్ని సేవ చేయాలనే బుద్ధిని కూడా వారే కలిగిస్తారు. ఒక్కొక్క సారి తామేకోరి మరీ సేవ చేయించుకుని వారిని ఉద్ధరిస్తారు. కుబ్జ విషయంలో అదే జరిగింది. శ్రీకృష్ణుడు కుబ్జను చందనం అడిగాడు. ఫలితంగా చక్కదనాన్ని ఇస్తానని కూడా అన్నాడు.

సేవ చేసే అవకాశం వచ్చినప్పుడు కుబ్జ తాను కంస దాసి అయినా 'రజకుని'లా తోసిపుచ్చలేదు. కుబ్జ విలేపనాలను ఎంతో ప్రీతితో బలరామ కృష్ణులకు ఇచ్చింది. వాటిని దేహానికి అలముకుని కుబ్జ ముప్వంకల దేహాన్ని సాగదీసి వక్రతలన్నీ పొగొట్టాడు. చక్కని 'చిత్తజన్మబాణం'లా సౌందర్య శోభతో వెలుగొందింది కుబ్జ.

కంసుని సేవించినంతకాలం త్రివక్రగా వికారంగా వున్న కుబ్జ శ్రీకృష్ణుని సేవించిన తక్షణమే అన్ని వంకలు దోషాలు పొగొట్టుకుని అతిలోక సౌందర్యవతి అయింది. కుబ్జ ముప్వంకలుగా ఉండడమనేది తన సత్త్వరజస్తమోగుణాలతో అసురుడైన కంసుని సేవించడానికి చిహ్నం. ఆ త్రిగుణాలే పరమాత్మ సేవలో వినియోగించినప్పుడు శుద్ధమయ్యాయి. సక్రమమయ్యాయి అని తెలుపడం దీని అంతరార్థం. జీవి తన త్రిగుణాలను పరమాత్మ సేవలో వినియోగించినప్పుడు శుద్ధమయి త్రిగుణాతీతుడవుతాడు.

కుబ్జ తనను సౌందర్యవతిని చేసిన కృష్ణుని పట్ల పంచశర బాణజాల భగ్న హృదయ అయి అంతులేని కాంక్షతో కృష్ణుని చూస్తూ పై వస్త్రాన్ని పట్టి లాగుతూ

**"వేంచేయుము నాయింటికి**
**పంచశరాకార...."** [119]

అంటూ ఆహ్వానించింది. తాను వచ్చిన కార్యం (కంసవధ) అయిన అనంతరం కుబ్జ యింటికి వస్తానని మాట ఇచ్చాడు. శ్రీకృష్ణుడు మధురకు వచ్చిన పని అవవలసి ఉండడంతో బాటు కుబ్జ కృష్ణునికై నిరీక్షణంలో కృష్ణుని ధ్యానంలో తపించాల్సిన అవసరమూ ఉంది.

భగవంతుడు ఎదురై వరంకోరుకునే అవకాశం వచ్చినా జీవి తన పూర్వ జన్మ 'వాసనాబలం'తో దానికి తగిన వరాన్నే కోరుతుంది తప్ప అంతకు మించిన వరాన్ని కోరుకోలేదు.

మహా యోగులకు సైతం లభ్యంగాని విభుడు సర్వ జగన్నాథుడు దుర్లభుడు అయిన శ్రీకృష్ణుని నుంచి కుబ్జ దైహిక సంబంధాన్ని కోరుకుంది.

గోపికలతో వారి భక్తి ప్రేమల స్థాయికి తగినట్లుగా 'యోగీశ్వరేశ్వరుడై ఆత్మారాముడై రమించిన' కృష్ణుడు కుబ్జ కోరికకు తగినట్లుగా

***"పరపాలోకన వృష్టి పై గురియచున్ సమ్యగ్వచోవైఖరిన్***
***గరగం జేసి సువర్ణ కంకణ సమగ్రంబైన పై రంధ్రి కేల్***
***కరపద్మం బునబట్టి తల్పమున కాకర్షించిగంభీరతం***
***బరిరంభాదులం దనిపె శౌరి వధూహృదయాపహారియై.*** [120]

'దొయ్యలిని మనోజాత సుఖంబుల దనిపాడు. అంతటితో తృప్తి పొందక "యేబాయజాల ననుం గొన్ని దినంబులంగభావ లీలం దేల్పవే" [121] అని కోరింది.

భగవానుడు తనకు ప్రసాదించిన సౌందర్య సంపదను భగవానునికే సమర్పించి తరించింది. కృష్ణుడు ఆమె కోర్కెమన్నించి 'తారుణ్యాము మెఱసి మదన తంత్రంబుల లీలారణ్యా వీధిదేల్చెను సైరంధ్రిన్.'[122] సైరంధ్రి (కుబ్జ) కోరిన వరాన్ని గురించి వ్యాసభాగవతం 'సర్వేశ్వరుడు దురారాధ్యుడు అయిన విష్ణువును ఆరాధించి ఆయనను విషయ సుఖాలను కోరేవాడు మిగులతుచ్ఛుడు. అట్టివాడు నిజంగా దుర్బుద్ధియే'[123] అంటూ వ్యాఖ్యానించింది.

*ఏ వేదంబుల గానని*
*దేవోత్తముగాంచి ముక్తి తెరువడు గకరా*
*జీవేక్షణ రతి యడిగెన్*
*భావింప దదీయ కర్మఫలమెట్టిదియో?"*[124]

అనే సందేహాన్ని గర్గ భాగవతం తీరుస్తుంది. ఇంతగా సైరంధ్రి (కుబ్జ) తన కామాన్ని వెల్లడించడానికి గల పూర్వ జన్మసంస్కారాన్ని పరిశీలిస్తే త్రేతాయుగంలో శ్రీరాముని చూసి మోహించిన శూర్పణఖే ద్వాపరంలో కుబ్జగా జన్మించిందని గర్గ భాగవతం తెల్పుతుంది.

రాముని మోహించి సీతను చంప జూసి లక్ష్మణుని చేత పరాభవాన్ని పొందిన శూర్పణఖే రావణునికి 'సీత సౌందర్యాన్ని' తన పరాభవాన్ని చెప్పిన తరువాత పుష్కరమనే తీర్థానికి వెళ్ళి పదివేల ఏళ్ళు హరుని మదితలచి ఘోరతపస్సు చేసింది. శంకరుడు ప్రత్యక్షమై వరమడుగగా 'స్మర సమరాముడు' హృదయేశ్వరుడౌనట్లు వరమునా కొసంగు'మని కోరింది. శంకరుని చేత ద్వాపరాంతంలో వాసుదేవ ముఖాన ఆ కోర్కె సిద్ధించేటట్లుగా వరాన్ని పొంది కుబ్జగా జన్మించింది[125]. శివుని వరఫలంగా శ్రీకృష్ణుడు కుబ్జయింటికి వెళ్ళి కుబ్జకోరిన విధంగా తృప్తి కలిగించాడు.

వాస్తవానికి శ్రీకృష్ణుడు కుబ్జకోరికను అంగీకరించి రతికేళితో తృప్తురాలిగా చేసినపుడు కుబ్జముక్తిని కోరలేదని రతికేళి కోరిందని కుబ్జను నీచ దృష్టితో చూడవలసిన అవసరంలేదు. భగవద్రతికన్నా ముక్తి గొప్పదిగా తలచలేదు కుబ్జ. అన్నీ తెలిసే భవిష్యత్తులో ఆమె కోరబోయే కోర్కె తెలిసే కుబ్జకు సౌందర్యాన్ని ప్రసాదించాడు కృష్ణుడు. కుబ్జ కోరిన 'రతి' భగవంతునితోనే కోరింది. కనుక, శ్రీకృష్ణ భగవానుడే ఆ కోర్కెను మన్నించి తీర్చాడు. భగవత్పరంగా ఎటువంటి కోరిక వున్నా ఎటువంటి వారినయినా కృష్ణభగవానుడు ఉద్ధరిస్తాడనే విషయం కుబ్జా కృష్ణుల వృత్తాంతం వెల్లడిస్తుంది. తరువాత కుబ్జ ఉపశ్లోకుడనే మహాభాగవతుడికి జన్మ నిచ్చింది. ఉపశ్లోకుడు నారదుడి శిష్యుడై సాత్వత సంహితను రచించినట్లు భాగవతం తెలుపుతోంది. (కంసవధానంతరం జరిగిన కుబ్జా వృత్తాంతం గురించి కూడా ఇక్కడే తెలుపడం జరిగింది).

కృష్ణుడు కుబ్జ ఇచ్చిన లేపనాలను స్వీకరించి ఆమె ముడ్వంకలను పోగొట్టి కంసవధానంతరం ఇంటికి వస్తానని చెప్పిన అనంతరం విపణి మార్గాన కదలివచ్చి పౌరులిచ్చిన తాంబూల మాలికా గంధాలను అనేక కానుకలను పరిగ్రహిస్తూ ధనుశ్శాలకు వచ్చి భటుల రక్షణలో నున్న ధనుస్సును జనులు చూస్తుండగా ఎడమచేతితో యెత్తి అనాయాసంగా విరుగగొట్టాడు.

శ్రీకృష్ణుడు మధురకు వచ్చిన వెంటనే కంసుని దగ్గరకు వెళ్ళలేదు. బృందావనం నుంచి వచ్చిన వెంటనే రాజకీయాన్ని ప్రదర్శించాడు కృష్ణుడు.

ముందుగా నగరం అంతా తిరుగుతూ నగరవాసులందర్నీ ఆకర్షించాడు. కంసుని మనిషి అయిన రజకుని చంపి ధనస్సును విరిచి కంసుని ఎదిరించగల వ్యక్తి ఇన్నాళ్ళకు వచ్చాడని, కంసుని దురాగతాల నుంచి తమ నందరినీ రక్షించగలిగే అండదొరికిందనే భావాన్ని తృప్తిని నగరవాసులకు కలిగించాడు.

నగరవాసులు కృష్ణుడు బాల్యం నుండి చేస్తున్న లీలలన్నీ దుష్ట సంహారాలన్నీ తెలుసుకుంటూనే ఉన్నారన్న విషయం స్పష్టంగా తెలుస్తోంది.

"నందతపఃఫలంబు....రండి చనిచూతము కన్నుల కోర్కె దీర...[126] అంటూ మధురకు అప్పుడే వచ్చిన కృష్ణుని గూర్చి తెలుపుతూ మధురా నగరపు మగువలంతా తమ తమ పనులను వదలి శ్రీ కృష్ణుని చూడవచ్చిన వైనమూ,

*"వీడటే రక్కసి విగత జీవగ జన్ను*
*బాలు ద్రావినమేటి బాలకుండు*[127] -

అంటూ శ్రీకృష్ణుని బాల్య చేష్టలను తలచుకుని -

*"వీడు లేకున్న పురమటవీస్థలంబు*
*వీని బొందని జన్మంబు విగతఫలము*[128]

అంటూ శ్రీకృష్ణుని పాలనలో లాలనలో తప్ప తాము జీవించలేమని తమ మనోగతాన్ని వ్యక్తీకరించిన విధము శ్రీ కృష్ణుని గూర్చి మధురా నగరంలో ఉన్న జనులకు ముఖ్యంగా స్త్రీలకు పూర్తిగా తెలుసుననీ శ్రీకృష్ణుని చూడాలని ఏనాటి నుండో ఆనగరంలోని సజ్జనులు ఎదురు చూస్తున్నారని స్పష్టం అవుతుంది. ముందుగా నగరవాసుల హృదయాలను గెలవడమేగాక తన కార్యాలతో కంసుని బింకాన్ని సైతం భేదించి కలవరపెట్టాడు.

ధనువు విరిచినందుకు వెంటపడ్డ కావలి వారిని సైతం మట్టు పెట్టాడు.

తన నగరానికి రామకృష్ణులు వచ్చి తన అనుచరులను చంపి ధనువును విరిచిన సంగతి విని కంసుడు నిద్రలేక విహ్వాలమతి అయ్యాడు.

## కువలయా పీడం

బలరామకృష్ణులు మల్లక్రీడోత్సవాన్ని తిలకించే నిమిత్తం వస్తూ మల్లరంగ ద్వారం దగ్గర అడ్డు తగిలిన కువలయాపీడమనే గజాన్ని మట్టు పెట్టాడు.

"లావొక్కింతయు లేదం"టూ ప్రార్థించిన గజేంద్రుని హుటాహుటిని వచ్చి రక్షించిన పరమాత్మ కృష్ణునిగా కంసవధకై వచ్చి నోరులేని గజాన్ని చంపడానికి కారణం ఉంది.

పూర్వం బలిపుత్రు డయిన 'మందగతి అనే దైత్యుడు సర్వ శాస్త్రార్థ ప్రవీణుడు మహాబలుడు అయి వుండీ ఒకసారి శ్రీరంగ యాత్రకై బయలుదేరి వెళుతూ త్రోవలోని బాటసారులను పడదోస్తూ మదించిన ఏనుగు చందాన ఎవ్వరినీ లెక్కచేయకుండా వెళ్ళసాగాడు. ఆ సమయంలో వృద్ధుడు బలహీనుడు అయిన త్రితుడనే ముని ఆ మందగతి దురుసు తనానికి లోనై నేలమీద పడ్డాడు. నెత్తురు వరదలై బాధకు ఓర్వలేని త్రితుడు మదోన్మత్తుడై మత్తేభం రీతిలో సంచరిస్తూ నిష్కారణంగా పడేసినందుకుగాను 'గజత్వాన్ని పొందమ'ని శపించాడు. దానికి తన తప్పు తెలుసుకున్న మందగతి 'ఆ శాపాన్ని తాను భరించలేనని మహాత్ములకు ఆగ్రహం తగదని నిగ్రహానుగ్రహ సమర్థులు గనుక తనకు గజత్వం నుంచి ముక్తి పొందే మార్గం తెలిపి రక్షించమని' ప్రార్థించాడు. అముని శాంతించి అతని భక్తికి మెచ్చి ద్వాపరంలో మధురాపురిలో శ్రీకృష్ణుని చేతిలో గజరూపం నుంచి ముక్తి లభిస్తుందని వరాన్ని ప్రసాదించాడు. 'మందగతి' వింధ్యాద్రిపైన కువలయాపీడమనే పేరుతో గజరూపంలో ఉద్భవించి సంచరిస్తూండగా మాగధుడు లక్ష గజాలతో వెళ్ళి ఆ కువలయ పీడాన్ని స్వాధీనం చేసుకుని తెచ్చి కంసునికి వరకట్నంగా ఇచ్చాడు[129]. ఈ విధంగా కంసుని దగ్గర కువలయా పీడంగా ఉన్న మందగతికి శ్రీకృష్ణుని చేతిలో శాపవిమోచనం కలిగింది.

మదించిన ఏనుగు డాంబికత్వానికి చిహ్నంగానూ సాధకుడు సాధనలో ముందుకు వెళుతున్న సమయాన డాంబికత్వం అవహిస్తుందనీ దాన్ని సాధకుడు నాశనం చేయాలనీ వెల్లడవుతోంది.[130]

## చాణూర ముష్టికులు

బలరామకృష్ణులు మల్ల యోధులయిన చాణూర ముష్టికులతో మల్ల యుద్ధం చేసి మట్టుపెట్టారు.

మానవ జీవితంలో కామక్రోధాదుల వంటివారు చాణూర ముష్టికులు. ప్రేమతో కామాన్ని, దైవబలంతో క్రోధాన్ని జయించాలి. ప్రేమ స్వరూపుడైన శ్రీకృష్ణుడు కామానికి సంకేతమైన చాణూరుని, బలదేవుడు క్రోధానికి సంకేతమైన ముష్టికుని వధించారు. వీరిని హతమార్చిన తరువాతే అజ్ఞానానికి సంకేతమయిన కంసుని హతమార్చడం జరుగుతుంది. కామాన్ని జయించినపుడే సాధకుడు ఆధ్యాత్మిక రంగంలో పురోభివృద్ధి సాధించి అజ్ఞానాన్ని నశింపజేసి, జ్ఞానాన్ని పొందుతాడు. [131]

చాణూర ముష్టికులు పూర్వజన్మలో ఉధ్యముని కొడుకులు. వీరు మిగిలిన మరో ముగ్గురు సోదరులతో కలిసి దిన దిన ప్రవర్ధమానమై అధిక స్వేచ్ఛను కలిగి తల్లిదండ్రుల మాటలను స్వజాతి ధర్మాలను లెక్కచేయకుండా యుద్ధ పద్ధతులు నేర్చుకుంటూ సంచరిస్తూ ఉండగా తండ్రి వారి చేష్టలకు కలత చెంది మనసు విరిగి క్రోధంతో 'ధర్మ దూరులై రాత్రులు చరిస్తూ నామాట వినక నన్ను బాధించిన కారణాన అసుర కులాన జన్మించి అసురుని సేవిస్తూ మల్ల విద్యా ప్రసంగాలలో కాలంగడపం'డని శపించాడు. వారుదనుజకులంలో చాణూర ముష్టి కశల తోశల కూటులుగా జన్మించి కంసుని ప్రాపున జీవించి కృష్ణుని చేతిలో హతమయి ముక్తిని పొందారు.[132]

## కంసవధ

ఉగ్రసేనుని భార్య యాదవ స్త్రీలతో యమునా నదిలో స్నానానికి వెళ్ళిన సమయాన ద్రవిళుడనే దానవుడు ఉగ్రసేనుని రూపంతో ఆమెతో రమించాడు.

తాను వంచింపబడ్డానని తెలుసుకున్న అనంతరం కోపంతో 'నీ వల్ల పుట్టినవాడు హరివంశంలో పుట్టిన వాడితో మరణిస్తాడని' శపించింది. అలా ద్రవిళుడి వల్ల ఉగ్రసేనుని పత్నికి జన్మించిన కంసుడు రాక్షస లక్షణాలతో పెరిగి రాక్షసుల అండతో రాక్షసంగా రాజ్యమేలుతున్నాడు.

కంసుడు చాణూరాదులను మిత్రులుగా చేసుకుని సురక్షితంగా ఉన్నటువంటివాడు. చాణూరా దులను చంపి వచ్చిన బలరామ కృష్ణులను చూసి కంసుడు తప్ప మిగిలిన అందరూ అమితానందాన్ని పొందారు. కంసుడి మదిలో కలవరం రేగింది. భయంతో -

> *"వల్లవబాలురన్ నగర వాకిట కిన్వెడలంగ ద్రొబ్బుడీ*
> *గొల్లల ముట్టికోల్ గొనుడు క్రూరుని నందుని గట్టుడుర్వికిం*
> *దెల్లముగాగ నేడు వసుదేవుని జంపుడు తండ్రిగాడు వీ*
> *డెల్ల విధంబులం బరుల కిష్టుడు కావకుడుగ్రసేనువిన్*[133]

అని అరవసాగాడు.

అదివిని మీదకు ఉరికిన కృష్ణుని చూసి కంసుడు ఖడ్గంతో ఎదిరించాడు. అయినా సర్పాన్ని పట్టిన గరుడునిలా శ్రీ కృష్ణుడు కంసుని జుట్టుపట్టి పైనుండి లాగి రంగస్థల మధ్యంలో జనులందరి మధ్య పడవేసి వధించాడు.

> *'రోష ప్రమోద నిద్రా*
> *భాషా శవపాన గతుల బాయక చక్రిన్*
> *దోష రతిజూచియైన వి*
> *శేష గతిం గంసుడు'*[134] పరమాత్మను చెందాడని స్పష్టమవుతుంది.

> **"కామంక్రోధం భయం స్నేహ మైక్యం సౌహ్రాదమేవచ**
> **విత్యం హారే విదధతో యాన్తి తన్మయతాంహితే**[135]**"**

అని చెబుతుంది శ్రీమద్భాగవతం.

శ్రీకృష్ణుని వల్ల తనకు మృత్యువు సంభవిస్తుందన్న భయంతోనే కంసుడు నిత్యం జీవిస్తూ చివరికి కృష్ణుని చేతిలోనే మరణించాడు. కృష్ణుడు కంసుడనే అజ్ఞానాన్ని మధురానగర వాసులకు దూరం చేశాడు.

## దేవకీ వసుదేవుల బంధవిముక్తి

కంసవధానంతరం కృష్ణుడు దేవకీ వసుదేవులను బంధ విముక్తులను చేశాడు. తమ చెరవిడిపించిన బలరామకృష్ణులను చూసి "లోకేశులుగాని వీరు కొడుకులుగార"ని దరిచేరడానికి శంకించి దూరంగా భయభక్తులతో నిలబడ్డ దేవకీ వసుదేవులకు జగన్మోహినియైన తన మాయను ఆవరింపజేసి తదభిజ్ఞానాన్ని వారించాడు.

తల్లిదండ్రులకు ఆనందం కలిగేట్లుగా బిడ్డగా తన ప్రేమాభిమానాలను అందించి వారిని అలరించాడు.

కంసుని చంపినా సింహాసనాధిపత్యాన్ని ఉగ్రసేనునికే కట్టబెట్టాడు.

కంస భీతులై విదేశాలలో కృశిస్తున్న వృష్ణిభోజమరుదశార్హక కుకురాంధక ప్రముఖులను రావించి విత్తమిచ్చి ఆదరించాడు.

## పుత్రధర్మం

మానవుడై అవతరించిన పరమాత్మ ప్రాపంచిక మర్యాదను పాటించడంలో ఎటువంటి తిరస్కారమూ విప్రతి పత్తి చూపలేదు. కంసుని వధించి తల్లిదండ్రుల చెర విడిపించడం ద్వారా బిడ్డగా తన కర్తవ్యాన్ని నిర్వహించాడు.

పున్నామ నరకంలో పడకుండా రక్షించేవాడు పుత్రుడు. అటువంటి పుత్రుడు ముందుగా ప్రాపంచిక కష్టాల నుంచి తల్లిదండ్రులను కాపాడగలగాలి. అపుడే తల్లిదండ్రుల మరణానంతరం చేసే శ్రాద్ధ కర్మల ద్వారా తల్లిదండ్రుల

నరక బాధను సైతం దూరం చేయగలుగుతాడు. జీవించి ఉన్న తల్లిదండ్రుల కష్టాలను బాధలను పట్టించుకోలేని పుత్రుడి వల్ల తల్లిదండ్రులకూ ఇహాము పరమూ కూడా శూన్యమే. తల్లిదండ్రుల కష్టాలను తొలగించడం కొడుకు విధి అన్న విషయాన్ని కృష్ణుడు లోకానికి చాటాడు.

*చెల్లుబడి గలిగి యెవ్వడు*
*తల్లికి దండ్రికి నిదేహ ధనముల వృత్తుల్*
*చెల్లింపడట్టి కష్టుడు*
*ప్రల్లదుడా మీద నాత్మ పలలాశియగున్*[136]

అని, అటువంటివాడు జీవన్మృతుడని పలికి ఇన్నాళ్ళూ తాము వారికి దూరమై వారి కష్టాలను దూరం చేయలేని అసమర్థతను క్షమించి రక్షించమని తల్లి దండ్రులను కృష్ణుడు వేడుకున్నాడు . ఇంతకన్నా ఏ తల్లి దండ్రులు అయినా పుత్రుని నుండి కోరే దేముంటుంది? లౌకికంగా వారికి చెరవిడిపించి, తాను వారికి జన్మించిన కారణాన భవ బంధ మోక్షాన్ని కలుగ జేశాడు.

శ్రీకృష్ణుడు బృందావనం నుండి మధురకు వచ్చేవరకు చేసిన లీలలు భగవల్లీలలు. అవి ఎవరూ ఆచరించలేనివి. మధురకు వచ్చిన అనంతరం మానవులకు ఆచరణ యోగ్యమైన కార్యాలు చేసి మానవులకు ఆదర్శ ప్రాయుడయ్యాడు.

## గురుకుల వాసం

*గురువులకు నెల్ల గురువై*
*గురులఘు భావములు లేక కొమరొందుజగ*
*ద్గురులు త్రిలోక హితార్థము;*
*గురు శిష్య న్యాయలీల గొలిచిరివేడ్కన్*[137]

సర్వజ్ఞుడు జగద్గురువు అయిన శ్రీ కృష్ణుడు కేవలం త్రిలోక హితార్థం, గురుశిష్య న్యాయాన్ని లోకానికి చాటడం కోసమే వేడ్కగా గర్గుని ద్వారా ఉపనయన సంస్కారాన్ని, సాందీపని ద్వారా విద్యను బలరామునితో కలిసి పొందాడు. యథావిధిగా గురుసేవతో బలరామ కృష్ణులు సాందీపనిని సంతుష్టుని చేశారు.

ఆ గురుని ద్వారా-

*'వేద శ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబు దంత్రంబుమ న్వాది వ్యాహృత ధర్మ శాస్త్రములు నుద్య న్న్యాయముందర్కవి ద్యా దక్షత్వము రాజనీతి'* [138] అభ్యసించారు.

బలరామ కృష్ణులు తాము అభ్యసించడంలో ప్రత్యేకతను కనబరుస్తూ 'అరువది నాలుగు విద్యలు నఱవది నాలుగు దినంబుల[139] లో నేర్చుకున్నారు. ఇది మానవ మాత్రులు చేయలేని పనిగా స్పష్టం అవుతుంది.

శిష్యుల సామర్థ్యం తెలుసుకున్నాడు. కనుకనే సాందీపని ఏగురువూ కోరని విధంగా 'మృతపుత్రుని' సజీవంగా తెచ్చి ఇవ్వమని 'గురు దక్షిణ' కోరాడు. గురువు గురు దక్షిణ కోరిన విధానం బలరామకృష్ణులను భగవత్స్వరూపులుగా గుర్తించినట్లు అర్థం అవుతుంది. గురువు కోర్కె తీర్చడానికి ఆయత్తమయి 'గురువు కోర్కె ఎటువంటి దయినా దానిని తీర్చడం శిష్యుని ధర్మ'మని లోకానికి చాటాడు.

## గురు దక్షిణ

గురువు పుత్రుని తెమ్మన్న వెంటనే కృష్ణుడు యమపురికి పోలేదు. ముందుగా గురుపుత్రుడు మృతి చెందే సమయంలో ఆడుకున్న సాగర ప్రాంతానికి వెళ్ళి సాగరునితో గురుపుత్రుని తెమ్మని ఆజ్ఞాపించాడు. నీటిలోకి వచ్చిన గురుపుత్రుని

సాగర గర్భంలో ఉన్న పంచజనుడనే అసురుడు మింగాడని సాగరుడు తెలుపడంతో సాగర గర్భంలోకి వెళ్ళాడు. శ్రీ కృష్ణుడు ఏనాడో చనిపోయిన గురుపుత్రుడు పంచజనుడి గర్భంలో ఉండబోడు. అయినా పంచజనుడు సాగరగర్భంలో నివసిస్తున్న ప్రదేశానికి వెళ్ళి అసురుని సంహరించి పొట్ట చీల్చి గురుపుత్రుని కానక అక్కడ ఉద్భవించిన పాంచజన్యమనే శంఖాన్ని స్వీకరించాడు.

పంచజనుడి గర్భంలో గురుపుత్రుని కోసం చూడడం ఏమిటి? అరవైనాలుగు విద్యలు అరవై నాలుగు రోజులలో నేర్చుకున్న కృష్ణునికి ఆ మాత్రం తెలియకపోదు. ఇక్కడ పంచజనుని చంపడం, పాంచజన్యాన్ని స్వీకరించడమే ప్రధానంగా జరుగవలసిన కార్యాలు.

చతుర్భుజుడైన హరి చెంత నున్న శంఖం మిగిలిన ఆయుధాల (చక్రం గద) కంటె తాను హరి మోవిని అనేక మార్లు తాకి వెలిగొందు తున్నాననే గర్వంతో ఉండి ఒకనాడు -

> "ఆర్తజన ప్రియుండయిన యచ్యుతుడే వనుగొంచు దక్షిణా
> వర్తము గెల్వ జాలెమన పాంపతి పుత్రిక సాధ్యమున్ సుధా
> పూర్ణము రుచ్యమైన హరిమోవిని రాజమరాళకాంతితో
> బూర్తిగ నాను చుంటి నను బోలుదురే యెవరేని నిద్ధరన్"[140]

అని తలచగా హరి హృదయాన నివసించే లక్ష్మి విని 'ఇతరులను చులకన చేసి గర్వించిన కారణంగా' అసురునిగా జన్మించమని శపించింది. ఆ శాపకారణాన సాగరంలో పంచజనుడనే పేర జన్మించిన శంఖం - కృష్ణుని చేతిలో మృతి నొందింది. పంచజనుని గర్భంలోని పాంచజన్య మనే శంఖం శ్రీ కృష్ణునికి హస్త భూషణమయింది. పంచజనుని ఆత్మ కృష్ణ పరమాత్మలో ఐక్యమయింది.[141]

ఆ తరువాత యమపురికి వెళ్ళిన కృష్ణుడు యముని అడిగి గురుపుత్రుని తెచ్చి గురు దక్షిణగా సమర్పించాడు. చనిపోయిన పుత్రుని తేవడం మానవునికి సాధ్యమయిన కార్యం కాదు. అది గ్రహించిన సాందీపని రామకృష్ణులు తనకు శిష్యులుగా అవడం వలన తాను కృతార్థుడు నయ్యానని పలికి మహదానందాన్ని చెంది దీవించాడు.

## ఉద్ధవుని వ్రజ సందర్శనం

పరమాత్మ గురించి జీవి చింతించడం పరితపించడం సహజం. ఏ జీవి కోసం పరమాత్మ చింతించడమంటూ జరుగుతుందో ఆ జీవి ధన్యమయింద నడంలో సందేహం లేదు. కృష్ణపరమాత్మ చేత స్మరింపబడిన గోపికలు ఎంతటి ధన్య జీవులో కొలమానం లేదు.

*"నాపై జిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నారాక గాంక్షించుచున్*
*నాపేరాత్మలనావహించుకు వగన్ నానా ప్రకారంబులన్*
*గోపాంగన లెంతజాలిబడిరో? కోపించిరో దూఱిరో?*
*వ్రేపల్లెన్ నిజధర్మగేహములలో విభ్రాంతి చైతన్యలై*[142]

అని గోపకామినులను తలచుకున్నాడు. భక్తులపైన కృష్ణునికి గల ఆసక్తి ఎంతటిదో తెలుస్తోంది. సిద్ధవిచారుడు గభీరుడు వృద్ధ వచో వర్ణనీయుడు వృష్ణి ప్రవరుడు బుద్ధి నిధి అయిన ఉద్ధవునితో బృందావనానికి వెళ్లి వారి సమాచారం తెలుసుకు రమ్మని పంపాడు. పంపుతూ -

**"లౌకిక మొల్లక నన్నా**
**లోకించు ప్రపన్నులకును లోబడి కరుణా**
**లోకనముల బోషింతును**
**నాకాశ్రిత రక్షణములు నైసర్గికముల్"**[143]

అని శరణాగతులను ఆశ్రితులను రక్షించడమే తన సహజ తత్త్వమని స్పష్ట
చేశాడు. శ్రీకృష్ణుని సంకేతాన్ని సందేశాన్ని గ్రహించి బృందావనానికి వెళ్లా
ఉద్ధవుడు. బలరామ కృష్ణుల క్షేమాన్ని గురించి ప్రశ్నించిన నందునితో ఉద్ధవు
సమాధానంగా కృష్ణావతార కారణాన్ని కృష్ణ తత్త్వాన్ని వివరించాడు. ప్రాణ వియో
కాలాన ఒక్కమారు జీవి ఎవరిని తలచినంతనే ముక్తిని పొందుతుందో ఆహ
భూభారం తొలగించడానికై బలరామ కృష్ణులుగా జన్మించాడనీ, అటువం
హరిని సేవించి వారు కృతార్థులయ్యారని చెప్పాడు. అంతేకాక ఆ హ
జీవులన్నిటిలోనూ వెలుగొందు జ్యోతి అని అతనికి జననీ జనక దార సఖ పు
బాంధవ శత్రు ప్రియాప్రియులైన జనులు లేరని చెప్పాడు.

*జన్మ కర్మములును జన్మంబులును లేవు*
*శిష్ట రక్షణంబు సేయుకొరకు*
*గుణ విరహితుడయ్యు గుణియయి*
*సర్వరణ వినాశకేళి సలుపుచుండు*[144]

అని కృష్ణ తత్త్వాన్ని హరిప్రభావాన్ని వెల్లడించాడు.

## గోపికలకు కృష్ణుని సందేశం

కృష్ణ సందర్శన లాలసలయిన గోపికలు కృష్ణుని సందేశాన్ని వినిపించ
వచ్చిన ఉద్ధవునితో కృష్ణుని గూర్చి నిష్ఠు రోక్తులాడగా ఉద్ధవుడు గోపికలను
ఓదార్చుతూ కృష్ణ సందేశం వినిపించాడు.

కృష్ణుడు స్వయంగా పలికిన ఈ పలుకులలో పరమాత్మ తత్త్వం
వెల్లడవుతుంది.

*"ఎల్ల కార్యములకు నేను ప్రధాన కా*
*రణముగావున మీకు రమణులార*

కలుగదు మద్వియోగ చరాచర రూప
ములలో మహాభూతములు వసించు
కరణి నుండుదు సర్వగతుడనై నే మనః
ప్రాణబుద్ధి గణేంద్రియాశ్రయుండ
నాత్మయందాత్మ చేనాత్మ బుట్టింతుర
క్షింతును ద్రుంతు వ్యాపీక భూత

గణ గణాకార మాత్మకు గొమరు మిగులు
నిబిడ మాయాను భవమున నిత్య శుద్ధ
మాత్మ విజ్ఞాన మయమునై యమరుగుణము
ప్రకృతి కార్యమనోవృత్తి బట్టి పొందు"[145] నని

అంటూ జగత్తులో జరిగే సకల కార్యాలకు తానే కారణమంటూ గోపికలు చేసే ప్రతి కార్యం లోనూ తనను దర్శించమని తెలిపాడు. 'చరాచర రూపాలన్నిటిలోనూ అంతర్గతంగా జీవం ఎలా ఉంటుందో అదే విధంగా తాను సర్వగతుడై చర్మ చక్షువులకు అగుపడక మనః ప్రాణబుద్ధి గుణేంద్రియాశ్రయుడనై' ఉన్నానని అన్నాడు. 'ఆత్మయందాత్మచే ఆత్మ పుట్టింతు రక్షింతు త్రుంతు'నని తెలిపాడు. బాహ్య దృష్టి వీడి ఇంద్రియ నిగ్రహులై అంతర్ముఖులయినట్లయితే ఆత్మనే అంటి ఉన్న తనను దర్శించ గలుగుతారని స్పష్టం చేశాడు.

ఒక విధంగా గోపికలకు కంటికి దూరమైన తనను ఆత్మలో దర్శించమనడంలో సగుణారాధనం నుండి నిర్గుణారాధనకు చేరుకునే స్థాయిని స్థితిని తెలియజేస్తున్నాడు. సాధకులు ఆరంభంలో తమ దృష్టికి ఆకర్షణీయమైన దేవతా స్వరూపాలను ఎంచుకుని దానిపై దృష్టిని కేంద్రీకరించి ఏకాగ్రతతో ధ్యానం చేస్తూ, ఆలయాలకు పుణ్య క్షేత్రాలకు వెళ్ళి ఆయా రూపాలను దర్శిస్తూ ఉండి రాను రాను కేవలం బాహ్య దృష్టికి మాత్రమే పరిమితం కాక అంతర్యంలో

పరమాత్మ స్వరూపాన్ని దర్శించగలిగే స్థాయికి చేరుకునే విధానం గోపికలకు కృష్ణుడిచ్చిన సందేశంలో వెల్లడవుతోంది. కంటికి కనబడుతున్న వెలుగును అంతరాంతరాలలో నింపుకో గలగాలి. కంటికి కనబడేది సత్యమే అయినా అది శాశ్వతం కాదు. ఆ శాశ్వతం కాని దానిని అంతరంగంలో నిలుపుకుని శాశ్వతం చేసుకోవచ్చును. కనుకనే గోపికలతో ఎన్నో ఆటలు ఆడి లీలలు చూపి మధురకు వెళ్ళిన కృష్ణుడు తిరిగి ఎన్నడూ శారీరకంగా గోపికల దగ్గరకు బృందావనానికి రాలేదు.

> "....................................ఎప్పుడు న్నన్ను మీ
> రలు చింతించుచు నుండ గోరి యిటు దూరస్థత్వముంబొందితిం
> దలకం బోలదు నన్ను గూడెదరు నిత్యధ్యాన పారీణలై"[46]

అన్న కృష్ణుని సందేశాన్ని ఉద్ధవుని ద్వారా విని గోపికలు సంతసించి తృప్తిచెందారు. కృష్ణుని సందేశాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకున్నారు కనుకనే గోపికలు కృష్ణ లీలలను మననం చేసుకుంటూ గడిపారు.

అంతరంగంలో భగవంతుని ఏనాటికీ బంధించలేకపోతే సాధకుల సాధనకు అర్థంలేదు. అది సాధించిన సాధకులు గోపికలు.

అనంతరం కుబ్జఇంటికి (వెళ్ళిన వైనం ముందే వివరించడం జరిగింది). అక్రూరుని ఇంటికి ఉద్ధవునితో కలసి కృష్ణుడు వెళ్ళి వారి వారి కోర్కెలు తీర్చాడు.

ఉగ్రసేనుని రాజుగా చేసినా విద్యాభ్యాసమై వచ్చిన అనంతరం శ్రీ కృష్ణుడు రాజ్య వ్యవహారాలను చూడ సాగాడు. తండ్రిని కోల్పోయి పెద తండ్రి యింట ఉంటూ అతని నిరాదరణకు పాత్రులవుతూ కష్టాలు పడుతున్న పాండవుల దగ్గరకు వెళ్ళి వారిని ఓదార్చిరమ్మని ధృతరాష్ట్రునికి బుద్ధులు గరపమని చెప్పి అర్ఘ్యదైవ అక్రూరుని పంపించాడు.

## జరా సంధునితో యుద్ధం

కంస భార్యలు అస్తి, ప్రాప్తి తమ తండ్రి జరాసంధుని దగ్గరకు వెళ్ళి తమ వ్యధను వెల్లడించగా బలగర్వితుడైన జరాసంధుడు కృష్ణుని మీదకు యుద్ధానికి వచ్చాడు. బలరాముడు జరాసంధుని ఎదుర్కొని జరాసంధుని చంపబోగా కృష్ణుడు బలరాముని అడ్డుకుని, మీదెరిగి కార్యము గల్దని[147] మాన్పించి 'తిరిగి సైన్యం సమకూర్చుకు రమ్మ'ని జరాసంధుని పంపాడు.

అవమానం పొందిన జరాసంధుడు తిరిగి తిరిగి దండెత్తి వచ్చి 17 సార్లు ఓడిపోయాడు

## ముచికుందుని జాగృతి - కాలయవనుని అంతం

కాలయవనుడు యవనులరాజు. ఇతడు నారదుని చేత ప్రేరేపించబడి మూడుకోట్ల యవన వీరులతో మధురను ముట్టడించాడు.

అంతవరకు జరాసంధుని దండయాత్రల వల్ల మధురానగరవాసులు విసిగియున్నారు. ఈ సందర్భంలో శ్రీ కృష్ణుడు ఒక రాజకీయవేత్తగా సమస్యను ఎదుర్కోవడానికి పథకం ఆలోచించాడు.

"యవనుడు పురమెల్ల నావరించెను నేటి
యెల్లింటి లోపల నీ నడుమను
మాగధుండును వచ్చి మనమీద విడియును
యవన మాగధులు మహాప్రబలులు
పురిరెండు వంకల బోరుదు రట్టిచో
నోపినభంగి నాక్కొక్క చోట
మనము యుద్ధము సేయ మరియొక్కడెడసొచ్చి
బంధువులందఱ బట్టిచంపు

నొండెగొనిపోయి వెఱబెట్టు నుగ్రకర్ము
డైన మాగధుడది గాన నరివరులకు
విడియ బోరాడగా రాని విషమభూమి
నొక్క దుర్గంబు సేసి యందునుపవలయు"[148]

అని వితర్కించిన తీరు భగవంతుడై యుండి జరాసంధ కాలయవనులను తప్పించుకునేందుకు ఇంత యోచన చేయాలా అనీ, తప్పించుకుని దొంగ చాటుగా మధురను వదలి మరో నగరాన్ని సముద్ర గర్భంలో నిర్మించు కోవాలా అనీ సందేహం కలుగుతుంది. ముఖ్యంగా జరాసంధ కాలయవను లిద్దరి మరణం శ్రీకృష్ణుని చేతిలో లేదు.

కాలయవనుడు యాదవ పురోహితుడయిన 'గర్గుని'కి ఒక అప్సరసకు పుట్టిన మహావీరుడు. గురుపుత్రుని చంపగలిగినా చంపడు కృష్ణుడు. అంతేకాక వృష్ణ్యంధకాదులకు గురుడైన గర్గుడు ఆజన్మ బ్రహ్మచారిగా, అవివాహితునిగా ఉండడం చూసి ఒక యాదవుడు గర్గుని పురుషత్వాన్ని హేళన చేశాడు. అక్కడి యాదవులు సైతం గురునిందచేసిన వానిని అడ్డుకోలేదు. దానికి బాధపడిన గర్గుడు అడవికి వెళ్ళి పన్నెండు సంవత్సరాలపాటు అతి నిష్ఠతో మహేశ్వరుని గూర్చి తపస్సు చేస్తూ లోహచూర్ణాన్ని మాత్రమే భుజిస్తూ ఉన్నాడు.

పరమేశ్వరుడు ప్రత్యక్షమై గర్గుని కోరిక ప్రకారం వృష్ణ్యంధకులను ఓడించడగలిగేవాడు, యాదవుల చేతిలో చావులేనటువంటి వాడు అయిన కుమారుడు కలిగేట్లుగా వరమిచ్చాడు. కాలక్రమాన గోపకామినీ రూపం ధరించిన ఒక అప్సరసతో స్నేహం కలిపి వారిరువురికి కుమారుడు కలగడం వానిని యవనపతి పెంచుకోవడం జరిగింది.[149]

గురు తేజాడయిన కాలయవనుడు గర్వంతో ఎవ్వరినీ లక్ష్య పెట్టని వాడుగా ఉండి శ్రీకృష్ణుని పైకి దండెత్తి వచ్చాడు. యదు వంశీయుల చేతిలో

కాలయవనునికి చావులేదు కనుక పరమేశ్వరుడు గర్గునికిచ్చిన వరాన్ని కాపాడే మర్యాద కలవాడు కనుక కృష్ణుడు కాలయవనుని చంపలేదు.

ఇక జరాసంధుడు బ్రాహ్మణపూజ అనే నియమంతో నిష్ఠగా ఉన్నవాడు. ఎంతో మంది రాజులను బంధించి చివరకు భీముని చేతిలో శ్రీకృష్ణుని సాయంతో చావవలసి ఉంది. కనుక జరాసంధుని కృష్ణుడు చంపలేదు.[150] అన్నిటికన్నా ముఖ్యం యాదవులకు ప్రత్యేకమైన నగరాన్ని నిర్మింప జేయాలనే సంకల్పం. ముచికుందుని నిద్ర లేపే తరుణం ఆసన్నమవడం మరొక కారణము.

జరాసంధుని జర (వృద్ధాప్యం)గాను, కాలయవనుని కాలంగాను వ్యాఖ్యానించారు కొందరు. జరాసంధుడు (జర) తనతో బాటు కాలయవనుని (కాలాన్ని) కూడా వెంట తీసుకు వస్తే బతకడం సులభం కాదు. కాలం వృద్ధాప్యం కలసి వచ్చినపుడు జీవి ఆశ్రయించాల్సింది ద్వారకని. ద్వారక బ్రహ్మ విద్యకు సంకేతం. కనుక జరాసంధకాల యవనుల దెబ్బలకు మధుర అనే శరీరాన్ని వదలి ద్వారకలో ప్రవేశించాడు కృష్ణుడు. ఉపనిషత్తుల ప్రకారం 'క' అంటే బ్రహ్మమని, ఏద్వారం దగ్గర పరమాత్మ నివసిస్తాడో అది ద్వారక అని తెలుస్తోంది. ద్వారకలో జేరుకున్నాడు కనుక మధురానగరవాసులకు కాలయవన జరాసంధుల నుండి రక్షణ కలిగింది.

విశ్వకర్మను రప్పించి సముద్రాంతర్భాగాన పన్నెండు యోజనాల పొడవు వెడల్పు గల సుందర నగరాన్ని నిర్మింపజేశాడు. దేవేంద్రుడు సుధర్మ అనే సభా భవనాన్ని పారిజాత వృక్షాన్ని ద్వారకకు పంపితే, ఒక చెవి నల్లగా ఉన్న తెల్లని గుఱ్ఱాలను వెయ్యింటిని వరుణుడిచ్చాడు. కుబేరాదులు అష్టనిధులను, మిగిలినవారు కూడా వారికి తగిన కానుకలను పంపారు. మధురానగరవాసులను రహస్యంగా ద్వారకకు తరలించి రక్షణ కలిగించాడు కృష్ణుడు.

అనంతరం కాలయవనుని పరిమార్చడానికై ఒంటరిగా నిరాయుధుడై మధుర నుండి వెళ్ళాడు. కృష్ణుని వెంటాడుతూ కాలయవనుడు తరుముకురాగా కాలయవనునికి అందీ అందని రీతిలో పారిపోతున్నట్లుగా నటిస్తూ ముచికుందుడు నిద్రిస్తున్న పర్వత గుహలోకి ప్రవేశించాడు.

ముచికుందుడు మాంధాత కుమారుడు. ఇతడు కొంతకాలం దేవతలకు రక్షకునిగా ఉండి రాక్షసుల బారి నుండి కాపాడి యుగం మారినందున భార్యా బిడ్డలకు దూరమై దేవతల నుండి దీర్ఘ నిద్రను వరంగా పొందాడు. ఆనాటి నుండి గుహలో నిద్రిస్తూనే ఉన్నాడు.

కృష్ణుని వెంటాడుతూ వచ్చిన కాలయవనుడు గుహలో ప్రవేశించి ఎంతో కాలంగా నిద్రిస్తున్న ముచికుందుని చూసి కృష్ణునిగా భ్రమించి ఒక్కతాపుతన్నాడు. నిద్రాభంగమైన ముచికుందుడు నిద్రలేచి కోపోద్రిక్తుడై చూసిన చూపులకు కాలయవనుడు నిలువునా మండి బూడిదయ్యాడు. అనంతరం కృష్ణుడు ముచికుందుని ముందుకు వచ్చి జరిగిన సంగతి వివరించాడు.

మునుపు ముచికుందుడు తనను గూర్చి ధ్యానించినందుకుగాను ముచికుందుని అనుగ్రహించ వచ్చానని అన్నాడు కృష్ణుడు. ముచికుందుడు అనేక విధాల స్తుతించిన అనంతరం కృష్ణుడు 'నీవు తొల్లి క్షత్ర ధర్మంబున నిలిచి, మృగయా వినోదంబుల జంతువుల వధియించినాడవు; తపంబున దత్కర్మ విముక్తుండవై తరువాతి జన్మంబున సర్వభూత సఖత్వంబు గలిగి బ్రాహ్మణ శ్రేష్ఠుండవై నన్ను చేరెద[150]వని తెలియజేశాడు. చేసిన భక్తి ఎప్పటికీ వృథాపోదు. ముక్తి లభించకపోయినా ఆ జన్మలో కృష్ణుని దర్శనం, అనుగ్రహం లభించింది. తరువాతి జన్మలో ముక్తి లభించేటట్లు వరమూ లభించింది.

మధురానగర వాసులను రాజకీయంగా ద్వారకకు తరలించి, కాలయవనుని ముచికుందుని ద్వారా దగ్ధంగావించిన అనంతరం కృష్ణుడు

మధురకు వచ్చి యవన సైన్యాన్ని మట్టుపెట్టాడు. ద్వారకకు వస్తున్న సమయంలో జరాసంధుడు 23 అక్షౌహిణుల సైన్యంతో దండెత్తి వచ్చాడు.

ఇక్కడ బలరామకృష్ణులు మళ్ళీ జరాసంధునికి భయపడినట్లుగా ప్రవర్షణగిరి శృంగం పైకి పారిపోయి అటునుండి మరొక వైపుగా ద్వారకకు చేరుకున్నారు. అది తెలియని జరాసంధుడు గిరి చుట్టు మంట పెట్టి బలరామకృష్ణులు దగ్ధమయారని భావించి శాంతించి వెళ్ళిపోయాడు.

కృష్ణుని చేతిలో హతమయి ముక్తి లభించే యోగ్యత లేని కాలయవనుని కృష్ణుడు యుక్తితో ముచికుందుని ద్వారా హతమార్చాడు. యాదవులను జయించగల వరపుత్రుని గర్గుడు ఎంతో తపశ్శక్తిని వినియోగించి పొందాడు. గర్గుడు పురోహితుడైయుండి కూడ ఒక యాదవుడు తనను అవమానించిన కారణంగా క్రుద్ధుడయ్యాడు. మానావమానాలను లెక్కపెట్టకూడదు ముని శ్రేష్ఠులు.

అవమాన భారాన్ని దించుకోవడానికి యాదవులను ఎదుర్కొగల పుత్రుని కోసం తపస్సు చేయడం అకుంఠితమైన బ్రహ్మ చర్య దీక్షను వీడి పుత్రుని పొందడం గర్గునికి ఏవిధంగానూ ఉపయోగపడలేదు. అంతటి తపశ్శక్తిని వృథాచేసి పొందిన పుత్రుడు కాలయవనుడు శ్రీకృష్ణుని అండలో ఉన్న ఏ ఒక్క యాదవునికి హాని తల బెట్టలేకపోయాడు. కృష్ణుని యుక్తికి లోబడి దగ్ధమయ్యాడు. గర్గుని తపస్సు బూడిదలో పోసిన పన్నీరే అయింది.

## శ్రీ కృష్ణుడు - కళ్యాణాలు

మధురానగర రాజకీయాలలోకి అడుగుపెట్టిన కృష్ణుడు కళ్యాణాల సందర్భాలలో వీరుడైన ఒక నాయకునిగా కనిపిస్తాడు. శ్రీకృష్ణుడి కళ్యాణాలన్నీ లోకకళ్యాణాలుగానే పరిణమించాయి.

శ్రీ కృష్ణునికి ఎనిమిదిమంది పట్టపు రాణులు, పదహారువేల నూరుమంది (16000+100+8=16108) భార్యలు ఉన్నట్లుగా తెలుస్తోంది. గోకులంలోని గోపికలకు 16108 మందికి సంబంధంలేదు. అష్టభార్యలలో రుక్మిణి సాక్షా ల్లక్ష్మీదేవి. మిగిలిన ఏడుగురు పట్టపురాణులు సప్తర్షులు అనీ మిగిలిన వారందరూ జనకరాజధాని యైనమిథిలలోని, చెలికత్తెలు, దాసీలు అప్సరసలు మొదలయిన వారు అనీ వీరంతా లీలా కృష్ణునికి భార్యలు అనీ, గోకులంలో ప్రేమలీలలు జరిపినవారంతా (గోపికలు) గోలోకం నుంచి కృష్ణునితో బాటు భూలోకానికి వచ్చిన వారనీ ఒక అభిప్రాయం.[151]

ఈ విధంగా కాక 'అష్టమహిషులు శ్రీకృష్ణుని అష్ట విభూతులకు చిహ్నాలని అష్ట విధనాయికలకు ప్రతీకలని కూడా చెప్పడం జరిగింది.[152]

*భూమిరాపోనలో వాయుః ఖంమనోబుద్ధిరేవచ*

*అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతి రష్టధా*[153] అనే శ్లోకాన్ని అనుసరించి కృష్ణ తత్త్వానికి 'అష్ట ప్రకృతుల తోడి సమ్మేళనం పురుషోత్తమ ప్రాప్తికి మూలకందంగా'[154] చెప్పడం జరిగింది.

తత్త్వ సంకేత గర్భితమైన ఈ అంశాన్ని మరో విధంగా కూడా వ్యాఖ్యానించడం జరిగింది. 16000 సంఖ్యలో 16, సృష్టి క్రీడలోని షోడశ ప్రకృతులకు సూచకం (5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలు, 5 తన్మాత్రలు, ఒక మనసు) గాను వీటి చేత పరివృతుడై జీవులనే గోపికలతో అంతర్యామి క్రీడిస్తున్నట్లుగాను సహస్రసంఖ్య పురుషసూక్తంలో ప్రతిపాదించబడిన సహస్ర శీర్షాలకు ఉపలక్షణమని, ఇక 108లో 100 అనేది 'శతమానం' అనే ఆయుః ప్రమాణ సంఖ్య, కాలమూర్తులయిన 100మంది భార్యలుగాను, మిగిలిన ఎనిమిది మంది ప్రకృతులుగాను వ్యాఖ్యానించారు.[155]

అయితే కృష్ణావతారానికి కృష్ణావతార కాలంలో జరిగిన అనేక శాపాలకు వరాలకు పూర్వ వృత్తాంతాలను వివరంగా తెలిపిన 'గర్గ భాగవతం మాత్రం 'ఎవరెవరు ఏయే అంశాలతో జన్మించాలో' తెలిపే సందర్భంలో - శ్రీకృష్ణుడు

బ్రహ్మకు తెలుపుతూ[156] అన్న మాటలు అష్ట భార్యల గురించిన వివరాలను అందిస్తున్నాయి. లక్ష్మి రుక్మిణిగాను, ధరణి సత్యభామగాను, దక్షిణ లక్ష్మణగాను, తులసి (బృంద) సత్యగాను, విరజానది కాళింది గాను, వ్రీడ భద్రగాను, దోషనాశని సురనది మిత్రవిందగాను, మృడాని (పార్వతి) జాంబవతిగాను వారివారి అంశలతో ఉద్భవించినట్లుగా గర్గ భాగవతం ద్వారా తెలుస్తోంది.

శ్రీ కృష్ణుడు తనను వరించి తనకోసం పరితపించిన కన్నెలను అడ్డంకులన్నిటిని తొలగించి వారిని తాను వివాహమాడాడు. ఈ కళ్యాణాలు కూడా పరోక్షంగా భూభారాన్ని అణచేందుకు జరిగిన మహాభారత యుద్ధానికి దారితీసేట్లు కనిపిస్తాయి.

జీవాత్మ పరమాత్మల సమ్మేళనం రమ్యంగా చెప్పడానికి శృంగార రసాన్ని ఆధారంగా తీసుకోవడం జరుగుతూ ఉంటుంది. నాయికానాయకుల పరస్పర ప్రీతి విరహం సంయోగం మొదలయినవన్నీ జీవాత్మ పరమాత్మల మధ్య సంభవిస్తున్నాయి. శ్రీకృష్ణుని అష్ట వివాహాలలోనూ ఇటువంటి నాయికానాయకుల మధ్య సంబంధం గూర్చి వర్ణించిన విధం కనిపిస్తుంది.

'యద్భావం తద్భవతి' అన్నట్లుగా భాగవత గాథలకు జ్ఞానయోగాది దృష్టులలో ఏ దృష్టిలో పరిశోధించినా అన్వయం కుదిరే విశేష గుణం ఉంది. రుక్మిణీ కళ్యాణ ఘట్టాన్ని కుండలినీ శక్తితో అన్వయించి అద్భుత విశ్లేషణ జరుపవచ్చు.[157] అయితే భక్తి ప్రధానమైన భగవత్సంబంధమైన భాగవత గ్రంథంలో శ్రీ కృష్ణ భగవానుని కళ్యాణ వృత్తాంతాలు మేధా దృష్టి కంటే

భక్తిపరంగా హృదయ నేత్రంతో పరిశీలించినపుడు మరింత మనోహర తత్త్వాన్ని దర్శించే అవకాశం ఉంటుంది. అది సమంజసంగా కూడా ఉంటుంది.

## రుక్మిణీ కళ్యాణం

రుక్మిణీ కళ్యాణం ఒక భక్తురాలికి భగవంతునికి మధ్య జరిగిన సుమధుర సంధానం.

'ఖగనాథుండమరేంద్రు గెల్చి సుధమున్ గైకొన్న చందంబునన్
***జగతీ నాథుల జైద్య పక్ష చరులన్ సాల్వాదులంగెల్చి భ***
***ద్రగుడై చక్రి వరించె భీష్మక సుతన్ రాజీవ గంధిన్‌రమా***
***భగవత్యంశ భవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్***[158]

అనే పద్యంలో రుక్మిణి రాజీవగంధిగాను, 'రమా' భగవత్యంశగాను, మహాగుణమణి అయిన బాలా మణిగాను చెప్పడం జరిగింది.

నవవిధ భక్తి మార్గాలలో పాదసేవనానికి 'లక్ష్మీదేవి'ని ప్రధానంగా చెప్పడం జరుగుతుంది. సకల జగత్తుకూ మూలాధారమైన ధనానికీ అధిదేవత అయిన లక్ష్మీదేవి అహంకార వర్జిత అయి విష్ణుమూర్తి పాదాలనే ఆశ్రయించిన భక్తురాలు. పాదసేవలో తరించిన లక్ష్మీదేవికి శ్రీనాథుడు హృదయంలో స్థానాన్ని ఇచ్చి గౌరవించాడు. భక్తితో పునీతమై శ్రీహరి హృదయంలో స్థానాన్ని ఏర్పరచుకున్న లక్ష్మీదేవి అంశగా రుక్మిణీదేవి భాగవతంలో కనిపిస్తుంది.

సర్వ శుభ లక్షణ సమన్విత అయిన రుక్మిణి

***తన తండ్రి గేహమునకుమ***

***జనుదెంచుచున్న అతిథి జనుల వలన గ్రు***

***ష్ణుని రూప బల గుణాదులు***

***విని కృష్ణుడు తనకు దగిన విభుడని ...***[159] తలచింది.

'భగవంతుని అద్భుతమైన నామరూప గుణ లీలలను నిరంతరం ప్రీతితో శ్రవణ కీర్తన మననాదులు చేసినట్లయితే తాపత్రయాలతో కూడిన ఈ మాయా సంసారం నుండి బయటపడి ఆత్మశాంతిని పొంది భగవత్సాన్నిధ్యాన్ని చేరగలగడంలో[160] సందేహం లేదు. రుక్మిణి భక్తి విషయంలో అదే జరిగింది. ముందుగా తండ్రి ఇంటికి వస్తూవుండే అతిథి జనం నుండి కృష్ణుని రూపబలగుణాదులను విన్నది. ఇది శ్రవణ భక్తి. భగవంతుని రూప గుణాదుల గూర్చి వినడం ద్వారా భగవంతునిపట్ల ఆకర్షణ కలుగుతుంది. ఆకర్షించిన ఆ రూపగుణాలను స్మరించుకోవడం ద్వారా ఆ ఆకర్షణ పెరిగి భగవంతుని చేరాలనే ఆలోచన తపన పెరిగి సకల జగత్తుకు పాలకుడయిన ఆ భగవంతుడే తనకు పతి అనే భావం బలపడుతుంది. ఈ భావం బలపడిన తరువాత మనసు ఇంక ఏవిధమైన లౌకిక సంబంధాలకూ లౌకిక ఆకర్షణలకులొంగదు. భగవంతునే పతిగా చేసుకోవాలనే భావన బలంగా స్థిరంగా ఉన్నప్పుడు లౌకికంగా కలిగే వ్యతిరేకాలను ఆటంకాలను ఎదుర్కొనగలిగే తెగింపు, శక్తి వాటంతటవే జీవిలో కలుగుతాయి. ఈ లక్షణాలన్నీ ఒక దాని తరువాత ఒకటి రుక్మిణిలో కలిగాయి.

ఈ విధంగా జీవిలో (భక్తురాలిలో) తపన బయలు దేరడమంటూ జరిగితే సర్వాత్మకుడయిన పరమాత్మకు కూడా ఆ భక్తులను తన దగ్గరకు చేర్చుకోవాలనే ఆరాటం కలుగుతుంది. కంసాది రాక్షస ప్రవృత్తులకే తనను భయంతో క్రోధంతోనయినా స్మరించారనే నెపంతో ముక్తి నిచ్చిన కృష్ణపరమాత్మకు ఇహమూ పరమూ తానేనని భావించిన రుక్మిణి పట్ల అనురాగం కలుగడంలో ఆశ్చర్యం లేదు. కనుకనే -

*"ఆ లలన రూపు బుద్ధియు*
*శీలము లక్షణము గుణము చింతించి దగన్*
*బాలా రత్నముదనకి*
*ల్లాలుగ జేకొందుననుచు హరియుందలచెన్"* [161]

భక్తులు భగవంతుని ఎంతగా ప్రేమించాలంటే - 'భగవంతుడు భక్తుని జ్ఞాపకం చేసుకునేటంతగా' ప్రేమించగలగాలి. ప్రేమ అనేది అతిశయించి అది భగవంతుని వైపు ప్రసరించినట్లయితే అదే భక్తి. రుక్మిణిలో అంకురించిన ఆ భక్తి కృష్ణ భగవానుని 'కదలించింది'. కనుకనే రుక్మిణి లక్షణాలను చింతించి ఆమెను తనకు ఇల్లాలిగా చేసుకున్నాడు.

భగవంతుని చేరుకోవాలని 'భక్తులు', ఆ భక్తులను దరి చేర్చుకోవాలని భగవంతుడు ఎవరి స్థానాలలో వారుండి నిర్ణయించుకోవడం వరకు ఒక స్థాయి అయితే దానిని అధిగమించి భక్తులు భగవంతుని చేరుకునే ప్రయత్నం చేయడం బలంగా జరిగినపుడు భగవంతుడు ఇక తన స్థానంలో స్థిరంగా ఉండలేడు. భక్తుడు భగవంతుని వైపుకు ప్రయత్నించి ఒక్క అడుగు వేస్తే భగవంతుడు భక్తునివైపు పది అడుగులు వేసి వచ్చి ఆ భక్తుని తన వద్దకు జేర్చుకుంటాడు. భక్తుడు కష్టపడి ఆ ఒక్క అడుగు వేసే ప్రయత్నంలోనే అనేక ఆటంకాలు ఎదురవుతాయి. పైకి అవరోధాలుగా కనిపించినా అవి ఆ భక్తునిలో భగవంతుని పట్ల ఆరాటాన్ని, శరణాగతి భావాన్ని అతిశయింపజేసే సోపానాలు. ఆ అవరోధాలనే సోపానాలు రుక్మిణికీ ఎదురయ్యాయి.

బంధువులంతా రుక్మిణీ బాలను కృష్ణునికే ఇద్దామని తలచగా కృష్ణుని పట్ల విరోధంతో నున్న (రుక్మిణి అన్న) 'రుక్మి' అడ్డుపడి, రుక్మిణిని శిశుపాలునికిచ్చి వివాహం చేయాలని పట్టు పట్టాడు. సోదరుని పట్టుదల రుక్మిణిలో తెగింపుకు కారణమయింది. తప్పని సరి పరిస్థితి ఎదురయినప్పుడు రుక్మిణి తన స్త్రీ సహజమైన సిగ్గును మొహమాటాన్ని పక్కకు నెట్టింది.

లక్ష్యం ఉన్నతమయినది, మధురమయినది అయినప్పుడు సమాజానికి పెద్దలకు భయపడి కట్టుబడి వెనకడుగు వేసి తనను తాను దిగజార్చుకోవడం అవివేకమే అవుతుంది. రుక్మిణి ఎంతో వివేకంతో ధైర్యంతో భగవంతుని

మీదభారం వేసి ఒంటరిగానే పోరాటం సాగించింది. తన జీవితాన్ని సార్థకతను కలిగించుకునే ప్రయత్నంలో అప్పుడైన బ్రాహ్మణుని పిలిచి తన పరిస్థితిని వివరించి దానిని చక్రికి విన్నవించమని వేడుకుంది. ఇది జీవి ఆర్తితో భగవంతునికి పంపే నివేదన. శౌరిని కుండినకు రమ్మని కొన్ని రహస్య వచనాలు చెప్పుకుంది రుక్మిణి.

'పరమాత్మ యెడనున్ముఖమైన జీవాత్మకు లక్ష్యముగ రుక్మిణిని గమనించినపుడు హృదయాంతర్గతమైన అగ్నిని (తాపాన్ని) రగుల్కొల్పి స్వామితో సంధానమొనర్చు గురుతత్త్వానికి బ్రాహ్మణుడు (అగ్నిద్యోతనుడు) ప్రతీక'.[162] రుక్మిణి సందేశాన్ని శ్రీ కృష్ణునికి చేరవేయడానికి వచ్చిన బ్రాహ్మణుడు భగవంతుని భక్తుని సంధానం చేయగలిగిన సామర్థ్యం గల సద్గురువుగా వ్యవహరించాడు.

భక్తురాలి సందేశాన్ని తెచ్చిన బ్రాహ్మణుని కూర్చుండజేసి 'తనకు దేవతలు సేయు చందంబున' పూజలు చేసి సరస పదార్థాలతో భోజన సత్కారాలు చేసి లోక రక్షక ప్రశస్తమైన తన హస్తంతో ఆ బ్రాహ్మణుని అడుగులు ఒత్త సాగాడు కృష్ణుడు. భక్తుని భగవంతునితో సంధానం చేకూర్చే సద్గురువుకు భగవంతుడు సైతం లొంగియుండి సేవలు చేస్తాడనడంలో సద్గురువు విశిష్టత కూడా స్పష్టమవుతుంది.

విషయాన్ని వివరిస్తూ బ్రాహ్మణుడు చెప్పిన రుక్మిణి మాటలలో శ్రీ కృష్ణుని భగవంతునిగా గుర్తించే సందేశం పంపినట్లు స్పష్టంగా తెలుస్తుంది.

'ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోక
    దేహతాపంబులు దీఱి పోవు
నేనీ శుభాకార మీక్షింప గన్నుల
    కఖిలార్థ లాభంబు గలుగుచుండు
నేనీ చరణ సేవలే ప్రొద్దు జేసిన
    భువనోన్నతత్వంబు బొంద గలుగు

*నే నీలసన్నామమే ప్రొద్దు భక్తితో*
*దడవిన బంధ సంతతులు వాయు*

*నట్టి నీయందు నా చిత్త మనవరతము*
*నచ్చియున్నది నీయాన నానలేదు*
*కరుణజూడుము కంసారి ఖల విదారి*
*శ్రీయుతాకార మానినీ చిత్త చోర!* [163]

అని (పోతన) జెప్పిన రుక్మిణి మాటలలో కృష్ణుని గుణ వర్ణన చెవులకు సోకగానే దేహతాపాలు తీరడం కృష్ణుని శుభాకారాన్ని ఈక్షించగానే అఖిలార్థ లాభాలు కలుగడం కృష్ణుని చరణసేవ నిరంతరం చేసినట్లయితే లోకంలో ఉన్నతత్వాన్ని పొందడం కృష్ణుని నామాన్ని నిరంతరం భక్తితో తలచగా బంధసంతతులు తొలగిపోవడం వంటి లక్షణాలు అన్నీ భగవంతుని పరంగానే ఉన్నాయి. ముఖ్యంగా నామ స్మరణంతో బంధ సంతతులు వాయడమనేది కేవలం భగవంతునికే వర్తించే మాట.

అంతేకాక

*" ............................................... నిన్నునే*
*కన్యలు గోరరు కోరదేముసు రమాకాంతాలలామంబు"* [164]

అన్న రుక్మిణి మాటలు శ్రీ కృష్ణుడు విష్ణువేనని స్పష్టంగా తెలుపుతున్నాయి. " సర్వస్త్రీ రూపక ప్రకృతి అంతా పరాతత్త్వ ప్రతీక అయినస్వామి తోడి ఐక్యమునే భజిస్తుందనే"[165] విషయాన్ని వెల్లడిస్తోంది.

*"శ్రీయుత మూర్తి! యోపురుష సింహమ! సింహము పాలిసొమ్ము గో*
*మాయువు గోరు చందమున మత్తుడు చైద్యుడు నీ పదాంబుజ*
*ధ్యాయిని నైన నన్నువడిదా గొనిపోయెదనంచునున్నవా*
*డా యధమాధముండెఱుంగ డద్భుతమైన భవత్ప్రతాపమున్"* [166]

అని అనడంలో 'తాను పదాంబుజ ధ్యాయిని' నని లౌకికమైన కామ వాసనలతో కోరుకోలేదని తన భక్తిని తెలిపింది. 'ఆ అధమాధము డెఱుంగడద్భుత మైన భవత్ప్రతాపముల్' అని అనడంలో 'కృష్ణుని అద్భుతమైన ప్రతాపాలను చైద్యుడెరుగడు కాని నేను సంపూర్ణంగా ఎఱుగుదునని' తెలియజేసింది. కృష్ణుడు 'భక్త పరాయణుడు, ఆశ్రిత రక్షకుడు, దుష్ట శిక్షకుడు' అనే విషయం తలచుకుంటూ కృష్ణుని ఆశ్రయించిన తన దరి చేర్చుకుంటాడనే విశ్వాసం స్పష్టం అవుతోంది. ఈ విశ్వాసమే భక్తులకు ఆత్మస్థైర్యాన్ని ప్రసాదిస్తుంది.

> *"వ్రతముల్ దేవ గురు ద్విజన్మ బుధసేవల్ దాన ధర్మాదుల*
> *గత జన్మంబుల నీశ్వరున్ హరి జగత్కళ్యాణు గాంక్షించిచే*
> *సితినేనిన్ వసుదేవ నందనుండు నాచిత్తేశుడౌగాక* [167]

అని తలచిన రుక్మిణి తలపులు భక్తుడు 'వ్రతాలు దేవగురు ద్విజన్మబుధుల సేవలు దాన ధర్మాదులు' చేసినట్లయితే వాటి పుణ్యం వలన మరు జన్మలో నయినా భగవంతుని సాన్నిధ్యం లభించే అర్హత కలుగుతుందన్న విషయం తేటపరచి, శ్రీకృష్ణుడు భగవంతుడు కనుక పూర్వ జన్మలో తానా వ్రతాదులను చేసినట్లయితే తప్పక ఈ జన్మలో వసుదేవ నందనుడు తన చిత్తేశుడవ్వాలని కోరుకుంది.

పోతన భాగవతంలో కృష్ణుని 'పంకజనాభ' వంటి సంబోధనలు విష్ణుపరమయినవే.

లక్ష్యం శ్రీకృష్ణుని పొందడానికైనపుడు చేష్టలన్నీ కూడా కృష్ణుని పరంగానే భావించ బడతాయి. రుక్మిణి సమస్త ఇంద్రియాలు వాటి చేష్టలు కృష్ణుని కోసమే అని తెలుపుతూ -

> ***ప్రాణేశ ! నీ మంజుభాషలు వినలేని***
> ***కర్ణరంధ్రంబుల కలిమియేల?***

*పురుష రత్నమ ! నీవు భోగింపగాలేని*
*తనులతవలని సౌందర్యమేల?*
*భువన మోహన! నిన్ను బొడగానగాలేని*
*చక్షురింద్రియముల పత్త్వమేల*
*దయిత! నీయధరామృతం బానగాలేని*
*జిహ్వాకు ఫలరస సిద్ధియేల?*

*నీరజాతనయన! నీవన మాలికా*
*గంధమబ్బలేని ఘ్రాణమేల*
*ధన్యచరిత! నీకు దాన్యంబుసేయని*
*జన్మమేల ? యెన్ని జన్మములకు* [168]

అనిన మాటలతో తన తనువులోని అణువణువు భగవంతుని కోసమేనని భగవత్సంగమాన్ని కోరుతున్నదని చెప్పింది.

ఇంతగా భగవత్సంగ మానికై తపించే జీవిని భగవంతుడెన్నడూ ఉపేక్షించడు. బ్రాహ్మణుని ద్వారా పంపిన రుక్మిణి సందేశాన్ని రూప సౌందర్యాది విశేషాలను విని ఎంతో అభిమానంగా బ్రాహ్మణునితో - " కన్నియ మీద నాతలపు గాఢము కూరుకురాదు రేయి.."[169] అని తన ధ్యాస కూడా రుక్మిణి పైననే ఉన్నదని తప్పక విదర్భకు వచ్చి శత్రువులతో పోరి రుక్మిణిని తెస్తానని మాట ఇచ్చాడు కృష్ణుడు.

అన్నట్లుగానే 'ఏకరాత్రం'లో బ్రాహ్మణునితో సహా రథారూఢుడై కుండినకు వచ్చాడు. ఈ విషయం తెలిసిన బలరాముడు రాబోయే పోరును గ్రహించి కృష్ణునికి సాయంగా సేనతో వెళ్ళాడు.

ఈ లోపలే రుక్మిణి తన ప్రయత్నం సిద్ధిస్తుందో లేదోనని శంకతో కలత చెంద సాగింది.

"ఘనుడా భూసురుడేగెనో? నడుమ మార్గ శ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండిది దప్పుగాదలచెనో? విచ్చేయునో యీశ్వరుం
డను కూలింప దలంచునో తలపడో? యార్యా మహాదేవియున్
నను రక్షింపనెఱుంగునో యెఱుగదో? నాభాగ్య మెట్లున్నదో" [170]

అంటూ ఆశ నిరాశల మధ్య కొట్టు మిట్టాడింది. రాను రాను లౌకికమైన ధ్యాసను పూర్తిగా వదిలేసి స్త్రీ సహజమైన అలంకరణల మీద కూడా ఆసక్తి చూపలేకపోయింది. భక్తి ఎక్కువయి పరమాత్మపైనే ప్రాణాలను నిలిపిన భక్తులు లోకానికి ఒక్కొక్కసారి పిచ్చివారిగా కూడా కనబడటం కద్దు. అందులోనూ రుక్మిణి భక్తి ప్రేమభక్తి కనుక పరమాత్మ ఆగమనానికి ఎదురుచూస్తూ సుఖాన్ని ఏవగించుకుంది. మనో వ్యాకులతను అనుభవించసాగింది. సన్యాసినిగానే జీవించసాగింది.

"తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు కొప్పు జక్కగా
ముడువదు నెచ్చెలిం గదిసి ముచ్చటకుంజన దన్నమేమియుం
గుడవదు నీరముంగొనదు కూరిమి గీరము జేరి పద్యమున్
నొడువదు వల్లకీ గుణవినోదము సేయదుడాయదన్యులన్" [171]

"మృగనాభియలదదు.. వనమాలిరాడు తగవు మాలి యనుచు.." [172]

సకల కార్యాలలోనూ విరక్తిని పొందింది. ఈ లౌకిక విరక్తే భగవంతుని భక్తుని దగ్గరకు జేరుస్తుంది.

శుభ శకునాలతో బాటు రుక్మిణి పంపిన బ్రాహ్మణుడు వేగంగా వచ్చి శుభవార్తను రుక్మిణికి అందించాడు. ఆ వార్తతో ప్రాణాలు కుదుటపడిన రుక్మిణి ప్రత్యుపకృతి యేమీ చేయనేరనని బ్రాహ్మణునికి నమస్కరించింది.

భగవంతునితో సంధానించిన ఆధ్యాత్మిక సద్గురువుకు ఎవరు మాత్రం ఏమివ్వగలరు?

కుండినకు వచ్చిన కృష్ణుడిని రుక్మిణి తప్ప అందరూ చూశారు. అమితానందంతో భీష్మకుడు సకలోపచారాలను గావించాడు.

*"తగు నీచక్రికి విదర్భరాజసుతకుం, తథ్యంబు వైదర్భియుం దగునీ చక్రికి....................."*[173]

అంటూ రుక్మిణీ కృష్ణుల సంగమాన్ని ఎవరికి వారు మనసులో ఒప్పుకున్నారు. వివాహానికి ముందుగా నగరం వెలుపల నున్న గౌరీదేవి ఆలయానికి సర్వాలంకార భూషితయై వెళ్ళిన రుక్మిణి 'హరిని పతిగా చేయుమని' గౌరీదేవిని వేడుకుంది. చెలి కత్తెలతో కూడి ఇందిరాసుందరి వైభవాన వీరమోహినిగా ఆలయం వీడి వచ్చింది. అనన్య భక్తితో భారం భగవంతుని మీద వేసి భగవంతునే తన దగ్గరకు రప్పించుకున్న రుక్మిణి-

*"............చంద్ర మండల ముఖుంగం తీరవేంద్రావల*
*గ్నున వాంభోజదళాక్షు జారు తర వక్షున్ మేఘసంకాశదే*
*హు నగరాతి గజేంద్ర హస్తనిభ బాహుం జక్రి బీతాంబరున్*
*ఘన భూషాన్వితు గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్"*[174]

దర్శనం చేసుకుని అన్ని బంధాల నుంచి ముక్తిని పొందింది. కృష్ణుడు స్వయంగా చేతులతో రుక్మిణిని తన రథం మీదకు తెచ్చుకున్నాడు. తన మీద దండెత్తి వచ్చిన రాజులందరినీ ఎదిరించి రుక్మిణిని ఊరడించాడు.

శిశుపాలునికి అండగా వచ్చిన 'శ్రీకృష్ణుని వైరులు' సాల్వ మాగధ దంతవక్త్ర విదూరథ పౌండ్రకాది వేలకొలది రాజులందరిని యాదవసైన్యం తీవ్ర శరపరంపరతో పడగొట్ట నారంభించగా జరాసంధాది రాజులు వెనుతిరిగి వచ్చి శిశుపాలుని ఓదార్చి వారి వారి పురాలకు వెళ్ళారు.

భక్తులు భగవంతుని చేరే ప్రయత్నంలో చేసే సాధనలకు అడ్డుతగిలే వారికి భగవంతుడు ఏదో సమయంలో తగిన గుణపాఠం చెబుతాడనడానికి నిదర్శనంగా కృష్ణుడు తత్క్షణాన కొందరినీ, తదనంతరం కొందరినీ ఎదుర్కొని హతమార్చాడు.

రుక్మిణిని కృష్ణుడి నుండి విడిపించుకుని తీసుకుపోవాలనే ఉద్దేశంతో పోరుకు వచ్చిన జరాసంధాది రాజులు వెనుతిరిగి పోయారు. రుక్మిణి అన్న రుక్మిసైతం ఏకాక్షౌహిణీ సైన్యంతో కృష్ణుని మీదకు యుద్ధానికి వచ్చి పరాభవం పొందాడు. కృష్ణునితో అంతగా విరోధించిన 'రుక్మి' కృష్ణుని భక్తురాలయిన రుక్మిణి ప్రార్థన కారణంగా ప్రాణాలు దక్కించుకోగలిగాడు. దుర్మార్గులయినా సత్సాంగత్యం వల్ల పొందగలిగే ప్రయోజనం ఇది. రుక్మిణి అన్నకు కృష్ణుడు చేసిన అవమానమూ[175] గర్వభంగమూ దుష్ట శిక్షణ విషయంలో శ్రీ కృష్ణునికి అందరూ సమానులేనని తరతమ భేదాలు లేవని స్పష్టం అవుతుంది.[176]

కృష్ణుడు రుక్మిణిని ద్వారకకు తీసుకువచ్చాడు. కృష్ణుని చేరిన రుక్మిణి లక్ష్మి అంశంగానే కాక సాక్షాల్లక్ష్మి స్వరూపంగానే భాసించింది.

> *"......................నిజ చేతో హారిణిన్ మానవై*
> *భవగాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం*
> *ధవ సత్కారిణి బుణ్య చారిణి మహాదారిద్ర్య సంహారిణిన్*
> *సువిభూషాంబర ధారిణిన్ గుణ చూడామణిన్ రుక్మిణిన్"[177]*

- కృష్ణుడు వివాహ మాడాడని చెప్పిన పోతన వారిద్దరినీ 'లక్ష్మీనారాయణుల నిత్య కళ్యాణోత్సవ ప్రతీకగా జీవాత్మ పరమాత్మల సమ్మేళనంగా ప్రకృతీ పురుషులలీలగా'[178] దర్శించి తరించాడు.

(వివాహానంతరం రుక్మిణికి ప్రద్యుమ్నుడు జన్మించాడు. అతడిని తన మృత్యువుగా ఎరిగిన శంబరాసురుడు ప్రద్యుమ్నబాలుని సముద్రాన వేయగా

చేపగర్భాన చేరిన ప్రద్యుమ్నుడు తిరిగి జాలరి ద్వారా శంబరాసురుని ఇంటికే చేరి మాయాదేవిగా ఉన్న రతీదేవి వద్ద పెరిగి మాయా విద్యలు నేర్చి శంబరాసురుని చంపి తిరిగి రుక్మిణీ దేవి దగ్గరకు చేరాడు).

రుక్మిణీ కళ్యాణానంతరం కృష్ణునిపై పడిన స్యమంతకమణి అపహరణమనే అపనింద కృష్ణునికి రెండు వివాహాలు అవడానికి కారణ మయినాయి.

## జాంబవతీ సత్యభామలతో కళ్యాణం

సూర్యదత్తమయిన స్యమంతక మణిని తమ్ముడు ప్రసేనుడు మెడలో ధరించి అడవికి వెళ్ళి తిరిగి రానందున ప్రసేనుని చంపి మణిని శ్రీకృష్ణుడే గ్రహించాడని సత్రాజిత్తు అభియోగం.

అంతటి కృష్ణ భగవానునికి ఇటువంటి అపనింద కలుగడం, దానిని మాపుకోడానికి శ్రీ కృష్ణుడు ప్రయత్నించడమూ ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. కానీ ఈ సంఘటనతో శ్రీకృష్ణునితో జరుగవలసిన జాంబవతీ సత్యభామల వివాహాలూ త్రేతాయుగంలో జాంబవంతునికి శ్రీరాముడిచ్చిన వరమూ ముడిపడి ఉన్నాయి. కనుక భగవంతునిపై అపనింద వేయడం అనుచితమే అయినా కృష్ణుని కళ్యాణాలు జాంబవంతునికిచ్చిన వరం నెరవేరడానికి బీజ ప్రాయమయింది. ఎలాగూ అపనింద మాపుకోగలడు, గనుక శ్రీ కృష్ణునికి ప్రతిష్ఠా కరంగానూ అయింది. అలా కానట్లయితే సాక్షాల్లక్ష్మీపతి సర్వగ్రహాలకూ అధినేత అయిన కృష్ణ భగవానుడు సూర్య (గ్రహ) దత్తమయిన మణిని ఉగ్రసేనునికి ఇవ్వమని సత్రాజిత్తును కోరవలసిన అవసరంలేదు కదా!

'సూర్యునికి భక్తుడై చెలిమిసేయువతని వలన సంతసించి' సూర్యుడు స్యమంతక మణిని సత్రాజిత్తుకు ఇచ్చాడు. స్యమంతక మణి ఉన్నచోట దుర్భిక్షా మొదలయిన దేశారిష్టాలు ఉండవనీ అధి వ్యాధులుగాని మిగిలిన అశుభాలుగాని

ఉండవనీ మాయావులుండజాలరనీ ఆ మణి పూజింపబడుతూ ఉన్నట్లయితే సకల అరిష్టాలు తొలగుతాయనీ సూర్యుడు తెలియ జేశాడు.

దేశ ప్రజల ఉపయోగార్థం దానిని ఉగ్రసేన మహారాజుకు ఇవ్వమని కోరాడు కృష్ణుడు. రోజుకు ఇరవై బారువులు బంగారాన్ని ఇచ్చే స్యమంతక మణిని కొంతకాలం అనుభవించిన తరువాత కూడా స్వార్థంతో ప్రజోపయోగానికై రాజుకు ఇవ్వక దాని రక్షణకై అనేక పాట్లుపడి చివరకు మణితో బాటు తమ్ముడైన ప్రసేనుని సైతం కోల్పోయాడు సత్రాజిత్తు.

వస్తువు ఎంత విలువైనదయినా అనర్హుల దగ్గర దాని విలువ కోల్పోతుంది. ధనేచ్ఛ, స్వార్థ బుద్ధి కలిగిన సత్రాజిత్తు దగ్గర స్యమంతక మణి నిలువలేక పోయింది. సూర్యదత్తమయిన అమూల్యమణి ప్రసేనునినికి అలంకార ప్రాయంగాను, ప్రసేనుని చంపిన సింహానికి మాంసఖండంగాను, సింహాన్ని చంపిన భల్లూకానికి క్రీడా వస్తువుగాను గోచరించింది. ఈ విషయం తెలియని సత్రాజిత్తు ప్రజోపయోగార్థం మణిని కోరిన కృష్ణుని మీద నిందమోపగా ఆ నిందను బాపుకోవడం నిమిత్తంగా జేసుకుని వెదుకగా కృష్ణుడు చివరకు భల్లూక గుహలో బాలిక వద్ద క్రీడా వస్తువుగా నున్న మణిని గుర్తించాడు.

ఆ మణిని గ్రహించబోగా దాది అరుపులు విని వచ్చిన భల్లూకం (జాంబవంతుని)తో తలపడ్డాడు కృష్ణుడు. 'తన స్వామియని కృష్ణునెఱుంగక ప్రాకృత పురుషుండని తలంచి కృష్ణునితో రణా'[179]నికి తలబడ్డాడు జాంబవంతుడు.

తన స్వామియని కృష్ణుని ఎఱుగలేదని భాగవతం జాంబవంతుని గురించి చెప్పడానికి కారణం ఉంది.

జాంబవంతుడు బ్రహ్మ అంశతో పుట్టినవాడు[180] రెండు గడియలలో ఏడుసార్లు బ్రహ్మాండాన్ని ప్రదక్షిణం గావించగల వేగవంతుడయిన జాంబవంతునితో సమాన బలవంతులెవరూ రామదండులో లేరు. శ్రీరామునికి

మంత్రిగా నుండి తన బుద్ధి బలంతో రాముని లంకా విజయానికి కారణమైన జాంబవంతుని శ్రీరాముడు (రావణ సంహారణానంతరం) కృతజ్ఞతగా వరంకోరుకోమన్నాడు. అప్పుడు లంకా విజయంలో బుద్ధి మాత్రమే ఉపయోగపడిందని, బలం ఉపయోగ పడలేదని, తన బలం ప్రయోగించి యుద్ధం చేయగోరుతున్నాననీ కోరాడు. దానికి శ్రీరాముడు జాంబవంతునితో సమానబలం కలవారు ఎవరూ లేరు కనుక తానే యుద్ధం చేసి జాంబవంతునికి తృప్తి కలిగిస్తాననీ, తన రాబోవు అవతారంలో జాంబవంతునికి విస్మృతి కలిగించి యుద్ధం చేసి తృప్తిని కలిగించి తిరిగి స్మృతిని కలిగిస్తానని తెలిపాడు.[181] ఈ వరప్రభావం వల్ల జాంబవంతుడు తన కోర్కె తీర్చవచ్చిన కృష్ణుని తన స్వామిగా గుర్తించలేక 28 రోజులు రాత్రింబవళ్ళు కృష్ణునితో ఘోర యుద్ధం చేశాడు.

జాంబవంతునిలో చివరకు యుద్ధేచ్ఛ నశించిన వెంటనే అతని అజ్ఞానాన్ని తొలగించి తానే పూర్వపు అవతారాన శ్రీరాముడననే స్పృహ కలిగించాడు. శ్రీ కృష్ణునిగా తన దరికి వచ్చినది శ్రీ రామ చంద్రుడేనని గ్రహించి -

*" బాణాగ్ని నెవ్వడు పఱపి పయోరాశి*
*వింకించి బంధించి యేపు సూపె*

*ఆ తడవు వీవకావె మహాత్మ......*[182]

అంటూ స్తుతించగా శ్రీ కృష్ణుడు తన అమృత స్పర్శతో జాంబవంతుని దేహబాధలను పోగొట్టి తాను వచ్చిన కారణం తెలియ జేశాడు. జాంబవంతుడు ఆనందాతిశయంతో మణితో బాటు తన కన్యకా మణి అయిన జాంబవతిని సైతం శ్రీ కృష్ణునికి అర్పించి తరించాడు.

జాంబవంతుని కూతురు జాంబవతికి శ్రీకృష్ణుని పత్ని అయ్యే అదృష్టం ఎలా సంభవించిందనే విషయాన్ని పరిశీలించి నట్లయితే - శ్రీ రామావతార

సమయాన సైతం ఉన్న ఈ జాంబవతి 'దివ్యస్త్రీ' అనీ, ఈమె శ్రీరాముని రూపాన్నిగాంచి మోహితురాలయిందనీ, తన కూతురి అభిప్రాయాన్ని గ్రహించి శ్రీరామునికిచ్చి వివాహం చేయ తల పెట్టిన జాంబవంతునితో శ్రీరాముడు తాను ఈ అవతారాన ఏకపత్నీ వ్రతుడనుకనుక రాబోవు అవతారంలో ఈమెను వివాహమాడి కోరిక నెరవేరుస్తానని వరం ఇచ్చాడనీ, ఆకారణంగా జాంబవతి భగవత్ప్రాప్తి కోసం ఘోర తపస్సు చేసి మానవ కాంతగా రూపాన్ని దాల్చిందనీ కూడా తెలుస్తోంది.[183] ఆ తరువాత స్యమంతకమణి నెపంతో గుహకు వచ్చిన శ్రీ కృష్ణుని పొందగలిగింది.

స్యమంతక మణిని తెచ్చి ఇచ్చిన కృష్ణుని చూసి తాను మునుపు కృష్ణుని పై చేసిన నిందారోపణకు అమితంగా పశ్చాత్తాపం పొందిన సత్రాజిత్తు ఆ పాపపరిహారంగా తనకూతురు సత్యభామను కృష్ణునికిచ్చి వివాహంగావించాడు. 'సత్యభామ పృథ్వి యొక్క అంశావతారం. భగవంతునికి జన్మసిద్ధమైన భార్య'[184]

శ్రీ కృష్ణుడు రుక్మిణీ సత్యభామా జాంబవంతులను వివాహమాడిన విధం సత్త్వరజస్తమో గుణాలతో భాసిల్లే భీష్మక సత్రాజిత్ జాంబవంతులలోని అంతర్గత ప్రవృత్తుల మాటున భగవదైక్యాన్ని కోరే జీవాత్మలను స్వీకరించినట్లుగా అనిపిస్తుంది.

రుక్మిణీ కళ్యాణ కథలో భీష్మకుడు సాత్త్విక గుణ ప్రకృతికి ప్రతీకగా కనిపిస్తాడు. శ్రీ కృష్ణుని పట్ల ఆరంభంనుండి భక్తి ప్రపత్తులు అభిమానము ఉన్నవాడు భీష్మకుడు.[185] పరిస్థితుల ప్రాబల్యానికి లోనై రుక్మిణిని శిశుపాలునికి యిచ్చే ప్రయత్నం చేయవలసి వచ్చినా శ్రీకృష్ణుడు నడుమ వచ్చిన అడ్డంకులను తొలగించి అంతర్గతంగా తనను చేరడానికే తపిస్తున్న భీష్మకునిలోని జీవాత్మ రూపం అయిన రుక్మిణిని తనంత తానై కదలివచ్చి స్వీకరించాడు. ఈ విధంగా భీష్మకునికి పరమానందం చేకూర్చాడు.

సత్రాజిత్తు రాజస ప్రవృత్తి కలిగిన వాడుగా కనిపిస్తాడు. సూర్యునితో చెలిమిచేసి సూర్యుని వలన పొందిన స్యమంతక మణిని కంఠాన ధరించిన సత్రాజిత్తు 'భాస్కరుని భంగి భాసమానుడై' ద్వారకకు వచ్చాడు.

ప్రజాక్షేమానికై స్యమంతక మణిని అడిగిన కృష్ణునికి ధనేచ్ఛతో ఆ మణిని ఇవ్వకపోగా స్యమంతక మణికి అధిపతిననే అహంకారంతో సత్యాసత్యాలను గమనించకుండానే కృష్ణునిపైనే అసత్యనిందారోపణం గావించాడు.

*"మణి కంఠంబున దాల్చి నేడడవిలో మావాడు వర్తింపగా*
*మణికై పట్టి వధించినాడు హరికిన్ మర్యాదలేదంచు"*[86]

దూషించాడు. సత్యాన్వేషణం చేసి ఆ మణిని శ్రీ కృష్ణుడు తెచ్చి యిచ్చిన అనంతరం సత్రాజిత్తు సిగ్గుపడి మణినిపుచ్చుకొని పశ్చాత్తాపాన్ని పొందాడు. అందుకే

*"పాపాత్ముల పాపములం*
*బాపంగానోపునట్టి పద్మాక్షునిపై*
*బాపము గలదనినాడితిన*
*పాపాత్ముని పాపమునకు బారము గలదే?"*[87] అని భయపడ్డాడు.

*" మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు చే*
*సితి? బాపాత్ముడ నర్థలోభుడను దుశ్చిత్తుడ మత్తుండదు*
*ర్మతి నీదేహముగాల్పనే? దురితమే మార్గంబునంబాయు! నే*
*గతి గంసారి ప్రసన్నుడై మనుచునన్ గారుణ్యభావంబునన్"*[88]

అని అనేక విధాల తన రాజస ప్రవృత్తి వల్ల ప్రాప్తించిన పాపాన్ని మాపుకునే యత్నంలో అనేక విధాలయోచించి తన కూతురు సత్యభామను శ్రీకృష్ణునికి

మణి సహితంగా సమర్పించాడు. రాజస ప్రవృత్తితో కూడిన తన జీవాత్మను భగవంతుని పరం చేశాడు.

శ్రీ కృష్ణుడు సత్యభామామణిని స్వీకరించి, స్యమంతకమణిని తిరస్కరించాడు. నిజానికి శ్రీ కృష్ణుడు స్యమంతక మణిని కోరడంలోని అంతరార్థం సత్రాజిత్తులో అంతర్గతంగా అగ్నిని విరజిమ్ముతున్న రాజస ప్రవృత్తిని తన కర్పించ మనడంగా భావించ వచ్చు. మానసికంగా అంతర్మథనం జరిగి పశ్చాత్తప్తుడయిన తరువాతగానీ సత్రాజిత్తు తన మూర్ఖత్వాన్నీ రాజసాన్నీ వదిలి సత్యభామను అర్పించలేక పోయాడు.

ఇక జాంబవంతుడు తామస ప్రవృత్తికి చిహ్నంగా కనిపిస్తాడు. జాంబవంతుడు జంతురూపుడు. తన గుహకు వచ్చిన శ్రీకృష్ణుని చూస్తూనే ఆటవిక న్యాయంగా తలబడ్డాడు. ఆ యుద్ధంలో శస్త్రాలనే కాక తరులు కూడా ఉపయోగించి తామస ప్రవృత్తిని వెల్లడించాడు. యుద్ధంలో తన శక్తి నశించిన అనంతరంగానీ తాను అసలు ఎవరితో ఎందుకు యుద్ధం చేస్తున్నానో అనే ఆలోచన రాలేదు. ఆలోచన వచ్చిన తక్షణమే పూర్వస్మృతి కలిగి శ్రీకృష్ణుని తన స్వామి శ్రీరామ చంద్రునిగా విష్ణుమూర్తి అవతారంగా గుర్తించాడు.

శ్రీ రామావతారంలో జాంబవంతుడు కోరిన వరంకూడా తామస ప్రవృత్తిని సూచిస్తుంది. యుద్ధం చేసి శరీర శక్తిని ప్రదర్శించాలనే 'తామస ప్రవృత్తికి అనుగుణమైన కోరికను వెల్లడించాడు. పర్యవసానంగా తామస ప్రవృత్తితో నయినా పరమాత్మతో చేసిన పోరుకు ఫలితంగా తనకూతురు జాంబవతిని శ్రీ హరికి కానుకగా సమర్పించాడు.

సత్వగుణ ప్రధానమయిన జీవి సహజంగానే భగవత్సంగమాన్ని కోరుకునే విధంగా రుక్మిణి తనంత తానే సందేశాన్ని పంపి భగవంతుని తనవద్దకు

రప్పించుకుంది. రాజసతామస ప్రవృత్తుల అండలోనున్న సత్యభామా, జాంబవంతులు శ్రీ కృష్ణుని ప్రభావానికి లొంగి భగవచ్ఛక్తికి దాసోహమని సత్రాజిత్తు, జాంబవంతుల చేత కానుకలుగా సమర్పించబడ్డారు.

భీష్మకుని ముందు రుక్మిణి ముందు శ్రీ కృష్ణునికి తన శక్తిని ప్రదర్శించే అవసరం రాలేదు. వారు శ్రీకృష్ణుని భగవంతునిగా ముందుగానే గుర్తించారు. రాజస ప్రవృత్తి కలిగిన సత్రాజిత్తుకు తనపైన బడ్డ అపనిందను బాపుకోవడం ద్వారాను, తామస ప్రవృత్తి కలిగిన జాంబవంతునికి యుద్ధానంతరం పూర్వ స్మృతి కలిగించి శ్రీరామావతారాన్ని ప్రదర్శించడం ద్వారానూ కరుణించాడు కృష్ణుడు.

## కాళిందీ కళ్యాణం

కృష్ణుడు ఇంద్ర ప్రస్థానికి వచ్చిన సందర్భంలో అర్జునునితో కలిసి వేటకు వెళ్ళి సేద తీర్చుకునే సమయాన సూర్య కన్యక అయిన కాళిందిని చూడడం తటస్థించింది. ఆమె వివరమడిగిన అర్జునునితో తాను సూర్యసుతననీ తనపేరు కాళింది యని 'భాస్కర సంకల్పితగేహమందు నదిలో గంజాక్షు విష్ణు బ్రభున్ వరుగాగోరి తపంబు సేయుదు, నొరున్ వాంఛింప''[189]ననీ కృష్ణుడు వన విహారానికి వచ్చి వరించుననీ తన తండ్రి తెలిపాడనీ తెలిపింది.

తనకు తానుగా కోరిన కాళిందిని కృష్ణుడు ఖాండవ దహనానంతరం పరిణయమాడాడు.

## మిత్రవిందా వివాహం

భగవానుడు వరించినవారు కృతకృత్యులు. అతడెవరిని వరింపదలుస్తాడో వారతడికి తప్పక ప్రాప్తిస్తారు. పరమాత్మ ప్రాప్తికై చేసే ప్రయత్నానికి తమ వారే అనేక విఘ్నాలు ఆపాదించి మార్గాన్ని అడ్డగించి అనేక బాధలు పెట్టినా వాటిని

తట్టుకునే శక్తినిచ్చి భగవంతుడే స్వయంగా వచ్చి అన్ని బంధాలను తొలగించి తన దగ్గరికి చేర్చుకుంటాడు.

అవంతీ దేశాధీశులయిన విందానువిందులు తమ చెల్లెలు మిత్ర విందకై స్వయంవరాన్ని దుర్యోధనునికి వశులయి ఏర్పాటు చేశారు. మిత్ర వింద మనసెరిగిన శ్రీ కృష్ణుడు స్వయంవరానికి వెళ్ళి రాజులందరూ చూస్తుండగా మిత్రవిందను తన రథంలోకి ఎక్కించుకుని తెచ్చి శుభముహూర్తాన వివాహం చేసుకున్నాడు.

## నాగ్నజితి పరిణయం

కోసల దేశాన్ని ఏలే నగ్న జిత్తు తనవద్ద నున్న మదించిన గోవృషభాలను ఏడింటిని పట్టి కట్టిన వానికి తన కూతురు నాగ్న జితి నిచ్చి వివాహం చేస్తానని చాటించాడు. ఎంతో మంది రాజన్యులు ప్రయత్నించి విఫలులయ్యారు. కానీ నాగ్నజితి మనోభావం వేరుగా ఉంది. రాజీవాక్షుడు మోహనాకారుడు, త్రిలోకారాధితుడు అయిన మాధవుడే తనకు ఆరాధ్యుడయిన నాథుడని కోరింది. అంతేకాక తన మనసులో

*"విష్ణుడవ్యయుండు విభుడు గావలెనని*
*నోచినట్టి తొంటినోముఫలము*
*సిద్ధమయ్యెనని జేకొనుబోనన్ను*
*జక్రధరుడు వైరిచక్రహరుడు"*[190]

అని తలచింది. లక్ష్మి దేవి బ్రహ్మ మహేశ్వరులు అష్ట దిక్పాలకులు సైతం ఎవరి పాదధూళిని శిరోధార్యంగా భావిస్తారో ఆ శ్రీహరి ఏ విధంగా తనను కరుణిస్తాడోనని పదే పదే తలచే నాగ్నజితి మనోభావాలెరిగిన కృష్ణుడు నగ్నజిత్తు

దగ్గరకు వచ్చి నాగ్నజితిని తనకిమ్మని కోరాడు. ఆ నగ్నజిత్తు కోరినట్లుగా ఏడు వృషభాలను దారిలోకి తెచ్చే ప్రయత్నంలో

"చేలము సక్క గట్టుకొని చిత్రగతిన్ వడినేడు మూర్తులై
బాలుడు దారు రూపముల బట్టెడు కైవడి బట్టి వీరశా
ర్దూలుడు గ్రుద్ది నేల బడద్రోచి మహోద్ధతి గట్టి యాడ్చెభూ
పాలకులెల్ల మెచ్చ వృషభంబుల బర్వత సన్నిభంబులన్" [191]

ఏడు రూపాలలో ఏడు వృషాభాలను ఒకేసారి పడగొట్టి తనను 'విష్ణువుగా అవ్యయునిగా త్రిలోకారాధితునిగా, విశ్వసించి, ఆరాధించిన నాగ్న జితిని చేబట్టాడు. మునుపు ఆ ఏడు ఆబోతుల చేత ఓడిన భూపతులంతా ఇదివిని ఏకమై త్రోవలో కృష్ణునిపైకి సైన్యంతో పోరుకురాగా అర్జునుడు తన 'గాండీవ చాప విముక్త విశిఖంబుల'తో వైరులందరిని' శశకంబుల సింహము చంపు' విధంగా చంపాడు. నాగ్నజితి అయిన 'సత్య'తో వివాహానంతరం కృష్ణుడు ద్వారకకు చేరాడు.

కృష్ణుడు అణచిన సప్త వృషభాలు 'సప్త వ్యసానలకు'[192] చిహ్నంగా చెప్పవచ్చును. సప్త వ్యసనాల మదమణచి నట్టి వాడే సత్యాన్ని వరించి సత్యవ్రతుడవుతాడు.

## భద్రాపరిణయం

భద్ర శ్రీ కృష్ణుని మేనత్త అయిన శ్రుతకీర్తి కుమార్తె. కేకయ రాజ్యానికి రాజకుమార్తె. ప్రపూర్ణ సద్గుణ సముద్ర అయిన భద్రను 'అహిత వ్రాతంబులు భీతులవగా' కృష్ణుడు పరిణయం చేసుకున్నాడు.

## లక్షణా స్వయంవరం

మద్ర దేశ రాకుమార్తె అయిన లక్షణ నారదుని ద్వారా గోవిందుని కథామృతాన్ని గ్రోలి తన్మయురాలయ్యేది. కూతురి మనసు తెలిసిన

మద్రదేశాధిపతి శ్రీ కృష్ణుడు మాత్రమే భేదించగలిగినట్టి మత్స్య యంత్రాన్ని ఏర్పాటుచేసి పుత్రికా స్వయం వరానికై రాజులను, శ్రీ కృష్ణుని ఆహ్వానించాడు. మహా మహా వీరులు సైతం భేదింపలేని ఆ మత్స్య యంత్రాన్ని శ్రీ కృష్ణుడు భేదించి లక్షణ చేతి స్వయంవర మాలను ధరించగా శ్రీ కృష్ణుని వైభవాన్ని చూసి సహించలేని రాజులందరూ ఏకమై ఈర్ష్యతో క్రోధంతో శ్రీకృష్ణుని చుట్టు ముట్టారు. వారిని మట్టుపెట్టి లక్షణా సహితంగా ద్వారకకు వెళ్ళిన కృష్ణుని దగ్గరకు మద్రరాజా బృహత్సేనుడు వచ్చి వివిధ కట్న కానుకలను ఆనందాతిశయంతో సమర్పించి లక్షణనిచ్చి వివాహం చేశాడు.

ఈ విధంగా కృష్ణుడు విదర్భనుండి రుక్మిణిని, అరణ్యాల నుండి జాంబవతిని, యాదవరాజు సత్రాజిత్తు నుండి సత్యభామను, ఇంద్ర ప్రస్థానికి వెళ్ళి సూర్య పుత్రి కాళిందిని, అవంతి దేశానికి వెళ్ళి మిత్ర విందను, కోసల దేశం నుండి నాగ్నజితిని, కేకయ దేశం నుండి భద్రను, మద్రదేశం నుండి లక్షణను అష్ట భార్యలుగా స్వీకరించాడు.

వీరిలో ముఖ్యంగా రుక్మిణీ అపహరణ సమయాన శిశుపాలుడు చైద్యుడు మొదలయిన రాజులతోనూ సత్యభామ పరిణయ సందర్భాన శతధన్వుడితోనూ మిత్రవింద వివాహ సందర్భాన దుర్యోధనునితోనూ, విందాను విందుల తోనూ నాగ్నజితి పరిణయ సందర్భాన ఆమెను చేబట్ట వచ్చి పొందలేని భూపతులందరితోనూ, లక్షణా వివాహ సందర్భాన మత్స్య యంత్రం భేదించ వచ్చి విఫలురైన వివిధ రాజులతోనూ వీరులతోనూ శ్రీకృష్ణుడు శత్రుత్వాన్ని పెంచుకున్నాడు. అలాగే ఈ వివాహాల సందర్భాలలో జరిగిన యుద్ధాలలో ఎంతో మంది రాజులను దుష్టులను మట్టుపెట్టాడు.

ఒక విధంగా కృష్ణునికి జరిగిన వివాహాలు ఆయనతో రాజులెందరికో శత్రుత్వం సంభవించి ఆ శత్రువులలో కృష్ణునిపైన ద్వేషం పెరగడానికి (రుక్మిణి,

సత్యభామ, మిత్రవింద, నాగ్నజితి, లక్షణాల వివాహాలు), తాను మునుపు (శ్రీరామావతారంలో) ఇచ్చిన వరాలను సార్థకం చేయడానికి (జాంబవతీ పరిణయ సందర్భంలో) కారణాలుగా కనిపించడమేగాకుండా ఆయా దేశాల రాకుమార్తెలను వివాహమాడి ఆయా దేశాలను తనకు అనుకూలంగా మలచుకున్న విధానం శ్రీ కృష్ణుని చేష్టలో స్పష్టం అవుతుంది.

భగవంతుని పైన ద్వేషం, శత్రుత్వం అనేవి పెరిగిన కొద్దీ వారిని శిక్షించే అవసరం ఎక్కువవుతుంది. ఆ విధంగా చూస్తే దుష్ట శిక్షణ కోసం కృష్ణుడు తన వివాహరంగం తయారు చేసుకున్నాడా అని కూడా అనిపిస్తుంది. అష్ట భార్యలనే కాక నరకాసురుని బందీలుగా ఉన్న 16 వేల కన్నెలను కూడా పరిగ్రహించి ఆయా కన్నెలున్న రాజ్యాలను కూడా తనకు అనుకూలంగా తిప్పు కున్నాడు.

శ్రీ కృష్ణుని కళ్యాణ ఘట్టాలలో శ్రీ కృష్ణుడు తనను వలచి ప్రార్థించిన కన్నెలను వరించి తనవారిగా చేసుకుంటూనే సాహసాన్ని ప్రదర్శించి రుక్మి శిశుపాలుడు మొదలయిన వారిలో పగను, శత్రుత్వాన్ని పెంచి, వారిని రెచ్చగొట్టి, తాము వీర శృంగార పురుషునిగా వెలుగొందాడు.

అనంతరం నరకాసుర, బాణాసుర, పౌండ్రక వాసుదేవులపై జరిగిన శ్రీ కృష్ణుని దండ యాత్రలూ శిశుపాల సాల్వ దంతవక్త్ర సంహారాలు ఆయాజీవుల కర్మ పరిపక్వతను వెల్లడి చేస్తాయి.

## నరకాసురవధ

వరాహావతారంలో విష్ణుస్పర్శ వల్ల భూదేవికి కలిగిన పుత్రుడు నరకుడు (భూమికి పుట్టినవాడు కనుక భౌమాసురుడు). నరకుడు ప్రాగ్జ్యోతిష పురాన్ని ఏలుతూ ఉండి అసుర ప్రవృత్తితో లోకాలను పీడిస్తూ ఇంద్రుని నుండి అమరావతిని స్వాధీనం చేసుకున్నాడు. అదితి కర్ణకుండలాలు, వరుణుడి ఛత్రం,

మణిపర్వతం సైతం స్వాధీనం చేసుకున్నాడు. ఘోరయుద్ధాలు చేసి ఎంతోమంది రాజకుమార్తెలను చెరపట్టాడు.

ఇన్ని జరుగుతున్నా దుష్టశిక్షణార్థం అవతరించిన కృష్ణభగవానుడు నరకుని ఉపేక్షిస్తూన్నే ఉన్నాడు. మురాసురుడిని, అతని అయిదుగురు పుత్రులనుసాయం చేసుకుని చెలరేగుతూ చేసే నరకుని ఆగడాలను, దౌష్ట్యాలను ఇంద్రుడు వచ్చి చెప్పి నరకుని వధించమని ప్రార్థించిన అనంతరం సత్యాసమేతుడై నరకాసురుని పైకి దండెత్తి వెళ్ళి, మురాసురుని వానిపుత్రులను ముందుగా మట్టుపెట్టి అనంతరం నరకాసురుని వధించాడు.

శ్రీ కృష్ణావతరణం భూదేవి కోరిక మీదే జరిగింది. వేల సంఖ్యల దైత్య విభులు తన్ను నాక్రమించిన భారమాగజాలక భూమాత రోదిస్తూ బ్రహ్మాది దేవతలతో[6,193] విష్ణుమూర్తి దగ్గరకు వెళ్లడం వల్ల ఆ భారాన్ని బాపి భూదేవికి ఆనందం కలిగించడానికే శ్రీ కృష్ణావతారం జరిగింది.

తల్లికి పుత్రులు భారంకాదు. అయితే ఆపుత్రులే దుష్టులు దుర్మార్గులు అయినప్పుడు ఏ తల్లీ ఆ బాధను భరించలేదు. అటువంటి దుష్టపుత్రులు తల్లులకి ఎప్పుడూ భారంగానే అవుతారు. అటువంటి దుష్టపుత్రులలో నరకుడు ఒకడు. నరకాసుర సంహారానికి ఇంద్రుడు కృష్ణుని ప్రార్థించి వెళ్ళగా శ్రీకృష్ణుడు భార్య సత్యభామతో యుద్ధానికి వెళ్ళాడు.

శ్రీధరీయ వ్యాఖ్యననుసరించి - పోతనభాగవతములో సత్యభామ కృష్ణుని అడిగి యుద్ధరంగానికి వచ్చి నరకునితో యుద్ధరంగంలోనూ పాల్గొన్నట్లుగా, నరకాసుర వధలో భూమ్యంశ అయిన సత్యభామ సాయం చేసి'నట్లుగా వర్ణించాడు. 'భూదేవి అనుమతితోనే భూదేవి కొడుకును వధిస్తానని భూదేవికి శ్రీహరి వరం ఇచ్చినట్లు' భాగవతంలో పోతన తెలుపక పోయినా ఆకారణం

గానే నరకాసుర వధ సందర్భంలో సత్యభామ పాత్రకు పోతన ఎక్కువగా ప్రాధాన్యం ఇచ్చి కావ్యరీతిలో వర్ణించిపెంచి రచించాడని స్పష్టం అవుతుంది.

పోతన వ్యాస భాగవతాన్ని తెలుగులో అనువదించే సందర్భంలో శ్రీధరీయ వ్యాఖ్యకు ప్రాధాన్యాన్ని ఇచ్చాడన్న విషయం అందరికీ తెలిసినదే. ఈ కారణంగానే భూమ్యంశ అయిన సత్యభామకు నరకాసురవధ సమయంలో ప్రాధాన్యాన్ని ఇచ్చి ఎఱ్ఱన నాచనల హరివంశాలను కూడా ఆధారంగా గ్రహించి పెంచి మరింత రమ్యంగా అర్థవంతంగా రచించాడని చెప్పకతప్పదు.

సత్యభామ ".. నీ ప్రావీణ్యంబులు నూడగోరుదు గదా! ప్రాణేశ! మన్నించినన్నీ వెంటగొని పొమ్ము నేడు కరుణన్ నే జూచి యేతెంచినీ - దేవీ సంహతి కెల్ల జెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్"[194] అంటూ కోరడం, శ్రీకృష్ణుడు వారించినా పట్టుపట్టి యుద్ధానికి వెళ్ళడం యుద్ధరంగంలో సత్యభామ సైతం కొంత సమయం నరకునితో యుద్ధం చేయడం, సత్య యుద్ధ నైపుణ్యానికి శ్రీకృష్ణుడు పరవశుడవడం వంటి సన్నివేశాలు పోతన భాగవతంలో మూలాన్ని అతిశయించి విశేషంగా రచించబడ్డాయి.

శ్రీకృష్ణుడు సత్యభామతో విలాసంగా వచ్చి ఒక క్రీడా మాత్రంగా నరకుని చంపినట్లు తెలుపడం ఒక విశేషం. ఒక కంట నిప్పులు చెరిగే వీరాన్ని, మరోకంట వెన్నెల వెల్లువ చల్లదనాన్నీ ఒకేసారి కురిపించగల చతురునిగా కృష్ణుని చూపడం జరిగింది.

మరొక విశేషం - పోతన భాగవతంలో సత్యభామ నరకాసురునితో యుద్ధానికి తానూ వస్తాననడం. 'నరకాసుర వధను అంటే దుష్టుడైన పుత్రుని వధ'ను భూమ్యంశ అయిన సత్యభామ బలపరుస్తున్నది. భూదేవి అనుమతి తోనే నరకుని చంపుతానన్న శ్రీహరి అప్పటి వాక్యాలకు ఇక్కడ భూదేవి అనుమతి ఇవ్వడం జరిగిందని చెప్పుకోవాలి.

వద్దన్నా వినక యుద్ధానికి 'సత్య'రావడానికి పట్టు బట్టడమేకాక యుద్ధరంగానికి వచ్చి నరకునితో యుద్ధం చేయడం అనేది 'పుత్రుడైనా దుష్టుడయిన నరకుని శిక్షించడానికి సున్నితమైన మాతృహృదయం కూడా దుష్ట శిక్షణ కోసం కాఠిన్యం వహించినట్లుగానూ నరకుని వధకు భూమ్యంశ అయిన సత్యభామ ఆమోదమే కాక సహకారం కూడా అందించినట్లుగానూ' పోతన భాగవతాన్ని అర్థం చేసుకుంటే మరింత సమంజసంగా ఉంటుంది.

నరకాసురుని వధతో మరి కొన్ని విశేషాలు ముడివడి ఉన్నాయని తోస్తుంది. నరకుడు బంధించిన 16000 మంది కాంతల బంధ విముక్తి, ఇంద్రునికి రాజ్య ప్రాప్తి, అదితికి కర్ణకుండలాలలాభం, అనంతరం ఇంద్రుని మదం అణచి పారిజాతాన్ని భూలోకానికి తేవడం అనేవి జరగాలి. ఎన్నో కారణాలకు గాను ఒక కార్యాన్ని నిర్వహిస్తాడు భగవంతుడు.

నరకుని దుండగాలు ఇంద్రుడు వచ్చి వర్ణించి చెప్పినప్పుడుగానీ శ్రీ కృష్ణుడు యుద్ధానికి బయలుదేరలేదు. దుష్టశిక్షణార్థం అవతరించిన హరి ఇంద్రుడు వచ్చి చెప్పేదాకా నరకుని ఉపేక్షించడం ఎందుకనీ ఇంద్రుడు చెప్పనట్లయితే భగవానుడు సమస్యను గుర్తించలేడా అని సందేహం కలుగుతుంది. శ్రీ కృష్ణునికి ఇంద్రుని పదవీచ్యుతి 16000 మంది కన్యల బంధనం మొదలైనవి తెలియని విషయాలుగా చెప్పుకోవడం సమంజసం కాదు. మరి ఉపేక్షించడానికి కారణం?

కర్మఫలాన్ని జీవి తదుచిత దేహాన్ని దాల్చి అనుభవించాలి. ఆ కర్మఫలానుభవం ముగిసేదాకా ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు... భగవంతుడు చెయ్యగలిగినా చెయ్యడు. జీవి కర్మఫలం అనుభవించేదాకా భగవంతుడూ కలుగజేసుకోడు.

నరకాసురుని బందీలుగా నున్న కాంతలు తమ పూర్వకర్మను అనుభవించేదాకా ఉపేక్షించి దర్శనం ఇచ్చాడు. బందీలుగా నున్న కాలంలో ఆ

కాంతలు తపించిన దానికి ఫలంగా శ్రీకృష్ణభగవానుని భార్యలయ్యే అవకాశం లభించింది. బందీలుగా వారు అనుభవించిన బాధనంతా క్షణకాలంలోనే మర్చిపోయి -

'పాపపురక్కసుండు సెఱపట్టెనటంచుదలంతు మెప్పుడుం
బాపుడె; వాని ధర్మమున బద్మదళాక్షుని గంటి మమ్మ! ము
న్నీ పురుషోత్తముంగదియనేమి వ్రతంబులు సేసినారమో
యా పరమేష్ఠి పుణ్యుడు గదమ్మ! హరిన్ మము గూర్చెనిచ్చటన్'[135]

అని శ్రీకృష్ణుని ప్రాపు పొంది పరవశించారు.

నరకునికి అదితి కుండలాలు మొ॥నవి ఎంతకాలం అనుభవించగల భాగ్యం ఉన్నదో అంతకాలమూ నరకుడు అనుభవించిన అనంతరం, 'ఇంద్రుడు రాజ్యభ్రష్టుడై కర్మానుభవం పూర్తి అయిన అనంతరం' 16000 మంది కన్నెలు నియమిత కాలం తపించిన అనంతరం, మాత్రమే ఇంద్రుడు కృష్ణుని శరణువేడాలనే బుద్ధితో కృష్ణుని దగ్గరకు రాగలిగాడు. అందరూ వారి వారి కర్మలను భోగాల రూపంలోనూ అవమానాల రూపంలోనూ అనుభవించిన తరువాత ఇంద్రుడు ప్రార్థించాడనే నెపంతో కృష్ణుడు నరకాసుర వధగావించి ఎవరి వస్తువులు వారికి ఇప్పించి పదహారు వేలమంది కన్నెలను బంధవిముక్తులను జేసి వివాహమాడాడు.

ఇంద్రునికి పోయిన రాజ్యాన్నీ వస్తువులనూ ఇచ్చి దయచూపిన శ్రీ కృష్ణునితో 'కృష్ణుడు పారిజాతాన్ని గ్రహించాడని' ఇంద్రుడు కృతఘ్నుడై పోరు సలిపాడు. ఇంద్రుడు రాజ్య భ్రష్టుడవగా, కృష్ణుడు నరకుని వధించి, ఇంద్రుని రాజ్యసర్వస్వం కృష్ణుడే సంపాదించి ఇచ్చాడు ఇంద్రునికి. అయినా కృతఘ్నుడైన ఇంద్రుడు పారిజాతం స్వర్గానికే (అమరావతికే) సొంతమని భావించాడు. భార్య కోరికను అనుగ్రహించే నిమిత్తం ఇంద్రుని గర్వాన్ని అణిచే నిమిత్తం పారిజాతాన్ని

గ్రహించాడు కృష్ణుడు. అహంభావంతో ఇంద్రుడు కృష్ణుని అడ్డగించాడు. తాను ఇచ్చిన సంపదను ముందు తనకు నివేదించకుండా అనుభవిస్తున్న ఇంద్రుడు తనతో తలబడగా ఇంద్రుని మదం అణచి శ్రీ కృష్ణుడు పారిజాతాన్ని భూమి మీదకు తీసుకు వచ్చాడు.

నరకమే నరకాసురుడని అభివర్ణితమయినట్లు నరకద్వారాలు కామక్రోధాదులని వాటిని జయించాలంటే భగవద్భక్తి యొక్కటే మహాదీపిక అని దీపావళి అంటే 'భక్తి దీపాల' ఆవళి అని ఒక అభిప్రాయం.[196] జనులు నరకునికి వెరచి యింట దీపం కూడా పెట్టుకునేవారు కారని నరకుని మరణానంతరం వారికి శుభదిన మరుగుదెంచి నందున దీపావళి పండుగగా చేసుకో సాగారని కూడా కొందరి అభిప్రాయం.[197]

భోగమయమైన దేవలోకంలో స్వేచ్ఛా విహారులయిన అప్సరోజనం దూర్వాసుని శాప కారణంగా అసురమయ లోకాన బందీలయి ఆసురీ శక్తుల చేత ఆచ్ఛాదితులయి తన్నిచస్థితి గుర్తెరిగి పరమాత్మకై పరితపించి పునీతలయి పరమాత్మను పొందగలిగారు.

## బాణుని గర్వభంగం

బలి వందమంది పుత్రులలోనూ బాణుడు అగ్రజాడు. 'అత్యుగ్రమూర్తి చిరయశోహారి విజిత పూజిత పురారి'[198] అయిన ఈ బాణుడు 'సహస్రకరుడు విక్రమజిత గీర్వాణుడు'.[199]

శివభక్తుడయిన బాణుడు శివుని తన భక్తి చేత మెప్పించి తన శోణపురానికి శివుడు కాపలా ఉండేట్లువరం పొందాడు. తానిచ్చిన వరానికి అధీనుడై శివుడు గౌరీ సమేతంగాను కుమార స్వామితోను భూతగణాలతోనూ బాణ పురానికి కాపలా ఉన్నాడు.

శివుడంతటి వాడు తనకు తనపురానికి అండగా ఉండడంతో క్రమంగా దర్పోద్ధతుడైన బాణుడు ఒకనాడు శివుని స్తుతించి -

*"అనిలో నన్నెదిర్చి బాహుబలశౌర్య స్ఫూర్తి బోరాడ జా*
*లినవీరుండొకడైన బందెమునకున్ లేడయ్యె భూమండలి*
*న్ననయంబున్ భవదగ్రదత్తకర సాహస్రంబు కండూతి వా*
*యుమ పాయంబును లేదయీ భరమునెట్లోర్తున్నుమా నాయకా"*[200] అని

తనను ఎదిర్చి యుద్ధం చేయగల మహావీరుడు ఒక్కడయినా లేడనీ అటువంటి వీరునితో యుద్ధం చేయడానికై తాను బాహు సహస్రకండూతితో బాధనొందు తున్నానని అన్నాడు.

పూర్వం తన వేయి చేతులతోనూ వాద్యాలు మోగిస్తూ శివతాండవ నృత్య సమయాన ఆ మహాదేవుని సంతుష్టి పరచిన బాణుడు

*"...ఉద్దామభీమ సంగ్రామకేళి*
*ఘన పరాక్రమ విక్రమ క్రమముగాగ*
*జరపలేనట్టి కరములు కరము*
*దుఃఖ కరములగుగాక సంతోషకరములగునె?"*[201]

అని భగవత్సేవకోసం కాక చేతుల ప్రాధాన్యత బలపరాక్రమ ప్రదర్శనకే నని అభిప్రాయాన్ని వెల్లడించాడు. ఆ కోరికను కూడా బాణుడు తన భక్తికి లొంగి తనకు అండగా నున్న శివునికే వెల్లడించాడు. అంతేకాక

*"...మదీయ చండ భుజ గర్వపరాక్రమకేళికన్ సముం*
*డీనిఖిలావనిం గలడె యిందుకళాధర! నీవు దక్కగా?"*[202]

అంటూ తాను శివునంతటి వాడిననీ తనతో పోరాడ గలిగేవాడు శివుడేననీ తెలిపి అహంకారంతో పరోక్షంగా శివుని తనతో యుద్ధానికి ఆహ్వానించాడు బాణుడు. తన రక్షణలో నున్న బాణుని అహంకారానికి వాచాలతకు రోసిన శివుడు-

*"వినుమూఢ హృదయ! నీ కే*
*తన మెప్పుడకారణంబ ధారుణిపైగూ*
*లును నపుడు నీభుజావళి*
*దునియగ నాయంత వానితో నని గల్గున్"*[203]

అని తెలిపాడు శివుడు

ఒక విధంగా శాపం మరొకవిధంగా బాణుని పాలిట వరమూ అయిన శివుని మాటల వల్ల శ్రీ కృష్ణునికి బాణాసురునిపైకి దండెత్త వలసిన అవసరమేర్పడింది. బాణుడు సైతం తన బాహుగర్వ భంజనానికై తానే నిరీక్షించసాగాడు. శివుడు తెలిపిన నాటి నుండి కేతన మకారణంగా ధారుణిపై కూలు దినానికై ఎంతో ఆత్రుతలో ఎదురు చూడ సాగాడు.

బాణుని కూతురు ఉష తన స్వప్నంలో చూసిన అనిరుద్ధుని సమాగమాన్ని కోరి తన సఖి చిత్రలేఖ సాయంతో అనిరుద్ధుని తన మందిరానికి తెప్పించుకుని కేళీ విలాసాలలో తేలియాడ సాగింది (ఈ సంగతి తెలిసినా కృష్ణుడు అనిరుద్ధుని గురించి ఉపేక్షా భావాన్ని చూపాడు. కారణం అనిరుద్ధుని కారణంగానే బాణునిపై భవిష్యత్తులో యుద్ధానికి వెళ్ళవలసి ఉంది).

ఇది తెలిసి బాణుడు అనిరుద్ధుని నాగపాశ బద్ధుని గావించాడు. ఉషశోకవ్యాకులిత చిత్తంతో కుందుతున్న సమయంలో బాణుని కేతనం అకారణంగా అవనిపైన కూలింది. నారదుని ద్వారా అనిరుద్ధుని బంధన వృత్తాంతం విని శ్రీ కృష్ణుడు బాణుని పైకి దండెత్తాడు.

బాణుని శోణ నగరాన్ని కాపాడుతున్న శివుడు బాణుని వైపున శ్రీ కృష్ణునితో యుద్ధం చేయవలసి వచ్చింది.

నిజానికి బాణునికి శివుడిచ్చిన వరం నెరవేరవలసి ఉంది. బాణునికి శివుడంతటి వానితో యుద్ధం చేసే అవకాశం రావాలి.

బాణుని బాహుబల గర్వం శివుడంతటి వాడయిన శ్రీ కృష్ణునితో అణచబడాలి. 'చేతులారంగ శివుని పూజించలేక' ఆ సహస్ర హస్తాల బలగర్వంతో శివునంతటి వానితో యుద్ధం చేయాలని కోరుకున్న బాణుని బాహుబల గర్వాన్ని నిర్మూలించడమే తక్షణ కర్తవ్యంగా ఉన్నందున హరుడు హరిప్రయోగించిన సమ్మోహనాస్త్రానికి లొంగి పరవశుడయ్యాడు.

బాణుడు 'అ ఖర్వబాహు సహస్ర దుర్వార గర్వాటోప ప్రదీప్తుడై' శ్రీకృష్ణుని ఎదుర్కొన్నాడు. శ్రీ కృష్ణుని అవక్ర విక్రమ పరాక్రమానికి తట్టుకోలేని సమయాన బాణుని తల్లి వివస్త్ర అయి వీడిన శిరోజాలు వేలాడుతుండగా కృష్ణుని ఎదుటకు వచ్చింది. కృష్ణుడు ఆ రూపాన్ని 'చూడ మదిరోసి పరాఙ్ముఖుడై' ఉన్న సమయాన బాణుడు యుద్ధ భూమి నుంచి పారిపోయాడు.

అనంతరం మూడు శిరస్సులతోనూ మూడు పాదాలతోనూ వచ్చిన మహేశ్వర జ్వరం మీదకు శ్రీకృష్ణుడు వైష్ణవ జ్వరాన్ని ప్రయోగించాడు. ఉభయ జ్వరాలు యుద్ధం చేయగా ఓడినశైవ జ్వరం కృష్ణుణ్ణి శరణువేడి స్తుతించింది. శ్రీ కృష్ణుడు వైష్ణవ జ్వరాన్ని ఉపసంహరించాడు.

అనంతరం రెండవసారి దర్పోద్ధతితో పోరుకు వచ్చిన బాణుని సహస్ర హస్తాలను తన చక్ర ఘాతంతో కూల్చాడు. శివుడు శ్రీ కృష్ణుని నుతించి బాణుడు తనకు ప్రియ భక్తుడని తన రక్షణలో ఉన్నవాడు గనుక బాణుని కాపాడమని అనగా శ్రీకృష్ణుడు తన భక్తుడయిన ప్రహ్లాదునికి 'నీయన్వయంబున జననమందిన వారల జంపనని' వరమిచ్చినందున బాణుని తాను చంపనని అభయమిచ్చాడు.

*"విశ్వ విశ్వంభరా భార విపుల భూరి*
*బల భుజగర్వమడపంగ వలయుగాన"*[204]

"కరములు నాలుగు సిక్కం
బరిమార్చితి వీడు నీదు భక్తుల కగ్రే
సరుడై పొగడొందె జరా
మరణాదిభయంబు దక్కిమనునిటమీదన్"[205] అని

శివునికి తెలిపాడు. తన భుజబల అహంకారం నశించిన బాణుడు కృష్ణుని సన్నిధిలో తన బాహు సహస్ర శాఖలను వ్రేల్చి పరిశుద్ధి పొంది విజ్ఞాన దీపాంకురంతో గర్వాంధకారాన్ని నివారించి గోవిందుని చరణార విందాలకు ప్రణామాలాచ రించాడు.

బాణుడు శివుని గురించి తపస్సు చేసి శివుని మెప్పించి నట్టివాడు. తపస్సు సత్వగుణ ప్రధానమయితే జ్ఞానాన్ని యిచ్చి కృతకృత్యుని చేస్తుంది. రాజస గుణ ప్రధానమయితే అహంకారాన్ని వృద్ధి చేసి ఐశ్వర్యాదులనిచ్చి అంతటితో విరమిస్తుంది. తామస ప్రధానమయినట్లయితే అజ్ఞానం పెంపొందించి స్వల్ప వాంఛల నొసగుతుంది. బాణునిలో తపస్సు రాజగుణ ప్రధానమయి అహంకారం తలెత్తింది. శంకరుని తోనే యుద్ధం చేయాలనే కుతూహలం ఏర్పడింది. భక్తుని మనోభావాన్ని గ్రహించిన శివుడు అతని అహంకార నివారణకై తనంతటి వానితో భవిష్యత్తులో యుద్ధం చేస్తాడని చెప్పినా తన భక్తుని మృతుని గాకుండా కాపాడాడు. ఇది భగవత్కరుణకు ఫలం.

శ్రీ కృష్ణుడు శివకేశవులకభేదాన్ని నిరూపిస్తూ శివభక్తుడయిన బాణుని అహంకారాన్నీ తత్కారణమయిన బాహు సహస్రాన్నీ నిర్మూలించి దుష్ట శిక్షణ అంటే బాణుని లోని దుష్టత్వ నిర్మూలనాన్ని గావించాడు.

భగవంతునికి శత్రువులు మిత్రులు అనే పక్షపాతం ఉండదు. దుష్టులను శిక్షించే నెపంతో వారికి ఉపకారం చేయడం శిష్టులను పాలించే నెపంతోనూ

వారికి ఉపకారమే చేయడం జరుగుతుంది. దేహాన కలిగిన వ్రణాన్ని కోసివేసి దేహాన్ని రక్షించే రీతిలోనే భగవంతుడు జీవిలోని దుష్టత్వాన్నీ, మితిమీరిన దుష్టులను నిర్మూలించి లోక కళ్యాణాన్ని గావిస్తాడు. దురాత్ములకు కష్టాలను కలిగించి వారిని రణరంగాన నిర్మూలించి పాపాలను పోగొట్టి ముక్తి నివ్వడమూ జరుగుతుంది.

బాణుడు ఎంత అహంకరించి శివుడంతటి వానితోనే యుద్ధం చేయాలని కోరుకున్నా కొంతకాలం భూమిపై ఉండవలసిన కర్మము ఉండడం వలన బాణుని అహంకారకారణమైన బాహుసహస్రాన్ని మాత్రం ఖండించి, హరభక్తుడు కనుక విడిచి పుచ్చాడు శ్రీకృష్ణుడు. భగవంతునికి అసాధ్యమైనది లేదన్న భావాన్ని బాణునిలో కలిగించాడు. జీవిలో ఆ విధమైన జ్ఞానాన్ని కలిగించడమే పరమాత్మ ఉద్దేశ్యంగా తెలుస్తుంది. ఉషానిరుద్ధుల వృత్తాంతం నెపంగా శ్రీ కృష్ణుని ద్వారా బాణుని ఉద్ధరణ ఇందులో ప్రధానంగా కనిపిస్తుంది.

## పౌండ్రక వాసుదేవునితో యుద్ధం

స్వతః భక్తి సంపన్నుడైన బాణునికి మధ్యలో తలెత్తిన అహంకారం ఖర్వంజేసే నిమిత్తం బాణుని సహస్రబాహువులను ఖండించి చంపకుండా వదిలిపెట్టాడు కృష్ణుడు. బాణుడు 'తనతో యుద్ధం చేయగల సమర్థుడు శివుడేనని తలచి కనీసం శివునితో తనను సమానంగా భావించాడు. కానీ 'కరూశ' దేశాధిపతియైన పౌండ్రక వాసుదేవుడు సహచరుల ప్రోత్సాహంతో తాను లోకాన్ని ఉద్ధరించడానికై అవతరించిన విష్ణువునే అని భావించడమేకాక ఈ భూమిమీద తాను తప్ప మరొక వాసుదేవుడు ఉండరాదని చాటుతూ శ్రీకృష్ణుని 'వాసుదేవ' నామాన్ని శంఖ చక్రాది ఆయుధాలను వర్జించమని హెచ్చరించాడు.

**"నాపేరుమ నా చిహ్నము**
***లేపున ధరియించి తిరిగెదిదిపంతమె! యిం***

*తేపో మది పరికించిన*
*నేపంత మెఱుంగు గొల్లడే మిటనైనన్"*[206]

అని పలికితన చిహ్నాలను వదిలి నామాన్ని వదలి బతకమని లేనట్లయితే ఘోర కదనరంగంలో ఎదుర్కోమని శ్రీ కృష్ణునికి పౌండ్రకుడు వర్తమానాన్ని పంపాడు. శ్రీ కృష్ణుడు దానికి సమాధానంగా యుద్ధంలోనే తన శంఖ చక్రాది ఆయుధాలను పౌండ్రకుని మీదకే వదులుతానని వ్యంగ్యంగా చెప్పి పంపాడు. మిత్రుడైన కాశీరాజు అండతో వచ్చిన పౌండ్రకుని శ్రీ కృష్ణుడు యుద్ధరంగంలో కృత్రిమాలైన శంఖ చక్ర గదా శార్ఙ్గాదులతోనూ శ్రీవత్సంతోనూ కౌస్తుభమణితోనూ వనమాలికతోనూ గరుడధ్వజమెత్తిన రథం మీద వస్తున్న పీతాంబరధారియైన పౌండ్రకుని చూసి పకపక నవ్వాడు కృష్ణుడు. తన పైకి ఎగసిన పౌండ్రకుని సైన్యంతో ఘోర యుద్ధంగావించాడు. కృష్ణుడు కయ్యానికి కాలుదువ్విన పౌండ్రకవాసుదేవునితో-

*"మనుజేంద్రాధమ! పౌండ్ర భూపసుత! నీమానంబు బీరంబునే*
*డనిలో మాపుదు నెద్దు క్రొవ్వి పెలుచన్నా బోతుపై ఱంకెవై*
*చిన చందంబున దూతచేత నను నాక్షేపించి వల్లన్నపే*
*రును జిహ్నాంబులు నీపయిన్ విడుతు నర్చుల్ పర్వనేడాజిలోన్"*[207]

అంటూ ఉద్దండ ప్రతాపంబుతో పౌండ్రకుని సంహరించాడు. పౌండ్రకునికి ముక్తికవాటం తెరుచుకుంది.

*"వనజోదర చిహ్నాంబులు*
*గొనకొని ధరియించి పౌండ్రకుడు మచ్చరియై*
*యనవరతము హరి*
*దన తలపున గలుగుట జేసి ముక్తి పొందె...."*[208]

హరికంటె తాను గొప్పవాడనని తలచి కృత్రిమత్వంతోనయినా హరి చిహ్నాలు ధరించి హరిని అనుకరించి అనవరతం మాత్సర్య భావంతోనే హరిని స్మరిస్తూ ఉన్న కారణాన హరి కదలి వచ్చి 'రూపుమాపి' ముక్తిని ప్రసాదించాడు.

'Imitation is the best form of admiration' అన్న ఆంగ్ల సూక్తికి అనుకూలంగా పౌండ్రకుడు పీతాంబర ధారణవంటి శ్రీ కృష్ణుని రూపాన్ని అనుకరించాడు. ఆయుధాలను సైతం కృత్రిమంగా నిర్మించుకుని సభలో అలంకరించుకున్నాడు. ఒక విధంగా "సర్వాంగీణ స్ఫూర్తితో నీతడు వాసుదేవత్వ మభినయించి వైర సాధనంలో విశిష్టమైన సారూప్య మార్గాన్ని ప్రత్యేకంగా అధ్యయన మొనర్చాడు."[209] కనుకనే పౌండ్రకునికి పాపాలు నశించి శరీర పతనానంతరం భగవత్ప్రాప్తి కలిగింది.

పౌండ్రకుని చేదోడుగా కృష్ణునితో పోరుకు వచ్చిన కాశీరాజుకు ఆ తరువాత కాశీరాజు పుత్రుడయిన సుదక్షణునికి కూడా కృష్ణుని సుదర్శనాయుధంతో హతమయి తరించే భాగ్యం కలిగింది. అయినప్పటికి వీరిది విరోధ భక్తి కనుక ఇతరులు అనుకరించరానిది.

కాశీరాజు స్వయంగా ఏదోషమూ కలిగి ఉండకపోయినా శ్రీకృష్ణునితో ప్రత్యక్షవైరం లేకపోయినా దుర్మార్గునికి అండగా నిలిచిన కారణాన మరణించ వలసి వచ్చింది. తండ్రి చావుకు పగదీర్చుకోదలచిన సుదక్షణునికీ అదే గతి పట్టింది. దుష్టునికి దూరంగా ఉండడం సజ్జనుల స్నేహం సత్సాంగత్యం చేయడమూ శ్రేయస్కరం.

పౌండ్రకునిలా ఆత్మస్తుతి చేసుకోవడం కాశీరాజులా దుష్టులకు తోడుగా ఉండి ప్రోత్సహించడం, సుదక్షుణునిలా సజ్జనులను హింసించే ప్రయత్నం చేయడం .. శ్రేయస్కరం కాదని ఈ ముగ్గురి చరిత్రలు తెలియ జేస్తున్నాయి."[210]

ఆ తరువాత రాజసూయయాగ నిర్వహణ నెపంతో జరాసంధుని భీముని చేత చంపించడం, శిశుపాలుని తానే నిండు సభలో చంపడం, శ్రీకృష్ణుని దుష్ట సంహార కార్యక్రమాలలో ప్రధాన ఘట్టాలు.

శ్రీ కృష్ణుని దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, ధర్మ సంస్థాపనం ఎప్పటికప్పుడు అవినాభావ సంబంధం కలిగి జరిగాయనడంలో అతిశయోక్తి లేదు. భూభార నిర్మూలనార్థం అవతరించిన శ్రీ కృష్ణుని ప్రధాన లక్ష్యం మహాభారత యుద్ధాన్ని నిర్వహించి పెద్ద పెట్టున భూ భారాన్ని దించడమేనని స్పష్టం అవుతుంది.

## జరాసంధవధ

రాజసూయ యాగం కోసం రాజాలందరినీ జయించి పాండవుల పక్షాన బలాన్ని పెంచాలనే ఉద్దేశంతో తనకూ, తనద్వారా పాండవులకూ, రాజులెందరినో బంధించడం వలన ఎంతో మంది రాజన్యులకూ శత్రువుగా లోక కంటకునిగా ఉన్న జరాసంధుని ముందుగా నిర్మూలించదలచాడు.

ఆనాటి రాజులలో జరాసంధుని అనుసరించినవారు అధికులు. మునుపు కంసవధానంతరం జరాసంధుడు శ్రీ కృష్ణుని పైకి దండెత్తి వచ్చిన సందర్భంలో

మగధనాథు బోర మడియింప బోలదు
మడియకున్న వీడు మరలి మరలి
బలము గూర్చుకొనుచు బఱతెంచు బఱతేర
ద్రుంపవచ్చునేల దొసగు దొఱగ [211]

అని కృష్ణుడు ఆలోచించాడు. ఒకేసారి చంపితే జరాసంధుడే హతమవుతాడు. పరాజితుని చేసినట్లయితే అవమాన భారం మోయలేక తిరిగి తిరిగి అధిక సైన్యంతో దండెత్తుతాడు. కృష్ణుడు తలచిన విధంగానే జరాసంధుడు తనను అనుసరించి తనను సమర్థించే దుష్ట మహీపతులందరినీ కూడుకొని పదిహేడు

సార్లు వచ్చాడు. ఈ "...మాగధు నెడన్ సామంబు దానంబ సం-బేధంబు బనిలేదు దండవిధి శోభిల్లం బ్రయోగించి యీ భూదేవీవర భార మెల్లనుడుపంబోలున్ జయోద్భాసినై"[212]

*" ఏనవతరించుటెల్లను*
*మానుగ జతురంత ధరణీ మండల భరమున్*
*మానుపు కొఱకుంగాదే*
*పూనెదనిది మొదలు దగిన భూభరముడుపన్"[213]*

అని తలచిన కృష్ణుడు భూభారాన్ని తగ్గించడమే ధ్యేయంగా పదిహేడుసార్లు జరాసంధుడు తెచ్చిన దుష్టమహీపతులను సైన్యాన్ని సంహరించినా జరాసంధుని మాత్రం పరాజితుని చేసి సంహరింపక వదిలి పెట్టాడు.

జరాసంధుని సంహరించాలనే తలంపుతో బలభద్రుడు జరాసంధుని పట్టుకుని చంపబోగా భవిష్యత్తు తెలిసిన శ్రీకృష్ణుడు 'కార్యము కలదని' బలభద్రుని ఆ పని నుండి మానిపించాడు. పదిహేడుసార్లు పరాజితుని చేసి పదునెనిమిదవ మారు తానే జరాసంధుని బారి నుండి తప్పించుకుని పారిపోయాడు.

అనంతరం రాజసూయ యాగకాలానికి జరాసంధుడు ఎంతో మంది రాజులను కారాగార బద్ధులుగా జేసి లోక భీకరుడైన రాజుగాను, నాగాయుత సత్త్వుడుగాను శతక్షౌహిణీ బలాన్వితుడుగాను, ఆనాటి భారత రాజలోకాన ఒక పెద్ద వర్గానికి నాయకత్వం వహించిన వాడిగాను పుంజుకున్నాడు.

ఎన్నో రాజ్యాలను జయించి ఆ రాజ్యాలన్నింటినీ తన సామ్రాజ్యంలో కలుపుకునేవాడు. ఓడిన రాజులను బందీలను జేసి అంతటితో తృప్తి పడక శివుని ప్రీత్యర్థం 'శతరాజబలి' యనే యజ్ఞాన్ని తలబెట్టాడు. ఎనభై ఆరుమంది రాజులను తన రాజధాని అయిన గిరివ్రజ పురాన బంధించి ఉంచాడు. ఇంకా జయించ

వలసిన వారు పదునలుగురు. ఆ పదునలుగురు మందిలో కురువంశజులు సైతం చేరినప్పటికీ భీష్ముని పరాక్రమానికి కొంత వెనుకంజ వేశాడు జరాసంధుడు.

జరాసంధుని దుర్మార్గాలకు లోనయిన రాజలోకాన హాహాకారాలు చెలరేగాయి. కొంతమంది జరాసంధునికి లొంగి తమరాజ్యం అప్పగించి దాస్యాన్ని స్వీకరించారు. జరాసంధుని అండతో మరికొందరు దుష్టులు సైతం విజృంభించారు. అందరికీ నాయకుడు జరాసంధుడే.

'శిశుపాలుడు శిష్యప్రాయుడై జరాసంధునికి సేనాపతి అయ్యాడు. మాయా యుద్ధంలో గొప్పవాడు బలవంతుడు అయిన కరూషాధిపతి వక్రుడు జరాసంధుని ఆశ్రయించాడు. కరభుడైన మేఘవాహనుడు, యవనాధిపుడు, భగదత్తుడు, శూరుడైన పురజిత్తు, పౌండ్రకుడు అందరూ జరాసంధునితో చేరినవారే. భోజులు అష్టాదశ కులముల రాజులు జరాసంధునికి భయపడి ప్రతీచిని ఆశ్రయించారు. పాంచాలురు యాదవులు మొదలగువారు ప్రమాదంలో ఉన్నారు. ధార్మికులైన రాజులు నశించారు. జరాసంధుడు అందరి స్వాతంత్ర్యాన్నీ హరించి లోక భీకరుడై కొనసాగాడు''[214] ఇటువంటి జరాసంధుని సంహారం రాజసూయ యాగానికి మహత్తర ప్రారంభం.

యథోచితంగా నారదుని చేత

***"నీమేన బావ ధర్మాత్మజుండు -***
***అతని యజ్ఞంబు రక్షింపనంబుజాక్ష***
***వలయు విచ్చేయు మచటికివలను మెఱసి"*** [215]

అని ప్రార్థింపబడి సర్వజ్ఞుడయివుండీ ఉద్ధవుని ఆలోచనను మన్నించిన విధంగా వుండి జరాసంధుని దగ్గరకు భీమార్జునులతో బ్రాహ్మణ వేషాలలో వెళ్ళి 'ఆజి' భిక్షను వేడుకున్నాడు. భీమునితో పోరుకు తాను సిద్ధమన్నాడు జరాసంధుడు.

పరమాత్మను (కృష్ణుని) జీవాత్మను (నరుడైన అర్జునుని) వదిలి వాయునందనుడయిన భీముని ఎన్నుకున్నాడు జరాసంధుడు.

వృద్ధాప్యం (జర) జీవాత్మతోనూ పరమాత్మతోనూ తలపడదని ప్రాణవాయువును మాత్రమే కోరుకుంటుందని, దానితోనే తలపడుతుందని దీని ద్వారా వెల్లడవుతుంది.

జరాసంధునితో గదా యుద్ధం ముష్టి యుద్ధం చేసి చేసి అలసిపోయిన భీముడు కృష్ణుని శరణువేడాడు. వృద్ధాప్యంలో ప్రాణాలు పరమాత్మ వైపుకు మళ్ళితే సురక్షితమవుతుంది జీవి. భీముడు (ప్రాణవాయువు అనుకుంటే) భగవంతుని వైపు దృష్టి మరల్చి సురక్షిత మయ్యాడు.

శ్రీ కృష్ణుడు "వాయు తనూభవున కలయికలేక లావును జేవయు గలుగునట్లుగా దద్గాత్రంబు నందు దన దివ్య తేజంబు నిలిపి యరి నిరసనోపాయంబూహించి సమీర నందనుండు సూచుచుండ నొక్క శాఖాగ్రంబు రెండుగా చీరి వైచి వానినట్లు చంపుమని సంజ్ఞగా"[216] తెలిపాడు. అది గ్రహించిన భీముడు అదను కనిపెట్టి జరాసంధుని పడదోసి 'పాదజాను జంఘోరుకటి మధ్యోదరాంస కర్ణనయనంబులు వేఱ వేఱ భాగాలుగా వ్రయ్యలు' అయ్యే విధాన చీల్చాడు.

భీముని శారీరక బలంలో శ్రీకృష్ణుని దివ్యతేజమ్ము నిలిపిన కారణంగా, జరాసంధుని చీల్చే సులువును శ్రీకృష్ణుడు తెలిపినందున, శ్రీ కృష్ణుని సాయంతో భీముని చేతిలో జరాసంధుని మరణం సంభవించింది. జరాసంధ సంహారంలో భీముడు కేవలం ఉపకరణంగా మాత్రమే (జరాసంధుడు భీమునితోనే యుద్ధం చేస్తానని కోరుకున్నాడు కనుక) ఉపయోగపడ్డాడని స్పష్టంగా తెలుస్తోంది.

భగవంతుని విస్మరించి ఉపయోగించే బలం పశుబలం. భీముడు కృష్ణుణ్ణి చూడక పోరాడినంతకాలం భీమునికి విజయం లభించలేదు. తన అశక్తత తెలుసుకుని కృష్ణుని వైపు దృష్టిని సారించినందుకే కృష్ణ పరమాత్మ శక్తి యుక్తి భీమునిలో ప్రవేశించి జరాసంధవధ సంభవమయింది.

జరాసంధుని చేత బంధింపబడి చెరసాలలో మహాదుఃఖాన్ని అనుభవిస్తూ 'తన పదాంబుజ యుగళము చింతించుచున్న యుర్వీశ్వరుల'[217] బంధనాలను విడిపించిన కృష్ణుడు జరాసంధ సుతుడయిన సహదేవుని మగధకు పట్టం కట్టాడు. ఈ విధంగా దుష్ట శిక్షణ శిష్ట రక్షణ గావించి జరాసంధుని రాజ్యానికి జరాసంధ పుత్రుని రాజుగా చేసి ధర్మాన్ని స్థాపించాడు. జరాసంధుని చెరనుంచి బంధవిముక్తులయిన జననాధులకు ధర్మబోధ చేసి వివిధ మణి భూషణ మృదులాంబర మాల్యాను లేపనాలతో భోజన తాంబూలాదులతో సత్కరించి తనిపి నిజరాజ్యాలకు పంపాడు.

## రాజసూయ యాగం - శిశుపాలవధ

జరాసంధ వధతో రాజసూయ యాగ నిర్వహణకు ఉన్న ఒక్కగా నొక్క అడ్డు (జరాసంధుడు) తొలగి సకల రాజలోకం ధర్మరాజుకు విధేయులయి రాజసూయ యాగానికై తరలి రావడం జరిగింది. యాగానంతరం సహదేవుని సూచన మేరకు[218] ధర్మరాజు శ్రీకృష్ణునికి ప్రీతితో యథోచితంగా పూజించి ఉన్నత స్థానాన్ని ఇచ్చి గౌరవించాడు.

రాజసూయ యాగ నిర్వహణ మయ సభా నిర్మాణం ఒక విధంగా మహాభారత యుద్ధానికి నాందీ వాచకంగా స్పష్టం అవుతుంది. రాజసూయ యాగానికి రాజులందరూ ధర్మరాజు రాజరికానికి తలవొగ్గి తరలి వచ్చినా అది

రాజులందరి పట్లా మనః పూర్వకంగా జరుగలేదు. పాండవుల పట్ల ఈర్ష్యా సూయలతోనూ శ్రీ కృష్ణుని పట్ల ద్వేషంతోనూ రగిలిపోతున్న మనసులను బలవంతాన అదుపులో ఉంచుకుని సహిస్తున్నటువంటి దుర్యోధన శిశుపాలాదులూ ఆ రాజసభలో ఉన్నారు.

తానువివాహమాడ వలసియున్న రుక్మిణిని శ్రీ కృష్ణుడు చేపట్టిన కారణాన ఆనాటినుండి శ్రీ కృష్ణుని మీద శత్రుత్వం వహించి సమయం కోసం ఎదురు చూస్తున్న శిశుపాలుడు శ్రీ కృష్ణుడు అగ్రపూజకు అనర్హుడంటూ ఎన్నో విధాల దూషిస్తూ అవమానించసాగాడు. భరించరాని ఆ కృష్ణనిందను విని సహించలేని కొందరు చెవులు మూసుకుని శిశుపాలుని నిందిస్తూ సభనుంచి వెళ్ళిపోయారు. పాండవులు మత్స్య కైకయ సృంజయ వీరులు శిశుపాలుని సంహరించే నిమిత్తం ముందుకు దూకారు. యాగ సంరక్షణ బాధ్యతను వహించిన శ్రీ కృష్ణుడు శిశుపాలుని జన్మ రహస్యం ఎరిగిన వాడై తానే తన చక్రంతో శిశుపాలుని శిరస్సును ఖండించాడు. అదే క్షణంలో అందరూ చూస్తుండగా శిశుపాలుని మృత శరీరం నుండి 'అనుపమ తేజం వెలువడి వనజోదరునిదేహం'లో ప్రవేశించింది.

ఏదో విధంగా జీవిని ఆకర్షించడమే కృష్ణుని స్వభావంగా కనపడుతుంది. అయితే కొంతమంది ఆసురీ మార్గంలో ఈ ఆకర్షణ లక్షణాన్ని రజోమార్గంలో జాగృతం చేసుకుంటారు. ఈ రజోవిలసనమనేది బాహ్య ఆచ్ఛాదనగా చేసుకోవడానికి వీరి పూర్వ భవకృత పాపలేశమేదో కారణభూతంగా కనిపిస్తుంది. కాబట్టే వైర మార్గంలోనే వీరు పరమాత్మ పట్ల ఆకర్షితులవుతారు.

మిత్రత్వంలో సాత్త్విక భక్తిలో కన్నా వీరువైర వృత్తిలోనే మరింత గాఢంగా పరమాత్మకు దగ్గరవుతారు. ఈ వైర ప్రవృత్తి వ్యతిరేకత పూర్వజన్మ సంస్కార ఫలితమైన ఒక తెర లాగా వీరికి పరమాత్మకు మధ్య నిలుస్తుంది.

ఒక వ్యక్తి గుణ దోషాలను మిత్రునికన్నా శత్రువే మరింత తీవ్రంగా తలచుకోవడం అనుక్షణం శత్రువు యొక్క నడవడిని పరిశీలిస్తూ గమనిస్తూ ఉండడం లోకంలో జరుగుతూ ఉంటుంది. శ్రీ కృష్ణుని స్వభావాన్ని చేష్టలను పూర్తిగా తెలుసుకున్న వాడుగానే శిశుపాలుడు కనిపిస్తాడు. ద్వేషంతోనే అన్నా కృష్ణుని చేష్టలకు విపరీతార్థాలు తీసినట్లుగా పైకి కనిపించినా శిశుపాలుడు శ్రీకృష్ణుని నిందిస్తూ వాడిన ప్రతి మాటలోనూ శ్రీ కృష్ణుని గుణాధిక్యం పరమాత్మ తత్త్వం బయట పడుతూనే ఉంది.

*"గురుదేవ శూన్యుండు కులగోత్ర రహితుండు*
*తల్లిదండ్రు లెవ్వరో తడవగాన*
*మప్పుల బొరలెడు నాది మధ్యావసా*
*నంబులందరయ మానంబులేదు*
*బహురూపియై పెక్కు భంగుల వర్తించు*
*వాని వర్తనములు వరుసలేవు*
*పరికింపవిగత సంబంధుండు దలపోయ*
*మా నిమిత్తంబున మానిసయ్యె"*[219]

అంటూ అగ్రపూజార్హుడు కాడంటూ తెలిపిన ప్రతి మాటలోనూ అంతరార్థాన్ని పరిశీలిస్తే పరమాత్మ తత్త్వాన్నే వెల్లడవుతుంది.

జగద్గురువు కనుక గురుదేవ శూన్యుడనీ కులగోత్రాలకు అతీతుడనీ పుట్టుకే లేనివాడనీ ఆదిమధ్యాంత రహితుడనీ అనేక అవతారాలు గానూ సకల జీవుల లోనూ వుంటాడు గనుక బహురూపి యని పెక్కు భంగుల వర్తిస్తాడు గానీ ఒక విధానానికి లొంగి ఉండడనీ ఒక నియమానికి లోబడి ప్రవర్తించక స్వేచ్ఛగా స్వతంత్రంగా వర్తించేవాడూ ఎవరితోటీ ఏ సంబంధాలు లేకపోయినా మాకోసం (నిమిత్తంగా) మానవ రూపుడుగా కదలి వచ్చాడనీ స్పష్టంగా తెలుస్తోంది.

శిశుపాలుని మృతదేహం నుండి దివ్య తేజస్సు వెలువడి శ్రీకృష్ణునిలోనికి జేరడానికి గల కారణాన్ని భాగవతమే తెలియజేస్తుంది.

" మధు దైత్యాంతకు మీది మత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా
వధి యే ప్రొద్దు దదీయ రూపగుణ దివ్య ధ్యాన పారీణధీ
నిధియౌటన్ శిశుపాల భూవిభుడు తానిర్ధూత సర్వాఘుడై
విధి రుద్రాదుల కందరాని పదవిన్ వేపొందె..." [220]అంటూ

పూర్వభవాన నారాయణుని ద్వారపాలకులైన జయ విజయులు సనకసనంద నాదులశాపకారణంగా మూడు జన్మలలో వైర మార్గాన పరమాత్మను చేరేట్లుగా వరాన్ని సైతం పొందిన కారణాన శిశుపాలునికి కృష్ణుని పట్ల వైరం అనంతరం కృష్ణునితో ఐక్యమూ కలిగాయి.

శిశుపాలుని జనన కాలాన ఉన్న మూడవ కన్ను అధికంగా ఉన్న రెండు చేతులు ఎవరి స్పర్శ వలన అదృశ్యమవుతాయో వారిచేతిలో శిశుపాలుని మరణం సంభవమవుతుందన్న ఆకాశవాణి ప్రకారం శ్రీకృష్ణుని చేతిలో అవి అదృశ్యమయ్యాయనీ ఆకారణాన కృష్ణుని చేతిలోనే శిశుపాలునికి మరణం సంభవిస్తుందని తెలుసుకున్న శిశుపాలుని తల్లి సాత్వతి శ్రీ కృష్ణుని ప్రార్థించిన కారణంగా శ్రీకృష్ణుడు శిశుపాలుని వంద తప్పులను సైచిన అనంతరం శిశుపాలుని వధించాడని మహాభారతం వివరిస్తుంది.[221]

శిశువులను పాలించేవాడు శిశుపాలుడు మనిషి తనలోని శిశుత్వాన్నే పాలిస్తూ పెద్దరికాన్ని అణగద్రొక్కినట్లయితే ఎప్పటికీ మూర్ఖుడుగానే ఉంటాడు.

## దుర్యోధన గర్వభంగం

మహాభారతంలో రాజసూయ యాగ ఘట్ట కథ ప్రారంభంలోనే నారదుని మహోభావాల ద్వారా 'భారతరణానికి' సన్నాహాలు సిద్ధమయినట్లుగా

వర్ణింపబడింది.[222] రాజసూయ యాగానికి వచ్చిన రాజులలో కొందరు శిశుపాలవధ జరిగినందుకు ఆనందిస్తే మరికొందరు తత్తర పాటుతో పారిపోయిన వారూ ఉన్నారు. [223]

కలుష మానసుడు కులపాంసకుడు అయిన దుర్యోధనుడు రాజసూయయాగం వల్ల మిగిలిన వారి మోదంలో పాలు పంచుకోలేక పోయాడు. దుర్యోధనుని మనసు కలుషితం అవడం దైవ సంకల్పం మాత్రమే. మహాభారత యుద్ధానికి మూలం దుర్యోధనునిలో పాండవుల పట్ల ఉన్న అసూయా ద్వేషాలు. దుర్యోధనుని రెచ్చగొడితే గానీ మహాభారత యుద్ధానికి గల మార్గం సుగమం కాదు. ఈ విధంగా దుర్యోధనుని మాత్రమే రెచ్చగొట్టి భారత యుద్ధానికి కారణభూతుని చేయడానికి గల కారణం దుర్యోధనుడు 'కలి' యంశాన పుట్టినవాడు ధర్మద్వేషి అవడమే.[224] ఈ కారణం వల్లనే దుర్యోధనుడు పాండు పుత్రుల సంపదను జూసి ఓర్వలేక పోయాడు. దానికి మయ సభా మాయా మోహితమైన సభాస్థలంలో ఎవరికీ జరుగని విధంగా దుర్యోధనుడు -

*సలిలములేని తావున*
*వలువలు వెసనెగయ దిగిచి వారకతోయం*
*బులుగల చోటను*
*జేలంబులు దడియగ బడియెనిజవిభుత్వము దఱుగన్"* [225]

అభిమాన ధనుడైన దుర్యోధనుడు మయుని చమత్కార సభా నిర్మాణానికి తాను పడిన భ్రమకి సిగ్గుపడి తట్టుకోలేని సమయంలో భీమాదులు చేసిన పరిహాసంతో ఘోర అవమానం పొందాడు.

దుర్యోధనునిలో ఉన్న అసూయకు అవమానాన్ని జతజేసింది సాక్షాత్తూ శ్రీకృష్ణుడే. ధర్మరాజు వద్దంటున్నా భీమాదుల చేత దుర్యోధనుని పరిహాసింపజేశాడు శ్రీకృష్ణుడు.[226]

కుపిత మానసుడైన దుర్యోధనుడు లజ్జావనత వదనంతో హస్తినకు వెళ్లి శకుని కర్ణదుశ్శాసనులతో కలిసి అవమానానికి తగిన ప్రతీకారానికై పథకాలువేశాడు. మాయా జూదంలో పాండవుల నోడించి అరణ్యాల పాలు జేసి వైరం పెంచుకుని భారత యుద్ధానికి కారణమయ్యాడు. ఈ విధంగా దుర్యోధనుని రెచ్చగొట్టడానికి "అప్పుండరీకాక్షుండు భూభార నివార కారణుండగుటం జేసి దుర్యోధనున పహాసంబునకుంగాదనడయ్యె"[227] అని తెలియ జేయడంతో శ్రీ కృష్ణుని ప్రతి చేష్టా అర్థవంతంగా ఉండి మహాభారత రణానికి దారి తీసేదిగానే జరిగిందన్న విషయం స్పష్టమవుతుంది.

అయితే సర్వజగద్రక్షకుడయిన శ్రీ కృష్ణుడు భారత రణాన్ని ఎందుకు ప్రోత్సహించాడన్నదానికి ధర్మాధర్మాలకు ప్రతీకలయిన కౌరవపాండవుల వారి ప్రోత్సాహకుల మధ్య జరిగిన మహాయుద్ధంలో దర్మంజయిస్తుందనీ (ధర్మమేవ జయతే) అధర్మం నశిస్తుందనీ ధర్మ సంస్థాపనమే భగవదవతారానికి ప్రధాన ప్రయోజనమని చెప్పవలసి ఉంటుంది.

## సాల్వుని వధ

శ్రీ కృష్ణుని ఈ సంహార యజ్ఞంలో స్వయంగా వచ్చి సమిధలయిన వారిలో మరో ఇద్దరు సాల్వుడు, దంతవక్త్రుడు. వీరిద్దరూ శిశుపాలుని స్నేహితులు.

రుక్మిణీ పరిణయ సమయంలో శ్రీకృష్ణుడు ఓడించిన ఎంతోమంది రాజులలో సాల్వుడు ఒకడు. ఆసమయంలో సాల్వుడు శ్రీ కృష్ణుని మీద కోపంతో "ధాత్రినిటమీద వీతయాదవము గాగ గడగిసేయుదు"[228] నని ప్రతిజ్ఞ చేశాడు. అది నెరవేర్చుకోడానికి గాను ఒక ఏడాదిబాటు ప్రతి దినము పిడికెడు దుమ్మును మాత్రమే ఆహారంగా తీసుకుంటూ పరమశివుని కోసం తపస్సు చేసి, మెప్పించి, గంధర్వ నాగ రాక్షసాదులకు అభేద్యమూ యాదవులకు భయంకరమూ అయి స్వేచ్ఛానుసారం పయనించే ఒక వాహనాన్ని కోరుకున్నాడు. మహేశ్వరుడు

సమ్మతించి కామగమనము, అతి విస్తృతము, లోహ నిర్మితము అయిన సౌభకమనే వాహనాన్ని మయుని చేత నిర్మింప జేసి సాల్వునికి ఇచ్చాడు. శ్రీ కృష్ణుడు ఇంద్రప్రస్థంలో ఉన్న సమయాన సాల్వుడు దర్పోద్ధతితో ద్వారకపై దాడి చేశాడు. అక్కడి ఉద్యానవనాలను, గోపురాలను, ప్రాసాదాలను నాశనం గావించాడు, సంపదను కొల్లగొట్టాడు.

సాత్యకి మొదలయిన వారితో కలిసి ప్రద్యుమ్నుడు సాల్వుడి మీదకు వెళ్ళి 27 రోజులు తీవ్ర యుద్ధం చేశాడు. సాల్వుడు మాయా యుద్ధం చేయసాగాడు. ఇరు వర్గాలు క్షీణించాయి. ఆ సమయంలో ఇంద్రప్రస్థం నుంచి ద్వారకకు వచ్చిన కృష్ణుడు ద్వారకను బలరాముని రక్షణలో ఉంచి తాను సాల్వుని మీదకు యుద్ధానికి వెళ్ళాడు.

సాల్వుడు శ్రీ కృష్ణుని వామహస్తాన్ని కొట్టి, ఆ చేతిలోని విల్లును కిందపడవేశాడు. అంతేగాక - తన సఖుడు శిశుపాలుడు కోరిన కన్య రుక్మిణిని అన్యాయంగా కృష్ణుడు వరించి వివాహమాడాడనీ అంతటితో ఆగక రాజసూయ యాగానంతరం శిశుపాలుని నిండు సభలో చంపాడనీ నిందించాడు. కనుక రణరంగంలో కృష్ణుని వధించి 'సఖుని సూడు తీరుస్తానని' కృష్ణునితో పోరుకు తలపడ్డాడు.

శ్రీ కృష్ణుని గదా ఘాతానికి మూర్ఛనొంది సౌభకంతో సహా మాయ మయిన సాల్వుడు మాయా వసుదేవుని కల్పించి కృష్ణుని కళ్ళముందు ఆవసుదేవుని కంఠాన్ని ఖండించాడు . అది చూసి కృష్ణుడు సౌభకాన్ని గదతో కొట్టి చూర్ణం చేయగా అంతవరకూ ఆవరించి ఉన్న మాయాబలం కాస్తా హరించుకుపోయింది. అయినా సాల్వుడు తగ్గని బీరంతో ఆగ్రహంతో గదను తీసుకుని కృష్ణుని పైకి రాగా కృష్ణుడు ముందుగా ఆ గదను పట్టిన చేతిని అనంతరం సాల్వుని శిరస్సును ఖండించాడు.

కృష్ణునికి స్వయంగా సాల్వునిపై విరోధంలేదు. తామస ప్రవృత్తి గలవాడు అకారణంగా సాత్వికుని మీద కోపం పెట్టుకుంటాడు. తామస ప్రవృత్తి గల సాల్వుడు తనంతతాను స్వయంగా ద్వారకను నాశనం జేసి కృష్ణుని రెచ్చగొట్టి నాశనమొందాడు.

'సాల్వుడంటే నిస్సారమైన వాడని అర్థం. విషయ వాసనలకు ప్రతీక. కనుకనే మట్టి తింటూ తపమాచరించాడు. సాల్వుడు సౌభకాన్ని ఎక్కి తిరగడం విషయ వాసనలు మాయ పైనే ఆధారపడి ఉంటాయని చెప్పడమే శ్రీ కృష్ణుని రాకతో సాల్వుని మాయ హరించబడింది. సాల్వుడు వధించబడ్డాడు. అనగా పరమాత్మ దర్శనంతో మాయా నాటకానికి తెరపడి వాసనాక్షయమయింది'.[229]

## దంతవక్త్ర విదూరకుల సంహారం

శిశుపాల సాల్వ పౌండ్రకులు శ్రీకృష్ణుని చేతిలో నిహతులవగా దంత వక్త్రుడు సహించలేక పోయాడు.

> "పెట పెట బండ్లు గీటుచును బెట్టుగ మ్రోయుచుగన్నుగ్రేవలం
> జిటచిట విస్ఫులింగంబులు సింద మహోద్ధత పాదఘట్టనన్
> వట నిట ధరిత్రి వడకాడ వడిన్గద కేల ద్రిప్పుచున్
> మిట మిట మండు వేసవిని మించుదివాకరు బోలియుగ్రతన్"[230]

గదతో కృష్ణుని మీదకు వచ్చాడు.

'దంతవక్త్రుడు కరూషదేశాధిపతి అయిన వృద్ధ శర్మకు వసుదేవుని సోదరియైన శ్రుత దేవకు పుట్టినవాడు'[231] శాపగ్రస్తులైన జయ విజయులు (మొదట హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగాను రెండవసారి రావణ కుంభకర్ణులుగాను) మూడవసారి శిశుపాల దంత వక్త్రులుగా జన్మించారు. శ్రీ కృష్ణుని మేనత్తలకు బిడ్డలుగా పుట్టినప్పటికీ శాపకారణంగా కృష్ణునితో వైర భావం కలిగి ఉన్నారు.

దంత వక్రుడు శ్రీకృష్ణుని మీదకు పోరుకు వచ్చి మిత్రద్రోహివైన నిన్ను మేనమామ కొడుకని ఉపేక్షించరాదు, బంధురూప శత్రువువైన నిన్ను యమపురికి పంపి నా స్నేహితుని చంపినందుకు పగతీర్చుకుంటానని అంటూ అనేక నిందాలాపాలుపలుకుతూ శ్రీ కృష్ణుని తలమీద మోదాడు. శ్రీ కృష్ణుడు దానికి లెక్క చేయక తనకౌమోదకి నెత్తిదంతవక్రుని వక్షో మధ్యంలో మోదగా, ఒక్క దెబ్బతోనే వక్షం చీలి రక్తము కక్కుతూ దంతవక్రుడు ప్రాణం వదిలాడు. శిశుపాలుని శరీరం నుంచి వెలువడిన విధంగానే దంతవక్రుని శరీరం నుండి కూడా ఒక జ్యోతి వెలువడి శ్రీ కృష్ణునిలో కలిసింది.

'వక్రభాష్యం చేసేవాడు దంత వక్రుడు. శ్రీకృష్ణుని చర్యలకు వక్రంగా వ్యాఖ్యానించి, కృష్ణుని నిందించడమే ధ్యేయంగా పెట్టుకున్నవాడు దంతవక్రుడు. ఇటువంటివారు కర్మ పరిపక్వంకాగానే బుద్ధి వచ్చి కైవల్యానికి చేరుకుంటారు.[232]

దుష్ట వాక్కు దంత వక్రుడిదయితే దుష్ట కర్మ విదూరకునిది. విదూరకుడు దంతవక్రుడి తమ్ముడు. అతడు కూడా శ్రీ కృష్ణుని చంపాలని వచ్చి కృష్ణుని చక్రానికి గురి అయి మరణించాడు.

సాల్వ దంత వక్ర విదూరకుల సంహారాలతో శ్రీ కృష్ణుడు స్వయంగా సంహారాలు చేయడం చాలించాడు.

అనంతరం బాల్య మిత్రుడైన కుచేలుని (సుదాముని) ఉద్ధరించాడు ('పోతన భాగవత తత్త్వం' అనే అధ్యాయంలో కుచేలుని భక్తిని గూర్చి వివరించడం జరిగింది).

## సూర్యగ్రహణం - బంధు సమాగమం

గ్రహణ స్నానాల సందర్భంగా 'కురుక్షేత్రం'లో పరశురాముడు చేసిన శమంత పంచకం దగ్గర పాండవులను కౌరవులను యశోదానందాదులను గోపగోపీ జనాన్ని కలుసుకుని అందరిని తరింప జేశాడు.

శ్రీ కృష్ణుడే సర్వస్వంగా భావించి బ్రతుకు తున్న గోపికలను అనునయిస్తూ

*"తరలాక్షులార! మద్భక్తి చేతనులకు*
*దనరు మోక్షానంద దాయకంబు*
*జపతపోవ్రతదాన సత్కర్మములముక్తి*
*కలుగంగ నేరదు కానతలప*
*విధి శివసనకాది విమల చిత్తంబుల*
*బొడమని భక్తి మీ బుద్ధులందు*
*జనియించె మీ పూర్వ సంచిత సౌభాగ్య*
*మెట్టి దోయది తుదముట్టె నింక*
*నటమటముగాదు మీకు నెన్నటికినైన*
*గలుగనేరవు నిరయ సంగతములైన*
*జన్మ కర్మములిట మీద మన్మనీషసుమహి*
*తధ్యానలార యో రమణులార!"*[233]

అని గోపికల పుణ్యఫల విశేషాన్ని గోపిలకు తెలియజేశాడు. తాను వారికి దూరమైన కారణాన తనయందు ప్రేమ అధికమయిందని తాను సర్వత్రానిండి యుండడం వలన నిజానికి ఎల్లప్పుడూ వారి దగ్గరా ఉన్నానని తెలిపి వారికి సాంత్వన చేకూర్చాడు.

అనంతరం శ్రీకృష్ణుడు వసుదేవునికి బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించి, దేవకి కంసుని చేత చంపబడిన ఆరుగురు పుత్రులను చూపమని కోరగా బలరామకృష్ణులు యోగమాయనాశ్రయించి 'సుతలం'లో 'బలి' చక్రవర్తి అండలోనున్న ఆరుగురు పుత్రులను తెచ్చి తల్లికి చూపించారు. ఈసందర్భంలో బలి చక్రవర్తికి తన దర్శన భాగ్యాన్ని ప్రసాదించడం తన దర్శన స్పర్శనల వల్లదేవకి ఆరుగురు పుత్రులకు ఊర్ధ్వలోకాలకు పోయే భాగ్యాన్ని అందించాడు.[234]

చెల్లెలు సుభద్రను బలరాముడు దుర్యోధనునికిచ్చి వివాహం చేయ సంకల్పించగా సుభద్రార్జునుల మనసెరిగిన కృష్ణుడు అదనుచూసి వారి వివాహం జరిగేట్లు చేశాడు.

## భూభారహరణం మహాభారతయుద్ధం

సుభద్రార్జునుల వివాహంతో పాండవులతో శ్రీకృష్ణుడు మరింత గట్టి బంధాన్ని ఏర్పరచుకుని వారికి సర్వస్వం తానే అయి మహాభారతాన్ని నడిపించాడు. ముఖ్యంగా అర్జునుని వెంట నుండి ఖాండవ వనాన్ని అగ్నికి అర్పించి గాండీవాన్ని అర్జునునికి వచ్చేట్లు చేశాడు.[235] నరనారాయణులుగా ఇద్దరూ కలిసి చేసే కార్యాలు ప్రారంభమయి యుద్ధం దాకా సాగాయి.

దుర్యోధనాదుల మాయా జూదంతో పాండవుల నోడించి పాంచాలిని పరాభవించినపుడు తనను అర్థించి తనపై భారం వేసిన పాంచాలికి అక్షయ వస్త్రాలనందించి పాంచాలి మానం కాపాడాడు.[236]

మహాభారత యుద్ధానికి ద్రోవదీసిన కారణాలతో పాంచాలీ పరాభవం ప్రధానమైన కారణం పాండవులకు దుర్యోధనాదుల చేతిలో పరాభవాన్ని పొందుతున్న పాంచాలికి మాన సంరక్షణ చేస్తూనే భీమాదులు ప్రతిజ్ఞాలు చేసే పరిస్థితిని అరణ్యవాసం నెపంతో పాండవులకు దివ్యాస్త్రాలను పొందే అవకాశాన్ని కల్పించాడు. పాండవులకు కలిగిన అవమానాలు అరణ్యవాసాది కష్టాలు పాండవులను రాటు దేల్చడానికి భారతయుద్ధంలో జయాన్ని పొందడానికి అర్హులుగా సమర్థులుగా చేయడానికేనని స్పష్టంగా తెలుస్తుంది. ఈ విషయాన్ని గ్రహించినట్లయితే 'భగవంతుడు అండగావున్నా పాండవులకు అన్ని కష్టాలెందుకు వచ్చాయనే' సందేహానికి తావుండదు.

పాండవుల వైపునుండి రాయబారిగా వెళ్ళిన కృష్ణుడు సంధి మాటలాడుతూనే యుద్ధం అంటూ వస్తే పాండవులదే గెలుపని తెలుపుతూ దుర్యోధనుని పరోక్షంగా యుద్ధానికే రెచ్చగొట్టాడు.

యుద్ధారంభంలోనే తనబంధువులను చంపి యుద్ధంలో గెలవాలనే కోరికలేదని నిర్వీర్యుడై విరక్తిని చూపిన అర్జునునికి గీతా బోధగావించి భగవత్తత్వాన్ని బోధించి అర్జునుని నిమిత్త మాత్రునిగా జేసి ఉత్సాహపరచి యుద్ధానికి ప్రోత్సహించాడు.. పెద్దఎత్తున భూభారాన్ని తీరేట్లు చేశాడు.

*"గురుభీష్మాదులు కూడి పన్నిన కురుక్షోణీశ చక్రంలో*
*గురుశక్తిన్ రథయంతయై నొగలపై గూర్చుండి యా మేటినా*
*శరముల్ వాఱక మున్న వారల బలోత్సాహయురుద్యోగత*
*త్వరతల్ చూడ్కుల సంహరించునమితోత్సాహంబు నాకిచ్చుచున్"*[237]

అనే అర్జునుని మాటలవల్ల మహాభారత రణరంగంలో శ్రీకృష్ణుని సాయం అర్జునాదులకు ఎంతగా లభించిందో అవగతమవుతుంది.

భీష్మ ద్రోణాదులను యుద్ధ రంగంలో పడవేయడానికి చేసిన పన్నాగాలూ కర్ణుని అర్జునుని చేత చంపించిన విధమూ భీమునికి చేసిన ప్రతిజ్ఞను గుర్తుచేస్తూ సైగ చేసి దుర్యోధనుని తొడలు విరుగగొట్టించిన విధానమూ పలువురికి అనుచితంగా అనిపించినా దుష్ట శిక్షణ చేసే ధర్మాన్ని గెలిపించే యత్నంలో ఏదీ అనుచితంకాదని సముచితమేననే విశేషధర్మాన్ని నిరూపించి భూభారాన్ని తగ్గించేట్లుగా చేశాడు. ద్రోణనందనుడు అశ్వత్థామ బాణ ప్రభావాన్నుంచి పాండవుల ఏకైక వారసుడైన పరీక్షిత్తును రక్షించాడు.

దుష్ట సంహారంగావించి ద్వారకకు చేరిన శ్రీకృష్ణుడు కొంతకాలానికి ఋషులతో కూడి మిథిలానగరానికి వెళ్ళి ఆ పురాన్ని ఏలే మహారాజు బహుళాశ్వునీ

అదే నగరంలో ఉన్న శ్రుత దేవుడనే విప్రునీ ఒకే సమయంలో ఇరువురి ఇండ్లకూ వెళ్ళి అనుగ్రహించాడు. బహుళాశ్వుడందించిన రాచమర్యాదలు శ్రుత దేవుడర్పించిన పేద మర్యాదలు రెంటిని సమంగా ఒకే సమయంలో స్వీకరించి తన విభూతిని వ్యక్త పరిచాడు. ఇరువురికీ తృప్తి కలిగించాడు.

పరమాత్మ దేశకాలాలకు అతీతుడని నిత్య స్వరూపుడని సర్వాంతర్యామి అనీ 'బహుళాశ్వశ్రుతదేవుల ఇళ్ళకు ఒకేసారి కృష్ణుడు వెళ్ళడం' వల్ల తెలియ జేశాడనిపిస్తుంది.

పుడుతూనే మృత్యువాత పడుతున్న బిడ్డలను తెచ్చి విప్రునికిచ్చిన సందర్భంలో శ్రీకృష్ణుడు అర్జునుని సారథ్యంలో వైకుంఠానికి వెళ్ళి తన దర్శనాన్ని అభిలషించిన అక్కడి మునీంద్రులకు దర్శనమిచ్చాడు. ఇదే సందర్భంలో తానెంతటి కార్యాన్నయినా చేయగలుగుతానని తలచిన అర్జునునికి కనువిప్పు కలిగించాడు. కృష్ణుని అండలేనిదే తానేమీ చేయలేడనే వాస్తవాన్ని అర్జునుడు గుర్తించేలాగా చేశాడు.

## యదువంశ నిర్మూలన

దుష్ట శిక్షణ శిష్ట రక్షణలో సాయంగా ఎంతోమంది దేవతలు అంశలతో భూమిమీద యదువంశంలో అవతరించారు. వారందరి నిర్మూలనం కూడా జరుగవలసిఉంది. అవతరించిన అంశలు యథాపూర్వ స్థితినందడమే దీని ఆంతర్యం. కృష్ణునిగా అవతరించి లోక క్షేమం కోసం ప్రవర్తిల్లి విష్ణుత్వాన్ని పొందడం ముఖ్య విషయము. శ్రీకృష్ణుడు -

**"భక్తులగు యాదవేంద్రుల బరగజూచి**
**యన్య పరిభవమెఱుగ రీ యదువు లనుచు**

వీరి బరిమార్పనే దక్కవేఱొకండు
దైవమికలేదు త్రిభువనాంతరమునందు"[238]

అని వితర్కించాడు.

శ్రీ కృష్ణుని అండలో నిశ్చింతగా దర్పించి ఉన్న యదుసైన్యం ఏదోకారణాన నిహతమయి తమ తమ పూర్వ స్థానాలకు జేరాలి. తన రక్షణలో నున్నవారిని తాను చంపడం సముచితంకాదు. పరులు వచ్చి యదువంశీయులను చంపడం తన విభవానికే న్యూన కారణం. కనుక భగవత్స్వరూపులు భూసురులు అయిన ఋషుల శాపకారణంగా యదు వంశీయులను మడయజేశాడు.

శ్రీహరి సంకల్పార్థమే అయినట్లుగా 'విశ్వామిత్రాసిత దుర్వాసో భృగ్వంగిరః కస్యపవామ దేవవాలఖిల్యాత్రి వశిష్ఠ నారదాది' మునివరులు స్వేచ్ఛా విహారంగా ద్వారకకు వచ్చి శ్రీకృష్ణుని దర్శించి అనేక విధాలస్తుతించి 'వాసుదేవ వదన చంద్రామృతాన్ని నిజనేత్రచకోరములతో గ్రోలి' వెనుదిరిగి వెడుతున్న సమయంలో ద్వారకకు అనతి దూరంలో ఉన్న పిండారకమనే పుణ్యక్షేత్ర తీరంలో యాదవులు కొందరు సాంబునికి గర్భిణీ రూపధారణ గావించి దర్పించి నవ్వుతూ పరిహాసం చేస్తూ ఆ ప్రదేశానికి వచ్చిన విశ్వామిత్రాది ఋషులకు మ్రొక్కి స్త్రీ రూపాన ఉన్న సాంబుని చూపించి 'ఈ సుదతి భారవు గర్భమునందు బుత్రుడో - యేకతమందు బాలికయో ఏర్పడజెప్పు'[239] మని కోరారు.

విషయం గ్రహించి ఉగ్రులయిన మనులు తమతో హాస్యమాడవచ్చిన యాదవులను -

'వాలాయము యదుకులని
ర్మూలకరం బైనయట్టి ముసలంబొకటీ

బాలిక కుదయించును బొం
డాల స్యములే................[240] దని

శపించారు. ఆ శాపానికి భీతులై వణుకుతూ సాంబుని స్త్రీరూపాన్ని తొలగిస్తున్న సమయాన మునుల వాక్ఫలితంగా సాంబుని గర్భం నుండి ముసలం భూమ్మీద పడింది. జరిగిన విషయం తెలువగా కృష్ణుడు "ఆత్మ కల్పిత మాయారూపంబగుట యెఱింగియు నెఱుంగని తెరుగున'[241] వారితో

"మదిసెడి కన్నులుగానక
మదయుతులై మునుల గల్లమాటల జెనయం
గదిసి కులక్షయకారణ
విదితంబగు శాపమొందు వెఱ్ఱులుగలరే[242]
"ధరణీ సురశాపమునకు
హరిహర బ్రహ్మాదులైన నడ్డము గలరే ?
నరు లనగనెంత వారలు
గర మరుదుగ బూర్వ జన్మకర్మము ద్రోవన్?[243]

'అది గావున యతినిందా పరత్వంబున యదువంశ నాశంబగు సందియములే'[244] దని ఆ ముసలాన్ని అరగదీసి సముద్రంలో కలుపమని తెలిపాడు. ఆత్మ కల్పిత మాయారూపమనడం వల్ల యదువంశ నాశనానికై మునులిచ్చిన శాపమూ ముసలం పుట్టడమూ శ్రీకృష్ణుని సంకల్పంగానే తెలుస్తోంది.

యదు వంశంలోనే తాము దర్శించ వచ్చిన కృష్ణ భగవానుడున్నాడని తెలిసీ ఆ యదు వంశనాశనానికై మునులు శాపమివ్వడం కేవలం భగవత్సంకల్ప మేనని భూభార నివారణార్థమేనని స్పష్టమవుతోంది.

"అత్యున్నత వేణుకాననంబు వాయువశంబున నొరసికొన వనలం బుద్భవంబయి దహించు చందంబున యదు బలంబుల కన్యోన్య వైరాను బంధములు గల్పించి హతం బొనర్చెద"[245] నని సంకల్పించి విప్రశాపాన్ని నెపంగా చేసి యదుబలాలను నాశనమొందించాడు. ఇది భగవత్సంకల్పం కనుకనే విప్రులను భగవత్స్వరూపులుగా ఎల్లప్పుడూ భావించి పూజించే యాదవులకు అంత్యకాలం సమీపించినందున మునులను కల్లమాటలతో పరిహసించాలనే దుర్బుద్ధి పుట్టిందని స్పష్టమవుతుంది.

ముసలాన్ని అరగదీసి సముద్రంలో కలిపి చివరగా ముసలానికి కీలకంగా నున్న సన్ననైన లోహఖండాన్ని ఉపేక్షించి సాగరంలో పడవేశారు. ఆ లోహఖండాన్ని చేపమింగగా ఆ చేపను పట్టిన లుబ్ధకుడు ఆ చేప కడుపులో దొరికిన లోహ ఖండాన్ని తెచ్చి బాణాగ్రాన ములికిగా అమర్చుకున్నాడు.

బ్రహ్మాది దేవతలు ద్వారకకు వచ్చి శ్రీకృష్ణుని సందర్శించి -

*అఖిలలోకేశా! సర్వేశ! యభవ!*
*నీవుదయమందుట భూ భారముడుపు కొఱకు*
*బంచవింశోత్తర శతాబ్ద పరిమితంబు*
*నయ్యె విచ్చేయు వైకుంఠ హర్మ్యమునకు*[246]

అని తెలిపినపుడు కృష్ణుడు 'యాదవుల కన్యోన్య వైరానుబంధం బులు గల్పించి వారల హతంబు గావించి భూభారం బడంచి యిదె వచ్చెదం బొండని'[247] చెప్పి పంపిన విధానం యాదవుల నాశనం శ్రీ కృష్ణుని సంకల్పమేనని తెలుపుతోంది.

శ్రీ కృష్ణుడు ద్వారక ఏడు రోజులలో సముద్రంలో మునిగే ప్రమాదముందన్న విషయాన్ని గ్రహించి 'దుర్నిమిత్తాలమగాంచి ' యాదవులను ద్వారకను వదిలి ప్రభాస తీర్థానికి పంపి ఉద్ధవునికి జ్ఞాన బోధగావించి బలరామ సమేతంగా తానూ ద్వారకను వదలి వెళ్ళాడు.

కృష్ణుడు ద్వారకను వదలిన అనంతరం యాదవులు మదిరాపాన మత్తులై తమలోతాము మత్సరంతో యుద్ధ సన్నద్ధులయ్యారు. ముని శాపకారణంగా ఉద్భవించిన ముసలాన్ని అరగదీసి చూర్ణం చేసి సముద్రాన కలుపగా ఆ చూర్ణం వొడ్డున చేరి యాదవులు యుద్ధ సన్నద్ధులయిన సమయానికి తుంగలుగా మొలిచింది. ఆ తుంగలు యాదవుల కాయుధాలయ్యాయి. వజ్రాయుధ సమానకాలయిన ఆ తుంగలతో యాదవు లొకరినొకరు హతమార్చుకున్నారు. అది చూసి బలారాముడు యోగ మార్గంలో వెళ్ళి అనంతుని లో కలిశాడు.

శ్రీ కృష్ణుడు సైతం వెళ్ళి ఒక నికుంజపుంజం చాటున విశ్రమించి చరణం వేరొక చరణం మీద నుంచి వినోదిస్తుండగా కదులుతున్న కృష్ణుని చరణాన్ని చూసి హరిణకర్ణంగా భావించి అటువైపు వేటకు వచ్చిన లుబ్ధకుడు (చేపకడుపులో దొరికిన ముసలక మూలమైన లోహఖండాన్ని అమర్చిన) బాణాన్ని సంధించి వదిలాడు. అది తగిలి 'ఆహో'రవముతో కదులుతున్న కృష్ణుని సన్ని ధానానికి వచ్చి చూసి భయంతో తాను చేసిన తప్పుకు బాధ పడుతున్న లుబ్ధకునితో కృష్ణ పరమాత్మ పూర్వ జన్మ కర్మలెంత వానికైనా అనుభవించవలసినదేనని లుబ్ధకుడు నిమిత్త మాత్రుడని తెలియజేసినా తాను చేసిన పనికి భరించలేని లుబ్ధకుడు - పవిత్రాంతః కరణుడై ప్రాయోపవేశం జేసి ప్రాణాలను వదిలి వైకుంఠధామం చేరాడు.

ఆ సమయంలో దారుకుడు వచ్చి యాదవుల విషయం విన్నవించగా కృష్ణుడు అక్రూర విదురులకు ఈ వృత్తాంతం వివరించి చెప్పమని స్త్రీ బాల గురు వృద్ధ జనాన్ని తీసుకుని అర్జునుని హస్తినకు పొమ్మని తెలువమని చెప్పి పంపాడు.

కృష్ణుని మాటలు దారుకుడు వారితో చెప్పేంతలోనే ద్వారకానగరమంతా జలమయమయి ఎవ్వరూ ప్రవేశింపరానిదయింది.

అనంతరం శతకోటి సూర్య దివ్య తేజో విభాసితుడైన శ్రీకృష్ణ పరమాత్మ నారదాది ముని గణంతో నిజధామం చేరుకున్నాడు.

జలధిప్రాంతంలో నారాయణుని విగ్రహం జగన్నాథ స్వరూపంగా నిలిచింది.

శ్రీ హరి కృష్ణునిగా అవతరించడం భూభార నివారణార్థం కౌరవ పాండవుల నడుమ, యాదవుల నడుమ ప్రత్యర్థి భావాలను కల్పించి అంతః కలహాలు రేపి కృత కృత్యుడై తాను వైకుంఠ ధామం చేరడం అనేవి పథకం ప్రకారం సాగినట్లు భాగవతంలోని ప్రతి సంఘటన స్పష్టం చేస్తుంది.'[248]

భూమికి భారమైన దుష్టులను నివారించి ధర్మయుతులైన శిష్టులను రక్షించి శాపాలను వరాలను ద్వాపరంలో పూర్తిగా తీర్చి జననమొందిన ప్రతి జీవాత్మ చివరకు తన నిజస్థానమైన పరమాత్మను చేరుకోడానికే ప్రయత్నిస్తూ జీవించడమే ధర్మమని నిరూపించి శ్రీకృష్ణ పరమాత్మ తన స్థానానికి చేరుకున్నాడు.

శ్రీకృష్ణుని జీవితంలో జరిగిన సంఘటనలు దుష్ట శిక్షణ శిష్ట రక్షణ గావించి ధర్మాన్ని స్థాపించడానికి ఏవిధంగా దోహదం చేశాయో, శ్రీకృష్ణుడు జీవులను శిక్షించడం అనుగ్రహించడం అనేది జరుపడానికి ఆయా పూర్వ కృత కర్మలూ వారు పొందిన శాపాలూ వరాలూ, ఏమిటనే విషయాన్ని ఈ ప్రకరణంలో వివరించడం జరిగింది.

**అయితే దుష్ట శిక్షణ శిష్ట రక్షణ చేయడానికి తానుగా ఉపయోగించిన భగవత్ శక్తులేమిటో ఎవరిమీద ఏ విధంగా ప్రయోగించి వారిని తన పట్ల ఆకర్షించుకునేట్లుగా చేశాడో తరువాతిదయిన 'శ్రీ కృష్ణుడు - భగవత్తత్వం' అనే ప్రకరణంలో వివరించబడుతుంది.**



## పాదసూచికలు

పులిజాల వేంకట సూర్య ప్రకాశరావు - విద్యున్మాల, పు - 23.

. భగవద్గీత (జ్ఞానయోగం) శ్లోకం - 6.

. చివుకుల అప్పయ్యశాస్త్రి - శ్రీ గర్గభాగవతము (పీఠిక) 1954, పు - 14

. 'ప్రకారితాఖిలగుణఃస్మృతః పూర్ణతమోబుధైః' - హనుమాన్ ప్రదాస్ పోద్దార్ - (రాధామాధవచింతన్, పు 426)

. యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా
తత్త్ దేవాగచ్ఛ త్వం మమ తేజోఽంశ సమ్భవమ్ - భగవద్గీత 10 అధ్యాయం, 41వ శ్లోకం.

&7. పోతన - శ్రీ మహాభాగవతము (పరిష్కర్త బులుసు వెంకటరామయ్య, టాగూర్ పబ్లిషింగ్ హౌజ్ 1975) దశమస్కంధం పూర్వభాగం పద్యం - 15, పు - 203.

. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం 23, పు - 204.

. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం 50, పు - 206.

10. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం 52, పు - 207.

11&12. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం 56, పు - 207.

13. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం 106, పు - 213.

14. అర్ధరాత్రంబునందిందు డభ్యుదయము
పెందినను గనుచీకటి జెలగవార్ష
యోగ, బుధవార, రోహిణీయుక్తమైన

భాద్ర కృష్ణాష్టమిన్ వృషభంబునందు' పుట్టాడు.

చివుకుల అప్పయ్య శాస్త్రి, శ్రీ గర్గ భాగవతము (1954) పద్యం - 346, పు - 57.

15. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం, పు - 112, 214.

16. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 127, పు - 216.

17. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం, వచనం 153, పు - 219.

18. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 154, పు - 219.

19. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 158, పు - 219.

20. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 164, పు - 220.

21. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం (పాదం) 163, పు - 321.

22. భాగవతములో కలిగిన సందేహాలకు భాగవతములోనే సమాధానాలు దొరకక పోయినప్పటికీ ఇతర పురాణాలలో లభిస్తాయి. వాటిని సమన్వయం చేసుకొని పఠించినట్లయితే భాగవత అంతరార్థాలను అర్థం చేసుకోవడం సులభం అవుతుంది.

23. పోతన శ్రీ మహాభాగవతము, దశమ స్కందం, పూర్వభాగం, పద్యం 133 పు - 217

24. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 134, పు - 217

25. ప్రభుదత్త బ్రహ్మచారి - హిందీ మూలం, తెలుగు అనువాదం: కుందుర్తి వేంకట నర్సయ్య - శ్రీ భాగవత కథ (శ్రీకృష్ణుని బాలలీలలు) (భాగవత కథ 39వ పుష్పం) నటరాజ పబ్లికేషన్ 1969 పుటలు - 309 -316.

26. జనమంచి శేషాద్రి శర్మ - శ్రీకృష్ణావతారతత్త్వము ప్రథమభాగం, పుటలు - 274, 276

27. శ్రీకృష్ణ జననం (అవతరణం) నిర్వృత్తి తత్త్వానిర్వాన సాధనలేక వాసనారహిత

తత్త్వ విజ్ఞాన సాధనగా తెలుపబడింది - వేదుల సూర్యనారాయణ శర్మ - అంతరార్థ భాగవతము పుటలు 199 -207.

28. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం - 173, పు 221

29. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 342, పు 240

30. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం - 193, పు 223,

31. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం - 218, పు 226

32. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం - 225, పు 227

33. చివుకుల అప్పయ్యశాస్త్రి - శ్రీగర్గ భాగవతము (1954) (పద్యానువాదం) పద్యాలు - 431 - 433, పు - 68

34. శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి (హిందీ) తెలుగు - కందుర్తి వేంకట నర్సయ్య) శ్రీ భాగవత కథ, భాగవత కథా గ్రంథమాల (39వ పుష్పం), పు - 6

35. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం -250, పు 230

36. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం 251, పు 230

37. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కందం, పూర్వభాగం, వచనం 252, పు 231

38. పోతన - శ్రీ మహాభాగవతము (2) దశమ స్కంధం, పద్యం - 252, పు - 231

39. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 262, పు - 231.

40. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 274, పు - 233.

41. చివుకుల అప్పయ్యశాస్త్రి (పద్యనువాదం) - శ్రీ గర్గభాగవతము (భావం) పద్యాలు 476 - 480, పు -73

42. "మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః"
భగవద్గీత రాజవిద్యారాజగుహ్యాయోగం శ్లోకం - 4

43. స్వామి సుందరచైతన్యానంద - శ్రీమద్భాగవతము (2) దశమస్కంధం, పు -35

44. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం వచము 288, పు - 234.

45. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం, పద్యం 342, పు - 240.

46. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం 388 పు 245

47. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కందము, పూర్వభాగం, పద్యం - 396, పు - 246

48. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం వచనం - 397, పు - 246

49. పోతవ - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం - 410, పు - 247

50. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం - 411, పు - 247

51. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం - 430, పు - 249

52. చివుకుల అప్పయ్య - శ్రీగర్గభాగవతము (పద్యానువాదం) పద్యాలు - 95-99, పులు 106, 107.

53. చివుకుల అప్పయ్యశాస్త్రి - శ్రీగర్గభాగవతము (ఆంధ్రపద్యానువాదం) పద్యాలు - 125 -137, పుటలు - 109, 110.

54. పోతన - శ్రీ మహా భాగవతము దశమస్కంధంపూర్వం, ప-480 పు 255

55. చివుకుల అప్పయ్యశాస్త్రి - శ్రీగర్గభాగవతము (ఆంధ్రపద్యానువాదం) పద్యాలు - 145-149, పుటలు - 111, 112.

56. రామాచార్యులు (మూలం - శ్రీరామచంద్రడోంగరే మహరాజ్ బడోదరా) - శ్రీ మద్భాగవత రహస్యం దశమస్కంధం. పూర్వభాగం పుటలు - 174, 175 ఆధారంగా

57. అంకరాజు సరోజిని, గర్గభాగవతము (తెలుగువచనం) పు - 186

58. భూమిరాప: పోనలో వాయుః ఖంమనోబుద్ధిరేవచ
అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతి రష్టధా! భగవద్గీత, జ్ఞాన విజ్ఞాన యోగం, శ్లోకం 4.

59. పోతన - శ్రీ మహాభాగవతము (బులుసు వెంకటరామణయ్య) పరిష్కారప్రతి 1975) దశమస్కంధం పూర్వార్థం, పద్యం 507, పు - 259

60. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం పూర్వభాగం, పద్యం - 521, పు 260

61. అంకరాజు సరోజిని-శ్రీ గర్గభాగవతము (వచనం), పు - 155

62. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం, పద్యం - 569, పు - 267

63. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం -884, పు - 306

64. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం -885, పు - 306

65. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, వచనం -880, పు - 307

66. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం -888,

పు - 307

67. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వభాగం, వచనము 890 పు - 307.

68. పోతన - శ్రీ మహాభాగవతము దశమ స్కంధం, పూర్వభాగం పద్యం - 914, పు - 311

69. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పద్యం - 915, పు - 311.

70. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం పద్యం - 930, పు 312.

71. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం పూర్వభాగం పద్యం - 933, పు 313.

72. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం పూర్వభాగం పద్యం - 902 పు 309

73. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం పూర్వభాగం పద్యం - 938 పు 313.

74 పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం 945 - పు 314

75 పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం 946 - పు 314

76. వెమలికొండ రామచార్యులు (మూలం రామచంద్రడోంగరే మహారాజ్ బడోదరా)- శ్రీ మద్భాగవత రహస్యం, దశమస్కంధం పూర్వభాగం పు - 187.

77. వెమలికొండ రామాచార్యులు (మూలం - శ్రీరామచంద్రడొంగరే మహారాజ బడోదర) భాగవత రహస్యము పు - 202.

78. శ్రీ గర్గభాగవతము పులిందివీ గోపికలు(పుట) రమాసఖ్య గోపికలు (పుట) జలంధర గోపికలు (పుట) సముద్రకన్యాకాది గోపికలు (పుట) గురించిన ఉపఖ్యానాలను వివరించింది - విపుకుల అప్పయ్యశాస్త్రి గర్గభాగవతము.

79&80. నెమలికొండ రామాచార్యులు (మూలం రామచంద్రడోంగరే మహారాజ్ బడొదరా) - శ్రీ మద్భాగవత రహస్యం, దశమస్కంధం పూర్వభాగం, పు - 206.

81. పోతన శ్రీమహాభాగవతము - దశమస్కంధం పూర్వభాగం పద్యం - 848, పు 302

82. నెమలికొండ రామాచార్యులు (మూలం - శ్రీరామచంద్రడొంగరే మహారాజ బడొదర) భాగవత రహస్యము, పు - 207.

83. రామాచార్యులు (మూలం - శ్రీ రామచంద్ర డోంగరే మహారాజ బడొదరా) భాగవతరహస్యము, పు - 185.

84. "గోవులను క్రొవులకు విడువక.... మంద వెలువడి".

పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం వచనం 967, పు - 313.

85. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం -978, పు 319

86. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం పూర్వభాగం, పద్యం - 979, పు 319.

87. ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి - "భక్త పోతన మహాభాగవత రచన (1997), పు - 126

88. భగవద్గీత - మోక్షసన్యాస యోగం, శ్లోకం - 66.

89. పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, ప - 988, పు - 320.

90. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వభాగం, ప - 997, పు - 321.

91. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం, వచనం - 1002, పు - 320.

92. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం, పూర్వభాగం, ప - 1003, పు - 322.

93&94. పోతన - శ్రీ మద్భాగవతము, దశమ స్కంధం, పూర్వభాగం, ప - 1006, పు -

322.

95. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, ప - 1011, పు - 323.

96. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, ప - 1021, పు - 324.

97. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, ప - 1023, పు - 324.

98. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, ప - 1080, పు 331.

99. రాసలీల అనేది కోలాటం వంటిది. ఇది హల్లీసకమని హరివంశంలో ఉంది. ఇందులో స్త్రీలు పురుషులు కలిసి యొకరి భుజాల మీద ఒకరు చేతులు వేసుకుని గుండ్రంగా తిరుగుతూ పాటలు పాడుతూ నృత్యం సలుపుతారు. గుంపుగా కూడిన కారణాన పరస్పర దేహ స్పర్శ కాక మానదు. వినోద క్రీడ కనుక ఒకరినొకరు ఆలింగన చుంబనాదుల నొనర్చుకోవడం ఉంటుంది. - వావిలికొలను సుబ్బరాయు - శ్రీకృష్ణావతార తత్త్వము చతుర్థ చుళకము. పుట - 169.

100. రాసక్రీడ మంగళా చరణంలో శ్రీధర స్వామి చేత బ్రహ్మాది దేవతలకు పరాభవం కలిగినందున కృష్ణునితో యుద్ధానికి కామదేవుడు వచ్చాడని భగవంతుడతనిని ఓడించాడనీ ఈ రాస క్రీడ కామదేవుని పరాభవించే నిమిత్తం జరిగిందని గోపికలతో విహరిస్తున్నా కృష్ణుని మనసు నిర్వికారంగా ఉందని తెలుపబడింది. కామ దేవుడు ధనుర్బాణాలను పారవేసి శ్రీకృష్ణుని శరణు పొందాడు. కృష్ణుడు యోగీశ్వరుడుగా కొలువబడ్డాడు. నెమలి కంటి రామాచార్యులు (మూలం - రామచంద్ర డొంగరే మహరాజ్ బడౌదర) శ్రీమద్భాగవత రహస్యం (దశమస్కంధం) పుట - 250.

101. నాసూయ న్ఖలు కృష్ణాయ మోహితాస్తస్య మాయయా
   మన్య మానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః
   వ్యాసుడు - శ్రీమద్భాగవతము (గౌడీయమఠ ప్రచురణ 1982)
   దశమస్కంధము (1) అధ్యాయం 33. శ్లో॥ 37, పుట 567

102. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యం - 1109, పు - 337.

103. శాప వృత్తాంతము, పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, వచనం - 1116, పు - 338.

104. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గ భాగవతము (1954) (ఆంధ్ర పద్యాను వాదం) ప - 617-652, పుటలు 165-169.

105. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గ భాగవతము (ఆంధ్ర పద్యాను వాదం 1954) పద్యాలు (భావం) 396-399, పు - 244.

106. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గ భాగవతము (ఆంధ్ర పద్యాను వాదం 1954) పద్యాలు (భావం) 37-41, పుటలు 250, 251.

107. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గ భాగవతము (ఆంధ్ర పద్యాను వాదం 1954) పద్యాలు (భావం) 383-388. పుటలు 242, 243.108.

108. స్వామి సుందర చైతన్యానంద, శ్రీమద్భాగవతం (వచనం) రెండవ భాగం దశమస్కంధం. పుట - 36.

109. పోతన-శ్రీమహాభాగవతము (రెండవభాగము) దశమస్కంధము, ఉత్తర భాగము, ప - 1234, పు - 584.

110. పోతన - శ్రీమహాభాగవతము (రెండవభాగము) దశమస్కంధము, పూర్వ భాగము, పద్యం - 607, పు. 271.

111. విందు = ప్రియము, సంతోషము. సూర్యరాయాంధ్రనిఘంటువు 7వ సంపుటం, (సాహిత్య అకాడమీ ప్రచురణ) పుట - 184.

112. విద్యార్థి కల్పతరువు (నానార్థాలు) ముసునూరి వేంకట శాస్త్రి. పుట- 194.

113. పోతన - శ్రీమహాభాగవతము, రెండవభాగము, దశమస్కంధము, పూర్వ భాగము, పద్యం - 1247, పుట - 355.

114. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీగర్గభాగవతము (ఆంధ్ర పద్యానువాదం 1954) పద్యాలు - 315-320, పుట - 284.

115. పోతన-శ్రీమహాభాగవతము (రెండవభాగము) దశమస్కంధము, పూర్వ భాగము, పద్య (పాదాలు) 1258, పు - 357.

116. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గభాగవతము, (మధురఖండము), (ఆంధ్రాపద్యానువాదం) పద్య (పాదం) 319, పు - 285.

117. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గభాగవతము, ప - 312-316, పు - 285

118. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గభాగవతము, (ఆంధ్రాపద్యానువాదం-1954) పద్యాలు (భావం) 328-336, పుట - 285.

119. పోతన-శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1279, పుట 359

120. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, ప - 1492, పు - 384

121. పోతన శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, పద్యపాదం 1495, పు - 384.

122. పోతన శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, ప - 1498, పు - 385.

123. వేద వ్యాసుడు - శ్రీమద్భాగవతం (గౌడీయ మఠ ప్రచురణం 1982) దశమస్కంధం (11), పూర్వభాగం, అధ్యాయం 48, శ్లోకం - 11.

124. పోతన శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వభాగం, ప - 1497, పు - 385.

125. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీగర్గభాగవతము (ఆంధ్ర పద్యాను వాదం 1954) పద్యాలు (భావం) - 338 - 344. పుటలు 286,287.

126. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1247, పు - 355

127. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1250, పు 356

128. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1250, పు 356

129. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీగర్గ భాగవతము (ఆంధ్ర పద్యానువాదం) వచనం - 345, పు 287

130. స్వామి సుందర చైతన్యానంద - శ్రీ కృష్ణ కథామృతము, పు - 291

131. స్వామి సుందర చైతన్యానంద - శ్రీ కృష్ణ కథామృతము, పు - 292

132. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గ భాగవతము (ఆంధ్ర పద్యానువాదము 1954), పద్యాలు 346-353 ఆధారంగా, పు 288.

133. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1371, పు 370

134. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1377, పు 371.

135. వ్యాసుడు: శ్రీమద్భాగవతము, దశమస్కంధము (1) (గౌడీయమఠ ప్రచురణ) అధ్యాయం 29, శ్లోకం - 15

136. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1391, పు 372

137. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1412, పు 375

138. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1410, పు 374

139. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1411, పు 375

140 & 141. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గభాగవతము (ఆంధ్ర పద్యానువాదము), పద్యాలు -357- 360.

142. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1432, పు 377

143. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1436, పు 377

144. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1448, పు 678

145. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1470, పు 381

146. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1473, పు 382

147. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1576.

148. పోతన - శ్రీమహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, పద్యం - 1590, పు 398

149. కృష్ణదాస్‌జీ - శ్రీకృష్ణ లీలా మృతము, - పు 209 - (ఆధారంగా)

150. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధం పూర్వభాగం, వచనం - 1665, పు - 407.

151. కుందుర్తి వెంకట నరసయ్య - ప్రేమభక్తి (1968), పుటలు, 60,61

152. ధారారామనాథ శాస్త్రి - ఆంధ్రవాఙ్మయము - కృష్ణకథ (2) పు - 147

153. భగవద్గీత - జ్ఞాన విజ్ఞాన యోగం, శ్లోకం 4

154. ధారామనాథ శాస్త్రి - ఆంధ్ర వాఙ్మయము - కృష్ణ కథ (2) పు - 147

155. ధారారామనాథ శాస్త్రి, ఆంధ్రవాఙ్మయము - కృష్ణకథ, పుటలు 149, 150.

156. చివుకుల అప్పయ్య శాస్త్రి - శ్రీ గర్గ భాగవతము ఆంధ్ర పద్యాను వాదం) గోలోక ఖండం, పద్యాలు 89, 90, పు - 27

157. ధారారామనాథ శాస్త్రి - ఆంధ్ర వాఙ్మయము - కృష్ణ కథ (2) పుటలు - 149, 150

158. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1687, పు - 409.

159. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1693, పు - 410.

160. త్రిదండి శ్రీభక్తి సుధీర దామోదర మహరాజ్, - 'శ్రీరాధాగోవింద చంద్రిక'

(రామచందగౌడీయ మీద ప్రచురణ), పు - 1

161. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1694, పు - 411.

162. ధారామనాథ శాస్త్రి - ఆంధ్ర వాఙ్మయము - కృష్ణ కథ (2) పు - 155.

163. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1703, పు - 412.

164. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1704, పు - 412.

165. ధారా రామనాథ శాస్త్రి - ఆంధ్ర వాఙ్మయము కృష్ణ కథ (2) పు - 157.

166. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వ భాగం, పద్యం - 1705, పు - 412

167. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1706, పు - 412.

168. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1710, పుట - 413.

169. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1715, పు - 414.

170. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1726, పు - 415

171. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1730, పు - 416.

172. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1731.415.

173. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1739, పు - 417.

174. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1749, పు - 419

175. 'బావా రమ్మని చిఱునగవు నగుమూవానిం బట్టి బంధించి గడ్డంబును, మీసంబును దలయును రేవులు వాఱ గొఱిగి విరూపింజేసి' - పోతన - శ్రీ మహాభాగవతము, దశమస్కంధం, పూర్వ భాగం, వచనం - 1770, పు - 423

176. కం: కొందఱ రిపులకి కీడును - .
గొందఱుహితులనుచు మేలు గూర్చుపునిజమీ
వందఱి యందును సముడవు
పొందగనేలయ్య విషమ బుద్ధి ననంతా!
పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1772, పు - 123.

177. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 1783, పు - 425

178. ధారా రామనాథశాస్త్రి - ఆంధ్ర వాఙ్మయము కృష్ణ కథ (2), పు - 158

179. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, వచనం - 63, పు - 434

180. జనమంచి శేషాద్రి శాస్త్రి - శ్రీ కృష్ణావతార తత్త్వము (8 ప్రకరణం) పు - 400.

181. కుందుర్తి వేంకట నరసయ్య - (మూలం శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి) "శ్రీభాగవత కథ" (49) శ్రీకృష్ణ కళ్యాణము (1), పు - 423.

182. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 68, పు - 434.

183. కుందుర్తి వేంకట నరసయ్య - (మూలం శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి) "శ్రీభాగవత కథ" (49) శ్రీకృష్ణ కళ్యాణము (2. భాగం), పు - 227

184. కుందుర్తి వేంకట నరసయ్య (మూలం ప్రభుదత్త బ్రహ్మచారి. శ్రీ భాగవత కథ. (49వ భాగం) పు - 436.

185. "రామకృష్ణులు తన కూతురు వివాహంబునకు వచ్చుట విని........తూర్య ఘోషంబులతో నెదుర్కొని విధ్యుక్త ప్రకారంబునం బూజించి మధుపర్కంబులిచ్చి వివిధ భరణంబులు మొదలైన కామక లొసంగి... భీష్మకుడు ...."

పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, వచనం - 1738, పు - 417.

186. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 58,, పు - 433.

187. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం 77,, పు - 435.

188. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం 78, పు - 435.

189. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం 119, పు - 441.

190. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం 130, పు - 442.

191. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం 140, పు - 443.

192. సప్త వ్యసనాలు - స్త్రీ, జూదము, మదిరాపానము, వేట, వాక్పారుష్యమూ, తగని వెచ్చము, కఠిన దండము - విద్యార్థి కల్పతరువు (కూర్పు శ్రీ మునునూరి వెంకట శాస్త్రి, పు - 94.

193. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం 14, పు - 202.

194. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం (పాదాలు) 151, పు - 445.

195. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం - 209, పు - 452.

196. డి. వెంకట రామరెడ్డి (?) శ్రీ కృష్ణ చరిత్ర, లీలా ఖండము, పు - 187

197. డి. వెంకటరామరెడ్డి (?) శ్రీకృష్ణ చరిత్ర, లీలా ఖండము, పు - 187

198. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం 311, పు - 466.

199. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తర భాగం, పద్యం 312, పు - 467.

200. పోతన - శ్రీ మహాభాగవతము, దశమ స్కంధము, ఉత్తరభాగం, పద్యం - 322, పు - 467.

201. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం - 323, పు - 467

202. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, ప - 324, పు - 467

203. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -325, పు - 467

204. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరార్థం, ప - 443, పు - 484.

205. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -444, పు - 484

206. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -509, పు - 493

207. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -521, పు - 494

208. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -526, పు - 495.

209. దారా రామనాథ శాస్త్రి - 'ఆంధ్రవాఙ్మయము - కృష్ణ కథ: (2), పు - 339

210. స్వామి సుందర చైతన్యానంద - 'శ్రీమద్భాగవతము' (వచనము) (ద్వితీయసంపుటం), పు - 282.

211. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము పూర్వ భాగం, పద్యం -1533, పు - 390

212. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము పూర్వభాగం, పద్యం -1531, పు - 390.

ుహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -1532, పు

ిర్ఘాతం: శిశుపాలం: ... (భారతం సభాపర్వం అ. 114 - మహాభారత - (పుటపర్తి నారాయణాచార్యులు, పు - 115

మహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరార్థము, వచనం - 726, పు - 519.

216. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -742, పు - 521.

217. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -745, పు - 522

218. భారతంలో సహదేవుని సూచన మేరకు కాక భీష్ముని సూచన మేరకు కృష్ణుని అగ్రపూజ జరిగినట్లు తెలుపబడింది. నన్నయ- శ్రీ మహాభారతము - సభాపర్వము ద్వితీయాశ్వాసము, వచనం - 7.

219. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -720, పు - 527

220. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -799, పు - 528.

221. నన్నయభట్టు - ఆంధ్రమహా భారతము, సభాపర్వము దితీయాశ్వాసము (52-66) పద్యాల భావం).

222. రాజలోకంబులో మనుష్య సామాన్యుండయి యఖిల మహాభారావతరణార్థము నారాయణుండు యదు వంశమున నదయించుటయు నయ్యక్షత్రియ కులంబుల సురదైత్య.... యంశావతారంబులుందలచి భవిష్యద్భారత రణంబునకు సంప్రాప్త హృదయుండయి "......నన్నయ - శ్రీ ఆంధ్రమహాభారతము సభాపర్వము.

223. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, వచనం -794, పు

- 528.

224. "దురోయధనమ్మతే పాపం కలిం కురుకులామయమ్
మోహసీహ శ్రియం స్పీతాంద్రుష్ట్వా పాణ్డు సుతస్యతామ్"
వ్యాసుడు - శ్రీమద్భాగవతము, దశమ స్కంధము (3)
అధ్యాయము-74, శ్లోకం - 53, పు - 244.

225. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -835, పు - 533.

226. ఆ విధమంతయు గమగొని
పావని నవ్వుటయు నచటి పార్థివులుమగాం
తావలియును యమతనయుడు
వారిరి జే నన్నదమ్ము వారింపంగన్" -

"దామోదరాను మోదితులయి మహారవంబుగా పరిహాసము జేసిన" - పోతన, శ్రీ మహాభాగవతము దశమస్కంధ ఉత్తరార్థము పద్యం, వచనం - 826, 827.

227. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -827, పు - 533.

228. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -831, పు - 533.

229. స్వామి సుందరచైతన్యానంద - శ్రీమద్భాగవతము (2), (వచనం), దశమస్కంధము, పు 306.

230. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -915 పు - 543.

231. స్వామీ కృష్ణదాస్ జీ - 'మహాభాగవతము ' (వచనము) (భాగవతసేవా సమాజ ప్రచురణము - 1978), పు - 560.

232. స్వామీ సుందర చైతన్యానంద - శ్రీమద్భాగవతం (వచనం) (భావసేకరణం) పు - 307.

233. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -1071, పు

- 561

234. స్మర్గుడు, ఉద్గీరుడు, పరిష్వంగుడు, పతంగుడు, క్షుద్రభృత్తుఘృణి అనే ఈ ఆరుగురు ప్రథమ యుగంలో మరీచి వర్ణ అనే వారికి పుత్రులై బ్రహ్మను పరిహసించి, శాపకారణంగా హిరణ్యకశిపునికి (రాక్షసులుగా) పుత్రులుగా జన్మించారని యోగమాయ వీరిని దేవకీ గర్భాన ఉంచినందున కంసుని చేతిలో హతమయ్యారని, పాతాళానికి చేరిన వీరిని హరి ఊర్ధ్వలోకాలకు పంపాడని భాగవంత తెలుపుతోంది. పోతన - శ్రీమహాభాగవతము, దశమ స్కంధము ఉత్తరభాగం, పద్యం -1154, పు - 572.

235. దండివవేకులతోవా
ఖండలు డెదురయివగెలిచె ఖాండవనముం
బండార్చికి వర్పించిన
గాండీవము విచ్చెజక్రి గలుగుట..." పోతన - శ్రీమహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్యం -361, పు - 63

236. "వైరుల్ గట్టిన పుట్టముల్ విడువగావారింప నావల్లభుల్
రారీశమపేక్ష సేయదవేరావే నివారింపవే
లేరే త్రాతలు కృష్ణయంచు సభలో లోనాంగియైకుయ్యిడం
గారుణ్యంబున భూరి వస్త్ర కలితంగా జేయడేద్రౌపదిన్"
పోతన - శ్రీమహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్యం -363, పు-64

237. పోతన - శ్రీమహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్యం -366, పు - 64

238. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాధ స్కంధము పద్యం - 7, పు - 603.

239. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము పద్యం - 20, పు - 604.

240. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము, పద్యం -22, పు - 605

241. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము, వచనం -23, పు - 605.

242. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము, పద్యం -24, పు - 605

243. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము, పద్యం -25, పు - 605

244. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము, వచనం -26, పు - 605

245. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము, వచనం -8, పు - 603.

246. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము, పద్యం -85, పు - 615

247. పోతన - శ్రీమహాభాగవతము, ఏకాదశ స్కంధము, వచనం-86, పు - 616.

248. "బలహీనాంగులకున్ బలాధికులకుం బ్రత్యర్థి భావోద్యమం
బులు గల్పించి వినాశమున్ నెఱపియీ భూభారముం బాపి ని
శ్చల బుద్ధిం గృత కార్యుడై చనిచెనా సర్వేశ్వరుండచ్యుతుం
డల ముండేమని చెప్పుదున్ భగవదాయత్తంబుప్ప ధ్వీశ్వరా
పోతన - శ్రీమహాభాగవతము, ప్రథమ స్కంధము, పద్యం -379, పు - 66.



# శ్రీకృష్ణుడు - భగవత్తత్త్వం

సర్వశక్తి వంతమైన భగవానుని అవతారమే కృష్ణావతారం. తన త్రిజగన్మోహనమైన రూపాన్ని ప్రతి జీవి దర్శించి తరించడానికి వీలుగా ఆ జీవుల ఉద్ధరణ కోసం శ్రీకృష్ణునిగా ప్రాదుర్భవించాడు భగవానుడు.

అఖండమైన భగవత్తత్త్వమే శ్రీకృష్ణుడు. పూర్ణ పురుషోత్తముడు, సంపూర్ణ శక్తిమంతుడు అఖండ విజ్ఞానవంతుడు అయిన శ్రీ కృష్ణుడు సకల లీలల్నీ చేస్తూ కూడా తన విజ్ఞానాన్ని అఖండంగానే ఉంచుకొంటాడు.

శ్రీ కృష్ణుని ఈ తత్త్వాన్ని రెండు రకాలుగా పరిశీలించ వలసి ఉంటుంది. అలా పరిశీలించినప్పుడే శ్రీకృష్ణుని సంపూర్ణ ఐశ్వర్య మాధుర్య తత్త్వాన్ని దర్శించ గలుగుతాము. అవి -

1. **చతుర్వ్యూహాత్మకం**

2. **షడ్గుణ యుక్తం**

షడ్గుణ యుక్తుడయిన కృష్ణభగవానుడు చతుర్వ్యూహాత్మక స్థితిలో ఆవిర్భూతుడవుతాడు.

'భగ' అంటే షడ్గుణాలనీ 'వత్' అంటే యుక్తుడనీ అర్థం. షడ్గుణ యుక్తుడైనవాడు భగవంతుడు.[2]

"ఐశ్వర్యస్యసమగ్రస్య వీర్య స్యయశస శ్రియః
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగఇతీరణా"[3]

పై ఆరు గుణాలు శివుడు బ్రహ్మ మొదలయిన వారిలో ఉన్నా సంపూర్ణంగా లేవు.

'ఈశ్వరః పరమః కృష్ణః సచ్చిదానంద విగ్రహః
అనాదిరాదిర్గోవిందః సర్వకారణకారణమ్'[4]

అనే బ్రహ్మ సంహిత శ్లోకం గోవిందుడయిన శ్రీకృష్ణుడే సర్వేశ్వరుడని అతని స్వరూపం సచ్చిదానంద ఘనమనీ తెలుపుతోంది. కనుకనే శ్రీకృష్ణ భగవానునిలో షడ్గుణాలు ఉన్నాయని తెలుస్తోంది.

సృష్టి స్థితిలయ కారకుడైన భగవానుడు సృష్టి స్థితిలయాలను చేసే సందర్భంలో చతుర్వ్యూహ స్వరూపుడై సంపూర్ణ శక్తులతో (షడ్గుణాలతో) ప్రపంచంలో లీలా వినోదానికై ప్రకటమవుతాడు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహాలనే చతుర్వ్యూహాలని అంటారు.[5]

పురుషోత్తముడైన శ్రీకృష్ణభగవానుడి వ్యాపక శక్తి వాసుదేవ వ్యూహం. మోక్ష ప్రదానం చేయడం వాసుదేవ వ్యూహకార్యం. జీవులలోని అవిద్యను నాశనం చేసి ఆయా జీవులను తనవైపుకు ఆకర్షించుకునేది సంకర్షణ వ్యూహం. అత్యంత ప్రియాన్ని కలిగించే శక్తి ప్రద్యుమ్న వ్యూహానిది. వంశానికి సంబంధించి ప్రకటించే

శ్రేయస్సు ప్రియత్వాన్ని ఉత్పన్నం చేయడం ప్రద్యుమ్నుని కార్యం. ధర్మబోధ ధర్మపాలన గావిస్తూ ఎదురులేని విధంగా శాశ్వతతత్వాన్ని నిలిపేది అనిరుద్ధ వ్యూహం.

భగవానునికై కార్యనిర్వహణగావించే ఈ చతుర్వ్యూహాలు భగవానుని సేవకులుగా లేదా శక్తులుగా భావించవచ్చు. ఈ చతుర్వ్యూహాలను అర్థం చేసుకున్నట్లయితే మూల రూపుడయిన శ్రీ కృష్ణ భగవానుని అర్థం చేసుకోవడానికి మార్గం సుగమమవుతుంది.

' ఈచతుర్వ్యూహాలను తనలో నిలుపుకుని రసస్వరూపమైన లీలల్ని చేసే ఆనంద ప్రేమ స్వరూపం' పురుషోత్తముడైన కృష్ణభగవానుడు. దేవకీ వసుదేవుల దగ్గర చతుర్భుజాలతో భగవానుడు ప్రకటమవడంలో గల అంతరార్థమిదేనని

"సంకర్షణో వాసుదేవాత్తస్మాత్ప్రద్యుమ్న సంభవః
ప్రద్యుమ్నానిరుద్ధో భూ, త్సర్వ ఏవచతుర్భుజా"

అనే బ్రహ్మ సంహిత శ్లోకం వల్ల తెలుస్తోంది.

సంక్షిప్తంగా చతుర్వ్యూహకార్యాలను (శ్రీమద్వల్లభాచార్యుల' భగవత్పీఠిక' ఆధారంగా) పరిశీలించినట్లయితే-

పూతనాది దైత్యుల వధలు, యమళార్జున వృక్షాల భంజనం, కంసాదు లయిన రాక్షసాంశుల రాజుల సంహారం సంకర్షణుని కార్యాలు. వీరత్వపూర్వకంగా చేసే కార్యాలు సంకర్షణ వ్యూహానికి చెందినవి.

మన్మథ స్వభావం మన్మథాంశం ఉన్న ప్రద్యుమ్న వ్యూహం ద్వారా రుక్మిణ్యాది వివాహాలు జరిగాయి. కుబ్జా ఉద్ధరణం సైతం ప్రద్యుమ్న వ్యూహ కార్యమే.

ఇక ధర్మ బోధ ధర్మపాలన అనిరుద్ధ కార్యం కనుక మధురలో తల్లి దండ్రులను ఉగ్రసేనుని చెరవిడిపించడం, ఉగ్రసేనుని రాజును చేయడం, అనంతరం ద్వారకలో (మధుర లోనూ) ధర్మాన్ని నెలకొల్పడం వంటి కార్యాలతో బాటు భగవద్గీతాబోధ వంటి శాశ్వత ధర్మబోధను గావించడం కూడా అనిరుద్ధ వ్యూహకార్యాలే. ఇక శ్రీ కృష్ణభగవానుని వ్యాపక శక్తి అయిన వాసుదేవ వ్యూహకార్యం మోక్షప్రదానం గావించడం. విశ్వరూప సందర్శనం సైతం వాసుదేవ వ్యూహ ప్రభావమే. భక్తులను అనుగ్రహించి మోక్షాన్నిచ్చేది వాసుదేవుడే.

ఒకే సమయంలో ఒకే సందర్భంలో వెంటవెంటనే చతుర్వ్యూహ కార్యాలు జరిగిన సందర్భాలూ ఉన్నాయి. సంహారం గావించడం సంకర్షణుడయితే సంహారానంతరం ఆ జీవికి ముక్తిని ప్రసాదించేది వాసుదేవుని కార్యంగా జరుగుతోంది.

యమళార్జున భంజనం సంకర్షణుడు, అనంతరం నలకూబర మణిగ్రీవులకు కృష్ణుని ద్వారా చేయబడిన బోధ అనిరుద్ధుడు, చివర ఇరువురిని అనుగ్రహించినది వాసుదేవుడు జరిపినట్లుగా గ్రహించాలి.[7]

శ్రీదామ మాలాకారులను కృప చూపినది అనిరుద్ధ వ్యూహం. భక్తులను అనుగ్రహించడం భగవద్ధర్మం కనుక అది అనిరుద్ధుని కార్యం అయింది. ముచికుందుని అనుగ్రహించినది వాసుదేవుడు.

ఇదే విధంగా కృష్ణుని వేణుగానం విని తక్షణమే పరుగున వచ్చిన గోపికలను

***యేలా వచ్చితిరీవిశాపమయమందిచ్చోట వర్తింతురే***
***చాలు జాలు లతాంగులారా! చనుడీ సంప్రీతి***
***......................................తో మందకున్ "***
***" ..............పనాతన ధర్మములాడువారికిం***
***బెనిమిటులన్ భజించుటలు పెద్దలు చెప్పుచుమందురెల్లడన్"***

అనిలోక ధర్మాన్ని వారికి బోధించినది అనిరుద్ధుడు. నిజానికి లోకవేదాతీత పురుషోత్తముని జేరడానికి వచ్చిన గోపికలకు ఇది ఒక పరీక్ష. లోక ధర్మాన్ని పాటిస్తారా - సర్వధర్మాలు పరిత్యజించి నాకు దాసోహమంటారా' అని ఆ భగవానుడు నర్మగర్భంగా గోపికలకు వేసిన ప్రశ్న ఇది. ఇది అర్థం చేసుకున్నారు కనుకనే గోపికలు అనిరుద్ధ వ్యూహాన్ని తట్టుకుని సర్వధర్మాలూ పరిత్యజించి నిలిచారు. లోకధర్మాల కన్నా అన్నిటికీ అతీతుడయిన పురుషోత్తమునే ఆశించిన గోపికల ముందు అనిరుద్ధుడు వెనుకంజ వేశాడు, యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుడాత్మారాముడై వారలతో రమించాడు.

క్షణం క్షణం మారే భగవానుని ఈ చతుర్వ్యూహ తత్వాన్ని అర్థం చేసుకోవడంలో సందిగ్ధం ఏర్పడే అవకాశం ఉన్నా ఈ కింది విధంగా సమన్వయించుకోవచ్చు. తల్లిదండ్రులు లేదా గురువులు, పిల్లలను లేదా శిష్యులను అనుగ్రహించే సందర్భాలలో అవసరాన్ని బట్టి కోపించడం, దండించడం, అనునయించడం, ప్రేమించడం, ధర్మబోధగావించడం వంటి వాటితో వారిని తమ ఆధీనంలో ఉంచుకోవడం సహజంగానే చేస్తూ ఉంటారు. ఎన్ని రకాల భావాలు వ్యక్తీకరించినా వారి మనసులో పిల్లల పట్ల శిష్యులపట్ల ఉండేది అవ్యక్తమైన ప్రేమమాత్రమే. ఇదే విధంగా శ్రీ కృష్ణ పరమాత్మ తాను జీవులను అనుగ్రహించ దలచిన సందర్భాలలో ఆయా జీవుల మనస్తత్త్వాలను అనుసరించి వాసుదేవ వ్యూహం ద్వారా అనుగ్రహాన్ని తన వ్యాపక శక్తిని (విశ్వరూప సందర్శనాదులు) సంకర్షణ వ్యూహం ద్వారా దండనను దమనాన్ని, ప్రద్యుమ్న వ్యూహం ద్వారా కామాచార ప్రవృత్తిని, అనిరుద్ధ వ్యూహం ద్వారా ధర్మబోధను బహిర్గతం చేస్తాడని చెప్పవచ్చు.

శ్రీకృష్ణుని రూపం ద్వారా ఎన్ని భావాలు వ్యక్తమయినా అంతర్గతంగా ఆనంద మాధుర్యాలను పంచిపెట్టే శుద్ధ ప్రేమ తత్త్వమే కృష్ణునిది.

చతుర్వ్యూహ సహితంగా ప్రకటమయే శ్రీకృష్ణ భగవానుడు దుష్ట శిక్షణ శిష్టరక్షణ ధర్మ సంస్థాపనకుగాను వినియోగించే ఆయుధాలే షడ్గుణాలు. ఐశ్వర్యం, వీర్యం, యశస్సు, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం అనే షడ్గుణాలలో వీర్యం (పరాక్రమం) యశస్సు దుష్ట శిక్షణకు, ఐశ్వర్యం, శ్రీ అనేవి శిష్టరక్షణకు జ్ఞాన వైరాగ్యాలు ధర్మ స్థాపనకు ఉపయోగిస్తాయి.

ఇంతకు పూర్వం చెప్పినట్లుగా జీవిని పరమాత్మవైపుకు ఆకర్షించడమే భగవానుడు స్థాపించే ధర్మం అనుకున్నప్పుడు లౌకిక వైరాగ్యాన్ని కృష్ణాసక్తినీ జీవిలో కలిగించే ధర్మాన్ని స్థాపించడానికి జ్ఞాన వైరాగ్యాలు సరియయిన సాధనాలు.

## షడ్గుణాలు

భగవానుని షడ్గుణాలను గురించిన అర్థాలు తెలుసుకోవడం ముందుగా సమంజసం.

ఐశ్వర్యం అంటే వైభవం. కృష్ణుని వైభవాన్ని ఈశత్వాన్ని వెల్లడించే ఉత్సవాలు సంబరాలు జరుపుకోవడం ఐశ్వర్యమని గ్రహించాలి.[10] 'వీర్యమ'ంటే వీరము, పరాక్రమము, తేజము'[11] పరాక్రమాన్ని ఉపయోగించి చేసిన రాక్షస సంహారాలు మొదలయినవి 'వీర్య' గుణాన్ని ప్రదర్శించేవి. యశస్సు అంటే 'కీర్తి'[12] గొప్పదనాన్ని తెలియజేస్తూ ఆనందాన్ని కలిగించే గుణాలు నాలుగు వైపులా వ్యాపించినట్లయితే అది 'యశస్సు అవుతుంది.[13]

ఆపదలను దూరం చేసే ఆనందమయ లీలలు 'శ్రీ' అనబడుతాయి'[14]

'తెలుసుకోవడం, అర్థం చేసుకోవడం, పరిచయం పొందడం, ప్రవీణు డవడం, నేర్చుకోవడం, చేతన, మోక్ష విషయక మగుబుద్ధి' అనే అర్థాలు జ్ఞానానికి ఇవ్వడం జరిగింది.[15] పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవడమే జ్ఞానం.

అయితే పరమాత్మను తెలుసుకున్న తరువాత జీవికి కలిగేది లౌకిక విరక్తి. ప్రాపంచికంగా విరక్తి పరమాత్మపట్ల పరమాసక్తి - వైరాగ్యం. పరమాత్మ పట్ల ఆసక్తి అధికమయినపుడు జనించిన విరక్తే వైరాగ్యం. అది భగవంతునికి ఏమాత్రం దూరంగా ఉండలేని స్థితి'[16]

భగవంతుడు షడ్గుణ వంతుడుని చెప్పుకున్నా ఈ షడ్గుణాలను గుణ రహితుడైన భగవంతుడెందుకు కలిగియుండాలి అనే సందేహం వస్తుంది. దానికి సమాధానం - భగవంతుడేది చేసినా భక్తుల కోసమే చేస్తాడు. భక్తుని హృదయమే భగవంతుని నివాసం, భగవంతుని అస్తిత్వం. కనుక ఆయా భక్తుల ఆయా జీవుల ఉద్ధరణ కోసం ఆయా గుణాలను ప్రదర్శిస్తాడు. స్వయం భగవానుడైన శ్రీకృష్ణుడు ఈ షడ్గుణయుక్తమయిన లీలల్ని గావించి జీవులకు అమందానందాన్ని ప్రసాదిస్తాడు.

తాను భగవంతుడినని అడుగడుగునా వ్యక్తం చేస్తూ వచ్చాడు. కనుకనే కొందరు శ్రీ కృష్ణుని 'ఐశ్వర్య' తత్త్వానికి ముగ్ధులై సంబరపడితే, మరికొందరు శ్రీకృష్ణుని పరాక్రమానికి అబ్బురపడి దాసోహమన్నారు. కొందరు శ్రీకృష్ణుని 'యశస్సు'కు తబ్బిబ్బయి దరి చేరితే, ఇంకొందరు భగవానుని 'శ్రీ' లక్షణానికి పరవశించారు. ఇదే విధంగా కొందరు భగవద్జ్ఞానానికి తృప్తి పొందితే, అందరూ పరమాత్మ పట్ల పరమాసక్తితో లౌకిక వైరాగ్యాన్ని అనుభవించారు. ఈవిధంగా అందరినీ ఆయా గుణాలతో ఆకర్షించుకుని తద్వారా తన దగ్గరకు వారు వచ్చే మార్గాలను సుగమం చేశాడు.

'జాంబవంతుడు శ్రీరామునితో ద్వంద్వ యుద్ధాన్ని ఆశించిన' విధంగా జీవుల అంతరాంతరాలలో భగవంతుని పట్ల కలిగిన కోరికను గమనించి వారు కోరుకున్న మార్గాలలోనే వారిని తనవైపుకు రప్పించుకున్నాడు. ఆయా సందర్భాలలో జీవుల ఉద్ధరణకోసం భగవానుడు తన షడ్గుణాలనే ఆయుధాలను

అవసరాన్ని బట్టి ప్రయోగించాడు. శ్రీకృష్ణుడు పుట్టినది మొదలు తన జీవితంలో ఐశ్వర్యాది గుణ ధర్మాలను ఎవరి పట్ల ఏవిధంగా ప్రదర్శించి వారిని ఉద్ధరించాడో వివరించడమే ఈ ప్రకరణ (శ్రీకృష్ణుడు-భగవత్తత్త్వం) రచనోద్దేశం. శ్రీకృష్ణుడు భగవానుడు కనుక తన భగవద్గుణాలను (ఐశ్వర్యాది గుణాలు) ప్రదర్శించి జీవులను తరింపజేసిన విధానాన్ని పరిశీలించినట్లయితే శ్రీకృష్ణుని భగవత్తత్త్వం అవగతమవుతుంది.

'ముందుగా భాగవతంలోని దశమస్కంధంలోని సంఘటనలను ప్రధానంగా నాలుగు రకాలుగా విభజించుకోవడం అవసరం. అవి

1. తామసప్రకరణం
2. రాజసప్రకరణం
3. సాత్త్విక ప్రకరణం
4. గుణ ప్రకరణం

తామస రాజస సాత్త్విక భక్తులను తన పట్ల ఆకర్షించుకునే విధానాలు ఈ ప్రకరణాలలో మనకు స్పష్టమవుతాయి. ఒక్కొక్క ప్రకరణాన్ని తిరిగి ప్రమాణం, ప్రమేయ, సాధన, ఫల ప్రకరణాలుగా విడదీసుకోవలసి ఉంటుంది.[17]

**1. తామస ప్రకరణం**

1. తామస ప్రమాణం, 2. తామస ప్రమేయం, 3. తామస సాధనం, 4. తామస ఫలం.

**2. రాజసప్రకరణం**

1. రాజస ప్రమాణం, 2. రాజస ప్రమేయం, 3. రాజస సాధనం, 4. రాజస ఫలం.

**3. సాత్త్విక ప్రకరణం**

1. సాత్త్విక ప్రమేయం, 2. సాత్త్విక సాధనం, 3. సాత్త్విక ఫలం,

**4. గుణ ప్రకరణం - (ఐశ్వర్యాది గుణ వివరణ)**

తామసప్రమాణాది ఒక్కొక్క ప్రకరణంలోనూ ఐశ్వర్యాది షడ్గుణాలు, ఏడవది ధర్మ స్వరూపుని (ధర్మి) తత్వాన్ని తెలిపే లీల వ్యక్తమవుతూ ఉంటాయి.

భాగవతంలో శ్రీకృష్ణుడు సాగించిన లీల 'నిరోధలీల'[19] దీని అర్థం మనసును నిరోధించడం. జీవి మనసును జగత్తునుంచి విస్మరింప జేసి భగవంతుని పట్ల ఆసక్తిని ఆకర్షణను కలిగేట్లు చేయడమే నిరోధ లీల ఉద్దేశం. సాంసారిక విషయాలను విస్మరించిన అనంతరం సాంసారిక బంధాలు తెగిపోతాయి. దానితో భగవత్సంబంధం ఏర్పడుతుంది. - భాగవతంలోని కృష్ణలీల అంతరార్థం ఇదే.

భక్తుల దుఃఖ నివారణార్థం అవతరించిన శ్రీకృష్ణ భగవానుడు తామసరాజస సాత్త్విక భక్తుల (జీవుల) పట్ల నిరోధ లీల గావించాడు.

శ్రీ కృష్ణుడు దేవకీ వసుదేవుల దగ్గర ఆవిర్భవించక మునుపు దేవకికి కలిగిన ఆరుగురు సంతానాన్ని కంసుడు చంపడం ద్వారా భగవానుని సంబంధించి లోకంలో వ్యాప్తమయి యున్న ఐశ్వర్య వీర్య యశః శ్రీజ్ఞాన వైరాగ్యాలను కంసుడు తన భగవద్వేషంతో అణచి వేశాడనీ నాశనం చేశాడనీ అనుకున్నట్లయితే, దేవకికి భగవానుడుదయిస్తూనే దూరంగా వెళ్ళి తన ఐశ్వర్యాది షడ్ధర్మాలను ఒక్కొక్కటీ ప్రకటిస్తూ, దేవకి సప్తమ గర్భాన్ని సంకర్షణం ద్వారా రక్షించిన విధంగానే తన ధర్మసహిత ధర్మ స్వరూపాన్ని (ధర్మి) వ్యక్తీకరిస్తూ వచ్చి చివరికి కంసాదులను హతమార్చాడని చెప్పవచ్చు.

శ్రీకృష్ణుడు ఈ విధమైన ఐశ్వర్యాది షడ్ధర్మాల ప్రకటనం ముందుగా వ్రజవాసుల నడుమ జన్మోత్సవం ద్వారా గావించాడు. వ్రజవాసులు తామస భక్తులుగాను, ముందుగా తామసులనే నిరోధించి నట్లుగాను ముందు తామస ప్రకరణం తెలుపడం వలన అర్థమవుతోంది.

అయితే ముందుగా తామస ప్రకరణం ఎందుకు చెప్ప బడిందని, వ్రజభక్తులు తామస భక్తులెలా అయ్యారని సందేహం కలుగుతుంది. "శ్రీ విఠల నాథుని వ్యాఖ్య' ననుసరించి"[19] పురుషోత్తమ స్వరూపమే భక్తిమార్గంలో ముఖ్య సిద్ధాంతం.

సాత్త్వికులకు జ్ఞానాది విహిత మార్గాలలో ఆసక్తి ఉంటుంది. రాజసుల చిత్తం ఎప్పుడూ విక్షిప్తంగా ఉంటుంది. కనుక లౌకిక అలౌకిక కర్మలలో సంబంధం కలిగి ఉండడం వలన స్వరూప విస్మృతి సంభవించవచ్చు. ఆ కారణంగా సాత్త్విక రాజస భక్తులను సంపూర్ణంగా నిరోధించడం సంభవించదు. తామసులు మూఢులుగా (అమాయకులుగా) ఉంటారు. వారికి ఏవిషయం లోనయినా ఆసక్తి వచ్చినట్లయితే దాన్నివారు వదలలేరు. వారు ఆ విషయంలో దృఢమైన గ్రాహకులుగా ఉంటారు. ఈ సంగతి లోకంలో ప్రత్యక్షంగా తెలిసిన విషయమే.

భగవంతుడు భక్తుల భావానుసారం ఉంటాడుగాని భక్తుల స్వభావాలను పరివర్తనం చేయడు. వ్రజవాసులకు భగవంతుని స్వరూపం పట్ల ఎటువంటి స్నేహం ఏర్పడిందంటే భగవత్స్వరూపం నుండి దేనినీ వారు ఆశించలేదు. కొన్ని సార్లు భగవానుడు చేసిన ధర్మోపదేశాలను సైతం ఉల్లంఘించారేగాని ఒప్పుకోలేదు. భగవానుడు ఇవ్వదలచిన జ్ఞానాన్ని కూడా వారు గ్రహించలేదు. అందువల్ల ముందుగా పరమాత్మ నిరోధం తామసభక్తులయిన వ్రజ వాసులకే సిద్ధించింది. దీనిని తెలియజేయడానికే మొదటి ప్రకరణం తామస ప్రకరణం అయింది.

నిజమైన భక్తులకు జ్ఞాన వైరాగ్యాలు సుఖాన్ని కలిగించవు. వారికి స్వర్గ అపవర్గనరకాలన్నీ సమానమే. మోక్షాన్నీ నరకాన్నీ కూడా సమానంగా భావించేటప్పుడు 'భక్తి' జ్ఞానం కన్నా గొప్పదే అవుతుంది. ఈ భక్తే వ్రజ వాసులలోనూ ఉంది.

వ్రజవాసులకు భగవానుని పట్ల విశుద్ధమైన భావం ఉంది. కనుక వారికి అందరికన్నా ఆధిక్యాన్నిస్తుంది శాస్త్రం. ఈ లౌకికత్వమే తామసంలో ముఖ్యం. భగవానుడు సర్వవ్యాపకుడనీ పరమాత్మ అనీ తెలిసినా బాహ్యంగా కంటికి కనబడుతున్న కృష్ణ స్వరూపాన్నే ముఖ్యంగా భావించారు వ్రజవాసులు. అంతరాత్మాది స్వరూపాలను ఒప్పుకోరు. వ్రజ భక్తులకు కర్మ జ్ఞాన విహిత భక్తిలోనూ, అంతర్గతంగా హృదయంలో నివసించే రూపం మీద ఆసక్తిలేదు. బహిర్గతంగా కనిపించే స్వరూపం మీదే ఆసక్తి. ఆ ఆసక్తి తామసికులలోలాగే సుదృఢంగా ఉంది. కనుకనే వీరిని తామస భక్తులుగా చెప్పడం జరిగింది.

## తామస ప్రకరణం

తామస భక్తులకు భగవంతుని పట్ల ఆసక్తిని కలిగించిన సందర్భాలు కలిగినది కనుక ఇది తామస ప్రకరణం. ఇది తామస ప్రమాణ ప్రకరణం, తామస ప్రమేయ ప్రకరణం, తామస సాధన ప్రకరణం తామస ఫల ప్రకరణం అని నాలుగు రకాలు.

### 1. తామస ప్రమాణ ప్రకరణం

తామస భక్తులకు ప్రమాణాల ద్వారా కృష్ణుని పట్ల ఆసక్తిని కలిగించడం తామస ప్రమాణ ప్రకరణంలో కనిపిస్తుంది.

కంసుని చెరలో దేవకీ వసుదేవులకు శ్రీకృష్ణుడు జన్మించిన అనంతరం యోగమాయతో మార్పిడి వల్ల శ్రీకృష్ణుడు యశోద ఇంటికి చేరాడు. ఎవ్వరికీ ఆ విషయం తెలియనందు వల్ల యశోదకే ఆ చిన్ని బాలుడు జన్మించాడని యశోద ఇంటిలోనూ, నందనందనుని జననానికి వ్రేపల్లె అంతటా కూడా బాలుని జన్మోత్సవం జరిపారు. ఆనాటి నుండే భగవానుడు ఐశ్వర్యాది ధర్మాలను ప్రకటించసాగాడు.

## ఐశ్వర్యం

భగవంతుని ఐశ్వర్య ప్రకటనం వల్ల జీవుల మనసుల్లో ఉత్సాహం పెల్లుబుకుతుంది. ఆనందం తాండవిస్తుంది. లోకానికి అది ఒక ఉత్సవ కారణమవుతుంది.

దేవకీ వసుదేవుల వద్ద చెరసాలలో శ్రీకృష్ణుని జననం గోప్యంగా జరిగితే యశోదానందుల బిడ్డగా వ్రేపల్లె అంతటా బహిర్గతమయింది. ఇదే విధంగా ఐశ్వర్య ప్రకటనం సైతం రెండురకాలుగానూ జరిగింది. ఒకటి ప్రకృతిలో గోప్యంగా జరిగిన ఉత్సాహం, రెండవది వ్రేపల్లెలో ఉత్సవ రూపంగా జరిగినది. దేవకీ దేవివద్ద భగవానుడు ఆవిర్భవించిన సందర్భంలో సకలప్రకృతి పులకించింది.

'జల రాశులు స్వచ్ఛమై పొంగాయి మేఘాలు కలఘోషణాలతో ఉరిమాయి. గ్రహతారకలతో గగనం విరాజిల్లింది. దిక్కులు మిక్కిలి తెలివి గలిగి ఉన్నాయి. గాలి చల్లగా వీచింది. హోమానలం చక్కగా వెలుగొందింది. నదులు స్వచ్ఛమైన నీటితో ప్రవహించసాగాయి. దేవదేవుని దేవకీ దేవి కనిన సమయంలో

> "వరపురగ్రామ ఘోషయై వసుధ యొప్పె
> విహగరవ పుష్పఫలముల వెలసెవనము
> *లలరు సోనలు గురిపిరయ్యమరవరులు..*"[20]

అంతఃకరణ శుద్ధి అయిన తరువాత భగవానుని ఆవిర్భావం జరుగునట్లుగా శ్రీకృష్ణభగవానుడు ఆవిర్భవిస్తున్న సందర్భంలో ప్రకృతిలో కాలం దిశ పృథ్వి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు ఆత్మ అన్నీ శుద్ధమయినట్లు వర్ణించబడింది. ప్రకృతిలో జరిగే ఈ మార్పు, ఉత్సాహం బహిర్గతం కాని విధంగా గోప్యంగా జరిగింది.

ఇక వ్రేపల్లెలో యశోద యింటి బాలుని జననం (ప్రకటనం) వల్ల వ్రేపల్లె అంతటా ఆనందస్రోతస్సు ప్రవహించింది. వ్రజం సర్వసంపదల చేత పరిపూర్ణమయింది. వ్రజరాజు మహానంద పూర్ణుడై పుత్రునికి జాతకర్మాదుల నొనరించి మహోత్సవం జరిపాడు.

పితృదేవతల నర్చించి క్రేపులతో బాటు రెండు లక్షల పాడియావులనూ 'కనక కలశమణి వసన విశాలంబులైన తిలశైలంబు లేడింటిని' భూదేవతల కిచ్చాడు.

ఎంతోమంది బ్రాహ్మణులు వచ్చి దీవనలిచ్చారు. దుందుభుల మ్రోతలతో గాయకుల గానంతో సూతులు వంది జనులు చేసే కీర్తనలతో భద్ర కాహళ రవాలతో వ్రజం అంతా మారు మోగింది. వ్రజంలోని ఇళ్ళూ వాకిళ్ళూ చిత్ర విచిత్ర తోరణాలతో ముగ్గులతో అలంకరించబడ్డాయి. అంతటా సంతోషం తాండవించసాగింది.

ఏమినోముఫలమోయింత ప్రొద్దోకవార్త
వింటిమబలలార వీనులలర
మన యశోద చిన్న మగవానిగనెనట
మాచివత్తమమ్మ సుదతులారా[21]

అంటూ వ్రజవాసులు ఒకరినొకరు పిలుచుకుంటూ ఉత్సాహంతో గోప బాలుని చూడవచ్చి నేతులతో పెరుగులతో వెన్నలతో నీళ్ళతో బాలుని వసంతాలాడించి సరససంభాషణలాడసాగారు.

ఈ విధంగా వ్రేపల్లెలోని అణువణువు బాలభగవానుని జననానికి ఉత్సాహంతో నిండి పొంగి పొర్లుతూ ఆనందం వెల్లివిరుస్తూ మహోత్సవం చేసుకున్న తీరు శ్రీకృష్ణ భగవానుని ఐశ్వర్య గుణ ప్రకటనమే.

## వీరం

శ్రీకృష్ణుని పరాక్రమ చరిత్ర మననం చేసుకోవడం వల్ల ఆత్మ బలం పరమాత్మ బలంతో సురక్షితమవుతుంది. శ్రీకృష్ణ భగవానుడు బాల్యం నుండి పరాక్రమాన్ని ప్రకటిస్తూ వచ్చాడు. (చతుర్వ్యూహపరంగా ఇది సంకర్షణ వ్యూహకార్యం) అంటే తన పరాక్రమం వల్ల ఉద్ధరింపబడవలసిన జీవులను పరాక్రయం ఉపయోగించి ఉద్ధరించాడు. ప్రప్రథమంగా వీరత్వాన్ని ప్రదర్శించినది పూతన వధ సందర్భంలోనే.

విషపుపాలిచ్చి చంపవచ్చిన పూతనను పరాక్రమంతో విషంతో బాటు ప్రాణాలను కూడా పీల్చి చంపాడు. పాలు పీల్చే విధానంలోనే బలం ఉపయోగించి ఆయువు పట్లను సడలించివేశాడు.

*'బిగిచన్నుగవగేల బీడించికబళించి*
*గ్రుక్క గ్రుక్కకు గుటు గుటుకుమనుచు*
*నొక రెండు గ్రుక్కలనువిద ప్రాణంబులు*
*సైతము మేనిలో సత్త్వమెల్ల*[22] *తాగాడు.*

మోసపు రూపంలో పూతన తనను చంపరాగా బాలకుడి రూపంలోనే తాను పూతన ప్రాణాలను పూతనకు తప్ప ఎవ్వరూ ఎరుగని రీతిలో పీల్చేశాడు శ్రీకృష్ణభగవానుడు.

## యశం

శకట భంజన సంఘటన శ్రీకృష్ణుని యశోవిభూతిని వెల్లడిస్తుంది.

పూతనను చంపిన సందర్భంలో కృష్ణ భగవానుని పరాక్రమాన్ని గోకుల వాసులు గుర్తించలేదు. కృష్ణునికి ఆ రాక్షసి వల్ల గండం గడిచింద

ఆనందించారు. 'గోమూత్రం గోమయం బాల కృష్ణుని శరీరమంతా అలది ఆచమనంచేసి ఆ బాలుని శరీరంలోని అంగాంగాలను పరమాత్మ రక్షించాలంటూ రక్షామంత్రాలు పఠించారు.

అయితే బాలకృష్ణుడు చేసిన శకట భంజనం వారికి బాలుని పట్ల కొంత ఆశ్చర్యాన్ని కలిగించింది.

శ్రీకృష్ణుని కాలు తాపుకు శకటం విరిగి భయంకరమైన శబ్దంతో విరిగిపడగా-

మిన్నున కూరక యెగయెదు
తన్న సమర్థుండుగాడు తల్పగతుండీ
చిన్ని కుమారుడుదేరే
విన్నువున నెగసె దీని విధమెట్టిదియో[23]

అని విత్కరిస్తున్న గోపగోపీ జనానికి ఆ బాల కృష్ణుని సన్నిధిలో ఆడుకుంటూ కళ్ళారా చూసిన శిశువులు

*"బాలుడాకొని యేడ్చుచు*
*గాలెత్తిన దాకి యెగసెగాని శకటమే*
*మూలమున నెగయదని"*[24] చెప్పడంతో
*"బాలుండెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపై జేచ్చడం*
*గాలందన్నుట యెక్కడాట పడుచల్ గల్లాడిరీజడ్డుబ*
*ల్కేలోకంబున నైన బెప్పబడునే, యేచందమేగాక"*[25]

మరింత ఆశ్చర్యపోతూ పసి బాలుని కాలు తాకిడికే శకటం విరిగిందని తెలుసుకున్నా నమ్మ జాలనంత ఆశ్చర్యాన్ని ప్రకటించారు. ఈ విధంగా 'శకటభంజనం గోపగోపీ జనాన్ని ఆశ్చర్యచకితుల్ని చెయ్యడం' యశఃకారణంగానే

జరిగింది. తరువాత గోకుల వాసులకు బాల కృష్ణుని చేష్టలలోని గొప్పదనం మెల్ల మెల్లగా అర్థం కాసాగింది.

హరికరతల పీడనంతో పరవశుడై నేలకూలిన తృణావర్తుని వృత్తాంతమూ కృష్ణుని యశోవిభూతినే తెలియజేస్తుంది.

తృణావర్తుని రాకకు పూర్వం తన ఒడిలో కొండంత బరువుగా తోచిన కృష్ణుని మోయలేక ఇలాతలంపైన ఉంచిన యశోద 'ధరగావ బుట్టిన మహాపురుషుడు గాబోలు'[26] ననుకోవడం, తృణావర్తుడు కృష్ణుని ఆకాశానికి ఎగరవేసుకు వెళ్ళగా

*మెడ బిగియబట్టుకొనిడిగ*
*బడియెడి బాలకుని చేత బర్వతనిభుచే*
*విడివడ జాలక వాడురి*
*బడి బెగడెడు ఖగముభంగి భయము "*[27]

పొంది హరికర పీడనంతో పరవశుడై భగ్నాంగుడై క్రింద పడిన విధము గోప గోపీ జానాన్ని ఆశ్చర్య చకితుని చేసింది.

## శ్రీ

భగవానుని షడ్ధర్మాలలో శ్రీ ధర్మాన్ని వ్యక్తపరిచే లీలలు నామకరణ లీ దోగాడే లీల ఆపత్తి నివారణం. గర్గ మహాముని నామకరణం చేసే సమయంలో 'ఈ శాబకుని వలన మీరు దుఃఖంబుల దరియింతు; రీయర్భకుని చేత దుర్జ శిక్షణంబును, సజ్జన రక్షణంబునువగు, నీకుమారుండు నారాయ సమానుండని"[28] చెప్పాడు. ఆపత్తులను దుఃఖాలను దూరంచేసే ఈ పలుకు విని నందాదులు పరమానందాన్ని పొందారు. ఇంతేగాక బాలుడై బాల చేష్ట

(దోగాడుతూ తప్పటడగులువేస్తూ ఆడుతూ...) చేస్తూ అందరికీ ఆనంద ప్రదానం గావించాడు.

## జ్ఞానం

ఉలూఖల బంధన లీల భగవానుని జ్ఞాన ప్రదర్శన లీల. ఇంటిలో రోటిపైనెక్కి వెన్న దొంగిలించి కోతులకు పెడుతున్న కృష్ణుని చూసిన యశోద పట్టుకోవాలని బెత్తంతో వెంటపడింది. శరీర భారంతో తడబడుతూ లేస్తూ వెళ్ళి పట్టుదలతో పట్టుకోవాలని ప్రయత్నిస్తున్న యశోదమ్మకు తనకు తానుగా పట్టుబడ్డాడు. తానే పట్టుకున్నాననుకుని పొంగి పోయింది యశోదమ్మ. కళ్ళునులుముకుని ఏడుస్తున్న బాలుని చూసి ప్రేమ పొంగగా భయ పెట్టదలచి రోటికి కట్టింది. ఈ సందర్భంలో వ్యాస భాగవతంలో శ్రీశుకుని నోట[29] కృష్ణతత్త్వాన్ని తెలిపే జ్ఞాన బోధ చేయబడుతుంది.

పోతన భాగవతంలో యశోదనోట పరోక్షంగా పరతత్త్వం తెలుపబడింది.

యశోద శ్రీకృష్ణుని బాలునిగా భావిస్తూనే

*"ఎక్కడనైనను దిరిగెద*
*వొక్కయెడన్ గుణము కలిగియుండవు నియమం*
*బెక్కడిది నీకు? మరచిన*
*జక్కగ బోయెదవు పెక్కు జాడల పుత్రా"*[30]

అనే మాటలో పుత్రా అనే మాటను వదిలితే ఎక్కడనైనను తిరిగెదవు. (సర్వాంతర్యామివి) గుణం కలిగి యుండవు (గుణాతీతుడివి), నియమం బెక్కడిది నీకు (నియమాలకు కట్టు బడనివాడవు), మరచిన జక్కగ బోయెదవు పెక్కు జాడల ... అనడంలో తనను మరచిన వారి వద్ద నుండి దూరంగా వెడలి పోయే పరమాత్మ తత్త్వాన్ని వర్ణించడం జరిగింది.

## వైరాగ్యం

యమళార్జున భంజనాద్యభివర్ణనం భగవంతుడు వైరాగ్యాన్ని ప్రసాదించే విధానాన్ని తెలియజేస్తుంది. భగవానుని పైన తప్ప మరే ఇతర వస్తువు పైన ఆసక్తి లేకపోవడమే వైరాగ్యం. భగవానుని పైనగల పరమాసక్తి ప్రాపంచిక వైరాగ్యాన్ని కలుగజేస్తుంది.

మదిరాపానమత్తులై కన్నుగానక ప్రవర్తించిన నలకూబర మణిగ్రీవులు నారదుని శాపాన యమళార్జున వృక్షాలవగా, కృష్ణుడు యశోదమ్మ తనకు కట్టిన రోటిని లాగుకుంటూ వచ్చి ఆచెట్ల మధ్య నుండి లాగి చెట్లను కూల్చి వారికి శాపవిముక్తిని కలిగించాడు. శాపవిముక్తిని పశ్చాత్తాపాన్ని పొందిన నలకూబర మణిగ్రీవులలో శ్రీహరి దర్శన స్పర్శనాదుల వలన ఇంద్రియ వ్యామోహం నశించి వైరాగ్యం కలిగింది. భగవతత్త్వాన్ని అర్థం చేసుకున్న నలకూబర మణిగ్రీవులు 'బాలుడవె నీవు? పరుడవనాలంబుడ వధిక యోగి వాద్యుడవు'[31] అంటూ కృష్ణభగవానుని పట్ల ఆసక్తులై స్తుతించారు.

"నీ పద్యావళులాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీపేరం బనిసేయు హస్తయుగముల్ నీ మూర్తి పైఁ జూపులున్
నీపాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీసేవపైఁ జిత్తముల్
నీ పై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజ పత్రేక్షణా"[32]

అని స్తుతించడంలో నలకూబర మణి గ్రీవులెంతగా భగవంతుని పట్ల ఆకర్షితులయ్యారో తెలుస్తుంది. ఇంద్రియ భోగాల పట్ల కూడా వీరికి విర[క్తి] ఏర్పడింది.

'కారుణ్యామవముండగు
నారదు వచనముచ జేసి నను బొడగమటన్

మీరు ప్రబుద్ధుల రైతిరి
చేరెన్ నామీది తలపు సిద్ధము మీకున్[33]

అని కృష్ణ భగవానుడు వారి వైరాగ్యాన్ని ప్రశంసించాడు.

## ధర్మస్వరూపుని లీల (ధర్మీ)

రాక్షస సంహారాలు, శాపవిముక్తులు చేయడం గాక కేవలం దివ్యానందాన్ని కలిగించడం కోసం పరమాత్మ తన స్థాయిని వదిలి తన పరమ భక్తులతో కలిసి ఆడే ఆటలు చేసే లీలలు పరబ్రహ్మత్వాన్ని నిరూపిస్తాయి. ఈ కారణంగానే "తన తెఱంగెవ్వరు నెఱుంగకుండ వలెనని కపట కుమారుండు"[34]

*"పాడున్ మందునిభంగి గోపవనితల్ పాణిధ్వనుల్ సేయగా*
*నాడున్ జంత్రము కైవడిం బరవశుండై హస్తముల్ త్రిప్పుచుం;*
*జూడన్నేరనివాని భంగి జనులం జూచున్; నగున్; బాలురం*
*గూడుం; బెద్దల పంపు సేయ జను; దాగున్ మట్టి జెట్టాడుచున్"*[35]

ఇవి ఆనంద పరిచే చేష్టలు

*"చుంచెదుగు బాలు ద్రావుము*
*దంచితముగ నమడు బాలుద్రావి జననితో*
*జుంచెదుగ దనుచలీలా*
*చుంచుండై యతడు చుంచు జూపు నరేంద్రా"*[36]

ఈ విధంగా కృష్ణుడు బహు విధాల గపట బాలల లీలల వినోదించ సాగాడని స్పష్టం అవుతుంది.

ఇక గోకులం నుండి బృందావనానికి నందాదులు చేరుకున్న తరువాత బృందావనం, యమునా తీరం గోవర్ధనాదులను దర్శించగానే సంతుష్టులైన బలరామ కృష్ణులు బాలురతో స్వేచ్ఛా విహారాలు గావించారు.

"వేణువు లూదుచు వివిధ రూపములతో
గంతులు వైతురు కౌతుకమున
గురు కంబళాదుల గోవృషంబుల బన్ని
పర వృషభములని ప్రతిఘటింతు
రల్లులు దట్టించి యంఘ్రుల గజ్జెలు
మెరయ దన్నుదు రోలి మున్మరముగ
బన్ని దంబులు వైచి ఫలమంజరుల గూర్చి
వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప

వన్య జంతు చయంబుల వాని వాని
పదురు పదురుచు వంచించి పట్టబోదు
రంబుజాకరముల జల్లులాడ జనుదు
రాకుమారులు బాల్య విహారులగుచు"[37]

పరబ్రహ్మమూ భగవంతుడూ అయిన కృష్ణుడు బాలురతో బాలు[...] ఆటలాడడంలో ఒక అంతరార్థం ఉంది. తండ్రి తన తనయుని ము[...] మాటలకు చిలిపి చేష్టలకు పరవశుడైన సందర్భాలలో తాను కూడా చి[...] బాలునిగా నటిస్తూ, నవ్వును ఏడ్పునూ అనుకరిస్తూ చిలిపి చేష్టలు చేస్తూ ము[...] మాటలు మాట్లాడుతూ స్నేహితుడై కలిసి ఆడిన తీరు ఇందులో గోచరిస్తుం[...] తన సాంగత్యం కోరిన జీవుల మధ్య పరమాత్మ తామూ ఒక జీవుడిగా వారి[...] కలిసి మెలిసి ఆడిపాడి వారిని సంతోషం కలిగించడమే కృష్ణుడు బాలుర[...] ఆడే ఆటల అంతరార్థం. బాలుడుగా కృష్ణుడు చేసిన అద్భుతాలకు బ్రహ్మసైత[...] విస్మితుడయాడు. కనుకనే ఇది ధర్మ స్వరూపుని (ధర్మి) లీల.

భగవానుడు భక్తిని ప్రసాదించేవాడని నామకరణ మహోత్సవం ద్వారా[...] బాలలీలల ద్వారానూ తెలుస్తుంది. ఆ తరువాత భగవానుడు భ[...]

వశమవుతాడని ఉలూఖల బంధనం తెలుపుతుంది. అందరినీ ఉద్ధరించే భగవానుడు అందరి దోషాలను దూరం చేస్తాడనే విషయం నలకూబర మణి గ్రీవుల ఉద్ధరణ వలన తెలుస్తుంది.

## 2. తామస ప్రమేయ ప్రకరణం

ఈ ప్రకరణంలో ప్రమేయం (పరమాత్మ చూపే మాహాత్మ్యం) ద్వారా యశోదాదులకు ఆసక్తి రూపకమైన ధర్మాన్ని గ్రహించడం సాధ్యమవుతుంది. కనుక ఇది ప్రమేయ ప్రకరణమయింది. ప్రమాణ ప్రకరణంలో మాదిరిగా దీనిలోనూ ఒక క్రమం ఉంది. వరుసగా ఆరు సంఘటనలు ఐశ్వర్యాది ధర్మాలను తెలియజేస్తాయి. తరువాత ధర్మ స్వరూపుని లీలా వర్ణనం జరుగుతుంది.

ఐశ్వర్యం

అత్యంత ఉత్సాహాన్ని నయనోత్సవాన్ని కలిగించే భగవానుని రూప లావణ్యం ఐశ్వర్యాన్ని వ్యక్త పరుస్తుంది.

ధేనుకాసుర వధానంతరం గోగణంతోనూ గోపబాలురతోనూ వస్తున్న శ్రీకృష్ణుని సుందర రూపం గోవిందుని కోసం ఎంతగానో ఎదురు చూస్తున్న గోపికలకు నయనానందాన్ని ఉత్సాహాన్ని కలిగించింది.

*" గోపదరేణు పంకలితకుంతలబద్ధమయూరపింఛు ను*
*ద్దీపిత మందహాస శుభదృష్టి లసమ్ముఖు, వన్యపుష్పమాలాపరి పూర్ణు*
*గోపజనలాలిత వేణు రవాభిరాము, నా*
*గోపకుమారునిం గనిరి గోపసతుల్ నయనోత్సవంబుగన్"*

ఆ సమయంలో -

"కమలనయను వదన కమల మరందంబు
దవిలి నయనషట్పదముల నలన
గ్రోవి దినవియోగ తాపంబు మానిరి
గోపకాంత లెల్ల గోర్కులలరో"

శిఖిపింఛంతో అడవి పూలతో బాటు ధూళితో రంజితమయిన ముంగురులతోనూ సుందర దరహాసముతో మనోహర కటాక్షంతో వేణువు మోగిస్తూ వస్తున్న కృష్ణుని రూపసౌందర్య మాధుర్యం ఉత్సుక నేత్రాలతో ఎదురు చూస్తున్న వ్రజవాసులకు ఐశ్వర్య ప్రదాయక మైంది.

వీరం

కాళీయ దమన లీలా వర్ణన 'వీరత్వ' బోధకం.

'దుష్ట దండావతారుండై హరివడి గలిగిన పడగల మీద దాండవంబు సలుప'[40]గా కాళీయుని మదమణిగి శరణుజొచ్చి రక్షింపబడ్డాడు. ఈ విధంగా కాళీయుని దమనం శ్రీ కృష్ణుని వీరత్వం ప్రదర్శించిన ఘట్టం.

యశం

కృష్ణుడు కాళీయ దమనానికి హ్రదంలో దూకగానే కృష్ణుడు కనపడ పోవడంతో వ్రజ వాసులందరి హృదయం లోనూ ఆర్తినిండుకుంది. కృష్ణు ఇక చూడమేమోనని భీతి. కృష్ణుని దర్శించాలనే ఆరాటం తీవ్రంగా కలుగసాగిం ఇక కృష్ణుని చూడక బతకలేమనే స్థితికి చేరుకున్నారు వ్రజవాసులు. సమయంలో 'దివ్యగంధాంబర సువర్ణమణిగణ మాలికాలంకృతుడై మడు వెడలిన మాధవుని'[41] ప్రాణలాభాన్ని పొందిన ఇంద్రియముల మాదిరి యశో సమేతమైన గోపికలు నంద సునందాది గోపకులు తేరుకుని పరమానందా పొందారు. కృష్ణుని గొప్పదనం అందరికీ తెలిసి వచ్చింది.

కాళీయుని బారినుండి తిరిగి రావడంతో కృష్ణుని కీర్తి వ్యాపించింది. 'నీ సుతుడహిచే విడువడె; నీ సురుచిర భాగ్య మహిమ నిశ్చల'[42] మంటూ శ్రీకృష్ణుని యశస్సును తెలియ జేయసాగారు. కాళీయ దమనం ఈ విధంగా కృష్ణుని యశో విభూతిని వ్యక్తపరిచే సంఘటనం.

శ్రీ

ప్రలంబాసుర వధతో అకాల దుఃఖాన్ని నివారించాడు. దుఃఖ నివారణం ఆనంద ప్రదానం కనుక శ్రీ గుణం అయింది. ప్రలంబాసురుని వధించింది బలరాముడే అయినప్పటికీ మూలబలం కృష్ణునిదే. దివిజులు సైతం ప్రలంబుని మరణానికి సంతోషించి కుసుమ వర్షం కురిపించారు.

*మేలు మేలు గదయ్య! రాముడు మేటి రక్కసునొక్కడున్*
*నేల కూలిచెనొక్క పోటున నేడు విస్మయ మంచుగో*
*పాలకుల్ గని చచ్చి వచ్చిన భ్రాత గన్న విధంబునం*
*జాలదీవనలిచ్చి రాముని సత్కరించిరి వేడుకన్*[43]

జ్ఞానం

కృష్ణుడు కాళీయుని దమనం, మొదటిసారి దావాగ్నిపానం గావించిన తరువాత గోపకులకు కృష్ణుని పట్ల ఈశుడనే జ్ఞానం కలిగి రెండవసారి దావాగ్ని తమను చుట్టుముట్టినపుడు మృత్యుభీతులై ఎంతో విశ్వాసంతో కృష్ణునికి మొక్కి దావాగ్ని చుట్టు ముట్టిందని చెపుతూ-

*" వీచుట్టాలకు నాపదల్ గలుగునే! నేమెల్లనీవార; మ*
*న్యాచారంబు లెఱుంగ; మీ శుడవు; మాకాభీలదావాగ్నినే*
*డే చందంబున వింకదాటుదుము? మమ్మీక్షించి రక్షింప,వ*
*న్నా! చంద్రాభ! విపన్నులన్ శిఖిశిఖానచ్ఛన్నులన్ ఖిన్నులన్"*[44]

అంటూ విన్నవించారు. కృష్ణుడు అందరినీ కన్నులు మూసుకుని ఉండమని తాను రక్షిస్తానని అన్నాడు. భారం అంతా కృష్ణుని పైనే వేసిన గోపకులు కన్నులు మూసుకున్న వెంటనే కృష్ణుడు "నిజయోగ వైభవంబున దావదహనంబు పానంబుసేసి నిమిషమాత్రంబున గోపకులనందఱ భాండీరక వట సమీపంబు నకు"[45] జేర్చాడు.

*'కార్చిచ్చార్చు పటుత్వము*
*నేర్చునె వరు డొకడు? శౌరివే డిదెకార్చి*
*వేర్చె; నితండజుడో హరియొవిటలాక్షుండో'[46]*

అని ఆలోచించగల జ్ఞానం ఏర్పడింది. కృష్ణుని పరమాత్మగా గుర్తించగలిగే గోపకులు గోపికలు బలరామకృష్ణులను దేవతలుగా నిర్ధారించారు. కనుక జ్ఞానం ప్రసాదించిన సంఘటన ఇది.

## వైరాగ్యం

శరదృతు వర్ణనంలో వైరాగ్య ధర్మం వెల్లడవుతుంది.

శరత్కాలంలో ఆకాశం, నదులు, భూమి నిర్మలంగా ఉంటాయి. సాధకుల హృదయం కూడా అంత నిర్మలంగా ఉన్నప్పుడే పరమాత్మ వైపుకు ఉమ్ముఖమవుతుందని ఇది తెలియజేస్తుంది.

*'జొంపములు గొనియెవనములు*
*రొంపు లుడిగె నెమలిగముల రొదలుడిగె; నదుల్*
*పెంపులకు బాసెమఱుముల*
*శంపల సంపదలుమానె శారదవేళల్'[47]*

అనే వర్ణన ప్రకృతి అన్నీ ఉడిగి లౌకికంగా తటస్థ భావాన్ని పొందినట్లు తెలుస్తోంది. "మేఘ పటల రహితంబును గలశభవముని సహితంబును

విజ్ఞాన దీపవిలసితంబగు యోగి హృదయం చందంబున శుభ్రంబయిన యభ్రంబును"[48] మొదలైన వర్ణనం ప్రకృతి నిర్మలమై యోగి హృదయాన్ని పోలివుండి భగవంతుని వైరాగ్య గుణానికి ప్రతీకగా కనిపిస్తుంది.

## ధర్మ స్వరూపుని (ధర్మి) లీల

'రసోవైసః' 'రసంహ్యేవాయం లబ్ధ్వా ఆనందీభవతి' మొదలైనవి శ్రుతి ప్రతిపాద్యమైన బ్రహ్మత్వం శ్రీకృష్ణుని వేణుగీతిలో స్పష్టంగా తెలుపబడింది. కనుక వేణుగానం సాక్షాత్ ధర్మ స్వరూపుని (ధర్మి) లీల. సుందర శారద యామినిలో నందకిశోరుడు వినిపించిన వేణుగీతి వ్రజవనితానిజ హృదయాలలోనే గాక సకల చరాచర ప్రకృతిలోనూ వలపులు రేకెత్తించినట్లుగా చెప్పడం జరిగింది.

పరమాత్మ ఎంతో ప్రేమతో ఆత్మలను పిలిచే పిలుపే వేణుగానం.

గోపికలు 'గోపాల కృష్ణుని కెమ్మోవి సుధారసంబు పానం' చేస్తూ మారవికారం పొందసాగారు. సకల చేతనాచేతనమైన ప్రకృతి కృష్ణుని వేణుగాన మాధుర్యాన్ని గుర్తించి గ్రహించినట్లుగా తెలుపబడినందున ఈ వేణునాద వాదనం ధర్మ స్వరూపుని (ధర్మి) లీలగా స్పష్టం అవుతుంది.

ఈ విధంగా ఏడు సంఘటనలలోనూ అంటే ప్రమేయ ప్రకరణంలో స్త్రీలకు వారి అధికారానుసారంగా పరమాత్మపట్ల ఆసక్తి రూపక నిరోధం ఏర్పడింది.

## తామస సాధన ప్రకరణం

దేహ సంబంధమైన సర్వధర్మాలు త్యాగం చేసి భగవానుని ప్రాప్తికోసం లౌకిక వైదిక కర్మలు చేయడం వ్యసనం. భగవంతుని వదలి ఉండలేని స్థితే వ్యసనం. ఈ వ్యసనం వలన గోపకన్యలు భగవంతుని పట్ల నిరోధింపబడిన (ఆకర్షితులైన) విధానం ఈ 'తామససాధనం' ప్రకరణంలో వివరించబడింది.

## ఐశ్వర్యం

గోపకాంతలకు వస్త్రదానం చేయడం ఐశ్వర్య విభూతి. గోపకన్యలకు భగవానుడు వస్త్రదానం అంటే వరదానమే. మాసమంతా కాత్యాయనీ పూజ చేసిన గోపకన్యలకు మాసాంతాన వివస్త్రలై జలకాలాడే సమయాన యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుడు వారి వస్త్రాలను తీసి దాచాడు. తాను చెప్పినట్లుగా ఒడ్డుకు వచ్చి రెండుచేతులూ ఎత్తి సిగ్గువిడిచి నమస్కరిస్తేగాని వారి వారి బట్ట లివ్వనన్నాడు.

కృష్ణుని భగవంతునిగా గ్రహించిన గోపికలు అన్ని సంకోచాలూ వదిలి చేతులెత్తి నమస్కరించారు. కృష్ణుడు వారి వారి బట్టలను వారికి ఇచ్చాడు. వారి బట్టలను తాను గ్రహించడం ద్వారా వారి అహంకారపు తెరను తొలగించాడు. అనంతరం కృష్ణుని అమృత స్పర్శతో గోపకన్యకల వస్త్రాలు ప్రసాద రూపంలో గోపకన్యలను తిరిగి చేరాయి. వస్త్రాలను ప్రసాదించడంతో బాటు శ్రీకృష్ణుడు వారి వ్రత ఫలితాన్ని పొందేట్లుగా, అంటే తనను పొందేట్లుగా వరాన్ని కూడా ఇచ్చాడు.

శ్రీహరి మాటలకు గోపికలు తన్మయులై మహోత్సాహంతో వెళ్ళారు. వారి నోము ఫలించిందని వారు రాబోవు రాత్రులందు కృష్ణుని పొందబోతున్నామని కృష్ణుని నుండి వినిన గోపికలకు అంతకన్నా మించిన ఆనందోత్సవం మరేముంటుంది.

తన చర్యల ద్వారా భగవానుడు తన భక్తులకు అత్యంత ఉత్సాహాన్ని కలగించడమే ఐశ్వర్యం. ఈ విధంగా గోపకాంతలకు వస్త్రదానం (వచన దానం) చేయడం భగవాముని 'ఐశ్వర్యం' వెల్లడయ్యే సంఘటనం.

## వీరం

యజ్ఞపత్నుల ప్రసంగంలో భగవాముని బోధనాది మహాత్మ్యాలు వీరకార్యం యజ్ఞ పత్నులు తెచ్చిన తినుబండారాలను స్వీకరించి గృహస్థ ధర్మాన్ని

ఆచరించడానికి యజ్ఞపత్నులను వెళ్ళమనడం, వారు పరమాత్మను వదిలి వెళ్ళడానికి నిరాకరించగా కృష్ణుడు వారిని అనునయించి యజ్ఞకార్యం పూర్తిగా అవడానికిగాను యజ్ఞపత్నులను వారి భర్తల దగ్గరకు వెళ్ళడానికి ఒప్పించి పంపడంలో కృష్ణుడు సఫలుడయ్యాడు. తిరిగి వెళ్ళడానికి గాను వారికి తగిన మనస్థైర్యాన్ని, బలాన్ని తన బోధలద్వారా కలిగించినందున ఇది వీర ప్రదర్శకంగా భావించాలి. ఇది బుద్ధి వీరం.

యశం

వైష్ణవ యాగం చేయడం యశోనిరూపణం. మేఘాలు స్థావర జంగమ జీవులకు తృప్తిని కలిగిస్తాయి. మృతప్రాయమైన తృణాదులకు ప్రాణప్రదమయిన జలాన్ని వర్షిస్తాయి. కనుక మేఘాధిపతి అయిన ఇంద్రుని యజ్ఞం ద్వారా ఆరాధించదలచిన నందాదుల కార్యాన్ని మాన్పించి గోవర్ధనగిరికి గోబ్రాహ్మణులకు పూజలు దానాలు యజ్ఞాలు చేయించిన కృష్ణుని కార్యం యశఃకారణం. సకల దానాలు భోజనాలు స్వీకరించిన భూసురులు కృష్ణుని కార్యాన్ని ప్రశంసిస్తూ యశోగానాన్ని చేశారు.

శ్రీ

గోవర్ధనోద్ధరణం భగవంతుని 'శ్రీ' గుణ ప్రదర్శకం. ఇంద్రుడు వ్రజవాసులపైన కృష్ణుని పైన కోపించి ఏడు రోజులు ఏకధాటిగా వానకురిపించగా గోవర్ధనోద్ధరణం గావించిన భగవానుడు వ్రజవాసులందరికీ రక్షణ నిచ్చి ఆపదలను దూరం చేసి ఆనంద ప్రదానం గావించడం శ్రీకార్యం.

జ్ఞానం

ఏడేళ్ళ బాలుడైన శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఏడహోరాత్రాలు ఎత్తిపట్టిన అద్భుత కార్యాన్ని చూసిన అనంతరం వ్రజవాసులకు శ్రీకృష్ణుడు మానవ మాత్రుడు కాడనే ఆలోచన బలంగా కలిగింది. దీనికి సమాధానంగా

నందుడు శ్రీ కృష్ణుని నామ కరణ సందర్భంలో గర్గుడు కృష్ణుని గూర్చి తనకు తెలిపినది జ్ఞప్తికి తెచ్చుకుంటూ "శంకలేదు, కృష్ణుండు లోక రక్షకుండయిన పుండరీకాక్షుని నిజాంశ"[49] అని నిర్ధారిస్తున్నట్లుగా గోపకులకు తెలుపగా, వారు భయపడి కృష్ణుని అనంతునిగా తెలిసి పూజించారు. గోపకులకు తాను పరమాత్మ ననే జ్ఞానాన్ని ప్రసాదించిన ఈ ఘట్టం జ్ఞాన కార్యం.

## వైరాగ్యం

గోవర్ధనోద్ధరణానంతరం కృష్ణుని భగవంతునిగా గుర్తించిన ఇంద్రుడు తన అహంకారాన్ని వదలి -

*నావంటి వెఱ్ఱివారికి*
*శ్రీవల్లభ నీవు శాస్తి సేపితివేనిం*
*గావరము మాని పెద్దల*
*త్రోవన్ జరుగుదురు బుద్ధి తోడుతనీశా'*

అని అనేక విధాలుగా స్తుతించి గోపగోగణ పతిత్వానికి గోవిందుని నభిషిక్తుని జేసి వెళ్ళాడు. ఈ విధంగా శ్రీ కృష్ణుడు ఇంద్రునిలో అహంకారాన్ని వదిలించి వైరాగ్యాన్ని కలిగించాడు.

## ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల

నందుడు శాస్త్ర నిషిద్ధ సమయమైన అసుర సందె వేళలో యమునా జలంలో స్నానమాడిన కారణంగా వరుణభృత్యులు నందుని వరుణలోకానికి తరలించడం తెలసి శ్రీకృష్ణుడు వరుణలోకానికి వెళ్ళి విడిపించినపుడు వరుణలోకంలో శ్రీకృష్ణుని వైభవాన్ని దర్శించిన నందుడు ఆశ్చర్యంతో వ్రజవాసులకు సవివరంగా ఈ వృత్తాంతాన్ని తెలిపాడు. ఇది విని గోపకులు 'కృష్ణుడు భగవానుడని' తలచి శ్రీకృష్ణునితో పరమ పదాన్ని దర్శించాలనే కోరికన

వ్యక్తం చేయగా అఖిల దర్శి అయిన శ్రీకృష్ణభగవానుడు 'నావారయిన వ్రజవాసులకు నామాధుర్య లీలనను భవిస్తూకూడా వారి ఔన్నత్యాన్ని గ్రహింపలేక మిగిలిన జీవులతో తమను సమానంగా భావిస్తున్నారు. కనుక వీరిని 'అవిద్య' నుండి దూరం చేయాలి' అని ఆలోచించి గోపకులందరినీ బ్రహ్మ హ్రదంలో (అక్రూరునికి యమునలో నారాయణ దర్శనమయిన చోటు) స్నానం చేయించి మునులకు సమాధి స్థితిలో లభ్యమయ్యే బ్రహ్మ లోకాన్ని వారికి చూపించాడు.

నందాది గోపాలురు అక్కడి వేదాలు సైతం కృష్ణుని స్తుతించడం జూసి విస్మితులై సాక్షాత్ పరబ్రహ్మమే తమతో మసలుతున్నాడని గ్రహించి పరమానందభరితులయ్యారు. ఈవిధంగా వైకుంఠ దర్శనాన్ని మించినది తనను భజించడం' అని నందాదులకు తెలియ జెప్పడం ధర్మ స్వరూపుని (ధర్మి) లీల.

**తామస సాధన ప్రకరణంలో కొన్ని విశేషాంశాలు:**

1. మానవులు దేహ ఇంద్రియాది సర్వస్వాన్ని భగవానుని కోసమే వినియోగించాలి గానీ తమ స్వార్థం కోసం ఉపయోగించరాదనే నిర్ణయాన్ని గోపికా వస్త్రాపహరణం అనే సంఘటన తెలియ జేస్తుంది.

2. శారీరక జీవనం కోసం ప్రాణాలను నిలుపు కోవడానికి మనిషి సమర్థుడయినప్పటికీ వాటి నిర్వహణకు భగవంతుని తప్ప మరెవరినీ ప్రార్థించరాదు. గోపకులు ఆకలితో కృష్ణుని ప్రార్థించడం ద్వారా లోకంలో శాస్త్రీయ సాధనలు కాక భగవంతుని అనుగ్రహమే నియామకమని తెలుస్తుంది.

3. ఇతరులను భజించడం వలన లాభం పొందగలిగినా ఇతరుల భజన మెన్నటికీ చేయరాదని భగవానుని ఇచ్ఛననుసరించే సర్వమూ జరుగుతుందని ఇంద్రపూజ మానిపించడం ద్వారా తెలుస్తుంది.

4. సర్వకాల సర్వావస్థలయందును హరి మాత్రమే సేవ్యుడు. భగవంతుడు అతి సులభముగా తనవారిని రక్షిస్తాడని ఎడతెగని వర్షానికి తట్టుకోలేక ప్రార్థించిన వ్రజవాసులను శ్రీకృష్ణుడు గోవర్ధనోద్ధరణం చేసి రక్షించడం ద్వారా తెలుస్తుంది.

5. మాహాత్మ్య జ్ఞాన పూర్వకమైన పరమస్నేహం, సత్పురుషుల తోడి సత్సంగం భక్తులకు పరమార్థ తత్త్వాన్ని అర్థం చేసుకునేలా చేసి వారికి అధిక జ్ఞానం కలిగిస్తుంది.

ఈ అయిదు పర్వాలు సిద్ధించినట్లయితే పూర్ణ నిరోధం (భగవంతుని వదిలి వుండలేక పోవడం) సిద్ధిస్తుంది. పంచ కర్మలు (సాధనలు) కూడా ఈ తామస సాధన ప్రకరణం సూచిస్తుంది.

1. భగవంతుని ప్రాప్తికై పరంపరగా చేస్తూవస్తున్న 'సేవారూప సాధన' గోపికలు చేసిన 'కాత్యాయనీపూజ'.

2. గోపకులు క్షుదార్తులై భగవంతుని ఆకలి బాపమని చేసిన ప్రార్థన 'ప్రార్థనారూప సాధన'.

3. పరంపరగా చేస్తున్న ఇంద్రయాగాన్ని మాని గోవర్ధన పూజ చేశారు నందాదులు. ఇది 'ప్రకృతి ఆరాధనా సాధన'.

4. ఇంద్రుడు సృష్టించిన వృష్టి పాతానికి తట్టుకోలేని వ్రజవాసులు ఇంద్రునికాక శ్రీకృష్ణునే శరణు వేడారు. ఇది శరణాగతి సాధన.

5. నందుని మాటలు నమ్మి గోపకులు సందేహాన్ని వదలి శ్రీ కృష్ణుడే పరమాత్ముడని నమ్మారు. వీరు చేసినది మాహాత్మ్య జ్ఞాన పూర్వక స్నేహ యుక్త కర్మ.

ఈ విధంగా అయిదు రకాల సాధనలు తామససాధన ప్రకరణంలో ఉన్నాయి.

## తామస ఫలప్రకరణం

సాధన చేయడం వలన భక్తి విశేషంగా వృద్ధి చెందుతుంది. దాని తరువాత భక్తి మరింత ప్రబలం అవుతుంది. అనంతరం షడ్గుణ సంపన్నమైన పూర్ణ భగవానుడు ఫల రూపంలో లభిస్తాడు. కనుక ఇది తామస ఫల ప్రకరణం.

తామస ఫల ప్రకరణంలో ఐశ్వర్యాది గుణాల క్రమం పూర్వంలా ఉండదు. పుష్టి ఫలం (అనుగ్రహ ఫలం)లో క్రమాన్ని (నియమాన్ని) అతిక్రమించడం దూషితం కాదు. పైగా భూషితమే అవుతుంది. మధ్యలోనే విశేష సుఖం లభిస్తుంది. కనుక 'ఐశ్వర్యం, వీర్యం, యశం, శ్రీ తరువాత ధర్మస్వరూపుని (ధర్మి) లీలా దర్శనం వైరాగ్యం జ్ఞానం' అనే వరుసలో వివరించడం జరుగుతుంది.

ఫలప్రకరణంలో భగవానుడు రమణ రూప ఫలం ఇవ్వవలసి ఉంది. ఆ రమణం 'రూప' 'నామ' భేదాలతో రెండు రకాలు.

## ఐశ్వర్యం(రూపరమణం)

వేణునాదం ద్వారా గోపికలను ఆహ్వానించిన కృష్ణుడు లోకధర్మాన్ని తెలియజేస్తూ వారిని ఇళ్ళకు వెళ్ళమని బోధించాడు. భగవానుడే ఇంటికి వెళ్ళమన్నా గోపికలు ఇళ్ళకు వెళ్ళలేదు. అనంతరం వారితో రాసక్రీడ సలుపగా గోపికలకు తమ వంటి స్త్రీలు భూమి మీదే లేరని భావం ఉదయించడంతో భగవానుడు అంతర్ధానం అయ్యాడు.

నాదం ద్వారా గోపికలను ఆహ్వానించి వచ్చేట్లుగా చేసుకున్నా లోక ధర్మాన్ని చెప్పి తిరిగి ఇళ్ళకు పంపలేక పోవడం విలక్షణంగా అనిపించినా అది కృష్ణుని అసమర్థత కాదు. సమర్థతే అని చెప్పుకోవలసి ఉంటుంది. ఎందుకంటే కృష్ణుని

మాటల్లో గోపికలను తిరిగి వెళ్ళకుండా చేయగలిగిన గూఢార్థమూ, సామర్థ్యమూ గలిగి ఉంది.

ఆ మాటలతో 'నేను కావాలో లోక ధర్మాలు కావాలో తేల్చు కోండనే' సవాలు కనిపిస్తుంది. కనుక ఇవిచాలా శక్తివంతమయిన మాటలు. ఇందులో 'లోక ధర్మాలలో పడకండి సుమా!' అనే హెచ్చరిక కూడా ధ్వనిస్తుంది. 'తానుగా పిలిచి ఇంటికి తిరిగి వెళ్ళమనడం' జరిగిందంటే అందులో మరేదో అంతరార్థం ఉందనే భావించాలి. శ్రీ కృష్ణుడు తన దగ్గరకు వచ్చిన గోపికలతో బెట్టు చేసి తనపట్ల గోపికలకు మరింత ఆసక్తి కలిగేట్లు చేశాడు. శ్రీకృష్ణుని ఆంతర్యం గోపికలు గ్రహించారు. కనుకనే అంతర్దైర్యంగా 'తిరిగి వెళ్ళము' అని సమాధాన మిచ్చారు. నిజానికి భగవంతుని మాటలను తోసి పుచ్చుతున్నట్లుగా పైకి కనిపించినా ఆ శక్తివంతమైన మాటలకు ఎంతో విలువ నిచ్చే గోపికలు అటువంటి తగిన సమాధానాన్ని ఇచ్చారు. కనుక భగవానుని మాటను వినకపోవడమనే దోషం వారికి అంటదు. వారి దృఢమైన మనసుకు మాట నిలకడకు సంతసించిన భగవానుడు వారికి కట్టుబడి వారితో రమణం సాగించాడు. తద్వారా గోపికలు రాసోత్సవంలో పాల్గొని ఓలలాడారు.

*" కరుణాలోకమువం బటాంచల కచాకర్షంబులవ్ మేఖలా*
*కర బాహుస్తన మర్శనంబుల నఖాంక వ్యాప్తులవ్ వర్మవా*
*క్పరిరంభణంబుల మంజులాధర సుధా పానంబువంగాంతలం*
*గరగించెవ్ రతికేళి గృష్ణుడు గృపం గందర్పు బాలార్చుమవ్"*

వేణునాదంతో తమను పిలిచిన కృష్ణుడు ఉత్సాహంతో వచ్చిన తమను వెనుకకు మరలమనే నిష్ఠుర వాక్యాలతో కలత పరచినా అందుకు వెయ్యిరెట్లు ప్రేమాతి శయంతో తమను రాసోత్సవంలో తరింపజేయడం గోపికలకు కృష్ణ భగవాను డందించిన ఐశ్వర్య వరం.

## వీరం

భగవానుడు గోపికలతో రమించగా గోపికలకు కలిగిన సౌభాగ్య జనిత గర్వాన్ని జూసి గోపికలకు కలిగిన ఆ అభిమానాన్ని పోగొట్టదలచి వారి నడుమ నుండి అంతర్హితుడయ్యాడు.

అకస్మాత్తుగా శ్రీకృష్ణుడు అంతర్ధానం కావడంతో గోపికలు తల్లడిల్లి కృష్ణ వియోగాన్ని భరించలేనివారై తపించసాగారు. శ్రీకృష్ణుని అన్వేషిస్తూ స్థావర జంగ మాలన్నింటినీ కృష్ణుని జాడ అడుగసాగారు. చివరకు ఆ అన్వేషణలో లీలలను అనుకరింపసాగారు. తమలోనే కృష్ణుడు ఉన్నట్లు తామే కృష్ణునిగా అయినట్లు భావించసాగారు. పూతన వధ, శకట భంజనం, కాళీయ మర్దనం వంటి శ్రీకృష్ణుని వీరత్వ ప్రదర్శక కార్యాలు అనుకరిస్తూ పొందిన అనుభూతితో వారు వీరులే అయ్యారు.

శ్రీకృష్ణుని పరాక్రమ చరిత్రను మననం చేసుకోవడం వలన గోపికల ఆత్మ బలం పరమాత్మ బలంతో సురక్షితమయింది. ఇదే భగవానుని 'వీర' కార్యం.

## యశం

అనంతరం గోపికాగీతాలు భగవానుని యశో గీతాలు. ఎంతకూ కనరాని గోపాలుని దర్శన స్పర్శనాదుల కోసం పరితపిస్తూ దర్శనాన్ని కోరుతూ స్తుతించసాగారు.

> **" విషజలంబు వలన విషధరదానవు**
> **వలన ఱాల వాన వలన వహ్ని**
> **వలన మన్న వావి వలనము రక్షించి**
> **కుసుమశరుని బారి గూల్పదగునె?"[52]**

అంటూ దీనంగా హృదయ విదారకంగా ప్రార్థించారు.

"నీవు యశోద బిడ్డ డవె? నీరజనేత్ర సమస్తజంతుచే
తో విదితాత్మ; వీశుడవు తొల్లి విరించి దలంచి లోకర
క్షావిధమాచరింపుమని సన్నుతిసేయగ సత్కులంబునన్
భూవలయంబు గావ నిటు పుట్టితిగాదె మనోహరాకృతిన్" [51]

అంటూ శ్రీకృష్ణుని కీర్తిస్తూ పలికే ప్రతి పలుకూ శ్రీ కృష్ణ భగవానుని యశోవిభూతిని వ్యక్తీకరిస్తుంది.

శ్రీ

భగవానుడు గోపికల హృదయ గత విలాపాలను విని వారి నడుమ ప్రకటమయి వారి విరహాన్ని దుఃఖాన్ని దూరం చేసి ఆనందాన్ని అందించడం 'శ్రీ' కారణంగా జరిగినదే.

"వచ్చిన వల్లభుగనుగొని
విచ్చే పెనటంచు సతులు వికసితముఖులై
యచ్చుగ ప్రాణములొదలికి
వచ్చిన నిలుచుండ నవయవంబుల భంగిన్" [52]

"హరిముఖకమలము జూచుచు
దరుణి యొకతె తెప్పలిడక తనియక యుండెన్
హరిపదకమలము జూచుచు
మరగి తనివి లేని మనమమాడ్కి నరేంద్రా!" [53]

గోపికలకు అన్నిటికన్నా మించిన ఆపద శ్రీకృష్ణుడు వారికి దూరమవడమే. అన్నిటిని మించిన ఆనందం కృష్ణ సందర్శనం. కృష్ణుడు వారి మధ్య ప్రకటమయి వారి ఆపదను దూరం చేసి ఆనందాన్ని కలిగించిన కారణాన ఇది భగవానుని శ్రీ గుణ ప్రదర్శకం.

## ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల...

ప్రేమ భక్తులకు ఆనంద ప్రదానం గావిస్తున్నప్పుడు జ్ఞాన వైరాగ్య నిరూపణం రసాభాస హేతువు అవుతుంది. కనుకనే అనంతరం ధర్మ నిరూపణం (జ్ఞాన వైరాగ్యాల తరువాత చెప్ప వలసిన ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల) జరుగుతుంది. శ్రీ నిరూపణ అనంతరం రమణం ఆవశ్యకత, ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల (రాసలీల) నిరూపించే అవశ్యకత ఉన్నది కనుక జ్ఞాన వైరాగ్యాలను వదలి ధర్మ స్వరూపుని (ధర్మీ) లీలలను మహారాసం ద్వారా గావించాడు.

భగవానుని పైన ఆసక్తిలో సకలాన్ని త్యాగం చెయ్యడం పుష్టి మార్గీయ వైరాగ్యం. ఈ వైరాగ్యం భగవత్తత్త్వ రూపాన్ని ఫలరూపంగా పొందిన అనంతరం కలుగుతుంది. స్వరూప ఫలం పొందిన వెనుకే భగవానుడు సర్వోత్తమంగా కనిపిస్తాడు. ఇదే జ్ఞానం. ఈ ప్రకారంగా జ్ఞానం తరువాతే వైరాగ్యం. దీనివలన అన్నీ వదలి భగవంతునే కోరుకోవడం జరుగుతుంది. అందువల్లనే ముందుగా ధర్మస్వరూపుని లీల ఫలంగా చెప్పడం జరిగింది.

పుష్టిమార్గీయ జ్ఞానం 'ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల' (ధర్మీ) అనంతరం తెలుపబడుతుంది. పుష్టిమార్గీయ జ్ఞానం కూడా భగవంతుని ప్రాదుర్భావదశలో సంభవం కాదు. ఎందుకంటే జ్ఞానం సంయోగం మధ్యలో జరిగింది. విప్రయోగ అవస్థలో జరిగింది. కనుక ముందు ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల (మహారాస లీల) జరిగింది.

### వైరాగ్యం

భగవంతుని కాక (శ్రీహరిని) ఇతరులను ఆశ్రయించడం వలన అనిష్టం కలుగు తుంది. ఈ అన్యాశ్రయాన్ని నివారించడానికి చేసిన కార్యం వైరాగ్యాన్ని కలిగిస్తుంది. నందరాజా అంబికావ్రతం చేశాడు. ఇది అన్యాశ్రయాన్ని

కోరినట్లయింది. కనుక సర్పానికి పట్టుబడ్డాడు. సర్పానికి పట్టుబడిన నందరాజు భీతితో 'కృష్ణ కృష్ణే'తి వచనాలతో తన్ను విడిపించమని కృష్ణుని శరణు వేడాడు. కృష్ణుడు వెంటనే సర్పం బారి నుండి నందుని రక్షించాడు.

జ్ఞానం

ముందు తెలిపినట్లుగా 'పుష్టి మార్గ జ్ఞానం' విరహదశలో కలుగుతుంది.

పగటి వేళ కృష్ణుడు గోపాలనకై వెళ్ళగా గోపాంగనలు కృష్ణుని తలచుకుంటూ విరహసూచకాలయిన గీతాలను ఆలపించ సాగారు. గోపికలు చేసిన ఈ కృష్ణ గుణగానంలో జ్ఞానం ప్రకాశమవుతుంది. కనుక ఇది జ్ఞాన కార్యం.

> "నవమాధుర్యముగల్గు కృష్ణు మురళీనాదామృత వ్యందముల్
> పెవులం జొచ్చి హృదంతరాళముల భాపిల్లన్ నవత్పంబులై
> యువిదా! మేపులకుం దొఱంగి మృగ గోయూథంబులు త్కంఠతో
> దివికింగంఠములెత్తి లో వదలు బో దేహేంద్రియ వ్యాప్తులన్"

ఈ విధమైన గీతాలాపాలతో విరహంలోనే పరమాత్మ జ్ఞానాన్ని పొందారు గోపికలు.

తామస ఫల ప్రకరణంలో ఈ విధమైన ఐశ్వర్యాది భగవద్గుణాలను దర్శించవచ్చును.

మర్యాదా మార్గం కన్నా భక్తి మార్గం విలక్షణమయినదిగా కనిపిస్తుంది. మర్యాదా మార్గంలో కామం ముక్తికి ప్రతి బంధకంగా చెప్పబడుతుంది. అదే కామం భక్తి మార్గంలో భగవత్ప్రాప్తిని కలిగిస్తుంది. మర్యాదా మార్గంలో సాగే భక్తి ద్వారా భగవంతుని ఆవిర్భావం అవుతుంది. భక్తి మార్గంలో కామవశమయినందున దీవత్వ ప్రకటనం వల్ల భగవానుడు ప్రకటమవుతాడు. ఈ విధంగా ప్రకటమయిన ప్రభువు పట్ల కామశాస్త్రాను సారంగా స్నేహం కలుగుతుంది.

బ్రహ్మాది దేవతలకు సాధన వల్లకూడా దుర్లభం అయిన ఫలితాన్ని కృష్ణ భగవానుడు నిస్సాధనులయిన వ్రజవాసులకు అధీనుడై అందించాడు. ఈ కారణంగా వ్రజభక్తులను అన్ని విధాలా శ్రేష్ఠులుగా చెప్పడం జరుగుతుంది. ఏవిధంగా గజం కామవశాన ఆడ ఏనుగు వద్దకు స్వయంగా వస్తుందో అదే విధంగా భగవానుడు స్వయంగా కామవశుడై (వ్రజభక్తుల కామానికి వశుడై) భక్తుల సన్నిధికి వస్తాడు. తనసాన్నిధ్యాన్ని ప్రేమను, తన స్నేహాన్ని భక్తులకు అందిస్తాడు. ఈ విధానం మర్యాదా మొదలయిన మార్గాలలో జరగడం అసంభవం. పుష్టి మార్గానుసారం వ్రజవాసులు తామస భక్తులు. కనుకనే తామస ప్రకరణంలో ముందుగా చెప్పడం జరిగింది.

## రాజస ప్రకరణం

రాజస భక్తులకు భగవంతుని పట్ల ఆసక్తిని కలిగించే ప్రకరణమిది. దీనిలో రాజస ప్రమాణ, రాజస ప్రమేయ, రాజస సాధన, రాజస ఫల ప్రకరణాలున్నాయి. ఒక్కొక్క ప్రకరణంలోనూ తిరిగి ఐశ్వర్యాది షడ్గుణాల నిరూపణమూ ఉంటుంది.

### రాజస ప్రమాణ ప్రకరణం

ప్రమాణాల సాయంతో భగవచ్చరిత్రలోనూ, భగవంతుని పైనమూ రాజస భక్తులకు ప్రీతి స్థిరపడిన ప్రసంగం కనుక ఇది రాజస ప్రమాణ ప్రకరణం.

ప్రమాణాలను చూపడంలో నారదుడు ప్రథముడు. భగవానుడు దేవకీ పుత్రుడేనని ప్రమాణాలతో కంసునికి తెలిపాడు. నందునికి వసుదేవునికి పుత్రుడుగా ఉన్నవాడు భగవానుడని అక్రూరుడు ప్రమాణాల ద్వారా తెలిపాడు. ఇక నందుడు వ్రజంలో కృష్ణుని భగవంతునిగా ప్రసిద్ధిచేశాడు. గోపికలు తమకు తాము కృష్ణుని భగవంతుడిగానే బుద్ధి స్థిరపరచుకున్నారు. వ్యూహారూపహారి అక్రూరునికి పురుషోత్తమ తత్త్వాన్ని జ్ఞానాన్ని తెలియజేశాడు.

కుబ్జ వల్ల మధురా నగర స్త్రీలకు కృష్ణుని దైవత్వం వెల్లడయింది. ఈ విధంగా ఇందులోని అంశాలు ప్రమాణాలను చూపేట్లు ఉన్నాయి.

## ఐశ్వర్యం

రాజస ప్రమాణ ప్రకరణంలో భగవానుని 'స్వతంత్రత' ఐశ్వర్య బోధకంగా ఉంది. **भगवान की स्वतंत्रता स्पष्ट ऐश्वर्य - बोधक है। ऐश्वर्य नाम स्वतंत्रता अर्थात्‌ कर्तुम, अकर्तुम अन्यथा कर्तुं सामर्थ्य का नाम ऐरवर्य है।**[57] అన్న మాటలు భగవానుని స్వతంత్రని ఐశ్వర్యాన్ని నిరూపిస్తుందని తెలుస్తోంది. భగవానునికి స్వతంత్రత అంటే వ్రజభక్తుల ప్రేమతో మానసికంగా శారీరకంగా బందీ అయిన కృష్ణునికి వ్రజం నుండి మధురకు వెళ్ళే అవకాశం రావడమే స్వతంత్రతగా భావించాలి.

కంసుని చంపే శత్రువే కృష్ణుడనీ గోకులంలో ఉన్నవాడు దేవకీ గర్భజనితుడేనని కంసునికి తెలియదు.

*నానరసన్ జనించినన్ - జంపెడి వీరు*
*డొక్కదెస నత్స్కృతి నొందెడు వాడుదుర్మతీ*[58]

అని కంసుడు చంపబోయిన యోగమాయ తెలిపి వెళ్ళగా కంసుడు "కాలపాశ బద్ధుడై విప్రాది సాధు మానవుల జంప దానవులం"[59] పంపాడు. ఆనాటి నుండి దైత్య వీరులు వెదకి వెదకి సాధువులను అణచసాగారు.

కంసుని ఆజ్ఞతో వచ్చిన పూతన బాలలను చంపుతూ బాల భగవానుని వెదకుతూ వచ్చి హతమయ్యింది. తరువాత ఎంతోమంది కంసుని అనుచరులు కృష్ణుని దగ్గరకు వచ్చి కృష్ణుని చేతిలో హతమయినా, కంసుడు వారందరినీ కృష్ణుడే తన శత్రువని తెలిసి పంపినట్లుగా కనబడదు. సంస్కృత భాగవతంలో కూడా ఒక్కొక్కరాక్షసుడు కృష్ణుని దగ్గరకు వెళ్ళి హతమవ సాగారేగానీ కృష్ణుని సమాచారం కంసునికి చేరవేసినట్లుగా కనబడదు.

కంసుడు పంపిన రాక్షసులు అన్ని వైపులా వెళ్ళి పజ్జములను బాధ పెడుతూ కంసుని శత్రువును వెతుకుతూ వెతుకుతూ చివరకు కృష్ణుని దగ్గరకు వచ్చి యుండినట్లుగా భావించవచ్చు. కృష్ణుడే తన శత్రువని తన అనుచరులను కృష్ణుడే చంపుతున్నాడని కంసునికి నారదుని ద్వారానే తెలిసింది.

అరిష్టాసురుని శ్రీకృష్ణుడు చంపిన అనంతరం నారదుడు కంసునితో -

*"..........................................................యశోద గూతుదా*

*గమటయు జక్రిదేవకికి గర్భు తనంబున మోసపుచ్చెనీ*

*బడుగును బట్టి చంపుటిది భావ్యమని' ....*"[61] అంటూ

కంసుడు పొందిన ఉద్వేగం చూసి నట్లయితే వసుదేవుడే తన పుత్రులను మందలో దాచి తనను మోసగించాడని అప్పుడే నారదుని ద్వారా కంసుడు తెలుసుకున్నట్లుగా స్పష్టమవుతుంది. కంసుడు క్రోధంతో వసుదేవుని చంపబోయాడు. నారదుడడ్డుకోగా ఆగాడు. కారాగారంలో ఉంచాడు. పూతనను పంపిన తరువాత, రామకృష్ణులు తన శత్రువులని తెలిసినప్పుడే కేశిని పంపాడని పూతన తప్ప 'కేశి' కన్నా ముందు వచ్చిన అనుచరులు రామకృష్ణుల దగ్గరకు కంసుని చేత పంపబడ్డ వారు కారని వారు అన్ని చోట్ల తిరుగుతూ కృష్ణుని దగ్గరకు వారంతట వారు వచ్చారని అనిపిస్తుంది. నారదుని మాటలతోనే మొదటిసారిగా బలరామ కృష్ణుల గురించి గ్రహించిన కంసుడు చాణూర ముష్టిక సాల్వకోసల ప్రముఖులను రావించి వారితో -

"ఎందున్ వన్నెదిరించి పోవుటకు దేవేంద్రాదులుంజాలరీ

బృందారణ్యము మంద నిప్పుడు మదాభీరార్భకుల్ రామగో

విందుల్ వర్థిల్లుచున్నవారట రణోర్వింగంమవింద్రుంతుమం
చున్ దర్పంబులు వల్కుచుందురట, యీ చోద్యం బులవ్ వింటిరో

అని ఆశ్చర్యంతో తనకు తెలిసిన విషయాన్ని వెల్లడించి వారి రాకకై మల్ల యుద్ధాలను ఏర్పాట్లు గావించాడు.

తన మరణానికి సన్నాహాలు గావించుకోనారంభించాడు కంసుడు. వ్రజవాసుల ప్రేమాభిమానాలకు బందీ అయివున్న కృష్ణుడు బృందావనం నుండి బయటకు మధురకు రావడానికి సన్నాహాలు జరుగసాగాయి.

నారదుని ద్వారా శ్రీకృష్ణుని ఉనికి ప్రకటనం, తామస భక్తుల నుండి రాజసభక్తుల దగ్గరకు వారి నుద్ధరించే నిమిత్తం కదలివచ్చే సందర్భంగా జరుగుతున్న ఏర్పాట్లు కృష్ణుని ఐశ్వర్యగుణాన్ని వ్యక్తం చేస్తున్నాయని చెప్పవచ్చు. తామసభక్తుల నుండి లోక కళ్యాణార్థం రాజస భక్తుల దగ్గరకు రావడంలో కృష్ణుని' స్వతంత్రతా పూర్వకమైన ఐశ్వర్యం వెల్లడవులోంది.

వ్రజంలో ఉన్నంత వరకు వ్రజవాసుల ఇష్టానుసారంగా ప్రవర్తించిన కృష్ణుడు రాజస భక్తుల వద్దకు వచ్చినప్పటి నుండి తన ఇష్టానుసారమే ప్రవర్తించినట్లు స్పష్టం అవుతుంది.

## వీరం

కేశివ్యో మాసురులనే దుష్ట దైత్యులను వీరత్వాన్ని ప్రదర్శించి వధించాడు.

## యశం

బలరామ కృష్ణులను మధురకు ఆహ్వానించడానికి కంస ప్రేరితుడై అక్రూరుడు వచ్చాడు. అక్రూరుడు సహజంగా సాత్త్వికుడే అయినా కంస సంగ దోషంతో తామస రాజసాలకు కొంత లోనయ్యాడు. అందుకనే దుష్టునికి దూరంగా ఉండలేకపోయాడు.

అక్రూరుడు కంసునికి ఎంతో నమ్మకస్తునిగా ఉన్నాడు. కనుకనే బలరామ కృష్ణులను చంపిస్తానని యదు వంశాన్ని నాశనం చేస్తానని కంసుడు తన మనసులోని మాటను అక్రూరునికి నిష్పంకోచంగా చెప్పగలిగాడు. శత్రువును వెంట నుంచుకు తెమ్మనిన గురుతర బాధ్యతను అప్పగించాడు.

అక్రూరుడు ఏమాత్రం వ్యతిరేకత చూపక కంసునికి ఎదురు చెప్పక -

"పంపిన బోవివాడవె నృపాలక ... యీశ్వరేచ్ఛ
దప్పింపకరాదు నీపగతు బిడ్డలదెచ్చెద బోయివచ్చెదవ్" [5]

అంటూ తెలిపాడు. కంసుడు అక్రూరుని తన 'ఇతర అనుచరులను పంపిన బుద్ధితోనే' పంపాడు. సహజంగా సాత్త్వికుడు దైవాన్నీ విధిని నమ్మినవాడు అయిన అక్రూరునికి ఈ కార్యం సదవకాశంగా పరిణమించింది. బయలుదేరినప్పుడు తటస్థభావంతో బయలు దేరిన అక్రూరుడు నందగోపకులానికి పోతున్న మార్గంలో తానెంతటి సదవకాశాన్ని అదృష్టాన్ని పొందుతున్నాడో అర్థం అయింది.

"మూరులు దొల్లి యే విభుని శోభితపాదనఖ ప్రభావళిం
జేరి భవాంధకారముల జిక్కక దాటుదురట్టి దేవునిన్
వైరములోడనైన గెలువన్ నమలంచి శుభంబు పేపెని
ష్కారణమై ప్రేమనిదె కంసుని బోలు సఖుండుగల్గునే"[6]

అంటూ కంసునికి మనసులోనే కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

శ్రీ కృష్ణుని బ్రహ్మ తత్త్వాన్ని సుందర వదనారవిందాన్ని పతితపావన తత్త్వాన్ని మాటి మాటికి తలచుకుంటూ పయనించడంతో అక్రూరునిలో ఏమూలో దాగియున్న రాజస గుణ తామస గుణ దోషాలు దూరమయ్యాయి. సాత్త్విక గుణ వ్యాప్తి జరిగి భగవంతుని చేరే యోగ్యత సిద్ధించింది.

బృందావనానికి వెళ్ళి వారిని చూసి పాదాలపైపడి వివశుడైన అక్రూరుని చక్ర చిహ్నిత హస్తంతో భక్త వత్సలుడైన శ్రీ కృష్ణుడు కౌగిలించాడు. అంతకు మించిన సన్మానం అక్రూరునికి ఏముంటుంది?

కంసుని వద్ద బయలు దేరినప్పుడు ఉన్న దంభ భయ శోకాదులన్నీ మటు మాయమయి భగవద్దర్శన స్పర్శనాలింగనాదులు లభించాయి. భాగవత్సాంగత్యం లభించడం వల్ల కు(కంస) సంగ దోషాలన్నీ పరిహారమయ్యాయి. తత్ఫలితంగా భగవంతుని ద్వారా అక్రూరునికి 'యశం' ప్రాప్తించింది. అక్రూరుడు తేజోవంతుడయ్యాడు. ఇది భగవంతుని యశోలీల.

శ్రీ

గోపికలకు కృష్ణ వియోగం కన్నా మించిన ఆపద దుఃఖం లేదు. కంటికి కృష్ణయ్య దూరం అవడమే వారికి కలిగిన ఆపద. అక్రూరుని వెంట కృష్ణుడు మధురకు వెళ్ళిపోతున్నాడనగానే వారు తల్లడిల్లిపోయారు. అంతులేని దుఃఖానికి లోనయ్యారు. అక్రూరుని వెంట వెళ్ళిపోతున్న కృష్ణుని రథం వెనుకే వడిచి వెళ్ళసాగారు.

ఎనలేని దుంఃఖంతో తమ రథంవెంట వస్తున్న గోపికలను చూసినకృష్ణుడు 'మరలి వత్తునని' సందేశాన్ని పంపాడు.

అది విన్న గోపికలు మనసు చిక్కబట్టుకుని కృష్ణుని మాట పైని విశ్వాసంతో నిలచిపోయారు. ఆక్షణం మంచి భగవానుని రాకకోసం ఆశతో ఎదురుచూస్తూ జీవించసాగారు. 'తిరిగివస్తా'నన్న ఒకే ఒక్క మాటతో వారికి ఉపశమనాన్ని వారి ప్రాణాలకు రక్షణ కలిగించి ఆనందాన్ని ప్రసాదించాడు. కనుక ఇది శ్రీ ప్రదమైన (ఆనంద ప్రదమైన) కార్యం.

## జ్ఞానం

బలరామ కృష్ణులను బృందావనం నుండి మధురకుతీసుకుపోయే సందర్భంలో దారిలో యమునానదిలో (బ్రహ్మహ్రాదంలో) అక్రూరుడు స్నానార్థం దిగగా జలంలోనూ రథం మీదా ఒకేసారి బలరామకృష్ణులను చూసి ఆశ్చర్యపడ్డాడు. 'మనో విభ్రాంతియో' అని తలచసాగాడు. ఆ విభ్రాంతి పోయి అక్రూరునికి సత్యస్వరూపం అర్థం అయ్యే విధంగా జలంలో -

*ఆ భోగి భోగ పర్యంక మధ్యంబున*
*వలనొప్పు వచ్చని వలువ వాని*
*మేఘంబు పైమన్న మెఱుగుచందంబున*
*నురమున శ్రీదేవి యొప్పువాని*
*మునరు తేటులు విప్ప ముఖ చతుష్కముగల*
*తన యుదాడెడి బొడ్డుదమ్మివాని*
*గదలిన బహువద క్రమ విశేషంబుల*
*రవము సూపెడి నూపురములవాని*

*జలజగర్భరుద్ర సనక సనందన*
*సద్ద్విజామర ప్రశస్యమాన*
*చరితుడైనవాని సౌందర్యఖనియైన*
*వాని నొక్క పురుషవర్యుగాంచె*

భగవంతుడు అక్రూరుని భావనకు అనుగుణంగా తన నారాయణ స్వరూపాన్ని నీటిలో అక్రూరునికి దర్శింపజేసి స్వమాహాత్మ్య జ్ఞానాన్ని కలిగించాడు. అక్రూరుడు స్తుతించిన స్తుతిలో జ్ఞానం ప్రకాశిస్తుంది.

## వైరాగ్యం

శ్రీకృష్ణుడు బలరామ సహితుడై రథంలో మధురకు వచ్చిన అనంతరం, అక్రూరుడు బలరామ కృష్ణులతో

*నాయింటికి విచ్చేయుము*
*నీయంఘ్రి సరోజరేణు నికరము సోకన్*
*నాయిల్లు పవిత్రంబగు*
*శ్రీ యుతనీ భటుని బెద్దసేయందగదే?"*

అంటూ ప్రార్థించాడు. దానికి కృష్ణుడు నిరాకరించి కంసుని నిహతుని చేసిన అనంతరం వస్తానని చెప్పగా అక్రూరుడు ఆ మాటలకు తలవంచి సమ్మతించి వెళ్ళిపోయాడు. కంస సేవకుడైన అక్రూరునికి తనపట్ల ఆసక్తిని పెంచి లౌకిక వైరాగ్యాన్ని కలిగించిన వైనం ఇది.

కుబ్జ

కంసదాసి అయిన కుబ్జను చందనం సమర్పించిందన్న కారణాన కంసుని దాస్యం నుండి విముక్తి చేసి, తనపట్ల ఆసక్తిని పెంచేట్లు చేసిన విధానం సైతం వైరాగ్యం వ్యక్తం చేస్తుంది. త్రివక్ర ముష్వంకలు పోయాయి. తన సత్త్వ రజస్తమో గుణాలను భగవత్పరం చేసి గుణాతీతమయి లౌకిక వైరాగ్యాన్ని పొందింది.

## ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల

బలరామకృష్ణులు మధురకు ధనుర్యాగ నెపంతో వచ్చారు. రామకృష్ణులు మధురకు వచ్చి ధనుర్భంగం గావించి కంసుని మనో బలాన్ని భంగం చేశారు.

*"కోదండ భంగ నిర్గత*
*నాదము నీమలకు భీషణంబయి యాశా*

రోదోంతరములు విందుచు
భేదించెన్ భోజవిభుని బింకము వధిపా[7]

అంటూ కంసుని గుండె చెదరిన విధానం భాగవతం తెలుపుతుంది. ఇది ధర్మ స్వరూపుని లీలాకేళి.

కుబ్జకు సౌందర్య దానం చేసి యాదవులకు తనపట్ల ఆసక్తిని పెంచి కంసాది దుష్టులను వధించి వసుదేవ పుత్రత్వం బ్రహ్మత్వం మొ॥ వాటిని యాదవులకు ప్రమాణాలతో తెలియజేశాడు.

## రాజసప్రమేయ ప్రకరణం

ప్రమాణాల ద్వారా యథార్థ జ్ఞానం వెల్లడవుతుంది. అది భగవానుని తెలుసుకోగలగడమే. యథార్థంగా తెలుసుకోదగిన (ప్రమేయాన్ని) భగవద్బలాన్ని బోధించేదే ప్రమేయ ప్రకరణం. ఈ ప్రకరణం లోనూ ఐశ్వర్యాది అంశాలు ఆరు, ఒక ధర్మ స్వరూపుని (ధర్మి) లీల ఉంటాయి.

### ఐశ్వర్యం

కువలయాపీడాన్ని వధించే ఘట్టం భగవానుని ఐశ్వర్య గుణ ప్రదర్శకం. రాజద్వారం దగ్గర కంసుని ఆజ్ఞానుసారం నిలిపిన గజంతో కృష్ణుడు పోరాడి దాన్ని ముప్పు తిప్పలు పెట్టి కింద పడవేసి పాదాలతో అదిమిపట్టి దంతాన్ని పెరికిదానితో గజాన్నీ, మావటిని చంపి దంతాన్ని పట్టుకుని మల్లయుద్ధరంగ స్థలానికి వచ్చాడు.

మూపున కరిదంతాలతో మోముపైని చెమట బిందువులతో ఏనుగు రక్తంతోనూ మదంతోనూ శోభిల్లుతూ వచ్చిన కృష్ణ భగవానుని రూపం మల్లురకు పిడుగులాగానూ దుష్టరాజులకు శాసకునిగానూ కంసునికి మృత్యువుగానూ, మానవులకు పురుషోత్తమునిగానూ మూఢులకు విరాట్పురుషునిగానూ స్త్రీలకు

మూర్తీభవించిన మన్మథునిగానూ గోపాలురకు బంధువుగానూ తండ్రులకు శిశువుగానూ యోగులకు పరమతత్త్వం గానూ వృష్ణి వంశీయులకు పరమదేవతగానూ కనబడి తన ఐశ్వర్యంతో అందరి మనస్సుల్లోనూ సంచలనాన్ని చైతన్యాన్ని కలిగించాడు.

ఇది కృష్ణ భగవానుని మహాత్స్వరూపం కనుక ఇది ఐశ్వర్య ప్రదాయకం.

## వీరం

కంస, చాణూర, ముష్టికుల వధ కృష్ణుని వీరత్వ సూచకాలు. కృష్ణుని చూసినంతనే మల్లురలోనూ కంసునిలోనూ వీరావేశమే ఉప్పొంగింది. వీరావేశంతో విర్రవీగే ఆనరరూప రాక్షసులను వీరత్వాన్ని ప్రదర్శించి మట్టుపెట్టాడు కృష్ణుడు.

## యశం

మధురకు వచ్చి అనేకులనుద్ధరించి తల్లిదండ్రులను తాత ఉగ్రసేనుని చెర నుండి విడిపించిన కృష్ణ భగవానుడు మధురా నగర సింహాసనం మీద ఉగ్రసేనుని రాజుగా అధిష్ఠింప జేసి తానూ యశోవంతు డయ్యాడు.

కంసుని భయంతో పారిపోయి, విదేశవాస క్లేశులయిన యాదవులు వృష్ణులు మొ॥ బంధువులను ఆత్మీయులను నానాదేశాల నుండి రప్పించి గౌరవించి వారందరికి అర్ఘాదులను ఇచ్చి సంతుష్టపరచి రక్షణ కల్పించాడు. వారి సర్వ సంతాపాలు రామకృష్ణులు పోగొట్టి తమ యశఃకాంతిని నాలుగు చెరగులా వ్యాపింపజేశారు.

## శ్రీ

గోకుల వాసులు శ్రీకృష్ణ వియోగానికి బాధపడుతుండగా వారి బాధను దూరం చేసే నిమిత్తం తన సమాచారాన్ని సందేశాన్ని ఇచ్చిరమ్మని ఉద్ధవుని పంపాడు.

లౌకిక మొల్లకనన్నా
లోకించు ప్రపన్నులకును లోబడి కరుణా
లోకనముల బోషింతును
నాకాశ్రిత రక్షణములు నైసర్గికముల్-"[68]

అని ఉద్ధవునికి తెలిపి 'సందేహము మానుండరవిందాననలార మిమ్ము విడువను వత్తున్ బృందావనమున'[69] కని హరి సందేశం పంపినట్లుగా వారికి తెలుపమన్నాడు. తనను విడచి ఉండలేని గోపికలకు గోపాలురకు తాను తప్పక వస్తాననే అమృత వాక్కులందించి వారిని ఆనందాంబుధిలో తేలించాలని శ్రీకృష్ణుడు చేసిన ప్రయత్నం 'శ్రీ'గుణ ప్రదర్శకం.

జ్ఞానం

శ్రీకృష్ణుని మాటలుగా ఉద్ధవుడు గోపికలతో తెలిపిన -

"భవతీనాం వియోగోమే నహి సర్వాత్మనాక్వచిత్
యథాభూతాని భూతేషు ఖంవాయ్వ గ్నిర్జలంమహీ
తదాహంచ మనః ప్రాణ భూతేంద్రియ గుణాశయః"[70]

అనే మాటలు జ్ఞాన ప్రకాశకాలు. నేను సర్వాత్ముడను. అందువలన మీతో నాకెప్పుడు వియోగము కలుగదు. ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి అనునవి చరాచర భౌతిక పదార్థాల యందున్నట్లుగా నేను గూడ మీ మనస్సు, ప్రాణం, పంచభూతాలు, ఇంద్రియాలు, గుణాలు అనే వాని కాశ్రయ రూపంగా వానియందే ఉన్నానన్నాడు.

ఎల్లకార్యములకు నేను బ్రధాన
కారణముగా వుద మీకు రమణులార

గలుగదు మద్వియోగము చరాచర
రూపములలో మహాభూతములు వసించు
కరణి నుండుదు సర్వగతుడనై
నే మనః ప్రాణబుద్ధి గుణేంద్రియాశ్రయుండ
నాత్మయందాత్మచే నాత్మ బుట్టింతు
రక్షింతుమ ద్రుంతు వ్యాపీక భూత

గుణగణాకార మాత్మకు గొమరు మిగులు
విబిడ మాయాను భవమున నిత్యశుద్ధ
మాత్మ విజ్ఞాన మయమునైయ మరుగుణము
బ్రకృతి కార్య మనోవృత్తి బట్టిపొందు"[71]

అంటూ తన సహజ తత్త్వాన్ని వారికి జ్ఞాన రూపంలో అందించాడు కృష్ణుడు.

## వైరాగ్యం

శ్రీకృష్ణుడు కుబ్జా అక్రూరాదులపై కృపతో వారిళ్ళకి వెళ్ళి వారిని లౌకికంగా విముక్తులుగాను తనపట్ల పరమాసక్తులు గాను చేశాడు. ఇది వైరాగ్య ప్రదాన కార్యం.

## ధర్మ స్వరూపుని (ధర్మి) లీల

శ్రీకృష్ణుడు అక్రూరుని పంపి ధృత రాష్ట్రునికి పాండవుల రక్షణను గురించి శ్రద్ధ తీసుకోమని చెప్పమని పంపాడు. (అయినా ధృతరాష్ట్రుడు మాట వినకపోవడంతో భారత యుద్ధం జరిగి భూభారం తీరింది). ఇది ధర్మస్వరూపుని కార్యం.

ప్రమేయ ప్రకరణంలో ఏడుగురు భక్తుల ఏడుగురు శత్రువుల గురించిన వృత్తాంతాలున్నాయి. వసుదేవుడు, యాదవులు, పుత్రదానం చేయబడిన గురువు, యశోదానందులు, కుబ్జా గోపికలు, అక్రూరుడు, పాండవులు, భక్తులు. సప్త శత్రువులు - కువల యాపీడం, చాణూర మల్లుడు, ముష్టికుడు, కూటశత, తోషలకులు, కంసుడు. ఈ ఏడుగురు ద్వేషుల వర్ణనం జరిగింది. భగవంతుని ప్రాకట్యానికి కారణం అందరికీ మోక్షాన్ని కలిగించడం. అందుకే తనను ద్వేషించే వారికి కూడా మోక్షాన్నిచ్చి ప్రమేయ బలాన్ని చూపించాడు. స్నేహం వల్లనో భయం వల్లనో భగవానుని పట్ల ఆసక్తి కలుగడం ముఖ్యం. కనుకనే కంసాదులు భగవానుని పట్ల భయంతో నయినా నిరంతరం తలచుకున్నారు.

## రాజస సాధన ప్రకరణం

దుఃఖ నివారకం అవడం వల్ల భగవానుని పట్ల ఏకాగ్రత కుదరడమే సాధన. ఈ విధమైన సాధన ద్వారా నిరోధం సిద్ధిస్తుంది. అందువలన ఇది సాధన ప్రకరణం. ఇందులోనూ పూర్వంలాగా భగవంతుని ఆరుగుణాలు, ధర్మ స్వరూపుని (ధర్మి) లీల వెల్లడవుతాయి.

### ఐశ్వర్యం

కంస వధానంతరం కంసుని మామ అయిన జరాసంధుడు కృష్ణుని పైన పగబట్టి అశేష దండయాత్రలు జరిపాడు. కృష్ణుడు జరాసంధుని చంపకుండా, భూభారహరణమే ధ్యేయంగా కలిగి జరాసంధుని సైన్యాన్ని నాశనం చేసి ఓడించి పంపాడు. జరాసంధుడు దుష్టరాజాలను కూడగట్టుకుని మళ్ళీ మళ్ళీ 17 సార్లు రాగా ప్రతిసారి అతని సైన్యాన్ని కృష్ణుడు నాశనం చేసి పంపాడు. జరాసంధునిపై ఇన్నిసార్లు భగవానుడు విజయం పొంది విజయోత్సవాలాచరించడం భగవానుని ఐశ్వర్యగుణ వ్యక్తీకరణమే.

అనంతరం జరాసంధునితో బాటు కాలయవనుడు కూడా కృష్ణునిపైకి యుద్ధానికి రావడంతో సముద్రం మధ్యలో ద్వారకానగరాన్ని అద్భుతంగా నిర్మింపజేసి మధురానగర వాసులను ద్వారకకు తరలించడం కూడా భగవానుని ఐశ్వర్యకార్యమే.

### వీరం

జరాసంధ కాలయవనులను స్వయంగా చంపక భీమ ముచికుందుల ద్వారా చంపించడంలో భగవానుని యుక్తి వీరం వెల్లడవుతుంది.

ముచికుందుడు దీర్ఘనిద్రలో ఉన్న గుహలోకి కాలయవనుని రప్పించడం, ముచికుందుని నిద్రాభంగం చేసిన కారణంగా అతని కంటి మంటలకు కాలయవనుడు మండి భస్మం కావడం జరిగింది. భగవంతుడు ముచికుందునికి దర్శనమిచ్చి సాధనయుత ఉపదేశం ఇవ్వడం అనేది కూడా భగవానుని యుక్తి వీరానికి సంబంధించిన కార్యమే.

భగవానుని దర్శనమైనా ముచికుందుడు ముక్తిని పొందలేదు. సాధనానంతరమే ఫలం గనుక సాధన చేయమని ఉపదేశించాడు. ముచికుందుడు ప్రారబ్ధకర్మననుభవించాల్సి ఉంది. దర్శనమాత్రాన ముక్తి లభిస్తే సాధన చేయవలసిన జీవులు సాధనను విస్మరిస్తారు. శ్రీకృష్ణుడు మర్యాదామార్గంలో ఉన్న జీవుల ప్రారబ్ధకర్మలను నాశనం చెయ్యడు. కనుకనే ముచికుందుని నిద్రా వ్యసనంనుంచి దూరం చేసి సాధనానంతరం జన్మాంతరంలో ముక్తి లభిస్తుందన్నాడు (ముచికుందుడే కలియుగంలో నరసింహమెహతాగా జన్మించి హరిభజన గావించి ముక్తి నొందాడని ఒక అభిప్రాయం).

### యశం

రుక్మిణీ దేవి శ్రీకృష్ణుని గురించి

"ఏనీ గుణంబుల కర్ణేంద్రియంబులు సోక
దేహ తాపంబులు తీరిపోవు
నేనీ శుభాకార మీక్షింప గన్నుల
కఖిలార్థలాభంబు గలుగుచుండు
నేనీ చరణ సేవ లేప్రొద్దు జేసిన
భువనోన్న తత్త్వంబు బొందగలుగు
నేనీలసన్నామమే ప్రొద్దుభక్తితో
దడవిన బంధసంతతులు వాయు"[72] ననీ

"ధన్యున్ లోకమనోభిరాము గుల విద్యారూపతారుణ్యసౌ
జన్యశ్రీ బలదాన శౌర్యకరుణా సంశోభితున్ నిన్ననే
కన్యల్ గోరరు కోరదేమున్ రమాకాంతాలలామంబు"[73]

అంటూ బ్రాహ్మణుని ద్వారా శ్రీకృష్ణునికి అందించిన నివేదనలో శ్రీకృష్ణుని యశోగుణం వర్ణితమయింది.

## శ్రీ

రుక్మిణీ వివాహం శిశుపాలునితో నిర్ణయింపబడగా రుక్మిణి ఆహ్వానాన్ని అందుకుని వచ్చి కృష్ణుడు రుక్మిణికి కలిగిన దుఃఖాన్ని ఆపత్తును దూరం చేసి తన దరి చేర్చుకుని ఆనందాన్ని కలిగించాడు. ఇదిశ్రీకృష్ణుని శ్రీగుణ ప్రదర్శకం.

## జ్ఞానం

రుక్మిణీ హరణ సమయంలో తన పోరుకు దిగిన 'రుక్మి'ని విరూపుని చేసిన తరువాత బలరాముడి ద్వారా రుక్మిణికి ఇచ్చిన ఉపదేశ వాక్యాలు జ్ఞానాన్ని సూచిస్తాయి.

## వైరాగ్యం

మరణించిన గురు పుత్రుని తెచ్చియిచ్చిన కృష్ణుడు తనకు రుక్మిణికి కలిగిన పుత్రుని పురిటిలోనే శంబరాసురుడు అపహరించి తీసుకుపోయినా తెచ్చే ప్రయత్నమేదీ చెయ్యలేదు. అనంతరం మాయదేవి రూపంలో నున్న రతీదేవి ఆ బాలుని గుర్తించి పెంచి అదను చూసి శంబరాసురుని చంపించి ద్వారకకు వచ్చిన సందర్భంలో రుక్మిణ్యాదులు శ్రీకృష్ణుని పోలికతో వెలిగొందుతున్న ప్రద్యుమ్నుని గూర్చి వివరాలు తెలుసుకోగోరుతూ అనేక రకాలుగా విచారించుతున్నా కృష్ణుడు మాత్రం 'సర్వజ్ఞుండయు నేమియు వివరింపక యూరకున్నాడు. అంతకాలం తరువాత పుత్రుని చూసి కూడా కృష్ణుడు ఎటువంటి భావాలూ ప్రదర్శించక పోవడం వైరాగ్యం.

## ధర్మ స్వరూపుని (ధర్మి) లీల

తనమీద పడిన స్యమంతకమణి అపహరణ అపవాదు తొలగించుకుని, జాంబవంతునికి శ్రీరామావతారంలో ఇచ్చిన వరాన్ని తీర్చే నిమిత్తం జాంబవంతునితో 18 దినాలు యుద్ధం చేశాడు. ఆ సందర్భంలో శ్రీ కృష్ణుని గుర్తించిన జాంబవంతుడు 'దేవా నిన్ను బురాణ పురుషువధీశ్వరు విష్ణుం బ్రభవిష్ణుగా నెఱుంగుదు. సర్వ భూతంబులకుం బ్రాణ ప్రతాప ధైర్య బలంబులు నీవ; విశ్వంబునకు సర్గ స్థితిలయంబు లెవ్వరాచరింతురు వారికి సర్గ స్థితిలయంబులు జేయు నీశ్వరుండవు నీవ; యాత్మవు నీవ' అని స్తుతించిన తీరు శ్రీకృష్ణుని యథార్థ స్వరూపాన్ని వర్ణించుతుంది. గనుక ఇది ధర్మ స్వరూపుని (ధర్మి) లీలా కార్యం.

ఈ విధంగా తత్తల్లీలల ద్వారా ఏకాగ్ర చిత్తాన్ని కలిగించిన తీరు ఈ 'సాధన ప్రకరణం'లో కనిపిస్తుంది.

వ్యసనం (దుఃఖం)లో ఉన్న జీవులను లౌకిక దుఃఖం నుంచి ముక్తులను జేసి భగవద్వ్యసనుల చేయడమే ఇక్కడ ముఖ్య ఆశయము. లౌకిక వ్యసనం నుండి దూరం అయి భగవద్వ్యసనులుగా అవడం వల్ల దుఃఖ నివారణ అయి భక్తునికి భగవంతుని పట్ల ఏకాగ్రత కుదురుతుంది.

## రాజసఫల ప్రకరణం

రాజసభక్తులకు వారి వారి అర్హతను అనుసరించి ఫలం ప్రాప్తించే ప్రకరణం కనుక ఇది రాజసఫల ప్రకరణం. దీనిలోనూ భగవంతుని షడ్గుణాలు ధర్మ స్వరూపుని (ధర్మి) లీల ఉన్నాయి.

ఐశ్వర్యం

సత్రాజిత్తును చంపిన శతధన్వుడి మీదికి కృష్ణుడు యుద్ధానికి రాగా, తనకు తోడు రమ్మన్న శతధన్వుడితో అక్రూరుడు కృష్ణుని దివ్యత్వాన్ని గూర్చి పలికిన పలుకులు ఐశ్వర్య ప్రదర్శకాలు.

వీరం

పాండవులకు విశ్వకర్మద్వారా అద్భుత నగరాన్ని నిర్మింపజేయడం, తనను వరించిన 'మేనత్త కుమార్తె మిత్రవింద'ను స్వయంవర సభలో రాజులందరూ చూస్తుండగా శ్రీకృష్ణుడు అపహరించిన వృత్తాంతం మదించిన ఏడు వృషభాలను లొంగ దీసుకుని నాగ్న జితిని పరిణయ మాడిన వృత్తాంతం శ్రీకృష్ణుని వీర గుణ ప్రదర్శక కార్యాలు.

యశం

భౌమాసుర వధానంతరం భూదేవి చేసిన శ్రీకృష్ణుని స్తుతిలోనూ కృష్ణుడు భూదేవికి అభయదానం చేయడంలోనూ, యశోగుణం వ్యక్తమవుతుంది.

శ్రీ

శ్రీకృష్ణుడు నరకాసురుని చెరలోనున్న పదహారువేల మంది కాంతలను బంధవిముక్తులను చేయడం మాత్రమే కాక వారు తనపై మరులుగొనిన కారణాన వారినందరిని వివాహమాడి సంఘంలో వారికి రక్షణను కల్పించి వారి మనోభావానుసారంగా ఆనందాబ్ధిలో వారిని ఓలలాడించడం 'శ్రీ' కార్యానికి సంబంధించినవి.

జ్ఞానం

శ్రీ కృష్ణుడు రుక్మిణితో పరిహాసంగా పలికిన పలుకులలో తన తత్త్వాన్ని (స్వభావాన్ని) తానే తెలియజేశాడు.

*లోకుల నడవడిలోని వారముగాము*
*పరులకు మాజాడ బయలు పడదు*
*బలమదోపేతులు వసగొండ్రు మాతోడ*
*రాజ పీఠములకు రాము తఱచు*
*శరణంబు మాకు నీజలరాశి నతతంబు*
*నిష్కించనుల మేము నిధులు లేవు*
*కలవారు చుట్టాలు గారు నిష్కించన*
*జన బంధులము ముక్త సంగ్రహులము*

*గూఢ వర్తనులము గుణహీనులము*
*భిక్షు లైన వారిగాని నాశ్రయింప*
*మిందు ముఖులు దగుల రిటు వంటి*
*మము బోటి వారి వేల దగుల వారిజాక్షి"*

అంటూ శ్రీకృష్ణుడు పలికిన ప్రతిమాట ఆయన తత్వాన్ని వెల్లడిస్తూ జ్ఞాన బోధకంగా ఉంది. శ్రీకృష్ణుడనిన ప్రతిమాటకి రుక్మిణి సమాధాన రూపంలో తెలిపిన వ్యాఖ్యానం (కృష్ణుని మాటలకు) సైతం జ్ఞాన బోధకంగానే కనిపిస్తుంది.

### వైరాగ్యం

బాణాసుర పుత్రి ఉషను ఊరడించే నిమిత్తం చిత్రలేఖ శ్రీకృష్ణుని మనుమడయిన అనిరుద్ధుని ద్వారక నుండి తనయోగబలంతో శోణిత పురంలోని ఉషామందిరంలోకి తెచ్చి చూపింది. ఉష అనిరుద్ధునితో స్వేచ్ఛావిహారాలు గావించింది. సర్వజ్ఞుడయిన శ్రీకృష్ణుడు తన రక్షణలో నున్న ద్వారకా నగరం నుండి అనిరుద్ధుడు అపహరింపబడుతున్నా అడ్డుకోలేదు. నాలుగు మాసాల తరువాత నారదుడు వచ్చి చెప్పే దాకా ఎటువంటి ప్రయత్నం చేయకపోవడం కృష్ణుని తటస్థ ప్రవృత్తిని వైరాగ్య ప్రవృత్తిని సూచిస్తుంది.

### ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల

బాణా సురునితో యుద్ధం చేసి బాణుని భుజాలను ఖండించడం ధర్మ స్వరూపుని కార్యం. దుష్ట శిక్షణకై అవతరించిన శ్రీకృష్ణుడు బాణుని భుజబల గర్వాన్ని అణచాడు అంటే బాణునిలోని దుష్టత్వాన్ని శిక్షించి శిష్టత్వాన్ని రక్షించాడు. యుద్ధానంతరం వైష్ణవ జ్వరాన్ని మహేశ్వర జ్వరాన్ని రెండింటిని శంకరునికి వరదానంగా ఇవ్వడం ధర్మస్వరూపుని కార్యంగా తెలుస్తుంది.

## సాత్త్విక ప్రకరణం

సాత్త్విక భక్తులను నిరోధించడం కోసం చేసే లీల సాత్త్విక ప్రకరణం. తామస రాజస ప్రకరణాలలో లాగా కాక దీనిలో ప్రమాణ ప్రకరణం ఉండదు. దానికి కారణం సాత్త్విక భక్తులకు ప్రమాణాలతో పని ఉండదు. నందనందనుడు

వసుదేవుని పుత్రుడు అయిన శ్రీకృష్ణుడు పరమేశ్వరుడే నన్న యథార్థ జ్ఞానం స్వాభావికం గానే సాత్త్విక భక్తులకు ఉంటుంది. ఈ భక్తులకు ప్రమేయ, సాధన ఫలాల ద్వారా నిరోధం సిద్ధిస్తుంది.

## సాత్త్విక ప్రమేయ ప్రకరణం

సాత్త్వికులయిన భక్తులే ప్రమేయ పూర్వకంగా భగవంతుని పట్ల ఆసక్తులవడంలో భగవంతుని షడ్గుణాలూ ధర్మ స్వరూపుని లీలా తోడ్పడిన విధం పరిశీలిద్దాం.

ఐశ్వర్యం

నృగమహారాజుకు మోక్షం సిద్ధించిన విధం భగవానుని ఐశ్వర్య గుణాన్ని ప్రదర్శిస్తుంది.

నృగమహారాజు అనేక పుణ్య కార్యాలు చేసి తెలియక బ్రాహ్మణులకు చేసిన చిన్న దోషం వలన మరణానంతరం యముని ముందుకు వెళ్ళి పాప పుణ్యాలలో ముందుగా స్వల్పంగా జేసిన పాపాన్ని అనుభవించగోరి ఊసరవెల్లి రూపంలో నిర్జల కూపంలో పడి ఉండడం సంభవించింది. కృష్ణ కర స్పర్శ చేత ఊసర వెల్లి రూపం విడచి దివ్య శరీరం పొందిన నృగ మహారాజు "నేడు సమస్త నిస్తారకంబయిన భవదీయ పాదారవింద సందర్శనంబున జేసి యీ ఘోర దుర్దశలం (పాపకర్మఫలం) బాసి నిర్మలాత్మకుండనైతి"నని పునః ప్రణామంబు లాచరించి"[76]

"కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ
యప్రమేయ వరద హరి ముకుంద
విష్ణు జూడగంటి నీకృప గనుగొంటి
నిఖిల సౌఖ్య పదవులందగంటి"[77]

అని అనేక విధాలుగా కొనియాడి 'దేవా' భవదీయ పాదరావిందంబులు నాహృదయారవిందబునం బాయకుండునట్లుగా ప్రసాదింపవే"[78] అని వేడి అమితోత్సాహముతో పుణ్యకర్మ ఫలానుభవానికై తేజోవిరాజిత దివ్య విమానాన్ని ఎక్కి స్వర్గానికి వెళ్ళాడు.

సహజంగా హరి భక్తుడు, దాత అయిన నృగ మహారాజుకు తన స్పర్శతో మోక్షాన్ని ప్రసాదించడం సాంబుడు మొదలయిన యాదవులకు బ్రాహ్మణులను బాధించవద్దని ఉపదేశాన్ని ఇవ్వడం మొదలయినవన్నీ ఐశ్వర్య గుణ ప్రదర్శకాలు.

## వీరం

ఆవేశపురుషైన బలరాముని ద్వారా యమునా కర్షణం జరపడం వీరకార్యం (మహాప్రభు వల్లభాచార్యుల సుబోధినీ వ్యాఖ్యలో బలరామకృష్ణులకు తేడాలేదని, బలరాముడు చేసిన కార్యాలకు మూలశక్తి కృష్ణునిదే అన్న విషయం తెలుపబడింది. జరాసంధ వధలోనూ ఇది నిరూపితమయింది).

## యశం

పీతాంబర ధారణం కృత్రిమ శంఖచక్రగదాశీర్షాలను ధరించడం వంటివి చేసి శ్రీకృష్ణుని అనుకరించి, కృష్ణుని ధిక్కరిస్తూనే స్మరించిన పౌండ్రక వాసుదేవుని కృష్ణుడు వధించి ముక్తిని ప్రసాదించాడు. ఇది యశోగుణ ప్రదర్శకం. కాశీరాజును అతని పుత్రుడు సుదక్షిణుని కూడా సంహరించాడు. సుదక్షిణుని పక్షాన మాహేశ్వరానుగ్రహంతో తనను చంప వచ్చిన 'కృత్య'ను చక్ర ప్రభావంతో దగ్ధం చేసిన సైనం యశోహేతువు.

## శ్రీ

శ్రీ కృష్ణుని చేత నిహతుడైన నరకాసురుని మిత్రుడు మైందుడనే వాని సోదరుడు ద్వివిదుడు. వానరుడైన ద్వివిదుడు వేయి ఏనుగులబలం కలవాడు.

ఇతడు ద్వారకలో ఎంతోమంది స్త్రీ పురుషులను మహర్షులను ఎన్నోరకాలుగా బాధిస్తూ రైవతకాద్రి పైకొచ్చి అక్కడి యువతులతో క్రీడిస్తున్న బలరాముని ఎదుటికి వచ్చి అసహ్యాకరమైన చేష్టలతో ఆ యువతులనవమానించసాగాడు. మితిమీరిన ఆ వానరుని చేష్టలకు కోపించి బలరాముడు వానితో పోరాడి చంపి అందరికీ వాని నుండి కలిగే బాధలను తొలగించి ఆనందాన్ని చేకూర్చాడు. కనుక ఇది ఆపత్తి నివారకమైన 'శ్రీ' గుణ ప్రదర్శకం.

జ్ఞానం

'లక్షణ' అపహరణ సందర్భంలో కౌరవులచేత సాంబుడు బంధింపబడగా మంచి మాటలతో కౌరవులతో సంధి చేసుకోదలచిన బలరాముని కౌరవులు రెచ్చగొట్టారు. క్రుద్ధుడైన బలరాముడు హస్తినను గంగలో కలపదలచి తన హలాగ్రంతో హస్తిన దక్షిణ దిక్కు ప్రాకారాన్ని తన ముసలంతో పెళ్ళగించసాగాడు.

గంగలో పడడానికి సిద్ధంగా ఉన్న హస్తినలోని కౌరవాదులందరూ భీతులై సాంబుని లక్షణను బలరామునికి అప్పగిస్తూ పలికిన పలుకుల్లో జ్ఞానం వెల్లడి అవుతుంది.

శ్రీకృష్ణునితో అభిన్నుడు అయిన బలరామునితో కౌరవులు.. 'యీ సచరాచరంబు నయిన జగంబుల నీలీలా వినోదంబులం జేసి దుష్ట జనమర్దనంబును శిష్ట జన రక్షణంబును జేయుచు జగదుత్పత్తి స్థితిలయ హేతువైన నీకు నమస్కరింతు'[79] మనుచూ

అవ్యయుండవు సర్వభూతాత్మకుడవు
సర్వశక్తి ధరుండవు శాశ్వతుడవు
విశ్వకరుడవు గురుడవు విమలమూర్తి
నైన నిన్ను మతింప బ్రహ్మకును దరమే[80]

అని మలించడంలో కౌరవులు బలరాముని బలాన్ని తత్వాన్ని తెలుసుకుని స్వరూప జ్ఞానాన్ని పొందిన విధానం గోచరిస్తుంది.

## వైరాగ్యం

భగవంతుడు గృహస్థాశ్రమ ధర్మాన్ని నిర్వర్తిస్తున్నా నారదునికి నిర్లిప్తునిగా గోచరించి నారదునికి వైరాగ్య బోధగావించాడు.

## ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల

శ్రీకృష్ణుని దిన చర్య నియమ బద్ధంగా ఉండి జనులకు మహాత్ములకు ఆదర్శప్రాయంగా ఉన్నది.

ప్రాతః కాలాన లేవడం స్నానం చేసి దానాదులు నిర్వహించి, రాజసభా ప్రవేశం చేసి అతి వైభవంతో హితులు, పురోహితులు, మిత్రులు, బాంధవులు, బుధులు వసుమతీశులు కొలుస్తూ ఉండగా -

*కరుణార్ద్ర దృష్టి బ్రజలం*
*పరిరక్షించుచు వివేక భావకళాచా*
*తురి మెరపి యుష్టగోష్ఠిం*
*బరమానందంబున రాజభారకుడగుచున్*[81]

తన ధర్మపూర్వకమయిన నడవడితో అందరికీ ఆనందం కలిగించాడు. ఇది ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల.

## సాత్త్విక సాధన ప్రకరణం

సాధన మర్యాదా బోధక మయినది. సాత్త్విక భక్తులకు సాధనద్వారా నిరోధం కలుగడం "సాత్త్విక సాధన ప్రకరణం" ఈ ప్రకరణం లోనూ ఐశ్వర్యాది గుణాలను పరిశీలించినట్లయితే-

ఐశ్వర్యం

సమగ్ర సేనా సహితంగా శ్రీకృష్ణుడు హస్తినాపురికి వెళ్ళినప్పుడు శ్రీకృష్ణుని ఆగమనానికి పరమానందం చెందిన యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని ఆలింగనం చేసుకుని పరమశాంతిని పొందాడు. పులకిత దేహుడై లౌకిక వ్యవహారాలపట్ల విస్మృతుడయ్యాడు. పాండవులు భగవానుని కరస్పర్శతో మహోత్సాహ పూరితులయినారు.

'వారలుగావించు వివిధార్చనలంబరితుష్టుండై.... చతురంగ బల సమేతుండై వివిధ మణి తోరణాది విచిత్రాలంకృతంబు నతి వైభవో పేతంబునైన పురాన్ని [82] ప్రవేశించాడు. అక్కడి రాజ మార్గాన.

"రవళి మట్టెలు మణి నూపురములు మొరయ
బొలుచు కచబంధములు భుజంబునటింప
బయ్యెదలు వీడియాడ సంభ్రమముతోడ..." [83]

కృష్ణ సందర్శన కుతూహల పరస్పరాహూయ మానలై గురుపతి సుత బంధు జనంబులు వారింప నతిక్రమించి సమున్నత హర్మ్యశిఖరాగ్రంబు లెక్కి [84] కృష్ణుని చూశారు.

శ్రీ కృష్ణుని ఇంద్రప్రస్థ సందర్శనం ద్వారా అక్కడి జనుల హృదయాలలో వెల్లివిరిసిన ఉత్సాహం పొంగి పొరలిన సంభ్రమం శ్రీకృష్ణుని ఐశ్వర్యాన్ని వెల్లడిస్తుంది.

వీరం

రాజసూయ యాగం చేయబూనిన యుధిష్ఠిరుడు ముందుగా చేసిన దిగ్విజయ యాత్రలో భీముని ద్వారా జరాసంధుని సంహరింపచేయడం శ్రీకృష్ణుని యుక్తి వీరాన్ని తెలియచేస్తుంది.

యశం

జరాసంధుని చేత బందీలయిన రాజులను శ్రీకృష్ణుడు విడిపించగా వారు

నవ పద్మలోచను భవబంధ మోచను
 భరిత శుభాకారు దురితదూరు

కంకణ కేయూరు కాంచన మంజీరు
 వివిధ శోభిత భూషు విగత దోషు

పన్నగాంతక వాహు భక్త మహోత్సాహు
 నత చంద్రజూటు మన్నత కిరీటు

హరి నీలనిభకాయు వరపీతకౌశేయు
 కటి సూత్రధారు జగద్విహారు

హార వనమాలి కౌ మహితోరు వక్షు
శంఖ చక్రగదా పద్మశార్ఙ్గహస్తు
లలిత శ్రీవత్స శోభిత లక్షణాంగు
శుభగ చారిత్రు దేవకీసుతుని గాంచి[485]

"ధీర విహార! మమ్ము భవదీయ పదాశ్రయులన్ జరాసుతో
దార నిబంధనోగ్ర పరితాపము నీకరుణావలోకనా
పారము చేత వాపితివి సజ్జన రక్షయు, దుష్ట శిక్షయు
న్నారయ నీకు కార్యములు యాదవ వంశపయోధి చంద్రమా!"[486]

అని స్తుతించి కృష్ణుని యశోవైభవాన్ని స్మరించారు.

శ్రీ

రాజసూయ యాగంలో శిశుపాలుని వధ జరపడం 'శ్రీ' గుణాన్ని వ్యక్తం చేస్తుంది. శిశుపాలునికి శాపవశాన భగవానునిలో మూడు జన్మల వైరం సంభవించింది. జయ విజయులనే భగవానుని (శ్రీహరి) పార్షదులలో ఒకడు శిశుపాలుడు. చివరి జన్మ అయిన శిశుపాలుని జన్మ నుండి శ్రీకృష్ణుడు విముక్తి గావించి తిరిగి పార్షదునిగా తనను సేవించే అవకాశం ఇచ్చాడు. శాపరూపమైన ఆపత్తిని దూరం చేసి భక్తిదానం చేసి ఆత్మానందాన్ని కలగించినందున ఇది శ్రీ గుణ ప్రదర్శకం.

జ్ఞానం

దుర్యోధనుడు మయ సభలో పొందిన అవమానం కృష్ణుని జ్ఞానశక్తి కారణంగా జరిగింది.

దుర్యోధనుడు 'కలి' అంశచేత జన్మించిన వాడు. కృష్ణుడు భూభారహరణ కార్యానికై 'కలి' అంశుడైన దుర్యోధనుని మూలాధారంగా చేయ దలచాడు. కనుకనే మయసభలో జలం లేనిచోట వస్త్రాలను ఎత్తిపట్టినడచి, జలం ఉన్నచోట తెలియక జారిపడిన దుర్యోధనుని చూసి "పావనియు నచ్చటి పార్థివులను గాంతావళియును"[87] ధర్మరాజు వద్దని సైగ జేసినావినక "దామోదరామోది తులై మహా రవంబుగ హాసంబులు చేసిన సుయోధనుండు లజ్జా వనత వదనుండై కుపిత మానసు"[88] డయ్యాడు అనీ "అప్పుండ రీకాక్షుండు భూ భార నివారణ కారణుండగుటం జేసి దుర్యోధను నవహాసంబున కుం గారణుండయ్యె"[89] అనీ భాగవతం స్పష్టంగా తెలుపడం వలన దుష్ట శిక్షణ చేసి భూభారాన్ని హరించాలనే ప్రధానమైన కారణం గుప్తంగా ఉండి పరిహాసం చేయడం వలన దుర్యోధనుడు అవమానం పొందినప్పటికీ భవిష్యత్తు తెలిసిన వాడవటం వలన మౌనంగా ఉండి పోవడం జరిగింది. ఇది జ్ఞాన కార్యం.

## వైరాగ్యం

సాల్వునితో ప్రద్యుమ్మునికి జరిగిన యుద్ధంలో మూర్ఛితుడైన ప్రద్యుమ్నుని అతని సారధి యుద్ధ రంగంలో నుండి తప్పించి వెలుపలకు తెచ్చాడు. ఆసమయంలో శ్రీకృష్ణుని అంశ అయిన ప్రద్యుమ్నుడు తన సారథితో 'యుద్ధంలో మరణించడమే శ్రేయస్కరముగాని పారిపోయి శరీర రక్షణ గావించుకోవడం వీరత్వాన్ని యశాన్ని దూరం చేస్తాయని శరీర రక్షణం మంచిది గాదని' తెలిపిన పలుకులు వైరాగ్యాన్ని సూచిస్తాయి.

## ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల

సాల్వవధ దుష్ట శిక్షణార్థం జరిగినది కనుక ఇది ధర్మ స్వరూపుని కార్యం. శిశుపాల వధకు దీనికి భేదం ఉంది.

శిశుపాలుడు శాపగ్రస్తుడు కనుక శాపనివారణార్థం శిశుపాలుని వధించినందున శిశుపాలుని పట్ల అది శ్రీకార్యం అయింది. కాని సాల్వుడు శాపగ్రస్తుడు కాడు. దుష్ట రాజుల సమూహంలోనివాడు. శ్రీకృష్ణుడు సాల్వుని వధించి దుష్ట శిక్షణ గావించాడు గనుక ఇది ధర్మ స్వరూపుని లీలా కార్యంగా భావించాలి.

## సాత్త్వికఫల ప్రకరణం

ఇది సాత్త్విక భక్తులకు ఫలాన్ని ఇచ్చే ప్రకరణం. ఇందులోనూ ఐశ్వర్యాది భగవద్గుణాలు వరుసగా ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల తెలియ జేయ బడుతుంది.

## ఐశ్వర్యం

దంతవక్త్రుని వధ ఐశ్వర్యకార్యం దంత వక్త్ర విదూరకుల వధతో కృష్ణుడు స్వయంగా చేసే సంహారాలు ముగిశాయి. తరువాత జరుగవలసియున్న

మహాభారత యుద్ధం ద్వారా పెద్ద పెట్టున భూభారం అణగవలసి ఉంది. కాని శ్రీకృష్ణుడు స్వయంగా దుష్ట సంహారంగావించి మోక్షాన్ని ప్రసాదించే సంహారాలు (విదూరకుని వధతో) ముగిశాయి. ఆ సమయంలో

*"వరముని యోగ మరామర*
*గరుడో రగ సిద్ధ సాధ్య గంధర్వనభ*
*శ్చర కిన్నెర కింపురుషులు*
*హరిమహిమమతించి రద్భుతానందములన్"*[90]

అప్సరోజనం నృత్యాలు సలిపారు. వేల్పులు కుసుమ వర్షం కురిపించారు. "దేవతూర్యంబులవార్యంబులై మేరయు యదు వృష్ణి ప్రవరులు సేవించ పరమానందంబును బొంది నిజ విజయాంకితంబులైన గీతంబుల వంది జనంబులు సంకీర్తనంబులు సేయ మనోహర విభవాభిరామంబును నూతనాలంకారంబును నైన ద్వారకానగరంబు శుభ ముహూర్తంబునం"[91] ప్రవేశించే సందర్భంలో

*పురవతులవిరులు లాజలు*
*గురు సౌధాగ్రముల నుండి కురియగ వికచాం*
*బురు హాక్షుండంతఃపుర*
*వరమర్థి జొచ్చె వైభవంబ లరారన్"*[92]

అటు దేవతలకు ఇటు పురజనులకు ఉత్సాహాన్ని కలిగించి ఉత్సవం చేసుకున్నందున దంత వక్త్ర విదూరక వధలు ఐశ్వర్య ప్రదర్శకాలు.

వీరం

బల్వలుని వధ మొదలయినవి బలరాముడు జరిపిన కార్యాలు. బలరాముడు స్వయంగా "ధర్మ పరిరక్షణంబు సేయ నవతరించిన మాకు విట్టి

దుష్ట మర్దనంబవశ్య కర్తవ్యంబు"[93] అని అనడం మునులచే కీర్తించబడడం వలన బలరాముడు శ్రీకృష్ణునికి అండగాను సహాయకునిగాను ఒకవిధంగా శ్రీకృష్ణునితో అభిన్నునిగా చతుర్వ్యూహాలలో సంకర్షణ వ్యూహంగా బలరాముడు చేసిన సకల కార్యాలకు మూలశక్తి కృష్ణునిదే .

యజ్ఞశాలలో అశుచి పదార్థాలను రక్త మాంసాలను పడవేస్తూ మునులను హింసిస్తున్న బల్వాలుని శిరస్సును బలరాముడు తన హలాగ్రంతో బద్దలు కొట్టి చంపి మునుల తీవ్రవేదనను తొలిగించాడు. బల్వాలుని వధ భగవంతుని వీర్య ప్రదర్శకం.

### యశం

కుచేలుడైన సుదాముని ఆదరించి లక్ష్మీ అంశ సంభూత అయిన రుక్మిణీ సహితంగా శ్రీకృష్ణుడు అర్ఘ్య పాద్యాదులతో అర్చించి సకల సంపదలతో తులతూగుతున్న శ్రీకృష్ణుడు ఎటువంటి భేదభావమూ లేక బాల్య మిత్రుని చేరదీయడం శ్రీకృష్ణుని ఔన్నత్యాన్ని యశస్సును తెలుపుతుంది.

### శ్రీ

శ్రీకృష్ణుని అర్థించి తన దారిద్ర్యాన్ని దూరం చేసుకునే మిషతో వచ్చి, కృష్ణపరమాత్మ దర్శన స్పర్శనలతో సర్వం మరచి తన్మయుడైన సుదాముని వద్దనుండి పిడికెడు అటుకులను మాత్రమే స్వీకరించి కోరకుండానే సర్వ సంపదలను ముక్తిని కూడా ప్రసాదించి సుదామునికి అతని కుటుంబానికి ఆనందాన్ని అందించిన విధానం భగవానుని శ్రీకార్యం.

### జ్ఞానం

గ్రహణ స్నాన నిమిత్తం కురుక్షేత్ర యాత్రకు వచ్చిన సందర్భంలో భక్తులకు ఏకాంతంలో గోపికలకు శ్రీకృష్ణుడు చేసిన జ్ఞానోపదేశ వాక్యాలు భగవానుని జ్ఞాన ప్రదర్శకాలు.

గోపికలకు తనపై కుదిరిన భక్తి వారి పూర్వజన్మ ఫలమని తెలుపుతూ-

అఖిల భూతంబులకు నవయంబునాదిమ
 ధ్యాంత కాంత ర్బహిర్వ్యాప్తి నేన
ఘటపటాదిక భూతకార్యంబులకు
 నుపాదాన కారణములై తనరునట్టి
గగనానిలానలకక్ష్మోణులను భూత
 పంచకంబైక్యత నడయుగాదె
లోకంబులందు బంచీకరణ వ్యవ
 స్థల చేత నట్టి భూతముల రీతి

గగన ముఖ భూత తత్కార్య కారణముల
దగిలి యాధారహేతు భూతంబనైన
నాకు బరమన్య మొక్క డెన్నంగ లేదు
విమల మతులార మాటలు వేయునేల"

అంటూ తన స్వరూప జ్ఞానాన్ని గోపికలకు ప్రసాదించాడు.

## వైరాగ్యం

శ్రీకృష్ణునితో వివాహమైన విధానాన్ని తెలియజేయమన్న ద్రౌపదికి అష్టమహిషులు శ్రీకృష్ణునితో వారివారి వివాహాలు జరిగిన విధానము వర్ణించి తెలిపారు. ఆ సందర్భంలో తాము కృష్ణుని పట్ల ఆకర్షితులయి తద్వారా దాసులయి లౌకిక ప్రపంచం నుండి విరక్తిని పొందినట్లు తెలిపిన విధానం 'వైరాగ్యాన్ని' సూచిస్తుంది.

## ధర్మ స్వరూపుని (ధర్మీ) లీల

వ్యాసాది మునులు శ్రీకృష్ణ భగవానుని దర్శనార్థం ద్వారకకు రాగా వారితో భగవానుడు తెలిపిన విషయాలు ధర్మ స్వరూపుని కార్యంగా గోచరిస్తుంది. భగవానుడైన తనను దర్శించే అభిలాషతో వచ్చిన మునులను శ్రీకృష్ణుడే స్వయంగా అర్చించి వారి గొప్పదనాన్ని ప్రశంసించాడు.

సమ్మనీశ్వరులార! జన్మ భాక్కులమైన
 మాకు నిచ్చోట సమ్మతిని దేవ
వికర దుష్ప్రాపులు నిరుపమయోగీంద్రు
 లైన మీ దర్శనం బబ్బెగాదె
ధృతి మందభాగ్యులింద్రియ పర తంత్రులు
 నైన మూఢాత్ముల కనఘులార
భవదీయ దర్శన స్పర్శన చింతన
 పాదార్చనలు దుర్లభంబులయ్యు

 నేడు మాకిట సులభమై నెగ
 డెగాదె జగవలిపై దీర్థ భూతులు సాధుమతులు
 మిమ్ము దర్శించుటయు చాలు
 నెమ్మితోడ వేరు తీర్థంబులవని పై వెదకనేల[95]

ంటూ సాధుపురుషుల దర్శనం తీర్థ స్నానం వంటిదని, "సత్పురుషులు దర్శన మాత్రంబునం బావనంబు సేయుదురని"[96] తెలిపాడు. ఏ భగవానునైతే ునులు దర్శించి తరించడానికి వచ్చారో ఆ భగవానుడే వారిని కీర్తిస్తూ -

ఆదిత్య చంద్రాగ్ని మేదినీ తారాంబు
    మారుతాకాశ వాఙ్మనము లోలి
బరికింప దత్తదుపాసనంబుల బవిత్ర
    ములు సేయగ సమర్థములు గావు
సకలార్థ గోచర జ్ఞానంబు గల మహా
    త్మకులు దారు ముహూర్త మాత్రసేవ
జేసి పావనములు సేయుదురదియున
    ట్లుండె ధాతు త్రయ యుక్తమైన

కాయ మందాత్మ బుద్ధియు గామి వీకు
మారులందు స్వకీయాభి మానములును
దివిరి జలమున దీర్థ బుద్ధియును జేయునట్టి
మూఢుండు పశుమార్గు డనగ బరగు"

అని పలికిన పలుకులకు ఆ మునులు సైతం విమోహిత చిత్తులయారు. భగవానుడు మునులను ఈ విధంగా స్తుతించడం లోక సంగ్రహం కోసమే. మహాత్ములను సాధువులను లోకులు గౌరవించి ఆదరించి సేవించాలని భగవత్సంకల్పం. వారి మాహాత్మ్యాన్ని వారి ఔన్నత్యాన్ని లోకానికి చాటి చెప్పడం కోసం వారిని భగవత్స్వరూపులుగా శ్రీకృష్ణ భగవానుడే నిర్ధారించి లోకానికి ఆదర్శప్రాయుడయ్యాడు. ఈ విధంగా ధర్మాన్ని స్థాపించాడు.

శ్రీకృష్ణుడు తామస రాజస సాత్త్విక భక్తులను తన వైపు ఆకర్షితుల్ని చేసుకోవడానికై షడ్గుణాలతో వినోద లీల గావించాడు. చివరగా గుణ నిరూపణాన్ని గావించేది 'గుణ ప్రకరణం'.

# గుణ ప్రకరణం

పరాత్పరుడైన శ్రీకృష్ణుని నిరూపణం చేసే ప్రయత్నం గుణ ప్రకరణంలో జరుగుతుంది. గమక ఈ గుణ ప్రకరణం కూడా ఐశ్వర్య వీర్య యశః శ్రీ జ్ఞాన వైరాగ్యాలనే షడ్గుణాలతో ఉంటుంది.

## ఐశ్వర్యం

దేవకీదేవి కోర్కె మీద కంసుని చేత చంపబడిన ఆమె ఆరుగురు పుత్రులను శ్రీకృష్ణుడు తన యోగ మాయా మాహాత్మ్యంతో 'సుతలం' లోని బలి వద్ద నుంచి తెచ్చి చూపాడు. శ్రీకృష్ణుని దర్శనంతో ఆనందభరితుడయిన బలి కృష్ణునికి నమస్కరించి, ఆనంద బాష్ప పూరంబుగా రోమాంచ కంచుకిత శరీరుండగుచు గర కమలంబుల ఫాల భాగంబునం గదియించి

*ధీయుతుడైనమో భగవతే హరయే పరమాత్మనే ముకుం*
*దాయ సమస్త భక్త వరదాయ నమః పురుషోత్తమాయకృ*
*ష్ణాయ మునీంద్రవంద్య చరణాయ సురారిహరాయ సాంఖ్యయో*
*గాయ వినీల భాస్వదలకాయ రథాంగధరాయ వేదసే*[68]

అని అభివందించి అనేక విధాల స్తుతించాడు.

*"కంటి గంటి భవాబ్ధి దాటగ గంటి ముక్తి నిధానముం*
*గంటి నీ కరుణావలోకము గంటి బాపము వీడ ము*
*క్కంటి తామర చూలియుం బొడగాననట్టి మహాత్మా! నా*
*యింటికి జనుదెంచితీశ్వర! యే గృతార్థత బొందితిన్"*[69]

అంటూ పరవశించాడు.

దేవకి తన ఆరుగురు సంతానాన్ని చూసుకుని పుత్ర స్నేహ మోహ కలితాత్మ అయి

"చన్నులు దిగ్గన జేపగ
గన్నుల నానంద బాష్పకణముల దొరగం
గ్రన్నన కౌగిట విడి వమ
గన్నన్నలు వచ్చిరమమ గౌతుక మొప్పన్" [100]

"కౌగిట జేర్చి నిజాంక పీఠంబుననునిచి శిరంబులు మూర్కొని చిబుకంబులు పుణుకుచుం బ్రేమాతిశయంబున మేన బులక లొలయం జన్నిచ్చి" [101] యపరిమిత పుత్ర వాత్సల్యాన్ని అందించి పరవశించి పోయింది.

ఇక ఆ ఆరుగురు పుత్రులు భగవంతుని అంగసంగమంతో విగత కల్మమలై విధి శాప సాగరాన్ని హరి దయా కటాక్షమనే నావతో తరించి తల్లిదండ్రులకు శ్రీకృష్ణునికి వందనం ఆచరించి నిజస్థానానికి చేరుకున్నారు.

ఈ విధంగా బలికి, దేవకికి, దేవకీ పుత్రులకు అమితోత్సాహాన్ని కలిగించినందున ఇది భగవానుని ఐశ్వర్య లీల.

వీరం

అర్జునునితో సుభద్రా వివాహం, శ్రుత దేవ జనకరాజుల ఇద్దరి దగ్గరికి ఒకే రూపంలో ఒకేసారి వెళ్ళడం వీర కార్యం.

వీరత్వం బుద్ధి వీరం క్రియావీరం అని రెండు రకాలు. అర్జునుడు సుభద్రా హరణానికి కృష్ణుడు అడ్డుకోక పోగా క్రుద్ధుడయిన బలరాముని కూడా యుక్తిగా శాంత పరచి సుభద్రార్జునుల వివాహానికి ఒప్పించాడు. ఇది కృష్ణుని బుద్ధి వీరం.

జనక మహారాజు వద్దకు శ్రుత దేవుడనే విప్రుని వద్దకు ఒకే సమయంలో నారద వామదేవ, అత్రి, వ్యాస భార్గవ, అసిత, అరుణి బృహస్పతి కణ్వ మైత్రేయులనే మునులతో వెళ్ళి ఇద్దరికీ తృప్తిని కలిగించి ముక్తిని ప్రసాదించి వెళ్ళాడు. ఇది కృష్ణ భగవానుని క్రియా వీరం.

## యశం

శ్రుతి గీతలు భగవానుని యశాన్ని గానం చేసేవి.

"జయ జయ హరి! దేవ! సకల జంతువులకు
జ్ఞాన ప్రదుండవు గాన వారి
వలన దోషంబులు గలిగిన సుగుణ సం
తానంబుగ గొని జ్ఞాన శక్తి
ముఖ్యసద్గుణ పరిపూర్ణత జేసిమా
యాత్మ విశిష్టుండగుచు గార్య
కారణాత్ముడవై కదగి చరించుచు
మన్న నీయందు బయోరుహాక్ష

తివిరి యామ్నాయములు ప్రవర్తించుగాన
ప్రకట త్రిగుణాత్మకంబైన ప్రకృతి తోడి
యోగ మింతయు మాన్పవే యోగి మాన
సాంబు జాత మధువ్రత యని నుతించి" [102]

వనజాతాక్ష! భవత్పదాబ్జయుగ సేవా సక్తులైనట్టి య
జ్జనముల్ మృత్యు శిరంబు దన్నిఘన సంసారాంబుధిన్ దాటి పా
వనులై లోకములుం బవిత్రములుగా వర్తించుచున్ నిత్యశో
భనులై యెప్పుడి ముక్తి బొందుదురు శుంభద్వైభవోపేతులై [103]

వంటి శ్రుతి గీతలు భగవంతుని యశస్సును తెలియజేస్తాయి.

## శ్రీ

శంకరుని ఆపత్తిని శ్రీహరి తన మాయచే దూరం చేయడం 'శ్రీ' కార్యం. వృకాసురుడు తపస్సుచేసి శివుని నుండి 'తన హస్తముంచిన వాని

తలభస్మమగు'నట్లు వరం పొందాడు. శంకరుడు తనకిచ్చిన వరాన్ని శంకరుని పైనే ప్రదర్శించి పరీక్షించ దలచి శంకరుని వెంట పడ్డాడు. ఆ సమయాన శ్రీహరి బాల బ్రహ్మ రూపాన వచ్చి వృకాసురునితో ఆ హస్తాన్ని వృకాసురుని తలపైనే ఉంచి పరీక్షించు కొమ్మని తెలుపగా ఆ విధంగా చేసి వృకాసురుడు భస్మమయాడు. ఈ విధంగా శంకరుని ఆపద తొలగించి ఆనంద ప్రదానం చేసినందుకు గాను సురలు పూలవాన కురిపించారు. గంధర్వులు పాడారు. అప్సరసలు ఆడారు. గ్రహాలు భయం వీడాయి.

ఆనంద ప్రదమైన ఈ విషయం శ్రీ గుణ ప్రదర్శకం.

### జ్ఞానం

త్రిమూర్తుల ప్రాశస్త్యాన్ని పరీక్షించదలచిన భృగుమహర్షి బ్రహ్మను, శివుని దర్శించిన అనంతరం శ్రీహరి దగ్గరకు వెళ్ళి తనను ఉపేక్షించాడనే కారణంతో కోపోద్రిక్తుడై శ్రీహరి హృదయాన తన్నగా శ్రీహరి పరమ సాత్త్వికంగా తనను తన్నిన భృగువును ఆదరించడంతో భృగుమహర్షి అనంత కళ్యాణ గుణనిధి అయిన శ్రీహరిని మించిన దైవం లేదని గుర్తించిన విధము జ్ఞాన ప్రకాశకం.

### వైరాగ్యం

శ్రీకృష్ణుడు జల క్రీడాదులలోను తన ప్రతి చేష్టలోను పదహారు వేల నూట ఎనిమిది మంది కాంతల చిత్తాన్ని హరించగా కృష్ణైక గత చిత్తలయిన ఆ కాంతలు ఎల్లప్పుడూ కృష్ణ చింతనలో నిమగ్నులై శ్రీకృష్ణాసక్తలై విహ్వాలురయి ప్రకృతిలోని చక్రవాకాది పక్షులను సముద్రాన్ని చంద్రుడు మొదలయిన వాటిని సంబోధిస్తూ పలికే వివిధ ప్రలాప వాక్కులు వారి లౌకిక వైరాగ్యాన్ని శ్రీకృష్ణాసక్తిని తెలియజేస్తాయి.

ఈ విధంగా తామస రాజస సాత్త్విక భక్తులకు నిరోధలీల ద్వారా భక్తి సిద్ధించింది. అనంతరం ముక్తి లభిస్తుంది. ఆ విధమైన ముక్తిని గురించి భాగవతంలోని ఏకాదశ స్కంధం వివరిస్తుంది.

## ముక్తి

ఏకాదశ స్కంధం జీవముక్తి, బ్రహ్మముక్తి అనే రెండు విషయాలను తెలుపుతుంది. జీవముక్తి అనేది మళ్ళీ బ్రహ్మ భావం, సాయుజ్యం అనే రెండురకాలుగా ఉంటుంది.

అవిద్య నాశనం అయినప్పుడే బ్రహ్మ భావం కలుగుతుంది. వైరాగ్య, సాంఖ్య, యోగ, తప, భక్తియనే అయిదు విద్యల ద్వారా అవిద్య నాశనం అయి బ్రహ్మ రూప భావమైన ముక్తి సిద్ధిస్తుంది. సాయుజ్యం అనేది భక్తి వల్లనే సిద్ధిస్తుంది.

విశ్వామిత్రాది మహర్షులు యాదవులకు శాపాన్ని ఇవ్వడం నారదుడు వసుదేవునికి పురాతన విదేహార్షభ సంవాదాన్ని తెలుపడం జీవులకు బ్రహ్మభావం కలిగించే వివరాలు ఏకాదశ స్కంధం తెలుపుతుంది.

అలాగే బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణుని వైకుంఠానికి పిలువడం శ్రీకృష్ణుడు ఉద్ధవునికి పరమార్థోపదేశం చేయడం అవధూత సంవాదాలు అనే అంశాలు జీవులకు సాయుజ్య ప్రాప్తిని కలిగించే విషయాలను బోధిస్తాయి. శాపకారణాన యాదవులు తమలో తాము కలహించుకుని యాదువులందరి సంహారమూ జరగడం, బలరామ కృష్ణులు వైకుంఠానికి చేరడం అనే అంశాలు 'బ్రహ్మముక్తి'ని సూచిస్తాయి. తనకోసం వచ్చిన మునులతో యాదవ కులనాశనం చేసే శాపం ఇప్పించడం ద్వారా యాదవులను త్యాగం చేసి స్వయంగా తాను వైకుంఠానికి చేరుకోవడం బ్రహ్మముక్తి.

భాగవతంలో ఈ విధంగా దశమస్కంధంలో శ్రీకృష్ణభగవానుని షడ్గుణ విభూతి, ఏకాదశ స్కంధంలో జీవబ్రహ్మముక్తులు వివరించబడ్డాయి.

ఈ దశమ ఏకాదశ స్కంధాలలోని కృష్ణలీలలు 'శ్రీకృష్ణుడు భగవంతుడనీ, తన షడ్గుణాలతోనూ తామస రాజససాత్త్విక జీవులను ఆకర్షించి ప్రమాణ ప్రమేయ సాధనల ద్వారా ఆయా జీవులకు ఫలాన్ని ప్రాప్తింపజేసి ఆనందింప జేయడమే శ్రీకృష్ణ భగవానుని తత్త్వమనీ' స్పష్టం చేస్తున్నాయి.



1. ఏతే చాంశకలాః కృష్ణస్తు భగవాన్ స్వయమ్।
   ఇంద్రారివ్యాకులం లోకం మృడయన్తి యుగే యుగే -
   - వ్యాసుడు - శ్రీమద్భాగవతము, ప్రథమ స్కంధము, అధ్యా - 3 శ్లో-28.
2. సంపూర్ణ ఐశ్వర్యం వీర్యం (వీరం) యశస్సు సౌందర్యం (శ్రీ) సంపూర్ణజ్ఞానం సంపూర్ణ వైరాగ్యం అనే ఆరు అచింత్య గుణాలతో కూడిన పరతత్త్వమే భగవానుడని విష్ణుపురాణం చెబుతోంది - త్రిదండి శ్రీభక్తి సుధీర దామోదర మహారాజ్ (రచన) - శ్రీరాధా గోవింద చంద్రిక, పు - 3.
3. శ్రీమద్వల్లభాచార్య - 'సుబోధినీ భాగవతవ్యాఖ్య' (భాగవతార్థ ప్రకరణంలోని శ్లోకం)
4. బ్రహ్మ సంహిత (5.1) - బి.వి.శ్రీనివాసాచార్యులు - (మూలం భక్తి వేదాంత స్వామి ప్రభుపాదులు) కృష్ణచైతన్య ప్రతిపత్తి భక్తివేదాంత బుక్‌ట్రస్ట్ (ఇస్కాన్)
5. శ్రీవావిలి కొలను సుబ్బరాయ - శ్రీకృష్ణావతార తత్త్వము చతుర్థముళకము. (ఆరం: జ్ఞాపిక).. పు - 28.
6. వావిలికొలను సుబ్బరాయ - శ్రీ కృష్ణావతార తత్త్వము, చతుర్థముళుకము (మూడవ కూర్పు). పు -27.
7. "यमलार्जुन भंग संकर्षण:, नलकूबर मणिग्रीव प्रसंगे अनिरुद्ध: तनयोरनुग्रह वासुदेव" - श्री मदवल्ल भाचार्य - भगवद पीठिका

8. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 976, పు - 319.

9. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 982, పు - 319.

10. ఐశ్వరము = సర్వాన్ని మించి ఉండడం. అధిపత్యం
వైభవము - (సంకలనం) చలమచర్ల వేంకటశేషాచార్యులు -
సంస్కృతాంధ్ర నిఘంటువు. పు - 74.

11. చలమ చర్ల వేంకట శేషాచార్యులు - సంస్కృతాంధ్ర నిఘంటువు పు - 295.

12. చలమచర్ల వేంకట శేషాచార్యులు - సంస్కృతాంధ్ర నిఘంటువు, పు - 263.

13. आधार में आकर्षता कर सब को आनन्द देनेवाला चारो तरह फैल जाय वह यश कहलाता है अथवा अच्छी रीती से वर्णन योग्य गुण तथा समूह जिस में हो उसे यश कहते है। क्षी जगन्नाथ चतुर्वेदी - (मूल - क्षी मव्दल्ल - बाचार्य) - भूमिका, Rasapanchadhyayi, (Sri Subhodini Commentry on Bhagavata) (1971) పు - 26.

14. శ్రీ - లక్ష్మి సంపద శోభ, సరస్వతి, బుద్ధి, కీర్తి మొ॥ అర్థాలు ఉన్నాయి (సం) చెలమ చర్ల వేంకటశేషాచార్యులు, సంస్కృతాంధ్ర నిఘంటువు పు - 305. అయితే आपन्ति निवारण क्षी कार्य है। क्षी जगन्नाथ चतुर्वेदि, (मूलु - क्षी मन्दल्लभा चार्य) भूमिका Rasapanchadhyayi (भागवतका सुबोधिनी व्याख्य), పు - 26.

15. (సం) చలమ చర్ల వేంకటశేషాచార్యులు - సంస్కృతాంధ్ర నిఘంటువు పు - 135

16. भगवान के अतिरिक्त दूसरे में आसक्ति न होना वैराग्य है। क्षी जगन्नाथ चतुर्वेदि, (मूल - क्षी मन्दल्ल - भाचार्य) भूमिका Rasapanchadhyayi (भागवत का सुबोधिनी व्याख्या) పు - నం. 26

17. ఈ ప్రకరణంలోని తామసరాజస సాత్విక గుణ ప్రకరణాది విభజనలను శ్రీమద్వల్లభాచార్య విరచితమైన శ్రీమద్భాగవత సుబోధినీ వ్యాఖ్య (రాస పంచాధ్యాయి - భూమిక) గ్రంథంలో వారు చేసిన విభజనను అనుసరించి చేసుకోవడం జరిగింది.

18. వ్యాసమహర్షి కృత శ్రీమద్భాగవతము, (గౌడీయమఠ (పచురాం) (అవతరణిక)

దశమ స్కంధం (1) పు - 20.

19. जगन्नाथ चतुर्वेदि (मूल - क्षी मन्दल्लभायार्थ) भूमिका रासपंचाध्याय, (भागवत का सुबोधिना टीका) पु - 28.

20. విష్ణుమూర్తికి శ్రీదేవి భూదేవి అని ఇరువురూ భార్యలుగా పురాణాలలో వర్ణించబడింది. భూదేవి వివాహానికి వైకుంఠం నుండి ప్రభువు తరలి వస్తున్న (అవతరిస్తున్న) సమయంలో భూదేవి (భూమి) మంగళ చిహ్నాలతో పులకరించిపోతోంది. అంటూ కాలదిశ పృథ్వి జలాదులన్నీ భగవాని ఆవిర్భావానికి ఎలా శుద్ధి అయ్యాయో సుందరంగా వ్యాఖ్యానించబడింది. क्षी प्रेम सुधा सागर అనే భాగవత దశమ స్కంధ గ్రంథం (హిందీ)లో - क्षी प्रेम सुधा सागर, भागवत दशमस्कंध (व्याख्या सहित) गीता प्रेस - हनुमान प्रसाद पोददार పు - 17.

21. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 176, పు - 222.

22. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 225,, పు - 227.

23. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 253,, పు - 231.

24. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 255,, పు - 231.

25. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 257,, పు - 231.

26. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 262,, పు - 231.

27. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 274, పు - 233.

28. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము

వచనం -288., పు - 234.

29. "నచాన్తర్నబహిర్య స్యన పూర్వః నాపిచాపరమ్
పూర్వాపరం బహిశ్చాగ ర్జగతో యోజగచ్చయం:" "తం మహాత్మ.....ప్రాకృత యథా" - వ్యాసుడు శ్రీమద్భాగవతము (గౌడీయమఠ ప్రచురణం దశమ స్కంధం1. అధ్యాయం -9 శ్లోకాలు 13,14.

30. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం-376., పు - 244.

31. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం -404., పు - 246.

32. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 408. పు - 247.

33. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం 411.. పు - 247.

34. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము వచనం 417.. పు - 248.

35. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము వచనం 418.

36. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము వచనం 419.

37. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 430.. పు - 249.

38. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 627.. పు - 273.

39. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 628.. పు - 273.

40. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము, వచనం - 667.. పు - 278.

41. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము, వచనం - 708,, పు - 284.

42. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 710,, పు - 284.

43. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 738,, పు - 288.

44. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 745, పు - 289.

45. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 748,, పు - 289.

46. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 749,, పు - 289.

47. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 764,, పు - 292.

48. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 765,, పు - 292.

49. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 934,, పు - 313.

50. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 939,, పు - 313.

51. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1003,, పు - 322.

52. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1039,, పు - 326.

53. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1040,, పు - 327.

54. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1060,, పు - 329.

55. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1062,, పు - 329.

56. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1128,, పు - 339.

57. जगन्नाथ चतुर्वेदी (मूल – वल्लभाचार्य, भूमिका रासपंचाध्याय (श्री सुबोधिनी का हिन्दी अनुवाद, పు - 29.

58. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 154,, పు - 213.

59. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 171,, పు - 221.

60. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1148,, పు - 324.

61. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1149,, పు - 342.

62. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1150,, పు - 342.

63. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1164,, పు - 344.

64. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1190,, పు - 347.

65. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1232,, పు - 353.

66. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1241,, పు - 355.

67. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1284., పు - 359.

68. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం -1436., పు - 377.

69. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము. పద్యం -1437., పు - 377.

70. వ్యాసమహర్షి - శ్రీమద్భాగవతము, దశమస్కంధము (2) శ్లో .పు -

71. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1470., పు - 381.

72&73. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 1703, 1704., పు - 412.

74. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము వచనం - 67., పు - 434.

75. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము,ఉత్తర భాగము పద్యం - 232., పు - 455.

76. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 476., పు - 488.

77. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము,ఉత్తర భాగము పద్యం - 477, పు - 488.

78. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము వచనం - 478, పు - 488.

79. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము వచనం - 593, పు - 503.

80. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 594, పు - 503.

81. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము

పద్యం - 641. పు - 509.

82. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము వచనం - 687. పు - 514.

83. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, పూర్వభాగము పద్యం - 688. పు - 515.

84. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 687. పు - 574.

85. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం -747. పు - 522.

86. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 750. పు - 523.

87. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము వచనం - 827. పు - 533.

88. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 827. పు - 533.

89. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 827. పు - 533.

90. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 922. పు - 544.

91. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము వచనం - 923. పు - 544.

92. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము,ఉత్తర భాగము పద్యం - 924. పు - 544.

93. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము వచనం - 929. పు - 545

94. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 1072, పు - 562.

95. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 1119, పు - 567.

96. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 1120, పు - 567.

97. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 1121, పు - 567.

98. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 1144, పు - 571.

99. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 1152, పు - 572.

100. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 1161, పు - 572.

101. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము వచనం - 1162, పు - 573.

102. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము వచనం - 1204, పు - 579.

103. పోతన - శ్రీమహాభాగవతము, (రెండవభాగము) దశమ స్కంధము, ఉత్తర భాగము పద్యం - 1221, పు - 582.



# ఉపసంహారం

ఆద్యంత రహితమైన శ్రీకృష్ణ భగవానుని తత్త్వాన్ని గ్రంథరూపంలో కుదించి పొందుపరచడం అసాధ్యం. అది అనంతం. ఎంత చెప్పినా అసంపూర్ణం.

అయినా ఈ గ్రంథంలో ఏర్పరచుకున్న ఈ పథకం ప్రకారం తెలియపరచడానికి ప్రయత్నించాను. ఆ ప్రయత్నంలో విషయం 'భాగవతంలో కృష్ణతత్త్వం' గనుక ముందుగా 'భాగవతం - భగవదవతారాలు' అనే శీర్షికలో భాగవత పురాణం గురించి భాగవత కర్తృత్వం భాగవత విశేషాలు, భారతీయ భాషలలో భాగవతానువాదాల గురించి స్వల్ప వివరాలు తెలిపి, ఆ తరువాత భగవదవతార కారణాలు అవతార భేదాలు, ఏకవింశత్యవతారాలు, దశావతారాలు, వాటి అంతరార్థాలు, శ్రీకృష్ణావతార విశేషం తెలుపడానికి ప్రయత్నించాను.

వ్యాసుడు పురాణ పరిష్కారం భారతరచనం గావించిన తరువాత మనశ్శాంతి కోసం నారదోపదేశంతో భగవంతుని కీర్తిస్తూ భాగవతాన్ని రచించాడు. అయితే భాగవతానికి పూర్వం 'అష్టాదశ పురాణాలలో కృష్ణ ప్రసక్తి' ఎక్కడెక్కడ ఉన్నదో పరిశీలించడం శ్రీకృష్ణతత్త్వాన్ని వెల్లడించడానికి నేపథ్యంగా ఉంటుందని భావించి బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మ వైవర్త పద్మ, కూర్మ, విష్ణు, అగ్ని, నారద, మార్కండేయ పురాణాలలో ఉన్న కృష్ణ ప్రసక్తిని గురించి వ్రాశాను. ఇందులో

తరువాత వివరించ వలసిన కారణాన భాగవతాన్ని మినహాయించాను.

తెలుగులో పోతన భాగవతం 15 శ॥లో వెలువడింది. ఈ పోతన భాగవతానికి ముందుగా తెలుగులో మొదటిసారిగా కృష్ణ చరిత్రము విశదీకరిస్తూ వచ్చినది ఎర్రన (14 శ॥) హరివంశం. పోతన భాగవతాన్ని అనుశీలించే ముందు ఎర్రన హరి వంశాన్ని స్థూలంగా వీక్షించడం సముంజసమనే భావంతో 'హరివంశంలో శ్రీకృష్ణ ప్రశస్తి' అనే అంశాన్ని గూర్చి తెలిపాను.

తరువాతిది 'పోతన భాగవత తత్త్వం'. భాగవతుడైన పోతన తత్త్వం తెలుసుకుంటే పోతన భాగవతం అందులోని కృష్ణతత్త్వం సులభగ్రాహ్యంగా ఉంటుంది. గనుక ఇందులో భాగవతునిగా పోతన ఉద్దేశాలు పోతన భాగవతంలోని ప్రహ్లాదాది భాగవతుల తత్త్వాలు, భక్తి మార్గాలు వివరించాను.

భాగవతంలో విశిష్టాద్వైతం గురించిన వివరాలను 'భాగవతంలో విశిష్టాద్వైతం అనే శీర్షిక కింద వివరించాను.

'శ్రీకృష్ణావతార ప్రయోజనాలు' అనే శీర్షిక క్రింద శ్రీకృష్ణుని ఆవిర్భావం నుంచి లీలా సంవరణం దాకా పరిశీలిస్తూ కృష్ణుడు అవతరించడానికి గల కారణాలు, ఏవిధంగా కృష్ణుని జీవితంలోని ప్రతిసంఘటన భూభార నిర్మూలనానికి ఏవిధంగా దోహదం అయిందో ప్రధానంగా వివరించాను. శ్రీకృష్ణుని కృపకు పాత్రులై కొందరూ కృష్ణుని చేత నిహతులై మరికొందరు ఉద్ధరింపబడ్డారు, తరించారు. ఆయా జీవులు పూర్వజన్మలో పొందిన వరాల శాపాల వృత్తాంతాలు కారణాలు శ్రీ గర్గ భాగవతం ఆధారంగా వివరించడం జరిగింది ఈ ప్రకరణంలో.

శ్రీకృష్ణుడంటే భగవంతుడే. శ్రీకృష్ణుడు స్వయంగా భగవానుడన్న విషయం వ్యాసభాగవతంలోనే తెలుపబడింది. భగవద్గీతలో కృష్ణుడు అర్జునునికి

గీతోపదేశం చేసే సందర్భంలో శ్రీకృష్ణ ఉవాచ అనిగాక ఆద్యంతం 'భగవానువాచ' అనే వ్యాసుడు 'భారతం'లో రచించాడు.

కనుక భగవానుడంటే ఏమిటి? శ్రీకృష్ణుడు భగవానునిగా ఏవిధంగా కనిపిస్తున్నాడనే దానిని 'శ్రీకృష్ణుడు - భగవత్తత్త్వం' అనే శీర్షిక క్రింద తెలుపుతూ, 'శ్రీమద్వల్లభాచార్యుని సుబోధిని' (భాగవతానికి వ్యాఖ్య) ని ఆధారంగా (హిందీ అనువాదం) విభజనలు చేసుకుని వివరంగా వ్రాశాను.

ఈవిధంగా శ్రీకృష్ణతత్త్వానికి ఒక ఆకృతిని ఆవిష్కరించానని భావిస్తున్నాను. అనంతమైన భగవత్స్వరూప స్వభావాలలోని 'ఆకృతి' లీలామాత్రంగా రేఖాప్రాయంగానయినా ఈ పరిశోధనా గ్రంథంలో ఆవిష్కృతమయితే నేను కృతార్థురాలినే..... శ్రీకృష్ణార్పణమస్తు....



# ఉపగ్రంథ సూచి


| క్ర. సం. | గ్రంథనామం | రచన |
|---|---|---|
| 1. | అస్సామీ సాహిత్య చరిత్ర | బిరించికుమార్ బారువా |
| 2. | అంతరార్థ భాగవతము | డా. వేదుల సూర్యనారాయణశర్మ |
| 3. | ఆంధ్ర మహా భాగవతోపన్యాసాలు | సాహిత్య అకాడమీ |
| 4. | ఆంధ్ర వాఙ్మయము-కృష్ణకథ | దారారామనాథ శాస్త్రి |
| 5. | ఆంధ్ర మహాభారతము (శాంతిపర్వం) | తిక్కన |
| 6. | ఆంధ్రమహాభాగవతము రసానుభూతి | జి.వి. సుబ్రహ్మణ్యం |
| 7. | ఉత్తరభాషా సాహిత్యాలు | అకాడమీ |
| 8. | కన్నడ సాహిత్య చరిత్ర | సాహిత్యఅకాడమీ |

9. కృష్ణ కథ — ధారారామనాథ శాస్త్రి

10. కృష్ణ చైతన్య ప్రతిపత్తి — భక్తి వేదాంత స్వామిప్రభుపాద

11. గర్గభాగవతము — అంకరాజు సరోజిని

12. గుజరాతీ వాఙ్మయము — చిలుకూరి నారాయణరావు

13. గోపికా గీతము — శివ సత్యనారాయణ

14. చైతన్య చరితావళి — కుందర్తి వేంకట నరసయ్య (మూలం-ప్రభుదత్త బ్రహ్మచారి)

15. జైమిని భారతము (సంశోధనాత్మక పరిశీలన) — ముదిగొండ వీరేశలింగం

16. తమిళ సాహిత్య చరిత్ర — అకాడమీ ప్రచురణలు

17. తెలుగులో హరివంశాలు — డా. పి. యశోదారెడ్డి

18. తెలుగు కవులు భక్తితత్త్వం — మహతీ శంకర్

19. దక్షిణ భారత సాహిత్యాలు — చల్లా రాధాకృష్ణశర్మ

20. దక్షిణ భాషా సాహిత్యాలు — సాహిత్య అకాడమి

| | | |
|---|---|---|
| 21. | నారద భక్తి సూత్రాలు | (అను) దొడ్ల వెంకట రామరెడ్డి |
| 22. | నారదీయ పురాణం | అల్లాడ నరసింహకవి |
| 23. | నీలగిరి వెన్నెల | శ్రీ సత్యసాయిబాబా |
| 24. | పురాణ వాఙ్మయము | జి.వి. సుబ్రహ్మణ్యం |
| 25. | పోతన భాగవతరచన | శిష్టాలక్ష్మీకాంత శాస్త్రి |
| 27. | పోతన | నిడదవోలు వెంకటరావు |
| 28. | పోతన సహజ పాండిత్యం | తుమ్మ పల్లి రామలింగేశ్వరరావు |
| 29. | పోతనగారి వైచిత్రి | కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి |
| 30. | భక్త పోతన మహాభాగవత రచన | ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రి |
| 31. | భగవదారాధన | మాణిక్యం వేదవల్లి తాయారమ్మ<br>చినగంధం కౌసల్యాదేవి |
| 32. | భావగోపి | కూచిసూర్యప్రకాశరావు |
| 33. | భాగవత వైజయంతిక | కరుణశ్రీ (సం) |
| 34. | భాగవతం పై భగవద్గీతా ప్రభావం<br>(గీతాభాగవతాల తులనాత్మక | పులిజాల వెంకట |

సూర్యప్రకాశరావు
పరిశోధన)

35. భాగవత కథ (సంపుటాలు) కుందుర్తి వెంకటనరసయ్య
(మూలం - ప్రభుదత్త
బ్రహ్మచారి)

36. భాగవతకథాసారం (అను) (మూలం) బంకిం చంద్ర చటర్జీ
శ్రీకృష్ణ చరిత్ర (తెలుగు) బాలాంతరపు
సూర్యనారాయణ

37. భాగవతానుశీలనం ధూళిపాళ శ్రీరామమూర్తి

38. భక్తి తత్త్వదర్శనం చర్ల గణపతి శాస్త్రి

39. భవిష్య పురాణం వావిళ్ళ రామస్వామి

40. బ్రహ్మాండ పురాణం జనమంచి శేషాద్రిశాస్త్రి

41. భాగవత కథాతత్త్వం కపిలవాయి లింగమూర్తి

42. మహాభాగవత కల్పకుసుమములు డా.పి. యశోదారెడ్డి (కూర్పరి)

43. మహాభాగవతోపాఖ్యానములు సామ్రాజ్యలక్ష్మీరావు

44. మధుర మాధవం (నాటిక) ఎస్. ఎ. జోగారావు

45. మహాభారత విమర్శనము — పుట్టపర్తి నారాయణాచార్యులు

46. రాధారహస్యం — బులుసు సూర్యప్రకాశ శాస్త్రి

47. విమర్శిని (పరిశోధనాత్మక పత్రిక) — తెలుగు విభాగం (ఉ.మూ)

48. వ్యాస సాహితీ సంహిత (యువభారతి) — ఉపన్యాస మంజరి

49. విద్యున్మాల — పులిజాల వేంకట సూర్య ప్రకాశరావు

50. విష్ణు పురాణం — కలిదిండి భావనారాయణ

51. శ్రీరాధాగోవింద చంద్రిక — త్రిదండి భక్తి మధీర దామోదరమహారాజా

52. శ్రీకృష్ణ చరిత్రము — డి. వెంకటరామరెడ్డి

53. శ్రీకృష్ణ లీలామృతము — వావిలి కొలను సుబ్బరాయ

54. శ్రీకృష్ణ కథామృతము — స్వామీ సుందరచైతన్యానంద

55. శ్రీకృష్ణ లీలామృతము — కృష్ణదాస్‌జీ

56. శ్రీకృష్ణావతారతత్త్వము (సంపుటాలు) — జమవంచి శేషాద్రిశాస్త్రి

57. శ్రీమద్భాగవతము — త్రిదండి భక్తి మధీరదామోదర మహారాజా

58. శ్రీ మహాభాగవతము (1&2) బమ్మెరపోతన (లఘుటీక)
టాగూర్ పబ్లిషింగ్ హౌస్ - 1975 బులుసు వెంకటరమణయ్య

59. శ్రీమద్భాగవత ప్రకాశము
(ప్రథమస్కంధం) ఎక్కిరాల కృష్ణమాచార్య

60. శ్రీమద్భాగవత సామ్రాజ్యము ఎల్లంరాజు శ్రీనివాసరావు

61. శ్రీమద్భాగవత పురాణమహాత్మ్యము జొన్నాభట్ల వాసుదేవ శాస్త్రి
(పద్మ పురాణాంతర్గతము)

62. శ్రీమద్భాగవతము పోతన (సాహిత్య అకాడమి)

63. శ్రీమద్భాగవతము చదలవాడు జయరామశాస్త్రి
(తత్త్వదర్శనీ వ్యాఖ్య)

64. శ్రీమద్భాగవత రహస్యము నెమలికొండ రామాచార్యులు
(మూలం - రామచంద్ర డోంగరే
మహరాజ్)

65. శ్రీమద్భాగవతం - విశిష్టాద్వైతం ఎన్.సి. రఘునాధాచార్యులు

66. శ్రీమహాభాగవత హృదయము మామిడిపల్లి నరసింహం

67. శ్రీమదాంధ్ర మహాభారతము నన్నయ భట్టు
(సభాపర్వం)

68. శ్రీ గర్గ భాగవతము చివుకుల అప్పయ్య శాస్త్రి

69. శ్రీ దొడ్డ భాగవతము దొడ్ల వేంకటరామరెడ్డి

70. శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త పురాణం మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త

71. శ్రీమదాంధ్ర పద్మ పురాణం పిసుపాటి చిదంబర శాస్త్రి

72. శ్రీరాధామాధవతత్త్వము - సంప్రదాయం లీలాజ్యోతి

73. శ్రీ గోపికా రహస్యం వై.యస్. కృష్ణమూర్తి

74. శ్రీవిష్ణు పురాణము వెన్నలకంటి సూర్యనార్య

75. సర్వ సిద్ధాంత సారభము (7) అనుభవానందస్వామి

76. సహృదయ చక్రం సప్రసన్న

77. హరివంశం ఎఱ్ఱాప్రగడ

## సంస్కృతం

78. శ్రీమద్భాగవతము (12-స్కం) (గౌడీయమఠప్రచురణ) వేదవ్యాసుడు

79. శ్రీమద్భగవద్గీత (వ్యాఖ్య కొంపెల్ల లక్ష్మీ నారాయణ)

80. శ్రీమద్భగవద్గీత (గీతామృత తరంగిణి) కల్యాణానంద భారతీస్వామి

81. భగవత్ప్రీతిక శ్రీమద్వల్లభాచార్య

## నిఘంటువులు


82. సూర్యరాయాంధ్ర నిఘంటువులు (8)

83. విద్యార్థి కల్పతరువు — ముసునూరు వెంకటశాస్త్రి

84. విజ్ఞాన సర్వస్వం (వాల్యూమ్ 6) — తెలుగు భాషాసమితి

85. శబ్ద రత్నాకరము — సీతారామాచార్యులు

86. సంస్కృతాంధ్ర నిఘంటువు — (సంకలనం) చలమచర్ల వేంకట శేషాచార్యులు


## హిందీ


87. रास पंचाध्याई (श्री मन्दल्लभाचार्य विरचित श्री सुबोधिनी का हिन्दी अनुवाद - जगन्नाध चतुर्वेदी

88. श्री राधा माधव चिंतन — हनुमान प्रसाद पोद्दार

89. श्री प्रेम सुधा सागर — हनुमान प्रसाद पोद्दार




" నీ పద్యావళులాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీపేరం బనిసేయు హస్తయుగముల్ నీ మూర్తి పైఁ జూపులున్
నీపాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీసేవపైఁ జిత్తముల్
నీ పై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజ పత్రేక్షణా"



